ఆదివాసి నేత, 'సామాజిక వాల్మీకి'

# శ్రీ చదల జానకి రామారావు

జీవన యాన 'సప్తతి' చరిత్ర



*సంకలనం – రచన :*

**అడ్డుమిల్లి పూర్ణచంద్రరావు**

*ప్రచురణ :*

**ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్**

కస్తూరిబాపేట,

విజయవాడ–520 010

# ఈ పుస్తకం ...



శ్రీ చదల జానకి రామారావు వేత్త . రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక వేత్త. సంచార - ఆదివాసి - విముక్త - దళిత - గిరిజనుల ఆరాధ్యులు. మంచిమనిషి. ద్రష్ట. స్రష్ట.

జానకి రామారావు గారి 'సప్తతి' సమ్మానోత్సవాన్ని పురస్కరించుకుని, వేగుచుక్క వంటి ఆయన ఆదర్శ - మార్గదర్శక - జీవన యాన చరిత్రను గ్రంథస్థం చేస్తున్నాను. ఇది కార్యకర్తలకు కాహళి, యువతకు వినూత్న స్ఫూర్తి కావలెనని ఆశ.

ఇందుకు సహకరించిన పెద్దలకు, పిన్నలకు, ముఖ్యంగా 'సప్తతి' సన్మాన సంఘం వారికి, ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్‌కు ఈ కథన కథానాయకులైన చదల వారికి హార్దికాభినందనలు. మా అభ్యర్థనను మన్నించి, ఈ చిఱుపొత్తంలో ప్రచురణార్థం తమ సందేశాలను పంపిన విజ్ఞులకు మనఃపూర్వక కృతజ్ఞతలు.

శకపురుషుడు చదల జానకి రామారావు గారు వైప్లవ్య మహోదధి. నేను మేతమెత్తాను, అంతే !

అడ్సుమిల్లి పూర్ణచంద్రరావు
**02-10-1999**

# ప్రస్థావన



**ఆఫ్రికా** తరువాత భారత దేశంలోనే అత్యధిక సంఖ్యలో గిరిజనులు వున్నారు. మన దేశం వివిధ ప్రాంతాలకు విస్తరించివున్న గిరిజన ప్రజలు 1750 వ సంవత్సరం వరకు అజ్ఞాతంగానే వుండిపోయారు. తరువాత తరువాత మతాధికారులు, పాలనాధికారులు, సంఘసేవకులు వీరి గురించి పట్టించుకోవడం ప్రారంభించారు.

భారత దేశ పాలనా రంగానికి మానవ విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానం ఎంతో అవసరమని ఈస్టిండియా కంపెని డైరెక్టరులు 1807 లో అభిప్రాయానికి వచ్చారు.

సుగాలి, ధోటి, యానాది, ఎరుకల.

దక్షిణ భారతావనిలో ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యధిక సంఖ్యాక గిరిజన తెగల వారు వున్నారు. రాష్ట్రంలోని మొత్తం గిరిజనులలో **68** శాతం షెడ్యూల్డ్ ప్రాంతాలలో నివశిస్తుండగా, **32** శాతం మంది గిరిజనేతరులతో కలసి మైదాన ప్రాంతాలలో జీవిస్తున్నారు. ఇక్కడి గిరిజనులందరు **33** భిన్న తెగలకు, ఉపతెగలకు చెందినవారు. మైదాన ప్రాంతంలో ప్రధానంగా ఎరుకల, యానాది, సుగాలి, చెంచు తెగల వారుగా వీరు వున్నారు.

# కమిటీలు - కమిషన్లు

షెడ్యూల్ జాతుల ప్రయోజనాలను పరిరక్షించడానికి తగు సిపారసులు చేసే నిమిత్తం రాజ్యాంగ నిర్దేశం మేరకు రాష్ట్రపతి మన దేశంలో తొలిగా శ్రీ కాకా కలేల్కార్ అధ్యక్షతన వెనుకబడిన తరగతుల కమిషన్‌ను ఏర్పరచారు. **1953** జనవరి **29** వ తేదీ నుంచి పని చేసిన ఈ కమిషన్ **1955** మార్చి **30** వ తేదీన తన నివేదికను సమర్పించింది.

రాష్ట్రపతి మరల **1960** ఏప్రిల్ **28** వ తేదీన శ్రీ యు. ఎన్. దేబర్ అధ్యక్షతన షెడ్యూల్ ప్రాంతాలు, షెడ్యూల్ తెగల కమిషన్‌ను నియమించారు. **1961** అక్టోబరులో ఈ కమిటి తన నివేదికను సమర్పించింది.

వెనుకబడిన తరగతుల కమిషన్ పేర రాష్ట్రపతి **1979** జనవరి ఒకటవ తేదీన శ్రీ బి. పి. మండల్ అధ్యక్షతన మరొక కమిషన్‌ను వేశారు. ఈ కమిషన్ తన నివేదికను రాష్ట్రపతికి **1980** డిసెంబరులో సమర్పించింది.

మన పార్లమెంటు సభ్యులతో శ్రీ ఏ. సి. దాసు అధ్యక్షతన షెడ్యూలు కులాలు, తెగల సంక్షేమంపై పార్లమెంటరీ కమిటీని నియమించింది. శ్రీ ఎ.కె. చందా అధ్యక్షతన **1968** మార్చి **26** వ తేదీన పార్లమెంటు మరొక కమిటీని నియమించింది. **1969** నవంబరు **15** వ తేదీన ఈ కమిటీ తన నివేదికను పార్లమెంటుకు సమర్పించింది.

కేంద్ర ప్రభుత్వ సాంఘిక సంక్షేమ శాఖ ఆధ్వర్యాన శ్రీ బి. ఎన్. దాతార్ అధ్యక్షతన **1965** జూన్ ఒకటవ తేదీన షెడ్యూల్ కులాలు, తెగల జాబితాలో మార్పులు చేర్పులు చేయడానికి సలహా సంఘం ఏర్పడింది. ఈ సంఘం తన నివేదికను **1965** జులై **27** వ

తేదీన సమర్పించింది.

గిరిజనాభివృద్ధి ధ్యేయంగా ఇటువంటివే మరి డజను కమిటీలు పనిచేశాయి. ఏతావతా, జాతీయ స్థాయిలో, రాష్ట్రాల స్థాయిలలో, గిరిజన సంక్షేమ శాఖ ఏర్పడింది.



# అంకురం

ఒక ఊరు. పల్లెటూరు. ఊరుకు దూరంగా పల్లె. దానిలో మాల పల్లె, మాదిగ గూడెం. వీటికి ఎడంగా మెట్ట దిబ్బల మీదో, రహదారుల దరినో, పొలం గట్లపైనో, చెరువు కట్టకిందో కొన్ని గుడిశలు. అవి ఎరుకలు, యానాదులు, లంబాడీలు, పాముల, బుడబుక్కల, దొమ్మర వంటి ఆదివాస - సంచార జాతులలో ఎవరివో అయివుంటాయి. ఆంధ్రప్రదేశ్ కోస్తా జిల్లాలలో దాదాపు ప్రతి పల్లెపట్టు దృశ్యమూ ఇదే.

ఇటువంటిదే కృష్ణా జిల్లా నందిగామ తాలూకా కంచికచర్ల ఫిర్కా గండేపల్లి. గండేపల్లి గ్రామ కంఠంలో పడమటి దిశగా వైరా ఏరు దాపున పోరంబోకు స్థలంలో రెండే రెండు ఇళ్ళు. ఒకటి పొన్నావారిది కాగా మరొకటి చదల వారి రెండు నిట్టాళ్ళ పాక. వీరు ఎరుకలు. ఊరుకు కూత దవ్వున ఎరుకలు.

చదల అమ్మయ్య కష్టజీవి. అర్ధాంగి అచ్చమ్మ శ్రమజీవి. ఊరు కాపలాదారులుగా, కులవృత్తి అయిన పందుల పెంపకందారులుగా, చాపలు, బుట్టల అల్లకందారులుగా ఈ దంపతులు ప్రసిద్ధులు. అమ్మయ్య గారి తండ్రి గురవయ్యగారుకూడా కాపలాదారుగా గ్రామీణుల ఆదరాభిమానాలను చూరగొని నిప్పులాంటి మనిషిగా గణనకెక్కినవారే. ఆయనకు అయిదుగురు పుత్రులు. వీరిలో కనిష్టులే శ్రీ అమ్మయ్య.

చదల అమ్మయ్య గారి అర్ధాంగి శ్రీరామ్ కోటయ్యగారి కుమార్తె. ఈ దంపతుల సంతతి ఆరుగురు కుమారులు, ఇరువురు కుమార్తెలు. వీరిలో ఒక పుత్రుడు, ఒక పుత్రిక విగతజీవు లయ్యారు. మిగిలిన అయిదుగురు పుత్రులు వరసగా **1.** జానకి రామారావు, **2.** కోటయ్య, **3.** పెద అంజయ్య, **4.** చిన అంజయ్య, **5.** రాఘవులు. కుమార్తె లక్ష్మమ్మ.

జిల్లా ఏపిలహాపు మండలం చౌటపల్లికి చెందిన బొజ్జగాని కోటయ్య. వీరికి అయిదుగురు పిల్లలు. శ్రీ కోటయ్య దివంగతులయారు.

కాకుమాని గోత్రీకులైన చదల అమ్మయ్య గారి ప్రథమ పుత్రుడు శ్రీ జానకి రామారావు 1929 జులై 15వ తేదీన జన్మించారు. 23వ ఏట అదే గ్రామానికి చెందిన వీరావలి గోత్రీకులు మక్కా కోటయ్య గారి పుత్రిక సౌభాగ్యవతి సుశీలతో వివాహం జరిగింది. వీరి సంతానం నలుగురు కుమారులు, నలుగురు కుమార్తెలు.

కుమారులు : 1. శ్రీ కృష్ణారావు, పంచాయతీ ఉద్యోగి. సోమవరం గ్రామానికి చెందిన బొజ్జగాని వారి ఆడపడుచు సౌభాగ్యవతి రుక్మిణి వీరి అర్ధాంగి. వీరికి ఇరువురు కుమారులు, ఇరువురు కుమార్తెలు.

2. శ్రీ అమరేశ్వరరావు, టెలిఫోన్స్‌లో పని చేస్తారు. చీరాలకు చెందిన పొన్నా సత్యనారాయణ గారి కుమార్తె వసుంధర వీరి అర్ధాంగి. వీరి సంతు ముగ్గురు కుమార్తెలు.

3. శ్రీ సీతారామారావు, హైదరాబాదు హెచ్. ఎం. టి. లో పని చేస్తున్నారు. విజయవాడకు చెందిన మేడా వారి ఆడపడుచు విజయకుమారి వీరి అర్ధాంగి. వీరికి ముగ్గురు పిల్లలు.

4. శ్రీ భవానీ సేన్, ఆర్. టి. సి. కండక్టరు. కొండపల్లికి చెందిన మొగిలి నాగయ్యగారి పుత్రిక ప్రమీలా దేవి ఈయన అర్ధాంగి. వీరికి ముగ్గురు పుత్రులు.

కుమార్తెలు : 1. శ్రీమతి కల్పనాదత్తు, భర్త చీరాలకు చెందిన శ్రీ పొన్నా సత్యనారాయణ గారి పుత్రుడు శ్రీ రామమోహనరావు. వీరికి ముగ్గురు పిల్లలు. శ్రీ రామమోహనరావు హనుమకొండలో ఇండియన్ ఓవర్ సీస్ బ్యాంకి ఉద్యోగి.

2. శ్రీమతి రేణుక, భర్త గుంటూరుకు చెందిన మెకానిక్ శ్రీ మానుపాటి శ్రీధరరావు. వీరికి ఒక కుమారుడు, ఒక కుమార్తె.

3. శ్రీమతి ఝాన్సీ లక్ష్మీబాయి, భర్త తిరుపతి శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ లో లెక్చరరు డాక్టరు రెబ్బా అబ్బయ్య. వీరికి ఒక పుత్రుడు, ఒక పుత్రిక. శ్రీమతి ఝాన్సీ లక్ష్మీ బాయి పట్టభద్రులు, ప్రయివేటుగా చదివి ఎం. ఏ. పట్టం పొందారు. ఇప్పుడు డాక్టరేట్ కోసం థీసిస్ వ్రాస్తున్నారు.

**4.** శ్రీమతి ప్రమీలా రాణి, భర్త ఎల్. ఐ. సి. క్లర్క్ శ్రీ బొజ్జగాని రామారావు. పిల్లలు ఆణిముత్యాలు.

అర్ధ శతాబ్ది క్రితం కుటుంబ నియంత్రణకు చట్టమూ లేదు, సంప్రదాయమూ లేదు. ఎంత మంది సంతానం ఉంటే అంత గొప్ప ! 'సంతాన లక్ష్మి' పేర్లు కూడా వుండేవి. అయితే, అది కుచేల సంతానం ! పేదరికంతో మగ్గిపోయేవారు. తరువాత తరువాత గాని కుటుంబ నియంత్రణ ప్రాధాన్యత గుర్తింపుకు రాలేదు !

శ్రీ చదల జానకి రామారావు ఆబాల్యంగా ధీశక్తి పై ఆధారపడి అంచలంచలుగా ఎదుగుతూ స్వీయ జీవితాన్ని నిర్మించుకున్న దిట్ట. 'శ్రమ ఏవ జయతే' నాదం ఆయన వేదం. ఏమాత్రం వసతులు, వనరులు లేని ఆ రోజులలో నందిగామ చెరుదు గట్టున వున్న చిన్న గుడిశలో వుంటూ, చాలీ చాలని గంజినీళ్ళతో ఆకలి తీర్చుకుంటూ హైస్కూలు స్థాయివరకు కష్టపడి చదువుకున్న వివేకి. స్వయం కృషితో హిందీ నేర్చుకున్న విజ్ఞాని. విశ్రాంతి, సుఖం అనే పదాలు ఆయన జీవన నిఘంటువులోనే లేవు. పట్టుదల, చొరవ, దక్షత, నిజాయితీ, నిరంతర సేవాభావం, మానవత శ్రీ జానకి రామారావును మనీషిగా మలచి శిఖరాగ్రాన నిలువెత్తున నిలిపాయి.

కుటుంబానికే కాక తమ వంశానికే ఒక పెద్దగా సోదర సోదరీమణులు, వారి పిల్లలు, వీరి పిల్లలు - ఇలా మూడు తరాలవారి ప్రేమాభిమానాలను పొందుతున్న గౌరవం శ్రీ జానకి రామారావుకే దక్కింది. ఈ కాలంలో ఇది బహు అరుదు. ఈయనను చదల వంశానికే కులదైవంగా అందరు ఆరాధించడం విశేషం.

# అమాయకత్వం

ఇక్కడ శారీరక - మానసిక - మానవ సంబంధమైన ఒకానొక సామాజిక సమస్యను ప్రస్థావించక తప్పదు. అది దాంపత్యం, బ్రహ్మచర్యం. ఇది ప్రశ్నార్థకం.

నమ్మిన పవిత్ర లక్ష్య సాధనకోసం స్వసుఖాలను త్యజించారు కొందరు. విశ్వశ్రేయస్సు, వసుధైక కుటుంబం, సర్వ మానవాళికి స్వేచ్ఛ, జాతికి స్వాతంత్ర్యం, సామాజిక చైతన్యం, సమాజ పరివర్తన ధ్యేయంగా ఎందరెందరో మహానుభావులు - స్త్రీలు, పురుషులు - ఆజన్మ బ్రహ్మచారులుగా ఉండిపోయారు. వివాహానంతరం సయితం

[illegible] ప్రత్యాచారులయారు కొందరు. వారి దృష్టిలో అది త్యాగం కాదు. ఒక సాధన, [illegible].

[illegible] - అర్ధ శతాబ్ది క్రితం - ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ ఆధ్వర్యాన [illegible] విముక్త జాతుల ఉద్యమం ఉధృతంగా కొనసాగింది. నాటి ఉద్యమ సారధులలో [illegible] యువకులకు అప్పుడప్పుడే వివాహాలు జరిగాయి. అయితే, ఆ యువకులు ఉద్యమమే తమ ఊపిరిగా రేయింబవళ్ళు ఊళ్ళ వెంట తిరుగుతుండేవాళ్ళు. దాంపత్య జీవితాన్ని పట్టించుకునేవారు కాదు.

'నేనంటూ ఒక పెళ్ళాన్ని ఉన్నాను, గుర్తుందా?' సూటిగా ప్రశ్నించింది - ఒక భార్య ఒక భర్తను.

'ఉంటే వుండు, పోతే పో!' అన్నాడు ఆ భర్త.

ఆమె పోలేదు. వారి దాంపత్యం నేటికీ అమోఘంగా కొనసాగుతూనే వుంది.

'నేను పోతున్నాను. నువ్వు అసమర్ధుడివి. వేరు మనువాడతాను,' అని తెగేసి చెప్పింది మరొక భార్య మరొక భర్తతో.

'నీ ఇష్టం!' అన్నాడు ఈ భర్త నిర్వేదనగ.

అప్పటికప్పుడు కులాచారం ప్రకారం వారి విడాకుల తంతు జరిగిపోయింది.

ఈ భర్త మన చదల జానకి రామారావే!

ఆ యువతి స్థానంలో ద్వితీయ కళత్రంగా శ్రీమతి సుశీల వచ్చారు. వీరికి ఇప్పుడు [illegible] సంతానం.

మొదటి భార్య తాలూకు కుటుంబాన్ని శ్రీ జానకి రామారావే కాపాడవలసి వచ్చింది. అది వేరే విషయం ...

## కళారాధన

శ్రీ చదల జానకి రామారావు ప్రస్తుతం ఒక మంచి కళాపోషకుడు. ఏ తరహా కళాకారులైనా సరే వెళ్ళి శ్రీ జానకి రామారావును ఆశ్రయించి, తాము ఫలానా కళా ప్రదర్శన జరపనున్నాము, తమరి సహకారం కావలెనంటూ అర్ధించితే, ఆ కళా ప్రదర్శన పట్ల తమకు ఆసక్తి లేకున్నా సరే - వచ్చిన కళాకారులను గౌరవిస్తూ, వారికి యధాశక్తి సహకరించడం అనవాయితీగా వస్తున్నది. అందుకు కారణం లేకపోలేదు - ఆయన

స్వయంగా కళాకారులు !

ఆర్థిక బాధల వల్ల చదువు చాలించుకున్న శ్రీ జానకి రామారావు విద్యార్థి దశనుంచే కళాభిరుచిని పెంపొందించుకున్నారు. గుంటూరు జిల్లా నుంచి భజన పంతులుగారు ఒకరు గండేపల్లి వచ్చారు. గ్రామంలోని యువకులు కొందరు 'పాండురంగ భజన' నేర్చుకోవడానికి ఆయనను పిలిపించారు. ఆ రోజులలో పల్లె పట్టులలో భజన, కోలాటం, పోలాటం నేర్చుకోవడం, ప్రదర్శించడం, పోటీలు పడడం యువకులకు ఆనువాయితీగా వుండేది. శ్రీ జానకి రామారావు విషయం తెలుసుకుని, చల్లగా పంతులుగారిని ఆశ్రయించి, ఆయన శిష్యునిగా చేరాడు. ఆరు నెలల వ్యవధిలో భజనలో నిష్ణాతుడై పట్టం పొందారు.

ఇది తెలుసుకున్న దగ్గర గ్రామమైన అల్లూరు రెడ్డి యువకులు తమకు భజ' నేర్పవలసిందిగా శ్రీ జానకి రామారావును ఆహ్వానించారు. తల్లి గారి అనుమతితో జా, రామారావు ఆ ఊరు వెళ్ళి అనతి కాలంలోనే వారికి భజన నేర్పి వచ్చారు. చెక్క భః డొక్క నింపలేదు కదా ! ఉదర పోషణార్థం శ్రీ జానకి రామారావు రాఘవాపుర మునసబు గారి సహకారంతో కుట్టుమిషన్ ను ఏర్పరచుకొని దర్జాగా దర్జీ పనిని ప్రారంభించారు.

శ్రీ జానకి రామారావు మృదు భాషి. మిత భాషి. ఆయన కంఠస్వనం ఎంత మృదుమధురంగా వుంటుందో అంత గభీరంగానూ వుంటుంది. స్వచ్ఛత, స్పష్టత ఆయ జానుతెలుగు భాషలో ధ్వనిస్తాయి. కూనిరాగాలు తియ్యడం మొదలు పద్యాలను యుక్తంగా పాడడం వరకు పండితుడనిపించుకున్నారు. సాయంసంధ్యా సమయా చెరువుగట్టునో, కాల్వగట్టునో, ఏటి ఒడ్డునో, చెట్టు కిందనో, పుట్టచెంతనో గళం విప్ప మధుర రాగాలను ఆలపిస్తూ గండు కోయిలలను మరపిస్తుండేవారు. ఆయన గానలహరికి ముగ్ధులైన యువకులు కొందరు ఆయన ఇంటికి స్వయంగా వచ్చి రాగాలను నేర్చుకుపోతూవుండేవారు. గురువు లేని ఆయన సంగీత ఝరి ఆయనను గురువును చేసింది

శ్రీ జానకి రామారావు స్వయం కృషిని, ప్రతిభా పాటవాలను, నటునాసక్తిని తొలినుంచీ గమనిస్తూవస్తున్న ఆ ఊరికే చెందిన ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు శ్రీ బెజవాడ సుబ్బారెడ్డి ఆయనను తమ పార్టీలోకి ఆహ్వానించారు. శ్రీ సుబ్బారెడ్డి అప్పటి

ఆంధ్ర ప్రజా నాట్య మండలి నిర్వహణలో ప్రముఖ పాత్ర వహిస్తూవుండేవారు. శ్రీ జానకి రామరావును దానిలో చేర్చారు.

గ్రామీణ ప్రాంతాలలో ముఖ్యంగా పేద, సామాన్య ప్రజానీకాన్ని ఉత్తేజపరచే 'మాభూమి', 'ముందడుగు' నాటకాలలో ప్రాధాన్యత గల భూమికలను పోషించారు. ముఖ్యంగా 'యల్లమంద' పాత్రాభినయం ఆయనను అగ్రశ్రేణి రంగస్థలి నటుల సరసన చేర్చింది. పౌరాణిక నాటకాలైన 'హరిశ్చంద్ర' లో లోహితాస్యుడుగా నటించిన శ్రీ జానకి రామారావు 'గయోపాఖ్యానం' లో సుభద్రగా నటించి స్త్రీ వేషధారణలో సయితం శభాష్ అనిపించుకున్నారు.

ఈ నటనానుభవమే తరువాత తరువాత 'కల్లుముంత', 'ఏకలవ్య' బుర్రకథలతో లక్షలాది జనాన్ని ఆకర్షించుకునే స్థాయిన ఆయనను నిలిపింది. ఆ కథలలో శ్రీ జానకి రామారావు వ్యాఖ్యాతగా వ్యవహరించి నిరుపేదల నికృష్ట జీవితాలను కనులకుకట్టినట్టు సమయ సందర్భాలను గమనించి వర్ణిస్తుండేవారు.

కమ్యూనిస్టు పార్టీపై నిషేధం ఉన్న రోజులలో శ్రీ జానకి రామారావు కొరియరుగా పని చేసేవారు. ఆయన రకరకాల వేషధారణాభినయం కూడా అందుకు దోహదించేది. ఒకసారి ఆయన మిత్రుడు శ్రీ చలమయ్యతో కలసి కమ్మవారిపాలెం వెళ్ళారు. అప్పుడక్కడ పోలీసు కాపలా వుంది. మిలిటరీ వారు కొందరిని తరిమితరిమి కొడుతున్నారు. దీనిని గమనించి శ్రీ జానకి రామారావు, మిత్రుడు తప్పించుకోవడానికి ఎటూదారిలేక పొంగి ప్రవహిస్తున్న వైరా ఏటిలోకి దూకేశారు. మునగ ఈతతో గండేపల్లి ఒడ్డున తేలారు. అంటే – శ్రీ జానకి రామరావు ఈదడంలో కూడా దిట్టేనన్నమాట !

ఆ కాలంలో శ్రీ చదల జానకి రామారావు ఎదుట ఉద్యమాలు వున్నాయే కాని, ఉద్యోగం లేదు ! పూట గడవడం కష్టం. పస్తులకు లెక్కలేదు. ఊళ్ళవెంట తిరగడానికి, బస్సుచార్జీలకు డబ్బులువుండేవి కాదు. అంతా కాలినడక ప్రయాణం. పంపునీళ్ళు తాగి, ప్లాట్‌ఫారాల మీద పేపరు పరచుకుని కునుకుతీసిన రోజులు ఎన్నో ! **1949** జూన్‌లో విజయవాడలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర ఎరుకల సంఘ కార్యవర్గ సమావేశానకి హాజరు కావడానికి గండేపల్లి నుంచి మండుటెండలో ఆయన చేసింది పాదయాత్రే.....

రాయలసీమ జిల్లాలలో వీరి బుర్ర కథాదళం ప్రచారం సందర్భంలో ఒకసారి చిత్తూరు జిల్లాలో మారుమూల గ్రామమైన 'వేపలబయలు' కు వెళ్ళవలసివచ్చింది.

పీలేరులో రైలు దిగారు. అప్పుడు అక్కడ కలరా వ్యాధి ఉధృతంగా వ్యాపించి వుంది. ఊళ్ళోకి వెళ్ళడానికి వీల్లేదన్నారు. సరే, చేరువనే గల వాగు వద్దకు చేరారు. తైద జావ తాగారు. వాగు దాటి, అడ్డదారిన నడవడం ప్రారంభించారు. అడవిలో ప్రయాణం. అక్కడికి ఆ ఊరు 15 మైళ్ళు! ఎండ మండిపోతున్నది. కొందరి కాళ్ళకు చెప్పులు లేవు. తంగేడుపూవులను తురిమి కాళ్ళకింద వేసుకునేవారు. దాహం. నీటి చుక్క లేదు. పరికించగా, దూరంగా ఒక చోట ఆకశాన గింగర్లు కొడుతున్న గద్దల గుంపు కనిపించింది. అక్కడ నీరు వుండి ఉండవచ్చునని నిర్ధారణకు వచ్చి, అటు నడిచారు. మొత్తాని కొక నీటి మడుగు వున్నది! ఆపసోపాలతో సాయంత్రానికి ఊరు చేరి, రాత్రికి కథ చెప్పారు. అది కళాతృష్ణ. కార్యసాధన. కర్తవ్య నిర్వహణ. అక్కడ వీరికి అన్నం లేదు. శనగపప్పు, బొరుగు పేలాలు ( మురమురాలు ) తిని, నీళ్ళు తాగారు. తిరుగు ప్రయాణంలో గుంతకల్లుకు చేరుకుని రైలెక్కారు.

వీరి దళాన్ని కమ్యూనిస్టులుగా అనుమానించి, పోలీస్ నిఘా పెట్టారు. ఒకసారి పోలవరంలో పోలీసులు వీరిని అటకాయించారు. కదలనివ్వక, యక్షప్రశ్నలు వేస్తున్నారు. వీరు ఎంతగా నచ్చచెప్పినా పోలీసులు పట్టించుకోలేదు. ఆ సమయంలో అటుగా శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావు గారు వెడుతూ వీరిని గమనించారు. ఈ దళం వారికి పరిచయమే. ఆ స్వాతంత్ర్య యోధుని మాట మేరకు వీరిని వదలివేశారు.

ఇటువంటి శతానేక ఇబ్బందులను, ఇక్కట్లను అధిగమించి వీరు కళ ప్రజల కోసమే అనే సత్యాన్ని ఋజువు చేస్తూ ఉద్యమించారు. ఆ స్ఫూర్తి ఇప్పుడు ఏది...?





# కుల సంఘాలు

'**ఇప్పుడు** గొప్ప నాగరీకులుగా తమను తాము అభివర్ణించుకుంటున్న సవర్ణ మానవులు అందరు ఆదిమ సమాజంలో ఆదిమ జాతుల వారేకదా !' అని తెగేసి మరీ చెప్పాడు మహనీయుడు, మానవతావాది ఎం. ఎన్. రాయ్.

'మన సమాజం ఆదిమ జాతుల వారిని అయిదు వేల సంవత్సరాలుగా అణగద్రొక్కి వుంచింది ! ' అని సోషలిస్టు మేధావి డాక్టరు రామమనోహర్ లోహియ స్పష్టీకరించారు.

'ఆదిమ జాతుల వారు బహు నికృష్టమైన జీవితాన్ని గడుపుతున్నారూ అంటే అది వారి నైజం కాదు. అందుకు సమాజాన్నే వేలెత్తి చూపవలసివుంటుంది.' అని భారత తొలి ప్రధాని పండిత జవహర్ లాల్ నెహ్రూ హెచ్చరించారు.

'అనాది జాతుల వారే మన మూలపురుషులు.' అని బాబూ రాజేంద్ర ప్రసాద్ విశదీకరించారు.

భారత దేశపు ఉత్తరాన గంగా - సింధు నదుల పరీవాహక ప్రాంతం మొదలు దేశానికి మధ్యగా వున్న వింధ్య పర్వతాల వరకు; వాటిని దాటి, దిగువ దక్షిణాన-కన్యాకుమారి అగ్రం వరకు ఆదిమ జాతుల వారు విస్తరించి వున్నారు. ఆ మాటకువస్తే అసలు ద్రావిడులు, ఆర్యులు అనే వారు రాక ముందు నుంచి అనాదిగా యుగయుగాలుగా - ఇక్కడ ఆవాసమున్నవారే ఆదిమ జాతుల వారు. అయితే, అప్పటి భౌగోళిక, ప్రాకృతిక, రాజకీయ, సామాజిక పరిస్థితుల దృష్ట్యా వీరికి స్థిరనివాసం లేదు. గుంపులుగా, గూడేలుగా, తండాలుగా రక్తబంధువులంతా ఒక చోట చేరి కాలం గడిపేవారు.

ఆదిమ - సంచార జాతులలో ఎరుకలు, యానాదులు, చెంచులు, లంబాడీలు, పాముల, బుడబుక్కల, వడ్డెర, బోయ, దొమ్మర, బండ, మొండి మొదలైన తెగలు ప్రధానమైనవి. ఆధునిక సమాజంలో కనీసం మానవ మాత్రులుగా అయినా గుర్తింపుకు నోచుకోని ఈ ఆదిమ జాతుల అంధకార బంధుర జీవతాలను కొంతలో కొంతైనా

# నేరం చేయని 'నేరస్థులు'

**ఎరుకలు,** యానాదులు, చెంచులు మొదలైన ఆదిమ జాతులవారు అనాదిగా భయ భ్రాంతులతో జీవించడానికి ముఖ్య కారణం హింస. గ్రామ పెత్తందారులు, భూస్వాములు, జమిందారుల వత్తాసు మేరకు, వారి అడుగులకు మడుగులొత్తే అధికారగణం అమాయక జాతుల వారిని అకారణంగా హింసిస్తుండేవారు. ఈ సంచార జాతుల వారికి వేరే వృత్తులు తెలియవు. పొలం పుట్రలు లేవు. పందులను పెంచుకుంటు, చాపలు, తట్టలు బుట్టలు అల్లుకుంటూ, చేపలను పట్టుకుంటూ ఉదరపోషణ చేసుకునేవారు. అదీ చాలీచాలని గంజినీళ్ళు. వారి అమాయకత్వాన్ని ఆసరాగ చేసుకుని పై వర్గాలవారు వీరిని రాచిరంపాన పెట్టేవారు. గొడ్డుచాకిరి, వెట్టిచాకిరి చేయించుకోవడమేకాక, కట్టుబానిసలను చేసేవారు. పైగా 'దొంగలు' గా ముద్రవేసి, పోలీసులు, ఇతర అధికారుల క్రౌర్యానికి బలిచేస్తుండేవారు. మునసబు, కరణాలు వీరి పాలిట యమకింకరులు. వీరి యమయాతనలు పడలేక పారిపోతుండేవారు. దొరకిన వారిని పట్టుకువచ్చి చిత్రహింసలు పెట్టేవారు. చేయని నేరాన్ని చేసినట్టు అంగీకరించవలసిందిగా గొడ్డును బాదినట్టు చితక బాదేవారు. మగవారు కనుమరుగైతే, ఆడవారిని సయితం వదిలేవారు కాదు. మగవారి ఆచూకిని తెలపమంటూ స్త్రీలను నరక యాతనలు పెట్టేవారు. తొడలలో తొండలను వదిలేవారు. వర్ణించనలని కాని రీతిన - సభ్యసమాజం సిగ్గుపడే విధంగా- హింసించేవారు. కనుకనే ఈ ఆదివాసులు స్థిర చరాస్తులకు నోచుకొనక సంచార జీవులుగా ఊరూవాడ పట్టుకు తిరుగుతుండేవారు. మానవతను మంట గలిపే ఇట్టి దుస్థితికి ప్రధాన కారణం 'నేరస్థుల జాతుల చట్టం.'

ఈ 'క్రిమినల్ ట్రైబ్స్ యాక్ట్ '(సి.టి. ఆక్ట్) ప్రతిపాదకుడు జె.ఎం. స్టీఫెన్స్ అనేవాడు. ఇతను అప్పటి బ్రిటిష్ ప్రభుత్వపు కార్యదర్శి. నాటి వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యుడు కూడాను. **1871**లో ఈ చట్టాన్ని ప్రతిపాదిస్తూ అతను 'ఇండియా కులాల మయం. నేరస్థులు కూడా ఒక కులం వారే. పాత నేరస్థుడు ఎప్పుడూ కొత్త నేరస్తుడే. వాడికి పుట్టబోయేవాడు కూడా నేరస్తుడే. నేరం వాడి కులం' అని సిద్ధాంతీకరించాడు. **53** సంవత్సరాల పిదప - **1924**లో - ఈ చట్టాన్ని బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంలో అమలుపరిచింది.

చట్టం అమలు అంటే నరకలోక యాత్ర ప్రారంభమవడం. ఎరుకలు, యానాదులు, సుగాలి చెంచులు, బుడబుక్కల, దొమ్మర, బండ, మొండి మొదలైన సంచార - ఆదివాస జాతులవారు నేరం చేసినా చేయకున్నా కేవలం వదంతులు, ఫిర్యాదులు, దొంగ సాక్ష్యాల పేర వారికి యావజ్జీవ కారాగారవాసం లేక ద్వీపాంతర వాస శిక్షలు విధించేవారు. చిత్ర హింసలతో కొందరు సంచారులు అంగవైకల్యం చెందేవారు, మరి కొందరు మతి చాంచల్యం పొందేవారు. పోలీసులు, స్వదేశీ సంస్థానాధీశులు, జమిందారులు, ఇనాందారులు, బడా భూస్వాములు, ఈ చట్టాన్నిఆయుధంగా కన్పూమినప్పూ కానకుండా

ఉపయోగించుకునేవారు. సంచార - ఆదివాస జాతులవారి పాలిట ఈ చట్టం ఒక పె
శాపం, గుదిబండ, ఏలిననాటి శని.

ఈ చట్టం ప్రకారం - ఆదివాసి పొరుగూరికి పోవలనంటే గ్రామ మునసబు
చే(వ్రాలు (గొట్టం చీటి) రహదారి చీటి అవసరం. అది లేకుంటే అతనికి జై
గతి. పొరుగూరిలో పగలు తన పనులు చక్కబెట్టుకున్నా, రాత్రికి అతను మునసబు ఇం
పంచనే పరుండాలి. మొత్తంగా ఈ చట్టం ఆదివాసుల జవసత్వాలను, ధైర్యస్థయిర్యాల
చంపివేసింది, వారి మూలుగులను పీల్చి పిప్పి చేసింది. జాతి వికాసాన్నే అపహరించింద

సందటిలో సడేమియా అన్నట్లు విదేశీ క్రైస్తవ మిషనరీలు రంగప్రవేశం చేసి
నేరస్తులలో ఏసుక్రీస్తు పేర హృదయ పరివర్తన తీసుకువచ్చి, వారిని సత్యసంధులన
నీతిమంతులను చేయగలమన్నారు. సహజంగా బ్రిటిష్ ప్రభుత్వం వీరికి ఊతమిచ్చింద
వెంట వెంటనే 'నేరస్థులు' గా ముద్రపడిన వందలాది అమాయక ఆదివాస కుటుంబాలవారి
ఒక చోటుకు చేర్చి వారికి 'కాలనీ' లను నిర్మించారు. మహబూబ్‌నగర్ జిల్లా లింగా
నెల్లూరు జిల్లా కప్పరాల తిప్ప, గుంటూరు జిలా స్టువర్టుపురం, సీతానగరం, చిత్తూ
జిల్లా భూమల గడ్డ కాలనీలు అలా ఏర్పడినవే. వీటిని 'సెటిల్మెంట్స్' అనారు. ఈ 'సెటిల్మెంట్
వ్యవహారాలను చూసే బాధ్యతను 'శాల్వేషన్ ఆర్మీ' అనే క్రైస్తవ రక్షణ దళాని
ఒప్పగించారు. క్రైస్తవ మతం స్వీకరిస్తేనే వారికి మానసికంగా భౌతికంగా 'రక్షణ' అ
గావాన్ని ఈ సెటిలర్స్ లో నయానా భయాన బోధించేవారు.

ఇట్టి దిక్కుమాలిన చట్టాన్ని తక్షణమే రద్దు చేయవలెనని కోరుతూ అన్ని ఆదివా
కుల సంఘాల వారు : రాష్ట్ర, కేంద్ర ఆదిమ జాతి సేవక్ సంఘాల వారు సర్వశ్రీ వెన్నెలకం
రాఘవయ్య, పాలపర్తి వీరయ్య, పొన్నా సత్యనారాయణ, రామేశ్వరం నాగయ్య
తిరువిధుల సాంబయ్య, రామావతు లాలూనాయక్, చదల జానకి రామారా
నాయకత్వాన, మహోద్యమాలనే నిర్వహించారు. **1941**లోనే నాటి గవర్నరుకు, దేశ
కమిషనుకు మెమొరాండాలను సమర్పించారు. వీరి కృషి చరిత్రాత్మకం. గ్రామ, ఫిర్క
తాలూకా, జిల్లా, రాష్ట్ర స్థాయిలో సభలు, సమావేశాలు, ఊరేగింపులు, ఆందోళన
చేసి, లేఖలు వ్రాసి, మహజర్లు సమర్పించి ఉద్యమాన్ని మహోధృతంగా నిర్వహిం
విజయవంతం చేశారు. నిజానికి, నేరస్థులు అన్ని కులాలలోను వర్గాలలోను వున్నార
అటువంటిది-కేవలం ఆదివాసులే నేరస్థులనడం అమానుషం, అవివేకం. అమానుషమై
ఈ 'నేరస్థ జాతుల చట్టం' మానవతగల మహనీయులను మేల్కొల్పింది. పండి
జవహర్‌లాల్ నెహ్రూ **1936** అక్టోబరు **18**వ తేదీన నెల్లూరు బహిరంగ సభ
మాట్లాడుతూ 'సి. టి. ఆక్ట్ ఘోర నిర్బంధాలు నాకు తెలుసు. అది మానవ సంస్కృతి
సంకెల. మన శిక్షాస్మృతి నుంచి ఈ అమానుష చట్టాన్ని వెనువెంటనే తొలగించాలి' అ

ఉద్ఘాటించారు. ఆయన అధికారం చేపట్టగానే వీరిని 'విముక్త జాతులుగా' ప్రకటించారు.

మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ముత్తా వెంకట సుబ్బారావు "ఈ సి. టి. ఆక్టు మన న్యాయ వ్యవస్థనే అవమానిస్తున్నది. భారతీయ ఆత్మ సాక్షికే ఇది అపచారం. న్యాయ శాస్త్రానికే కళంకం" అని **1938**లోనే నిశితంగా వాఖ్యానించారు.

అప్పటి ప్రముఖ రాజకీయ పార్టీ అయిన అఖిల భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులు, మన తెలుగువాడు అయిన శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య "భారత జనాభాలో అరవయ్యవ భాగాన్ని 'నేరస్థజాతి' అని నిర్ణయించడం బ్రిటిష్ ప్రభుత్వం చేసిన పెద్ద నేరం. ఇది పశుబల ప్రదర్శనేకాని మరొకటి కాదు" అని నిరసించారు. **1937**లో ఫయిజ్‌పూర్‌లో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభలో శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య సి. టి. ఆక్టును రద్దుపరచవలెనని ప్రవేశపెట్టిన తీర్మానాన్ని పండిత నెహ్రూ బలపరిచారు. మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది.

మానవత నిదుర లేచింది. భారత దేశంలో అన్ని కులాలు, అన్ని మతాలు, జాతులు, శాఖల వారు ఈ చట్టాన్ని ఎలుగెత్తి దుయ్యబట్టారు.

ఎట్టకేలకు లోకం కళ్ళు తెరచింది. **1946**లో ఏర్పడిన టంగుటూరి ప్రకాశంగారి మంత్రి వర్గం అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రం అంతటా **1947**లో ఈ దరిద్రపుగొట్టు దిక్కుమాలిన చట్టాన్ని రద్దు చేసింది.

అంతే కాదు 'సెటిల్‌మెంట్' నిర్వహణ వ్యవహారాల పరిశీలనకు శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య అధ్యక్షతన ప్రత్యేక కమిటీని ప్రభుత్వం నియమించింది. **1948**లో ఆ కమిటీ తన నివేదికను ప్రభుత్వానికి అందజేసింది.

ఇటువంటి మరికొన్ని నివేదికలను కూడా కేంద్ర ప్రభుత్వం పరిశీలించిన పిదప **1952** ఆగస్టు **31**వ తేదీన - **28** సంవత్సరాల పిదప - ఈ నేరస్థ జాతుల చట్టాన్ని (క్రిమినల్ ట్రైబ్స్ యాక్ట్) యావత్తు భారతదేశం అంతటా రద్దు చేసింది.

అయితే, భూస్వాములుకాని, బ్యూరోక్రాట్స్‌కాని సామాన్యులు కారు. 'నేరస్థ జాతుల చట్టం' రద్దయాక, దాని స్థానంలో అంతే క్రూర స్వభావంతో 'అలవాటుపడిన నేరస్థ జాతుల చట్టం' (HABITUAL OFFENDERS ACT) ప్రవేశపెట్టారు.

షరా మామూలే అన్నట్టు ఈ చట్టాన్ని ఆసరాగ చేసుకుని పోలీసులు, భూస్వాములు తదితర బడాబాబులు తమ పరమ నీచ , నికృష్ట, దుర్మార్గపు చర్యలను కొనసాగించ పూనుకున్నారు. అయితే, అప్పటికే జాగృతి చెందిన ఆదిమ జాతి సేవక సంఘం వారు సర్వశ్రీ వెన్నెలకంటి రాఘవయ్య, పొన్నా సత్యనారాయణ, తిరువీధుల సాంబయ్య, రామేశ్వరం నాగయ్య, పాలపర్తి వీరయ్య, రామావతు లాలునాయక్, చదల

జానకి రామారావు ప్రభృతుల నేతృత్వాన మరల మహోద్యమానికి సమాయత్తమయ్యారు. దీనితో దానిని సయితం రద్దు చేశారు. *

## గుర్తింపు

షెడ్యూల్ ట్రైబ్స్‌గా ఎరుకల, యానాది, లంబాడి, చెంచు, బుడబుక్కల, పాముల, దొమ్మెర మొదలైన సంచార ఆదివాసులను ప్రభుత్వం గుర్తించవలెనని కోరుతూ **1941** నుంచి ఆంధ్ర రాష్ట్ర ఎరుకల సంఘం వారు శతపోరుతూవచ్చారు. **1951**లో భారత తొలి రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాద్ మద్రాసులో విడిదిచేసినపుడు ఈ సంఘంవారు అక్కడకు వెళ్ళి ఈ మేరకు వినతి పత్రాన్ని కూడా సమర్పించారు.

**1954**లో ఆంధ్ర ప్రాంతంలో పర్యటించిన కాకా కలేల్కర్ కమిషన్ ఎదుటకు విజయవాడ లక్ష్మీ టాకీస్ సెంటరులో వేలాది మంది ఎరుకలు, యానాది, సుగాలి, చెంచు, పాముల, బుడబుక్కల మొదలైన వారిని వారి వారి సంప్రదాయక వేషభాషలతో సహా సమీకరించి ప్రత్యక్షపరిచారు. తమను షెడ్యూల్ ట్రైబ్స్‌గా గుర్తించవలెనని వీరందరు కాకా కలేల్కరును స్వయంగా అభ్యర్థించారు.

కాకా కలేల్కరు, దేబర్, దాతార్, బసుమతార్ కమిషన్‌ల సిఫారసు మేరకు అప్పటి ఆంధ్ర జిల్లాలలోని ఈ తెగలను షెడ్యూల్ ట్రైబ్స్‌గా **1956** సెప్టెంబరు **26**వ తేదీన ప్రభుత్వం గుర్తించింది. అయితే, నాటి హైదరాబాద్ రాష్ట్రంలోని వారిని మాత్రం వెనుకబడిన తరగతులుగానే (బి. సి) పరిగణించింది. ఈ అసమంజసాన్ని తొలగించి తెలంగాణా ప్రాంతం జిల్లాలకు చెందిన ఈ తెగలను కూడా షెడ్యూల్ ట్రైబ్స్‌గా గుర్తించవలెనని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు వీరు విజ్ఞప్తులుచేశారు. చివరకు **1977**లో ఈ చట్టాన్ని అక్కడ కూడ వర్తింపచేశారు. ఈ మహత్తర కృషిలో శ్రీ చదల జానకి రామారావు గారి పాత్ర గణనీయమైనది ఘననీయమైనది.

అయితే, పోలీసు వ్యవస్థలో, నేర పరిశోధనలో నేటికీ మార్పు రాలేదు. వివక్షత కొనసాగుతూనే వుంది. మొరటు విధానం పోలేదు. ఈ విషయంలో మేధావులు, రాజకీయ వేత్తలు వెంటనే స్పందించి, పోలీసు వ్యవస్థలో సమూలమైన సంస్కరణలను ప్రవేశపెట్టి, నిరుపేదలకు నిష్పాక్షిక న్యాయం దక్కేట్టు చేయవలసిన ఆవశ్యకతవున్నది. *

---

మనవి : కలర్ ఫొటోలలో మూడవ పేజీలోని చిత్రం నాలుగవ పేజీకి, నాలుగవ పేజీలోని చిత్రం మూడవ పేజీలోకి మారుతుంది. రైటప్స్ యధాతథం. - ఎడిటర్

# ఆదిదంపతుల ఆనవాలు



శ్రీ జానకి రామారావు- శ్రీమతి సుశీలమ్మ

# మాతృదేవో భవః



శ్రీ జానకి రామారావు తల్లి శ్రీమతి చదల అచ్చమ్మ గారు

# వంశాంకురాలు



చదల జానకి రామారావు దంపతుల ప్రథమ పుత్రుడు శ్రీ కృష్ణారావు-కోడలు శ్రీమతి రుక్మిణి, వీరి పిల్లలు చిరంజీవులు అరుణ, వేణుమాధవ్, శ్రీదేవి, శ్రీనివాసరావు



ద్వితీయ పుత్రుడు శ్రీ అమరేశ్వరరావు, కోడలు శ్రీమతి
వసుంధర, వారి చిరంజీవులు



తృతీయ పుత్రుడు శ్రీ సీతారామారావు, కోడలు శ్రీమతి విజయదుర్గాదేవి- వారి చిరంజీవులు



చతుర్థ పుత్రుడు శ్రీ భవానీసేన్- కోడలు శ్రీమతి ప్రమీలా దుర్గాదేవి- వీరి చిరంజీవులు సుమన్



ప్రథమ పుత్రిక శ్రీమతి కల్పనాదత్తు- అల్లుడు శ్రీ పోన్నా
రామమోహనరావు- వీరి చిరంజీవులు



ద్వితీయ పుత్రిక శ్రీమతి రేణుకా దేవి- అల్లుడు శ్రీ మానుపాటి ప్రభాకరరావు- వారి చిరంజీవులు కిషోర్, నాగలక్ష్మి



తృతీయ పుత్రిక శ్రీమతి ఝాన్సీలక్ష్మీబాయి - అల్లుడు డాక్టరు రెబ్బా అబ్బయ్య - వీరి చిరంజీవులు

## ఈ బ్రతుకులు ఇంతేనా....
## మైలవరంలో ఒక ఎరుక, ఒకానొక ఎరుకత





## సందులలో పందులతో





మొన్నమొన్నటి మన మంత్రివర్యులు దేవినేని వెంకట రమణ గారికి ప్రజా సమస్యలను వివరించిన శ్రీ చదల జానకి రామారావు



కాకాని వెంకట రత్నం కళాశాల అధ్యాపకులు, విద్యార్ధులు శ్రమదానం చేసి, మొక్కలు నాటుతున్నప్పటి దృశ్యం



న్యూ ఢిల్లీలో అప్పటి రాష్ట్రపతి వెంకట రామన్ గారిని కలుసలుకున్నప్పటి ఫోటో





కుతుబ్‌మినార్‌ను సందర్శించిన వేళ, సర్వశ్రీ ఎరుకల వెంకటస్వామి, చదల జానకి రామారావు, పాలపర్తి వీరయ్య, కంపా కోటయ్య గారలు.



పేర్లు వ్రాయనవసరం లేదు కదా !



నందిగామ పంచాయతీని మూడు దశాబ్దాలపాటు ఏలిన మాజీ సర్పంచ్ డాక్టరు సుంకర సబ్బారావు గారిని ఆ పంచాయతి మాజీ ఉపసర్పంచ్ శ్రీ చదల జానకి రామారావు **1998** ఆగష్టు ఒకటవ తేదీన కలుసుకున్నప్పటి చిత్రం.



మద్యపాన వ్యతిరేకోద్యమ ఐక్యవేదిక కోసం 'ఈనాడు' రామోజీరావు గారు రూపకల్పన చేసిన శంఖారావం. శ్రీ చదల జానకి రామారావు ఈ ఉద్యమానికి కృష్ణా జిల్లాలో ఉపాధ్యక్షులు.

నెలూరు సభలో జోహారు గీతాలపన



గౌ॥ శ్రీ నందమూరి తారక రామారావు గారి **73**వ జన్మదినోత్సవం సందర్భంగా **1994** జూన్ **16**వ తేదీన హైదరాబాద్‌లోని వారి స్వగృహంలో ఫలకాన్ని బహూకరిస్తున్న శ్రీ చదల జానకి రామారావు, శ్రీ వడ్డెలి సాంబశివరావు, శ్రీ తోట వెంకటేశ్వరరావు గార్లను కూడా ఫోటోలో చూడవచ్చు.

## నిప్పులాంటి మనిషి



పరిచయకర్త : వీరు జానకి రామారావు అని, ఎరుక...

నందమూరి : నో,నో,నోనో బ్రదర్! ఈ తారక రాముడికి మీరు పరిచయం చేయాలా- అందున ఎరుకల వాడు అంటూ! కాదు-వారు ఎరుకల వాడు కాదు, మా ఎరుక కలవారు. జగమెరిగిన బ్రాహ్మణుడు నిప్పులాంటి మనిషి, ప్రజల మనిషి, మన పార్టీ కార్యకర్తకు ఒక మనిషి .

ఫోటోలో వరుసగా (ఎడమ నుంచి) సర్వశ్రీ కె. నరిసి రెడ్డి, తోట వెంకటేశ్వరరావు, శ్రీమతి చదల సుశీల, పంచుమర్తి శ్రీనివాసరావు (సిద్ధాంతి)



నందిగామ న్యూ కాలనీలో జరిగిన హోమియోపతిక్ వైద్య శిబిరాన్ని ప్రారంభించిన పిదప, మందుల నాణ్యత గురించి ప్రశ్నిస్తున్న మంత్రి శ్రీ దేవినేని వెంకటరమణ, ప్రత్యుత్తరమిస్తున్న డాక్టరు కె. భానుప్రసాద్, ఆసక్తిగా తిలకిస్తున్న చదల.



శాంతి మహిళా మండలి ఆధ్వర్యాన జరిగిన బుట్టల అల్లిక శిక్షణ శిబిరాన్ని ప్రారంభించిన పిదప ప్రసంగిస్తున్న మంత్రి శ్రీ దేవినేని వెంకట రమణ, జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ రాఘవరావు, సభాధ్యక్షులు శ్రీ చదల జానకి రామారావు.



నందిగామ న్యూ కాలనీ సెంటర్‌లో **1997** ఆగష్టు **7**వ తేదీన జండా ఆవిష్కరణ ద్వారా జండా స్థూపాన్ని ప్రారంభిస్తున్న శ్రీ చదల జానకి రామారావు. బి.సి. నాయకులు శ్రీ మనబోరుల శ్రీరామ కూడా వున్నారు.



నందిగామ బుడబుక్కల వారి కాలనీలో మురుగు కాల్వను బాగు చేస్తున్న శ్రీ చదల జానకి రామారావు. పరిశీలిస్తున్న మంత్రి శ్రీ దేవినేని వెంకట రమణ.



నందిగామ ఆసుపత్రిలో మొక్కను నాటుతున్న శ్రీ జానకి రామారావు, ఎం.డి.ఓ. శ్రీ వెంకట రత్నం, నోడల్ ఆఫీసరు శ్రీ రాజు, మండల పరిషత్తు సభ్యులు శ్రీ రామకోటయ్య, శ్రీ వెంకటనారాయణ తదితరులు.



నందిగామ న్యూకాలనీలో మొక్కను నాటుతున్న వార్డు సభ్యులు శ్రీమతి వల్లెపు సీతమ్మ.



నెల్లూరు ట్రస్టు బోర్డు ఆఫీసులో **1998** డిసెంబరు **24**వ తేదీన రాఘవయ్య గారి సంస్కరణ సభలో పొట్టి శ్రీరాములు పటానికి పుష్పహారం సమర్పిస్తున్న శ్రీమతి చదల సుశీల. శ్రీమతి పాలపర్తి తిరుపతమ్మను కూడా ఫోటోలో చూడవచ్చు.



నాటి సభలో ఉపన్నసిస్తున్న శ్రీ చదల జానకి రామారావు.

బాగుపరచవలెననే పవిత్ర ధ్యేయంతో ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో ఆదివాసుల పునరుజ్జీవనోద్యమాలు ప్రారంభమయ్యాయి. ఇందుకు కుల సంఘాలు దోహదించాయి. ఇట్టి కులసంఘాల ఏర్పాటుకు కులేతర సంస్కరణాభిలాషులు ముందుకు రావడం విశేషం.

కుల సంఘాలు మంచివా చెడ్డవా అనేది కాదు సమస్య. ఆ కుల సంఘాలు తమ కులంవారి ఆర్థిక, సామాజిక ప్రగతికి ఏ మేరకు దోహదించాయి అనేదే ప్రధానం. అన్య కులాల పట్ల ద్వేషభావం పెంచుకోనంతవరకు, కులాలకు రాజకీయాలకు ముడి పెట్టనంతవరకు వీటివల్ల ప్రమాదం లేదు. వృత్తి సంఘాలను, కుల సంఘాలను ఒకే గాటన కట్టడం తప్పు.

బ్రాహ్మణ సంఘం, కమ్మ సంఘం, రెడ్డి సంఘం, క్షత్రియ సంఘం, కాపు సంఘం, గౌడ సంఘం, యాదవ సంఘం, విశ్వబ్రాహ్మణ సంఘం, నాయీబ్రాహ్మణ సంఘం, రజక సంఘం, కళావంతుల సంఘం, మాల సంఘం, మాదిగ సంఘం అంటూ సవాలక్ష కుల సంఘాలు మన సమాజంలో చీలికలు పేలికలుగా నాటుకుపోయి వున్నాయి. అసలు కుల వ్యవస్థే పెద్ద తప్పు. అయినప్పుడు - ఆ యా కులాల వారందరు ఎవరికి వారు సంఘటితం కావడంలో తప్పేమున్నది? స్వార్థం, సంకుచిత తత్వం లేనంతవరకు కులం పేర సమాజ ప్రగతికి అవరోధం కానంతవరకు - అన్య కుల ద్వేషానికి తావివ్వనంత వరకు - వీటిని అనుమతించవచ్చునని గతంలో కొనసాగిన కుల సంఘాల చరిత్ర చాటిచెపుతున్నది. సెక్యులరిజం పేర కొన్ని వాస్తవిక సంఘటనలను మభ్యపుచ్చుకోవడం మనను మనమే మోసగించుకోవడం అవుతుంది. సంస్కరణలకు ప్రోదిచేసి, సంఘంలో సమాన ప్రతిపత్తికి దోహదించే సంఘాలను విస్మరించవలసిన అవసరం లేదు.

*





# సోది సొద

**ఎరుకలను** పల్లెటూళ్ళలో సామాన్యంగా 'ఎలికలోళ్ళు' అనడం కద్దు. వీరు చోరులు కాదు, చారులు, గూఢచారులు. చాణక్యుడు పేర్కొన్న రాజనీతి అష్టాంగాలలో భాగమైన చారుచర్య ఒకప్పటి వీరి ప్రధాన వృత్తి. ఇది చాలా గౌరవప్రదమైనది, గంభీరమైనది, అన్యులు చేయలేనిది.

అలనాడు రాజ్యంలో ఎక్కడ ఏమి జరుగుతున్నదీ వీరి ఎరుకలో ఉండేది. కనుకనే వీరిని 'ఎరుకలు' అన్నారు. రాజుగారి ఉత్తర్వులను, రహస్యపు ఉత్తరాలను సంబంధిత రాజోద్యోగులకు, రాజ బంధువులకు ఆఘమేఘాలమీద అందించడం వీరి పరమ కర్తవ్యం. ఇందుకు గుండె ధైర్యం కావాలి. చొరవ కావాలి. చాకచక్యం వుండాలి. అవన్నీ వీరికి పుష్కలం. వాహనాలు, గుర్రాలు సయితం వెళ్ళలేని కాకులు వాలని కారడవులలో, చీమలు దూరని చిట్టడవులలో ఉరుకులు పరుగులుతో వెళ్ళి ఏలికలకు సమాచారాన్ని అందించేవారు. చెట్లపైన, పుట్లమాటున, మారువేషాలలా నిఘావేసి శత్రువులు, సంఘవిద్రోహుల కదలికలను గుర్తించి పరుగుపరుగున వెళ్ళి పాలకులకు తెలియజేసి ప్రమాదాలనుంచి వారిని, దేశాన్ని రక్షించేవారు. ధైర్యస్థైర్యాలకు వీరు పెట్టింది పేరు. నమ్మకానికి నిలువెత్తుసాక్షులు. నిజాయితీకి ఆరోప్రాణం. అటు ప్రభుత్వాలలో ఇటు ప్రజలలో వీరికి ప్రత్యేక గుర్తింపు ఉండేది.

కాలం మారిపోయింది. రాజ్యాలు కూలాయి. ప్రభువులు పోయారు. పరిపాలనా విధానాలలో పెను మార్పులు వచ్చాయి. రాజకీయ, సాంఘిక, ఆర్థిక వ్యవస్థలలో మార్పులు చకచకా చోటుచేసుకున్నాయి. ఎరుకలవారి జీవనం స్థంభించి పోయింది. జీవన ప్రమాణాలు ధ్వంసమయాయి. సాంఘిక భద్రత లేకుండాపోయింది. చివరకు వారిని 'దొంగలు'గా ముద్రవేసింది సంఘం. సమాజంలో వారి ఉనికి భయభ్రాంతమైపోయింది. ఇది ఆధునిక చరిత్రలో దయనీయమైన అధ్యాయం. మానవేతిహాసంలో దారుణ సంఘటన. మానవతకు మాయని మచ్చ.

పధ్ధెనిదవ శతాబ్ది పూర్వార్ధానికి ఎరుకల బ్రతుకు బండలయింది. బ్రతుకు తెరవుకోసం చెట్టుకొకరు పుట్టకొకరుగా చెల్లాచెదురైపోయారు. జమిందారీ భూస్వామ్య వ్యవస్థ వీరిని పట్టి పీడించగా, ముస్లిం పాలకులు వీరి మూల్గులను పీల్చివేయగా, బ్రిటిష్ దొరతనం వీరిని దొంగలుగా చేసింది. నిజానికి బ్రిటిష్, స్కాటిష్, ఫ్రెంచ్, డచ్, పోర్చుగీస్ జాతులవారే పెద్ద బందిపోటు దొంగలు. సముద్రపు దొంగలు. దేశాలనే కొల్లగొట్టారు!

ఎరుకల వారి భాషకు లిపి లేదు. లిపి లేని భాషలు నేటికీ శతాధికంగా ఉన్నాయి. సంచార- ఆదివాస- గిరిజన జాతులవారి భాషలకు లిపిని లిఖించటానికి గిడుగు రామమూర్తి పంతులుగారు సవర, గోండు భాషలతో శ్రీకారం చుట్టారు గాని అది కొనసాగలేదు. ఎరుకల భాష తమిళానికి కొంచం దగ్గరగా ఉంటుందని అంటారు. ఎరుకలను మహారాష్ట్రలో 'కైకాలులు' అంటారు. కర్ణాటకలో 'కొరిసలు' అంటారు. తమిళనాట వీరు 'కురువన్'లు. తమిళనాడులో వీరి ప్రధాన దేవర కొల్హాపురి. మన ఎరుకల దేవేరులు పోలేరమ్మ, ముత్యాలమ్మ, మహలక్ష్మమ్మ.

ఎరుకలు పూర్తిగా మాంసాహారులు. వేట వీరికి ఆట. ఉండేలు బద్దతో పిట్టలను కొట్టడంలో వీరికి వీరే సాటి. ఉచ్చులు, బోనులు, బళ్ళాలు వీరి వేట ఆయుధాలు. పక్షులు, ఎలుకలు, పిల్లులు, కుందేళ్ళు, ఏదుపందులు, చేపలు వీరి ముఖ్య ఆహారాలు. దేశవాళి నాటుపందుల పెంపకం ముఖ్యవృత్తి. ఊరుకు శివార్లలో నలుమూలలా విడివిడిగా గుడిశలు వేసుకుంటారు. బోర్లించిన 'తెట్టి'లుగా (చేపలు పట్టే ఒక రకం మావులు) ఇవి వుంటాయి. వృద్ధులు, స్త్రీలు తట్టలు బుట్టలు అల్లుతారు. ఇందుకు ఈత, తాటి ఆకులను, తుంగ, అల్లిగడ్డిని, చువ్వలను వాడతారు. వెదురుతో బండి జల్లలను, చేతబుట్టలను, గంపలను కూడా అల్లుతారు. వీటిని అమ్ముకొని పొట్టపోసుకుంటారు. కష్టజీవులు, నికృష్టజీవులు కూడా వీరే!

ఎరుకల వారికి రెండు ప్రధాన గోత్రాలు, రెండు ఉప గోత్రాలు వున్నాయి. 'సాతుపడి', 'కావాడి' ప్రధాన గోత్రాలు. వీరిలో ఒక గోత్రం అమ్మాయి వీరికంటే తక్కువ కులస్తుని వివాహమాడగా, వారికి పుట్టిన సంతతికి 'కూతాడి' గోత్రం ఇచ్చారు. ఒక గోత్రం అమ్మాయి వీరికంటే ఎక్కువ కులస్తుని వివాహమాడగా ఆమెకు పుట్టిన సంతతికి 'మానుపడి' గోత్రం ఇచ్చారు.

ఎరుకల జాతివారిలో నాలుగు తెగల వారు వున్నారు. కుంచె, ఉప్పె, అయ్యో

ప్రధాన తెగలు. సాంఘికంగా ఎదురైన బాధలను తట్టుకోలేక కొందరు ఎరుకలు తాము 'పరికల', 'పెద్దింటి గొల్ల'లుగా చెప్పుకున్నారు. వీరే నాలుగవ తెగవారు. వీరు పిరికిపందల కింద లెక్క. కుంచెలుకలు, పామెరుకలు కూడా వున్నారు.

ఇతర జాతుల వారి వలనే ఎరుకలలోను సగోత్ర వివాహాలు నిషిద్ధం. ఒక గోత్రం వారు తక్కిన మూడు గోత్రాల వారితోను వియ్యమందవచ్చు. కొన్ని ప్రాంతాలలో మానుపడి, సాతుపడి గోత్రాలవారు సోదర సమానులుగా ఎంచుకోవడం విశేషం. అంటే వీరిలోనూ మేనరికాలు వున్నాయన్నమాట.

ఎరుకల వారిలో ఆడపడచు వివాహం కావలెనంటే ముందుగా ఆ పిల్ల మేనమామ అంగీకారాన్ని పొందాలి. నిశ్చితార్థం కల్లుముంత ముందు పెట్టుకుంటారు. నాలుగు గోత్రాల పెద్దలు కల్లుముంత ముందు కూర్చుంటారు. వారే సాక్షులుగా కానున్న వరుడు కానున్న వధువు తండ్రికి రూక – అది పావలా అయినా కావచ్చు- ఓలి ఇస్తాడు. దీనితో సగం పెండ్లి అయినట్టె. వివాహ క్రతువుకు ప్రత్యేకించి లగ్నం అంటూ వుండదు. సాధారణంగా మట్టమధ్యాహ్నం - చెట్టునీడ చెట్టుమీదే వున్నప్పుడు - ఈ పెండ్లిండ్లు జరుగుతాయి.

ఒకవేళ ఎవరైనా మాట తప్పితే, మాట తప్పిన వ్యక్తి కులపెద్దల సమక్షంలో కాలుకు కాలు కట్టివేసుకుని వారం రోజులపాటు ఉండాలి. ఈ వారం రోజులలో కులపెద్దలకు వారు తాగినంత కల్లు పోయించాలి. పొగాకు కాడలు ఇవ్వాలి. ఈ ఖర్చు అంతా అతనిదే. ఓలి రెట్టింపు ఇవ్వాలి. పైగా, చెట్టుకు కాటువేయాలి. పెండ్లి రోజున వరుడు స్వయంగా చురకత్తితో పందిని చంపాలి. దాని మాంసంతో 'బంతి' పెట్టాలి. ఇది జరగకుంటే పెండ్లి పెడాకులైపోతుంది. చుట్టపక్కాలు వాద-వివాదాలకు దిగుతారు. పాత పగలన్నింటిని తిరగదోడుకుంటారు. వీరిలో బహుభార్యాత్వం నిషేధం కాదు. బాల్య వివాహాలు సహజం.

ఎరుకలవారు సాధారణంగా మాట మార్చరు. ఒప్పందాలకు విధిగా కట్టుబడి వుంటారు. 'పావుశేర్లు' ( సారా) పుచ్చుకోవడమే ఒప్పందం. మాట తప్పితే గడ్డపలుగు, నూనెకుండతో ప్రమాణాలు చేయిస్తారు. ఇవి చాలా అటవికమైన సంప్రదాయాలు. ఇట్టి అనాగరిక సంప్రదాయాలను, దురలవాట్లను, మూఢనమ్మకాలను వీరినుంచి తొలగించడం కోసమే శ్రీ చదల జానకి రామారావు గారు వీటిని జీవన్మరణ సమస్యలుగా

ఎంచుకొని కృషిచేస్తూవస్తున్నారు. ఆయన గొప్ప సంస్కర్త. ఈ విషయంలో ఒక ఈశ్వర చంద్ర విద్యాసాగర్, ఒక రాజా రామ మోహన్ రాయ్, ఒక మహాత్మా పూలె, ఒక రఘుపతి వెంకటరత్నం నాయుడుతో సరిపోల్చడం అతిశయోక్తి కాదు.

ఇంటిలోవారికి ఏ కాస్త నలత ఏర్పడినా-చివరకి పెంపుడు పందికి జబ్బు చేసినా సరే-వెనువెంటనే గుడిశ ముందు మహాలక్ష్మమ్మ, పోలేరమ్మ, ముత్యాలమ్మలుగా మూడు రాళ్ళను అమర్చి, వాటికి పసుపు కుంకుమలను పూసి, పంది పిల్లనో, కోడిపిల్లనో బలిస్తారు. వీరి 'గుడ్డగురి' వత్తి వైద్యం మహామొరటుగా ఉంటుంది. అయినా భరిస్తారు. వీరి ప్రమాణాలు కూడా అంతే మొరటుగా ఉంటాయి. కాని నిజం నిప్పులాంటిదని నమ్మకం !

ఎరుకల పురుషపుంగవుల వస్త్రధారణ గోచి మాత్రమే. లంగోటాల మాదిరి వీటిని ప్రత్యేకంగా తయారుచేయిస్తారు. తలగుడ్డ చుట్టుకుంటారు. భుజాన కండువా వుంటుంది కాని అంగరిక (చొక్కా) ఉండదు. ఉత్తర కోస్తా జిల్లాలలో నేటికీ 'ఎర్రగోచులవారు' కనిపిస్తారు. దక్షిణ కోస్తాలో గూడకట్టుల వరకు వీరి వస్త్రధారణ విస్తరించింది.

వ్యభిచారం లేకపోవడం ఎరుకల విశిష్టత. భార్యా భర్తలు చాలా అన్యోన్యంగా ఉంటారు. కాని, భర్తకు భార్య పట్ల అనుమానం హెచ్చు. వీరు శుభ్రత నెరుగరు. తలకు కనీసం నూనె రాయరు.

ఎరుకల గుడిశను ఆనుకునే పందుల పడక. అవి దొర్లడానికి నీటి గుంట అక్కడే. పంది పెంట పోగు అక్కడే. ఆ పక్కనే వీరి వంటా - వార్పు. అక్కడే ఆరగింపులు, అప్పగింతలు వగైరా వగైరాలు. పందులను ఎవరైనా దొంగిలించుకుపోతారేమోనని, వాటిప్రక్కనే కొందరి పడక ! పందులకు మించిన సంపద వారికి మరి తెలియదు !

ఎరుకలు ప్రధానంగా సంచార జీవులు. 'కొంగకు ఒక చెరువా-ఎరుకకు ఒక ఊరా' అనే సామెత కూడా పుట్టింది. ఉదర పోషణార్థం ఊళ్ళవెంట తిరిగుతూ కాస్త అనువుగా వున్న చోట మజిలీ చేస్తారు. వీరి మొత్తం సంసార సామగ్రి ఒక కావడికి, ఒక తట్టకు సరిపోతుంది. పసిపిల్లల జోలెలో, నడిపిల్లల బుట్టలో. మొత్తం సామాగ్రి ఒక గాడిద బరువుకు సరిపోతుంది.

ఎరుక అంటేనే తెలియని దానిని తెలియజెప్పడం. దీనినే 'సోది' అంటారు. ఈ

సోది చెప్పడం అనేది కావ్యగౌరవాన్ని కూడా పొందింది. దేవ దేవుళ్ళకు కూడా వీళ్ళు సోది చెపుతారు. భారత - రామాయణాలలో సయితం పెక్కుచోట్ల సోది సొద ఉంది. యక్షగాన జక్కుల పురంధ్రులు వీరే !

సోది సోదోయమ్మ సోది, ఎరుక సెబుతా తల్లి ఎరుక ! అనే పిలుపుకు పల్లె ముత్తయిదువులు ఎగబడతారు. ఎరుకత ములుకర్రకు మధ్యన ( ఆనపకాయ ) బుర్రకట్టి, దానికి పసుపు కుంకుమల బొట్లు పెడతారు. గవ్వలతో బుట్టను తయారు చేసి దేవుని బుట్టగా దీనికీ బొట్లు పెడతారు. ఆ బుట్టను ముందు పెట్టుకుని బుర్ర కర్రను సోది చెప్పించుకునే వారి చేతికి, భుజాలకు, ఛాతీకి, నుదుటికి తాకిస్తు, పాట బాణీలో దేవతలను, ఆ సోది అడిగేవారి మనసులో ఏమివున్నదో అది వారి నోటనే బయటకు వచ్చేట్టు మలుపుకొని, వారు తృప్తి చెందేట్టు దీర్ఘాలాపన మధ్య, మాటలతో మురిపిస్తారు. వారు తృప్తిగా ఈ ఎరుకతకు చేటలో బియ్యమో, ధాన్యమో, డబ్బులో, పాతవస్త్రాన్నో ముట్టచెపుతారు. ఇదీ ఎరుకతల జీవన యాత్రలో ఒకభాగం. వారు సవర్ణులు అనుకునే వారితో దణ్ణాలు పెట్టించుకునే ఘట్టం !

నక్కలు ఊళ వేసే ముందే వీరు తమ భోజనాలను ముగిస్తారు. నక్క కూత అపశకునం.

ఒకనాడు రేడులకు రక్షణగా నిలచిన ఎరుకలు, ఊళ్ళకు కాపలా కాచే ఎరుకలు, ఆ పిదప ఆ జనానికి, ఆ ఊళ్ళకు దూరమై 'దొంగ' ముద్రను వేయించుకోవలసి వచ్చింది. ఇటువంటి దీన హీన స్థితిని ఈ ఎరుకల జాతి ఎలా అనుభవించిందో తెలుసుకోవడానికి కొంచం లోతుకు వెళ్ళడం అవసరం.

గుంటూరు జిల్లా నరసరావుపేటకు చెందిన విశ్వబ్రాహ్మణపెద్ద శ్రీ చిణ్ణావూరి నాగభూషణాచార్యులు స్టువర్టుపురం సెటిల్మెంటులో ప్రభుత్వోద్యోగిగా పనిచేస్తుండేవారు. ఆ తరుణంలో సెటిల్మెంటు మేనేజరు, పోలీసులు కుమ్మక్కై నడుపుతున్న దుష్టపాలనలో అక్కడి అమాయక ప్రజలు అనుభవిస్తున్న నరక యాతనలను ప్రత్యక్షంగా చూస్తూ, సహించలేక మానవ కారుణ్యతా దృష్టితో ఆ 'సెటిలర్స్'కు ఏదోవిధంగా ఎంతో కొంత జీవన భద్రతను కల్పించవలెనని కృతనిశ్చయానికి ఆయన వచ్చారు. అప్పటికే తమ ప్రజల అభ్యుదయాన్ని ఆకాంక్షిస్తూ యువజన సంఘాన్ని ఏర్పాటు చేసి నడుపుతున్న శ్రీ రామేశ్వరం నాగయ్యను, అటుపిమ్మట శ్రీ దేవరకొండ హనుమంత రావును

శ్రీనాగభూషణాచార్యులు కలుసుకుని 1941 సెప్టెంబరులో 'ఆంధ్ర రాష్ట్ర ఎరుకల మహా సంఘం' ఏర్పరచి, స్టువర్టుపురం కేంద్రంగా రిజిస్టరు చేయించారు. దీనికి గుంటూరు ప్రెస్‌లో పని చేస్తున్న శ్రీ కంపా పున్నయ్య తోడయ్యారు. 1942 మే నెలలో కృష్ణా జిల్లా నందిగామ బోర్డ స్కూలులో చదువుకుంటున్న పౌన్నా సోదరులు శ్రీ సత్యనారాయణ, శ్రీ కోటేశ్వరరావు, శ్రీ చదల జానకి రామారావు వీరితో కలిసారు. శ్రీ పాలపర్తి వీరయ్య కూడా చేరారు.

1927 నుంచే నెల్లూరు జిల్లాలో శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య యానాదుల పక్షాన ఉద్యమాలను నిర్వహిస్తున్నారు. వీరు వారితో కలసి, ఆయన అండదండలతో పెక్కు ఉద్యమాలను నిర్వహించారు. మద్రాసు వెళ్ళి గవర్నరును, దేబర్ కమిషన్‌ను, రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్‌ను కలుసుకుని ఎరుకల సంఘం తరఫున మెమొరాండాలను సమర్పించారు.

ఆంధ్ర రాష్ట్ర ఎరుకల సంఘం 1941 నుంచి 49 వరకు ఉధృతంగా పనిచేసింది. కృష్ణ, గుంటూరు, నెల్లూరు, ఉభయ గోదావరి జిల్లాలలో శాఖలు విస్తరించాయి. అప్పటి నిజాం రాష్ట్రంలోని ఖమ్మం, నల్లగొండ, వరంగల్లు, కరీంనగరం జిల్లాలు; హైదరాబాదు-సికిందరాబాదు జంటనగరాలలో కూడా ఈ సంఘం శాఖలను శాఖోపశాఖలుగా నెలకొల్పారు.

ఆంధ్ర రాష్ట్ర ఎరుకల సంఘం పక్షాన తొలిగా 'ఎరుకల' అనే మాసపత్రికను గుంటూరునుంచి, అటుపిమ్మట 'ఆదివాసి', 'గిరిజన జ్యోతి' పక్షపత్రికలను దళిత వర్గాలు అన్నింటికీ వర్తించే విధంగా నిర్వహించారు. శ్రీ పౌన్నా కోటేశ్వరరావు సంపాదకత్వాన 'దళితమార్గ్' నడిచింది. వీటన్నింటికీ శ్రీ చదల జానకి రామారావు గౌరవ సంపాదకులుగ, సలహాదారుగ ఆర్థికంగా ఆదుకుంటుండేవారు.

ఎరుకల సంఘాన్ని పటిష్టపరచినవారిలో ప్రధానంగా శ్రీయుతులు కంపా పున్నయ్య, దేవరకొండ హనుమంతరావు, దేవరశెట్టి పున్నారావు, కట్టా రాములు, ఏ. మాలకొండయ్య, జి. ఇ.బహద్దూర్, ఇ.గంగన్న, రసపుత్ర నాగభూషణం, పూల మునెప్ప, గజ్జల కృష్ణన్, తోకల కామయ్య, బొజ్జగాని హుళక్కయ్య, మేడా తాతయ్య, కుంభా వెంకటపతి, రాయల సూర్యనారాయణ, తిమ్మసర్తి నాగయ్య (టీచరు), కాంద్రకొండ పుల్లయ్య, మొగిలి నాగయ్య, ఉయ్యాల వీరాస్వామి, మేచర్ల కోటయ్య, కట్టా పకీరయ్య, ఎరబడి ఉరేశు, పూల కృష్ణన్, సాతుపాటి కృష్ణమూర్తి, బొజ్జగాని కోటప్ప, బాలసాని

రామదాసు, ఓసి రామ్‌దేవ్, మొగిలి పుల్లయ్య, కె. గండయ్య, ఎల్లయ్య, గంగయ్య, రెడ్డెప్ప, కంపా మాణిక్యం, మాదుగాని దేవదత్తం, కట్టా రామస్వామి, కుంభా వీరయ్య, మేడా నాగయ్య, పాలపర్తి సత్యనారాయణ, నల్లగొండ్ల నీలకంఠేశ్వరరావు, మేడా సూర్యప్రకాశరావు, యరబడి బసవయ్య, బొజ్జగాని నరసింహం, బొజ్జగాని నాగభూషణం, పొన్నా నాగభూషణం, గరికె బాబులు, జగన్నాధం రామయ్య, మేచర్ల నరసింహం, ఎస్. నాగప్ప, కె. నాగప్ప, మద్దెల సాంబశివరావు, మానుపాటి బొర్రయ్య, కూచిపూడి రామప్ప, పుట్టబంతి వెంకటేశ్వర్లు, జగన్నాధం నాగేశ్వర రావు, తోకల రామయ్య, శ్రీరామ్ రామస్వామి, కొజ్జా రామకోటి, మేడా వెంకటేశ్వర్లు, తోకల ఇన్నయ్య, పాలపర్తి చెన్నయ్య, ఎరగుల బసవయ్య, తిమ్మసర్తి లక్ష్మీపతి మొదలైన వారు విశేషంగా కృషి చేశారు.

1941 నుంచి 49 వరకు ఎరుకల అభ్యున్నతికి నిరంతరంగా కృషి చేసిన ఈ సంఘాన్ని ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి 'సేవక్‌సంఘ్' లో విలీనం చేసారు. ఇట్లాగే యానాది సంఘం, సుగాలి సంఘం, చెంచు సంఘం కూడా ఆ మహాసంస్థలో విలీనమైపోయాయి.



**1987 డిసెంబరు 13వ తేదీన విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయంలో 'పద్మశ్రీ ఘంటసాల' అకాడమి తృతీయ వార్షికోత్సవం సందర్భంగా ఉపన్యసిస్తున్న శ్రీ చదల జానకి రామారావు**

# యానాది సంఘం



ఎరుకల, సుగాలి తెగలకు వున్న సమస్యలే యానాది తెగకు కూడా వర్తిస్తాయి. ఎరుకల తరువాత, 'సీ.టి.' అష్ట బాధ వెన్నాడి తరిమింది యానాది ప్రజలనే. అజ్ఞానం, అమాయకత్వం, ఆదిమానవ సమాజపు ఆచార వ్యవహారాలు మరే ఇతర తెగలలోను లేనంతగా వీరిలో పురాతనంగా గూడుకట్టుకునివున్నాయి. అనాదులే యానాదులు! అనాథలు!

'యానాది గాంధి'గా విఖ్యాతులైన 'పద్మభూషణ్' శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య యనాదులను చైతన్యవంతులను చేసే వుద్దేశంతో 1950లో నెల్లూరులో ఆదివాస కార్యకర్తల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. ప్రఖ్యాత మానవ శాస్త్రవేత్త శ్రీ ఎ. ఎం. సోమసుందరం దానికి ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. అప్పటికే యానాది సంఘాలను ఏర్పరచుకుంటూ వస్తున్న సర్వశ్రీ తిరువీథుల సాంబయ్య, పోట్లూరి చంచయ్య, కొత్తపల్లి రామకృష్ణయ్య ప్రభృతులు తమ సహచరులు, అనుచరులతో సహా ఆ శిబిరంలో పాల్గొన్నారు. శిక్షణానంతరం వీరు తమ ఉద్యమాన్ని మరింత తేజోవంతంగా, చైతన్యవంతంగా ఉధృతం చేశారు.

శ్రీ రాఘవయ్య నెల్లూరులో నెలకొల్పిన 'ఠక్కర్ బాపా యానాది బాలుర హాస్టల్' లో ఉంటూ విద్యాభ్యాసం గావించిన శ్రీ ఎం. రామమూర్తి, డాక్టరు ఎం. లక్షీనారాయణ, శ్రీ పోట్లూరి రామమూర్తి, ఆయన సోదరుడు శ్రీ లక్ష్మీ నారాయణ యానాది సంఘం కార్యకలాపాలను రాష్ట్ర స్థాయిలో అన్ని జిల్లాలకు విస్తృతపరచారు. వీరికి సర్వశ్రీ పులుగు జాలయ్య, తడ్డా నరసింహం, యల్లంపల్లి పెంచలయ్య, మోపూరి రమణయ్య ప్రభృతులు తోడయి, ఉద్యమాలకు ఊపిరులు పోశారు.

శ్రీయుతులు బాపట్ల వెంకయ్య, రాపూరి వెంకటరత్నం, ఇళ్ళ పెద్దేశ్వర రావు, మెలికె రాజు, తుపాకుల గోపాలం, యాకసిరి నాగయ్య, మేకల ఆనందరావు, రాచగిరి ప్రకాశ రావు, తిరువీథుల రామయ్య, పొన్నలూరి లక్ష్మయ్య, తలపల సుబ్బరామయ్య తదితరులు తమతమ

స్థాయిలలో యానాదుల అభ్యున్నతికి, సంఘం అభివృద్ధికి ఎంతగానో కృషి చేశారు.

ప్రత్యేకంగా పేర్కొనదగిన మరొక ముఖ్యకార్యకర్త శ్రీ పోట్లూరి రాఘవయ్య. ఈయన మొదటినుంచి చేదోడు వాదోడుగా వున్నారు. కొంతకాలంపాటు రాష్ట్ర ప్రభుత్వ సాంఘిక సంక్షేమ బోర్డులో సభ్యులుగా కూడా వున్నారు. శ్రీ సాంబయ్య కృషితో గుంటూరు జిల్లా అమృతలూరు, చమళ్ళమూడి, తాడికొండ, మహాత్మాజీపురం, నరసరావుపేట, వినుకొండ మొదలైన చోట్ల యానాది కాలనీలను నిర్మింపచేశారు.

తిరుమల శ్రీ వెంకటేశ్వరస్వామి దేవాలయం తొలుత యానాదులదే అని అంటారు. చెంచులక్ష్మి తమ ఆడపడుచు అని యానాదుల నమ్మకం.

కొండలమీద వున్న చెంచులు పర్వత శ్రేణిని దిగి పల్లపు ప్రాంతాలకు వచ్చి యానాదులు అయ్యారని అంటారు.

**1971**లో అప్పటి వరంగల్లు జిల్లా కలక్టరు శ్రీ కె. ఆర్. వేణుగోపాల్ తో కలసి శ్రీవి. చంద్రమౌళి రామప్ప చెరువును ఆనుకుని వున్న పాలంపేట చెంచుగూడెం వెళ్ళారు. అప్పుడు అక్కడి యానాదులు అప్పుడే పట్టుకు తెచ్చుకున్న మొసలి మాంసాన్ని తింటున్నారు. అప్పటి కరవు రోజులలో వారికదే ఆహారం.

యానాది ఉద్యమానికి ఆదిపురుషులు శ్రీయుతులు తిరువీదుల సాంబయ్య, ఊటుకూరు కోటయ్య, చొక్కా సుబ్బయ్య, వెలంపల్లి పెంచలయ్య, ఎర్ర సుబ్బయ్య, నిమ్మళ్ళ శేషయ్య, కత్తి చల్లమ్మ.

కుడుం చేతికిస్తే పండుగ అనుకుంటాడు యానాది. తిడితే నవ్వుతాడు, కొడితే ఊరుకుంటాడు. శారీరక, మానసిక బాధలలో చీకుతున్న అతని కంటిలో నీరువుండదు. ఇదీ యానాది జీవనరంగం. బిడ్డ పుట్టినపుడు నవ్వనూ నవ్వడు, అప్పుడు కన్నుమూసినపుడు ఏడవనూ యాడవడు. ఒడుదుడుకుల బ్రతుకుతెరవు యానాదిని ఒక విధమైన స్థితప్రజ్ఞుని చేసిందనుకోవచ్చు.

యానాదులు తమ పూర్వీకులు ఎన్నడో వదలి పెట్టిన గ్రామాల పేర్లనే తమ ఇంటి పేర్లుగా వాడుకుంటారు. ఒకే ఇంటి పేరటివారందరూ ఒకే పక్షికో, చెట్టుకో, జంతువుకో, తాతలనాటి ఉనికిపట్టుకో చెందినవారుగా భావిస్తారు. ఇటువంటి వారందరూ దాయాదులని అనుకొని వారితో వియ్యమందరు.

వేదాలలో, పురాణాలలో వర్ణితమైన రాక్షసులు, కిరాతులు, నిశాచరులు ఆదివాసులే ! 'అసుర' శబ్దప్రయోగం పురాణాలలో, కావ్యాలలో ఎలా వున్నదో పరిశీలించిన వెరియర్ ఎల్విన్ 'వీరుడు 'అనే అర్థంలో **142** సార్లు, 'క్రూరుడు' అనే అర్థంలో **42** సార్లు వాడినట్లు పేర్కొన్నారు.

మద్రాసు మ్యూజియం ఉద్యోగి ఎడ్గార్ థర్స్టన్ 1909లో వెలువరించిన, 'దక్షిణ భారత కులాలు, జాతులు' అనే బృహత్ సంపుటిలో 'యానాదులు పులికాట్ సరస్సులో చేపలు పట్టుకుంటూ స్వేచ్ఛగా బ్రతికేవారు. వెట్టి వారిని బానిసలుగా చేశారు' అని వ్రాశారు.

ఊరు కాపలా వీరి జీవనాధారం. తెల్లవార్లు భర్త కావలికాస్తే భార్య ప్రొద్దున్నే ఆ రైతుల ఇళ్ళకు వెళ్ళి, వారు పెట్టిన చద్దన్నాన్ని తెచ్చేది. మిగులు అన్నాన్ని 'కలికుండ' అనే పాత్రలో వుంచి, నీళ్ళు పోస్తారు. అది ఊరేది. దానినే మజ్జిగ అన్నంగా తినేవారు. అది చాలా రుచిగా వుండేది. నంజుడుగా ఎండుమిర్చిని పొయ్యిలో కాల్చుకుని తినేవారు.

ఈ ఊరు కాపలాను ఎరుకలు, యానాదులు చేసేవారు. అయితే, వారు ఒకరి ఊరుకు ఒకరు పోరు. అంటే ఊళ్ళను పంచుకునేవారన్నమాట.

'యానాదుల గ్రామాలు, ఏనుగుల మందలు వుండవని' ఒక సామెత. అయితే, **1927** తుపాను బీభత్సంతో యానాదులు చెల్లాచెదురైపోయినప్పుడు వీరి ఉద్ధరణకు, కట్టుబాటుకు ఒక సంఘం అవసరమని భావించి, ఆ ఏడే నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా దామేగుంట గ్రామంలో **25** కుటుంబాలతో యానాది సంఘాన్ని వ్యవస్థాపించారు. నాటినుంచి 1974లోగా కోస్తా ఆంధ్ర ప్రాంతంలో సుమారు 400 యానాది గ్రామాలు నిర్మిత మయ్యాయి. చిత్తూరు జిల్లాలో పోలీసు ఉన్నతాధికారి శ్రీ సుబ్బరామన్ 1929-30లో 50 కాలనీలను నిర్మింపచేసి చరిత్రను సృష్టించారు. నెల్లూరు జిల్లాలో 150, గుంటూరు జిల్లాలో వంద, కృష్ణా, గోదావరి జిల్లాలలో 80 కాలనీలను వారి వారి సహకార సంఘాల ద్వారా నిర్మించారు. వీరందరికీ సుమారు పది వేల ఎకరాల సాగుభూమి కూడా లభ్యమయ్యింది.

యానాదుల గుడిశకు కావలసిన కలప చెట్ల కొమ్మలు లేదా చిట్టి వెదుళ్ళు. ఎత్తు సుమారు పది అడుగులు. వెడల్పు లేక అడ్డుకొలత అయిదు లేక ఆరు అడుగులు. వెదురు బొంగులను వలయాకారంగా తవ్విన కలుగుల్లోకి మొదట చొప్పిస్తారు. వీటి తలకొనలను

చుట్టి ముడి వేస్తారు. వర్షపు నీరు గుడిసెలోకి జొరకుండా ఈ కొనపైన కుండను బోర్లిస్తారు. గుడిశ ఎదుటి భాగాన రెండు లేక మూడు అడుగుల వాకిలిని వదలి, ఎక్కపెండెలతో గుడిశ చుట్టూ మెట్లు మెట్లుగా పైవరకు బిగించి కట్టి తాటాకులను నేలనుంచి పైవరకు నారతో కుడతారు. వాన నీరు లోనికి రాకుండా వెదుళ్ళ దిగువ కొనలు కదలకుండా మట్టితో అడుగు - అడుగున్నర ఎత్తున అంచుగోడ కట్టి దిట్టపరుస్తారు. వాకిలికి కుడిపక్కన గుంటపొయ్యి, నీళ్ళకుండలు, ముంతలు వుంటాయి. ఎడమ వైపున తట్టలు బుట్టలు వుంటాయి. మధ్యన రోకటి గుంట. వాకిలి వెనుకన జాజి చెక్కల పెట్టె, దాని మీద వేలాడదీసిన ఈతాకుల చాప, ఉంటే ఒకటి రెండు కోడిపెట్టలు వుంటాయి. చూరులో దోసి గెసిక (గూచి) కర్ర వుంటుంది.

అవసరం అయితే గుడిశను పీక్కుని మొత్తం సామాగ్రిని ఏ గాడిద మీదో వేసుకుని మరొక ఊరుకు వలసపోవచ్చు. వీరికి స్థిరనివాసం లేకపోవడానికి కారణం భయం. పోలీసుల భయం. ఉద్యోగుల భయం. ఎక్కడ ఏ నేరం జరిగినా అధికారగణం మొదటిగా దాడిచేసేది వీరిపైనే. పట్టుకొని చావచితక్కొడతారు. ఇతను దొంగతనం చేశాడా లేదా అని విచారించే పని లేదు. పట్టుకొని చితకబాదడమే. ఇలా చేయని నేరాన్ని తనే చేసినట్టు ఒప్పించిన సందర్భాలు కూడా వుంటాయి. వీరి బాధలుపడలేక వారు ఇలా వలసపోతూవుంటారు.

యానాదుల గురించి **1864**లో డాక్టరు జాన్ షార్ట్ ఒక పుస్తకం వ్రాశారు. **1873** నెల్లూరు జిల్లా గజిట్ లో శ్రీ హెచ్. ఇ. స్టోక్స్ దానిని ప్రస్తావించారు. **1974**లో శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య కూడా వీరి గురించి పెద్ద గ్రంథమే వ్రాశారు.

యానాదులు నల్లగా వుంటారు. పొడవైన కాయం. ఎముక పుష్టిగల శరీరం. వంకరగా ఉంగరాలు తిరిగిన జుత్తు. చట్టి ముక్కు. దొప్పచెవులు. పిక్కబలం చూపగల కాళ్ళు. వికారమైన పాదాలు. ముందుకు పొడుచుకువచ్చే మోకాళ్ళచిప్పలు. దూసిపోయిన దవడలు, కాయలుకాచిన అరచేతులు. కొంచం బెంగ కళ్ళు. అదురు చూపులు - మొత్తం మీద వీరి ఆకారం మంగోలియా జాతిని పోలివుంటుంది. ఎత్తయిన కణతల వద్ద వెడల్పు ముఖం. గూచి గడ్డం. మీసాలు వుండీలేనట్టు వుంటాయి. పలుచని శరీరం. గోచిపాతరాయుళ్ళు. "వారు నాట్యంచేసేటప్పుడు ఎన్ని పాము మెలికలైనా సునాయాసంగా తిరగగలరు" అని బాపట్ల తెలుగు బాప్టిస్ట్ మిషనరీ రెవరెండ్ జి. ఎన్. థామ్సన్ వ్రాశారు. ఎలుకలు, ఎండ్రకాయలు, ఇతర కందమూలాదులను

తీసుకుపోవడానికి వీరి మొలలకు తాటాకుల సంచులు వ్రేలాడుతూ వుండాయి. నడివేసవి కరవుకాలంలో వీరి ఆహారం తాటి పండ్లు మాత్రమే. తాటి పండు భీష్మాచార్యుల వారి వీరోచిత సమర చిహ్నం !

యానాదులలో ఒక ఉప శాఖ కప్పల యానాది. వీరి మితాహారం కప్పలు. చొక్కా యానాదులు చొక్కాలే తొడగరు. గోచిపాతే వారి దివ్య వస్త్రం.

గ్రామంలో నడిచేటప్పుడు యానాదులు చెప్పులు వేసుకోరు. వేసుకుంటే పెద్దలకు అది అగౌరమని భావన. తల పైకెత్తుకు నిటారుగా ఠీవిగా నడవరు. నిలిచినప్పుడు కూడా ఒక కాలిమీద బరువును మోపి, ఏటవాలుగా నిలుస్తారు. వీధి మధ్యన కాక ప్రక్క ప్రక్కన నడుస్తారు. రైతులకు ఎదురుగా నిలవరు.

చల్లా యానాదుల పలువరుస సరిగా ఉండదు, పైగా పళ్ళకు రంగు వేసుకుంటారు. స్త్రీలు, పురుషులు చెవులు కుట్టించుకొని, రంగు వేసిన బెండుముక్కలను దూర్చుకుంటారు.

యానాదుల గురించిన తొలి సమాచారం **1873**లో వెలువడిన నెల్లూరు జిల్లా మాన్యుయల్‌లో లభిస్తుంది. దాని సంకలనకర్త రచయిత శ్రీ ఏ.సి. బాస్వెల్. ఆ పుస్తకం **146 ,147**పుటలలో వీరి వర్ణన వుంది. "పురుషులు తోక లంగోటాలను బిగించుకుంటారు. స్త్రీలు నామమాత్రపు పేలికలను చుట్టుకుంటారు. పురుషులు తమ వెంట్రుకలను తలమీద ముడివేసుకుంటారు. స్త్రీలు తమ జుట్టును జారవిడుస్తారు" అని ఆయన వర్ణనలో వుంది.

అడవి యానాదులు వేటకు వెళ్ళినపుడు వారం, వర్జం, శకునాలను పాటిస్తారు. అడవి దేవుడైన 'కాట్రాయుడు' కు మొక్కుకుంటారు. ఈయనకు విగ్రహాలు, ఆలయాలు ఉండవు. ఎక్కడ పెద్ద బండ కనబడితే అక్కడే పూజలు. ఈయనే కాట్రాయుడు ! పిట్టలు కూసినట్టు కూసి, మృగాలు అరచినట్టు అరచి వాటిని చేరువకు ఆకర్షించడంలో వీళ్ళు మొనగాళ్ళు. నేటి 'మిమిక్రీ' కళ నాటి అనుకరణే !

ఆయుర్వేద వైద్యులకు కావలసిన వనమూలికలు యానాదులకు తెలిసినంతగా ఇతరులకు తెలియదు. సర్పగంధి, సుగంధపాల ప్రేష్ఠు వీరికి సుపరిచితం. వనమూలికలను వీరి ద్వారానే వైద్యులు సమకూర్చుకుంటారు.

*

# చెంచు సంఘం



ప్రసిద్ధ గాంధేయవాది శ్రీ కావూరి వెంకయ్య ప్రోత్సాహంతో అవతరించిన 'ఆంధ్ర రాష్ట్ర చెంచు సంఘం' శ్రీ పసుపులేటి వెంకటేశ్వర్లు, గేదెల బాబురావు, దాసరి దుర్గా ప్రసాదు, సింహాద్రి శ్రీనివాసరావు, ఆకుల రాంబాబు తదితర నాయకుల అచంచలమైన ఆదర్శ కృషితో మన రాష్ట్రంలో పెక్కు జిల్లాలలో తాలూకా, గ్రామ స్థాయిలలో సయితం విస్తరించి ఆ జాతి ప్రజను చైతన్యవంతం చేసింది.

'ఆంధ్రప్రదేశ్ చెంచు సేవా సంఘం' సర్వసభ్య సమావేశం 1969 జూన్ 27వ తేదీన గుంటూరులో మన చదల జానకి రామారావు గారి అధ్యక్షతనే పెద్దఎత్తున జరిగింది. శ్రీ దేశభట్ల రంగయ్యను అధ్యక్షులుగా, శ్రీ పసుపులేటిని ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకున్నారు. అంటే శ్రీ జానకి రామారావు ఒక కులం పరిధిని ఏనాడో అధిగమించి అన్ని ఆదిమ జాతులకు ఆరాధ్యులయ్యారు, ఆచార్యులయ్యారు.

చెంచులు ప్రధానంగా గుంటూరు, ప్రకాశం, కర్నూలు, మహబూబ్ నగర్, నల్లగొండ, రంగారెడ్డి జిల్లాలలో వున్నారు. ఈ ప్రాంతాన్ని నల్లమల కొండలుగా వ్యవహరిస్తారు. కృష్ణానది ఈ కొండల మధ్యనుంచే ప్రవహిస్తుంది. ఈ ప్రాంతాన్ని చాలావరకు అభయారణ్యంగా ప్రకటించారు. అభయారణ్యంలో 124 గ్రామాలు వుండగా, వాటిలో 31 గ్రామాలు షెడ్యూల్డ్‌వే.

చెంచులు కురూపులు. అంత పొడవుగా వుండరు. కారునలుపు. కాటుక పండ్లు, తెరల తెరల మెట్లు మెట్లు తలకట్టు. ఒంటిమీద వెంట్రుకలు వుండవు. చెంచుల గురించి హైమన్ డార్ఫ్ చాలా పరిశోధనలు చేశారు. వీరు, తమిళదేశపు 'ఇరుకలు' ఒకే జాతివారట.

ఓబళేశుడు చెంచులక్ష్మిని పెండ్లి చేసుకుని తన ఇంటికి తీసుకువెడితే, ఆయన పెద్దభార్య శ్రీదేవి తోటికోడలిని లోనికి ఆహ్వానించలేదట. అహోబిళ దేవాలయంలో గర్భగుడి వెలుపలే చెంచులక్ష్మి విగ్రహం వుంటుంది. చెంచు పడుచులు ఇకపై



పరూపులవుతారని చెంచులక్ష్మి శపించిందట. చెంచుపాట:

"మంచి మంచి ఆడపడుచులు చెంచువారి కెందుకు
పొంచి పొంచి ఓబళేశు డెత్తుకుపోయేటందుకా ?"

**1694** లో ఔరంగజేబు కుమారుడు మో ఆజమ్ నాటి మొఘల్ సామ్రాజ్యానిం దక్షిణ రాజధాని అయిన హైదరాబాదుకు కర్నూలు - నంద్యాల మీదుగా వెళ్ళాడు. ఆయనతో ప్రయాణిస్తున్న నాటి ప్రభుత్వ చరిత్రకారుడు ఫెరిస్తా అక్కడి చెంచుల గురించి వర్ణించారు.

'చెంచుల అనుదిన ఆహారం తేనె, చెట్లవ్రేళ్ళు, గడ్డిదినుసులు, వేటాడిన మృగమాంసం. తలమీద టోపీలు ధరిస్తారు. ఒక విల్లు, పిడికెడు అంబులు చేతవుంటాయి. వారి శరీరాన్ని చెట్ల ఆకులతో కప్పుకుంటారు. చెట్ల నీడలలో, కొండగుహలలో నివసిస్తారు. చెంచులు చక్రవర్తి కుమారునికి తేనెను, అడవి పండ్లను కానుకగా ఇచ్చారు. ఆయన వారికి పట్టుపీతాంబరాలను, బంగారాన్ని ఇవ్వబోయారు. వారు ససేమిరా తీసుకోలేదు. ఇంతలో ఎవరో దూరంగా తుపాకిని పేల్చారు. వీరందరూ పిట్టలవలె చెట్ల చాటున మాయమైపోయారు' అని ఆయన వ్రాశారు.

చెంచులు, యానాదుల గుడిశలు దాదాపు ఒకేరకంగా వుంటాయి. మోసం, కుట్ర, నమ్మకద్రోహం వీరిలో కనబడవు. సత్యసంధత, 'నిష్కాపట్యం'. ప్రాణం. హత్యలు, అత్యాచారులు చాలా అరుదు. వీరు ద్రావిడుల దండయాత్రలకు ముందే దక్షిణాపథాన వున్న 'మెలానిడ్' జాతికి చెందినవారు.

"భారతీయ గిరిజన తెగ సంతాలులు బ్రిటిష్ ప్రభుత్వంతో **1855-56** లో ఏడు నెలల పాటు గెరిల్లా యుద్ధం చేయగలిగారు అంటే వారి శక్తి - సామర్థ్యాలను, దేశభక్తిని అర్థం చసుకోవచ్చు."

- కారల్ మార్క్స్: 'నోట్స్ ఆన్ ఇండియన్ హిస్టరి

*

# సుగాలీ సంఘం



**ఆంధ్ర** దేశంలో సుగాలీలకు ఎరుకల, యానాది మొదలైన ఇతర ఆదిమ తెగలకు కుల కట్టుబాట్లు, ఆచారాలు, పద్ధతులు, జీవన విధానం మొదలైన అంశాలలో పోలికలు హెచ్చుగానే వున్నాయి. ఆది మానవ సమాజపు లక్షణాలే ఎక్కువ. సుగాలీలకు ప్రత్యేక సంఘం ఒకటి అవసరమని 1947 నాటికి ఆ జాతి విద్యావంతులు గుర్తించారు. సుగాలీలలో తొలి పట్టభద్రుడైన శ్రీ వడితె గోపాల రావు నాయక్, అలాగే సర్వశ్రీ రామావతు లాలు నాయక్, బాణావత్ జోగా నాయక్, సూర్యా నాయక్, శంకర నాయక్ ప్రభృతులు సంఘం ఆవశ్యకత ముఖ్యమని భావించారు.

అప్పటికి సుగాలీలలో చదువు సంధ్యలు అబ్బినవారిని వ్రేళ్ళపై లెక్కించ వచ్చు. శ్రీ గోపాల రావు నాయక్ తండ్రి శ్రీ బాల్యా నాయక్ ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు. అప్పటి రాయలసీమలో భాగమైన బళ్ళారి జిల్లా కొట్టూరులో లంబాడి విద్యార్థులకు శ్రీ శంకర నాయక్ హాస్టల్ నడిపేవారు. అనంతపురం జిల్లా పెనుగొండలో శ్రీ చావ్లా నాయక్ లంబాడి హాస్టల్ ఏర్పాటు చేసి రాయలసీమ ప్రాంతంలో ఈ తెగకు విద్యారంగంలో పునాదులు వేశారు. ఈ విషయాలన్నీ తెలుసుకున్న శ్రీ గోపాలరావు నాయక్, ఇతర మిత్రులు ఈ జాతికి ప్రధానంగా విద్యావకాశాలను కల్పించవలెననీ అభిప్రాయానికి వచ్చారు. ఫలితంగా 1951 ఫిబ్రవరి 18వ తేదీన గుంటూరు జిల్లా పెదవడ్లపూడిలో 'ఆంధ్ర రాష్ట్ర సుగాలి సంఘం' అవతరించింది. ఆంధ్ర రాష్ట్ర సంఘానికి తొలి అధ్యక్షులు శ్రీ బి. శంకర నాయక్, కార్యదర్శి శ్రీ గోపాలరావు నాయక్. మహాసభను శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య ప్రారంభించారు.

ఆంధ్ర రాష్ట్ర సుగాలి సంఘం గుంటూరు, కృష్ణా, కర్నూలు, చిత్తూరు, అనంతపురం, వరంగల్లు, నల్లగండ, ఖమ్మం, మెదక్, మహబూబ్ నగర్ జిల్లాలలో రాష్ట్ర,

జిల్లా, తాలూకా స్థాయిలలో పలు సభలు, సమావేశాలను నిర్వహించి పెక్కు తీర్మానాలు చేసింది. అంతే కాదు. మహారాష్ట్ర, నాటి మైసూరు తదితర రాష్ట్రాలలో బంజారాల (సుగాలి) సమస్యలను, జాతి అభివృద్ధికి అక్కడ తీసుకుంటున్న చర్యలను అధ్యయనం చేయడానికి వెళ్ళిన అఖిల భారత బంజారా ప్రతినిధి బృందం సభ్యులుగా శ్రీ గోపాలరావు నాయక్ పర్యటించివచ్చారు.

రాష్ట్ర సుగాలి సంఘం ఆశయాలను, కోర్కెలను విస్తృతంగా ప్రచారంలో పెట్టి సంఘాన్ని పటిష్టపరచడంలో శ్రీయుతులు బి. జోగా నాయక్, ఎం. జీవలా నాయక్, బి. హరిశ్చంద్ర నాయక్, ఎస్. గణేశ్ నాయక్, సఫావత్ అమిర్యా నాయక్, ఆర్. సూర్యా నాయక్, వి. భీమా నాయక్, డి. లక్ష్మా నాయక్, బి. రామా నాయక్, రంజిత్ నాయక్, బి.కె. సత్యం ప్రభృతులు ప్రముఖ పాత్ర వహించారు. సర్వశ్రీ రామావతు లాలూ నాయక్, డి.కేవలా నాయక్, భిక్యా నాయక్ బుర్రకథ దళంగా ఏర్పడి తమ భాషలోనే కథలు చెపుతూ రాష్ట్రమంతటా విస్తృత ప్రచారం కావించారు.

శ్రీయుతులు బి. లాలూ పంతులు, బి. ఝుంకా నాయక్, బి. ధావిర్యా నాయక్, కేతావతు శీన్‌పాల్, దేవసోత్ రామా నాయక్, ఇస్లావతు రమణా నాయక్ ప్రభృతులు ఈ సంఘాన్ని విస్తృతపరచడంలో ఎంతగానో కృషిచేశారు.

ఈ సంఘం వారు కొన్ని చోట్ల తమ జాతికి చెందిన మహిళల వేషధారణలో మార్పులు తెచ్చారు. వివాహాలు, కుల పంచాయతీలలో సంస్కరణలను ప్రవేశపెట్టారు. తమ జాతి బాలబాలికలకు **1972** వరకు **72** హాస్టళ్ళను నెలకొల్పి విద్యావకాశాలను కల్పించారు.

దేశంలో చెప్పుకోదగిన సంచార జాతులలో సుగాలి లేక లంబాడా లేక బంజారాలు ముఖ్యులు. సుగాలీలు నివసించే గ్రామం లేక తండా ప్రధాన గ్రామంలో కలసి కాక విడిగా ఉంటుంది. కొండలు, గుట్టలు, పచ్చిక బయళ్ళకు చేరువగా ఈ తండాలు ఉంటాయి. తమ పశువులను మేపుకోవడానికి అనువుగా ఇవి వుంటాయి. ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సా, బీహారులో షెడ్యూల్ తెగగా; కర్ణాటక, హిమాచల ప్రదేశ్, హర్యాన, ఢిల్లీలో షెడ్యూల్ కులంగా వీరిని ప్రభుత్వం గుర్తించింది. మన రాష్ట్రంలోని సుగాలీలు వారి సొంత మాండలికంలో మాట్లాడతారు. ఇది ఇండో- ఆర్యన్ భాషా కుటుంబానికి చెందినది.

సుగాలీలు మన రాష్ట్రంలో ప్రధానంగా రాథోడ్, జాదవ్, చవాన్, పవార్, ఆదె వంశజులు వున్నారు. తమ గోత్రాలను వీరు పితృవంశజ బంధుత్వాల ఆధారంగా నిర్ణయించుకున్నారు. గోత్రాలను సుగాలి భాషలో 'పద' లేక 'జాత్' అంటారు. వీరు తమ సమీప బంధువులతో వియ్యమందరు. తమ గోత్రేతరులను, వంశేతరులనే వివాహమాడతారు. వివాదాలను పరిష్కరించడానికి వీరికి తమ సొంత గిరిజన మండలి వుంది. ఈ మండలి పెద్దను 'నాయక్' గా వ్యవహరిస్తారు. ఈ మండలికి సలహాదారు వుంటాడు. ఆయనను 'కార్బారి' అంటారు. మండలి తరపున సందేశాలను తీసుకువెళ్ళే వ్యక్తిని 'డావ్సన్' అని పిలుస్తారు.

సుగాలీలు బయటవారిని కూడా తమలో కలుపుకుంటారు. ఇలా కలుపుకునే తతంగాన్ని 'జంగడ్' అంటారు. ఇలా కలసిన వ్యక్తుల వారసులకు ఏడు తరాల తరువాతనే పూర్తి 'సుగాలి' ప్రతిపత్తి లభిస్తుంది.



తూర్పు గోదావరి జిల్లా జగ్గంపేటకు చెందిన శ్రీ రాగిని అప్పన్న, తదితరులు

# సంఘాలు, మరికొన్ని సేవాసంస్థలు


రామేశ్వరం నాగయ్య

**ఆదివం** జాతుల సముద్ధరణకు సర్వశ్రీ రాఘవయ్య, వీరయ్య, జానకి రామరావు సమష్టి నాయకత్వాన గల 'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్' నిర్విరామంగా కొనసాగిస్తూవస్తున్న సేవా కార్యక్రమాలకు స్పందించిన అనేక మంది ఆదివాస - విముక్త జాతుల కార్యకర్తలు తమ తమ జాతులు, తెగల దైన్యస్థితిని ప్రోదోలి తమవారిని ఉద్ధరించవలెననే ఆకాంక్షతో, సంకల్ప దీక్షతో- తమ నాయకత్వ ప్రతిభను చిటిచూపవలెననే వ్యక్తిగత ధీమాతో సయితం - తమ కులాలకు సంబంధించిన సంస్థలను, సంఘాలను విడివిడిగా, సమష్టిగా ఏర్పాటుచేసుకున్నారు. వారి ఉత్సుకతను విశాల హృదయంతో మన నాయకతయం ప్రోత్సహించి స్ఫూర్తి నిచ్చింది.

అలా ఏర్పడిన వాటిలో 'ఆంధ్రప్రదేశ్ సంచార జాతుల సేవక్‌సంఘం' ఒకటి. 1965లో రిజిస్టరైన ఈ సంఘం అధ్యక్షులు శ్రీ దేశభట్ల రంగయ్య, ప్రధాన కార్యదర్శి శ్రీ భట్రాజు కృష్ణమూర్తి. దక్షణ భారత దేశంలో ఆదివాసుల సంక్షేమం గురించిన ఒక మహాసభను ఈ సంఘం 1967 జనవరి 20,21వ తేదీలలో గుంటూరులో భారీ స్థాయిలో నిర్వహించింది. ఆహ్వాన సంఘం అధ్యక్షులుగా నాటి రాష్ట్ర సాఘిక సంక్షేమ శాఖ మం॥ శ్రీ తానేటి వీరరాఘవులు వున్నారు. శ్రీ చిఱ్ఱావూరి నాగభూషణాచార్యులు సంపాదకత్వాన ప్రత్యేక సంచికను కూడా వీరు ప్రచురించారు.

అలా ఏర్పడిన మరొక సంస్థ 'ఆంధ్రప్రదేశ్ ఏజన్సీ ఆదిమ జాతి సేవక్‌సంఘ్'. 1971 నవంబరు 11వ తేదీన విశాఖపట్టణం ప్రధాన కేంద్రంగా ఆవిర్భవించిన ఈ సంస్థ ఆదిలాబాద్, వరంగల్లు, ఖమ్మం, ఉభయగోదావరులు, విశాఖ జిల్లా ఏజన్సీ ఆదివాస

ప్రజల కడగండ్లను తీర్చడానికి కంకణధారి అయింది.

పశ్చిమ గోదావరి జిల్లా ముత్తాయిగూడెం సమీపాన ఉన్న రామన్నగూడెం కేంద్రంగా 'శ్రీ ఏజన్సీ సేవాసంఘం' ఏర్పడింది. దీని కార్యదర్శి శ్రీ ఎస్. ఎస్. నంద.

పశ్చిమగోదావరి జిల్లాలోనే కొవ్వూరు కేంద్రంగా 'ఆంధ్ర శ్రామిక ధర్మ రాజ్య సభ' ను శ్రీ రెబ్బాప్రగడ మందేశ్వరశర్మ వ్యవస్థాపించారు. దీని కార్యదర్శి శ్రీ కె. వి. ఎన్. అప్పారావు.

హైదరాబాద్ నారాయణగుడ కేంద్రంగా 'ఆంధ్రప్రదేశ్ ఆదిమ జాతి సేవక్ సంఘ్' 1955లో రిజిస్టరయింది. అప్పటి దీని అధ్యకులు శ్రీ హెచ్. సి. కాడే, ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. ఆర్. పవార్, కోశాధికారి శ్రీ బనారసిలాల్ గుప్త.
ప్రభుత్వంవారు 1957 ఏప్రిల్‌లో విశాఖపట్టణం కేంద్రంగా 'ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డ్ ట్రైబ్స్ కోపరేటివ్ అండ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్' ను ఏర్పరచారు. ఇది ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ ఆందోళనలకు ఒక విజయం.

అలాగే 1963 ఏప్రిల్ లో హైదరాబాదులో 'ట్రైబల్ కల్చరల్ రిసెర్చ్ ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూట్' ను నెలకొల్పారు.

ఆదివాసులలో అనేక తెగలు. అన్ని తెగలలోను విద్యావంతులు అధికమయారు. విద్యావంతులలో ఎక్కువమంది ఉద్యోగాలలో వున్నారు. వివిధ హోదాలలో రాష్ట్ర వ్యాప్తంగా ఎవరికి వారేగా వున్న వారినందరిని ఒకచో చేర్చి వారిలో సమష్టి భావాన్ని పాదుకొల్పడానికి, వారి హక్కుల పరిరక్షణకు ఒక సంఘం అవసరం అని గుర్తించి 1964లో న్యాయవాది శ్రీ ఎం. వి. రామమూర్తి అధ్యక్షతన హైదరాబాద్ కేంద్రంగా 'ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్ ట్రైబ్స్ ఎంప్లాయిస్ అసోసియేషన్' ను నెలకొల్పారు. శ్రీ కె. రంగారావు దీని ప్రధాన కార్యదర్శి.

**"భారతీయ ఆదివ వాసుల ఈ దేశం తొలి మానవులు. అభివృద్ధి చెందిన అన్య జాతుల వారు వీరిని తృణీకరించారు, మందభాగ్యులను చేశారు. ఆదివాసులను కలుపు మొక్కలుగా కాక, మూలికా వైద్య వృక్షాలుగా మనం పరిగణించి, పెంచి పోషించాలి. వారి వంశ పునాదులు ప్రశస్తమైనవి, లోతైనవి."**

**- మహాత్మా గాంధి**

# ఒక మహా సంస్థ



మాల మాదిగలకు 'హరిజనులు' అని నామకరణం చేశారు మహాత్మా గాంధీ. వారి కోసం 'హరిజన్'పత్రికను నిర్వహించారు. 'హరిజన సేవక్ సంఘ్' అనే స్వచ్ఛంద సంస్థను కూడా వ్యవస్థాపించారు. 'మరి గిరిజనుల విషయం ఏమిటి'? అని మహాత్ముని ప్రశ్నించారు మన వెన్నెలకంటి రాఘవయ్య గారు. 'ఆ అంశం గురించి థక్కర్ బాపాతో సంప్రతించు' అన్నారు గాంధీజీ. శ్రీ రాఘవయ్య ఆయన వద్దకు వెళ్ళారు. మాట్లాడారు. ఫలితంగా 'భారతీయ ఆదిమ జాతి సేవక్‌సంఘ్' పేర ఒక మహా సంస్థ ఆవిర్భవించింది.

భారతీయ జీవన స్రవంతిలో తామూ సమాన భాగస్వాములమేనని గిరిజనులు గుర్తించగలిగే విధంగా; ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, విద్యాది రంగాలలో గిరిజనుల అభ్యున్నతికి అన్ని విధాలా కృషి చేసే మహదాశయంతో ఢిల్లీ కేంద్రంగా అఖిల భారత స్థాయిలో, మహాత్ముని ఆశీస్సులతో, 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా'కు చెందిన ప్రముఖ సంఘసేవకులు థక్కర్ బాపా, శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య మరికొందరు సంఘ సేవకులతో **1948** అక్టోబరు **24**వ తేదీన ఈ సంస్థను నెలకొల్పి **1949** నవంబరు **27**వ తేదీన రిజిస్టరు చేయించారు. మన తొలి రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాద్ ఈ సంఘం తొలి అధ్యక్షులు. ప్రస్తుత అధ్యక్షులు శ్రీ జె.హెచ్. చించాల్కార్.

దేశమంతటా **98** అనుబంధ సంఘాలుగల ఈ సంస్థ కార్యకలాపాలకు 'గాంధీ స్మారక నిధి' తదితర అఖిల భారత స్థాయి సంస్థలు, సంఘాలు, కేంద్ర ప్రభుత్వం ఆర్థికంగా సహకరిస్తూవుంటాయి. ఈ సంస్థ సేవా కార్యక్రమాలతో పాటు పత్రికను నడుపుతున్నది. గ్రంథ ప్రచురణను కూడా కొనసాగిస్తున్నది.

'భారతీయ ఆదిమ జాతి సేవక్ సంఘ్' ఆశయాదర్శాలను రాష్ట్రంలో అమలు పరచే ధ్యేయంతో **1949** జులై మూడవ తేదీన 'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్‌సంఘ్'ను నెలకొల్పి **1951** ఆగస్టు ఒకటవ తేదీన రిజిస్టరు చేసి,కేంద్ర సంస్థకు అనుబంధం చేశారు.

'దేశభక్త 'కొండా వెంకటప్పయ్య పంతులు ఈ సంస్థ తొలి అధ్యక్షులు. 'ఆంధ్రకేసరి' టంగుటూరి ప్రకాశం పంతులు, స్వామి సీతారాం, అధరాపురపు శేషగిరిరావు

కూడా అధ్యక్షులుగా వ్యవహరించారు. అప్పటి వరకు ప్రధాన కార్యదర్శిగా వున్న శ్రీవెన్నెల కంటి రాఘవయ్య అధ్యక్షులు కాగా 'కార్యదర్శిగా శ్రీ తిరువీధుల సాంబయ్య కొంత కాలం వ్యవహరించారు. ఆ పిదప, అప్పటి వరకు ఉపాధ్యక్షులుగా వున్న శ్రీ పాలపర్తి వీరయ్య కార్యదర్శి అయారు. శ్రీ వీరయ్య అధ్యక్షులు కాగా, ప్రధాన కార్యదర్శిగా శ్రీ చదల జానకి రామారావును ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. ఈ జంట కలయిక దశాబ్దాల తరబడి నేటికీ కొనసాగుతన్నది.

'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్' జిల్లా, తాలూకా, గ్రామ స్థాయిలలో కమిటీల ద్వారా శతానేక ప్రజాహిత సేవా కార్యక్రమాలను క్రమశిక్షణతో - పథకం ప్రకారం- అమలుపరిచి లక్షలాది ఆదివాస - సంచార - గిరిజనుల హృదయాలతో మమేకమయింది. ఇందుకు కార్యకర్తల కృషి, నాయకత్వ ప్రతిభ ప్రశంసనీయం.

**1960**నాటికి ఆంధ్రలో యానాదులు **1,73,217**, ఎరుకలు **1,11,776**, సుగాలీలు **59,340** మంది వున్నారు. **1956** రాజ్యాంగ సవరణ ననుసరించి ఎన్నికలలో మైదాన ప్రాంతం గిరిజనులకు జనాభా ప్రాతిపదికన అయిదు శాసన సభా నియోజక వర్గాలను రిజర్వు చేయవలసి వచ్చింది. వీటిలో రెండు యానాదులకు, రెండు ఎరుకలకు, ఒకటి సుగాలీలకు దక్కుతాయి. వీటిని కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో ; రాయలసీమకు చెంది అనంతపురం, కడప జిల్లాలలో కేటాయించవలసి వున్నది. **1961** జూన్ **23** వ తేదీన శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య అప్పటి కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ పళ్ళం రాజుకు లేఖ వ్రాస్తూ, ఈ రిజర్వుడు సీట్లలో ఎవరో అనామకులకు కాక, దశాబ్దాల తరబడి ఆదివాసుల సేవలో నిమగ్నులై వున్న కాకలుతీరిన కాంగ్రెస్ వాదులైన ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ నాయకులకు టిక్కెట్లు ఇవ్వవలసిందిగా సూచించారు. అందుకు కొన్ని పేర్లను సయితం సిఫారసు చేశారు. ఆయన ప్రతిపాదించిన అభ్యర్థులలో శ్రీ చదల జానకి రామారావు ఒకరు.

ఈ సంఘం ప్రధానంగా సంచార జాతుల వారికి కాలనీల నిర్మాణం ద్వారా స్థిర అవాసాలను ఏర్పరచడానికి, ఆదివాస పిల్లలకు పాఠశాలలు, హాస్టళ్ళ ఏర్పాటుకు తన దృష్టిని కేంద్రీకరించింది. అంతేకాదు. పెక్కు కుటీర పరిశ్రమలలో వేలాది మందికి శిక్షణనిచ్చి, వారు తమ కాళ్ళపై తాము నిలవడానికి ఆస్కారం కల్పించింది. అన్నింటికంటే ముఖ్యంగా అటు భూస్వాముల నుంచి, ఇటు నిరంకుశ అవినీతి అధికార గణంనుంచి వారికి పూర్తి రక్షణలను కల్పించారు. నిజానికి, ఆదివాసులలో ఆత్మ స్థయిర్యాన్ని

కల్పించడమే గొప్ప విజయం.

ఆ కాలంలో 15 వందలకు పైగా మహిళలకు సిరిచాపల నేతలో శిక్షణ గరిపారు అంటే వీరి పట్టుదలను అర్థం చేసుకోవచ్చు. ఇది మొత్తం దక్షిణ భారత దేశంలోనే రికార్డు.

ఏజెన్సీ ప్రాంతాలలో గిరిజనులకు కల్పిస్తున్న అన్ని సౌకర్యాలను మైదాన ప్రాంత ఆదివాసులకు కూడా వర్తింప చేయవలెనని వీరు ప్రభుత్వాన్ని కోరుతూవచ్చారు.

ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా జిల్లాలలో ఇంకా అక్కడక్కడా మిగిలివున్న ఆదివాస - సంచార జాతుల వారినందరిని 'షెడ్యూల్ ట్రైబ్స్' గా గుర్తించవలెనని వీరు నేటికీ పోరాడుతూనేవున్నారు.

*




ఆదివాసి ప్రజాభూషణ్ తిరు వీధుల సాంబయ్యగారి స్మారక సభను

గుంటూరులో 1983 నవంబర్ 22వ తేదీన జరిపినప్పటి దృశ్యం

# రాజకీయం




**కమ్యూనిస్టుగా** రాజకీయ జీవితాన్ని ప్రారంభించిన సాంఘిక సేవకులు శ్రీ చదల జానకి రామారావు తెలుగు దేశం పార్టీ ఆవిర్భావంతోటే దానిలో క్రియాశీలక సభ్యులుగా చేరారు. విజయవాడలో జరిగిన తొలి మహానాడు నిర్వహణలో ప్రముఖ పాత్ర వహించారు. అప్పుడే కృష్ణాజిల్లా శాఖ తొలి ప్రధాన కార్యదర్శిగా శ్రీ చదల జానకి రామారావును ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. సహజంగానే బడుగు వర్గాల పట్ల ఆత్మీయతానురాగాలను కనపరచే శ్రీ ఎన్.టి.రామారావు ఆదివాసి అయిన శ్రీ జానకి రామారావు పట్ల ప్రేమాభిమానాలతో ఎంతగానో గౌరవించేవారు.

శ్రీ జానకి రామారావు తెలుగుదేశం పార్టీ కృష్ణాజిల్లా శాఖలో కీలకపాత్ర వహించారు. రెండుసార్లు ఉపాధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికై పార్టీ పటిష్టతకు నడుంకట్టి పనిచేశారు. ముఖ్యంగా పార్టీ మనుగడే జిల్లాలో క్లిష్ట స్థితిలో పడినప్పుడు పార్టీ ప్రతిష్టే తమ పంచప్రాణాలుగా ఊరూరా వాడవాడలా కాలికి బలపంకట్టుకు తిరిగి ప్రధానంగా బలహీన, వెనుకబడిన, నిమ్న, బడుగు వర్గ ప్రజలలో పార్టీని పటిష్టపరచి పార్టీ అధిష్టానవర్గం ప్రశంసల నందుకున్నారు. వెంటనే వీరిని రాష్ట్ర పార్టీ ఎస్.టి.సెల్ వైస్ ప్రెసిడెంటును చేశారు.

శ్రీ నారా చంద్రబాబు నాయుడు హయాంలో కూడా శ్రీ జానకి రామారావు సేవలను తెలుగుదేశం పార్టీ గణనీయంగా వినియోగించుకుంటూవస్తున్నది. ఆయన నిజాయతి, చొరవ, నిర్మొహమాటం, కార్యదక్షత పార్టీ అగ్రనేతలను బాగా ఆకర్షించాయి. కృష్ణాజిల్లా పార్టీ ఎస్.టి.సెల్ విభాగాన్ని పూర్తిగా ఆయన అదుపులో వుంచుతూ దానికి అధ్యక్షుని చేశారు. జిల్లా కమిటీ రద్దయిన పిదప ఏర్పరచిన అడ్‌హాక్ కమిటీలో వీరిని సభ్యునిగా నియమించారు.

శ్రీ చదల జానకి రామారావు చిత్తశుద్ధితో కూడిన పనితీరు పట్ల పార్టీ శ్రేణులు ఎంతగా నమ్మకం వుంచాయి అంటే - శాసన సభా ఎన్నికలలో, మండల ప్రజా పరిషత్తుల ఎన్నికలలో, పార్టీ వివిధ స్థాయి కమిటీల ఎన్నికలలో రాష్ట్ర పార్టీ పరిశీలకునిగా వీరిని ఎంపిక చేసి పంపింది. ఆ పని పై శ్రీ జానకి రామారావు ఇటు పశ్చిమ గోదావరి, కృష్ణా, అటు

గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలో పర్యటించి తమకు అప్పగించిన గురుతర బాధ్యతలను విజయవంతంగా పూర్తిచేసుకువచ్చారు. తమ ఈ విస్తృత పర్యవేక్షణా కార్యక్రమాలలో శ్రీ జానకి రామారావు ఎక్కడా ఏనాడు వీసమెత్తు కూడా తప్పటడుగు పడకుండా జాగరూకత వహించి తమ సవివరాలతో కూడిన సుదీర్ఘ నివేదకల ద్వారా అధిష్టాన వర్గం ఆదరాభిమానాలను చూరగొని ప్రశంసాపాత్రులయ్యారు.

నందిగామ పంచాయతీ సభ్యులుగా శ్రీ చదల జానకి రామారావు 1964 నుంచి దాదాపు మూడు దశాబ్దాల పాటు పనిచేశారు. కొంతకాలం ఉపసర్పంచ్‌గా కూడా వ్యవహరించారు. ఈ సమయంలో శ్రీ జానకి రామారావు గ్రామంలో రోడ్ల విస్తరణ, సైడ్ కాల్వల ఏర్పాటు, వీధి లైట్లు, ఇళ్ళకు విద్యుచ్ఛక్తి సరఫర, కల్వర్డుల నిర్మాణం, మంచినీటి పంపులు మొదలైన అభివృద్ధికర, పౌర సౌకర్యాల కల్పన విషయాలలో విశేషమైన కృషి చేసి ప్రజల ప్రశంసలను పొందారు. అయితే, క్షుద్రమైన వర్గరాజకీయాల ప్రభావం కారణంగా ఆయనపై అవిశ్వాస తీర్మానం పెట్టి, నెగ్గించుకున్నారు!

శ్రీ చదల జానకి రామారావు ఏనాడూ అధికార పదవులను ఆశించలేదు. తన పరిధిలో తను ఒక స్వచ్ఛంద సేవకునిగా, ఒక చిత్తశుద్ధిగల కార్యకర్తగా, ఒక ప్రజానాయకునిగా ప్రజాహిత జీవన రంగాలలో చొరవతో కృషిచేయడం, పేద ప్రజలకు చేరువ కావడమే ఆయన ధ్యేయం. మనిషిగా పుట్టాం గనుక, సాటి మనుషులకు చేతనైనంతగా సాయపడడమే ఆయన లక్ష్యం. అయితే, నందమూరి తారక రామారావు పాలన చరమాంకంలో మాత్రం ఈయునకు ఎస్.టి. కార్పొరేషన్ డైరక్టరుగా నియమించారు. అయితే అది మూన్నాళ్ళ ముచ్చటే. శ్రీ ఎన్.టి. ఆర్. ప్రభుత్వం పడిపోవడంతో శ్రీ చదల జానకి రామారావుగారు ఆ పదవికి రాజీనామ చేసేశారు. అధికారిక పదవి ఉన్నా లేకున్నా శ్రీ జానకి రామారావు ప్రజల మనిషే. ఉద్యమించడమే ఆయన ఉద్యమం.

శ్రీ చదల జానకి రామారావుకు అంటరానితనం అంటే ఆబాల్యంగా అసహ్యం. ఆయన ప్రాథమిక విద్య వీరులపాడు మండలం నందలూరులో కొనసాగింది. ఆ ప్రాథమిక పాఠశాలలో 'అగ్ర వర్ణాలు' అనుకునే వారి పిల్లలు ఒకవైపున, 'అధమ కులాలు' అంటూ ఈసడించుకునే మాల, మాదిగ, కొమ్ము, పంబ, పాముల మొదలైన వారి పిల్లలు మరొక వైపున కూర్చునేవారు. అప్పుడు మన జానకి రాముడు మూడవ తరగతి. ఇతగాడు సరాసరి

పెచ్చే అస్పృశ్యుల సరసన కూర్చునేవాడు. దీనిని సహించలేని అగ్ర కులాల విద్యార్థులు ఒకసారి జానకిరామారావును చావ చితకబాదారు. అయినా ఈయన తన పట్టు వీడలేదు, పంథా మార్చుకోలేదు.

# ఎస్.టి. సెల్ అధ్యక్షునిగా

శ్రీ వంగవీటి మోహన రంగారావు చనిపోయినప్పుడు ప్రతి చోటా అల్లర్లు జరిగాయి. నందిగామలో ప్రత్యేకించి శ్రీ చదల జానకి రామారావు ఇంటిపై దాడి జరిగింది. రాజీవ్ గాంధి హత్యరోజున కూడా ఇంతే జరిగింది.

శ్రీ చదల జానకి రామారావు కృష్ణా జిల్లా తెలుగుదేశం పార్టీ ఎస్.టి. సెల్ అధ్యకులుగా అయినప్పటి నుంచి అనేకానేక కార్యక్రమాలను నిర్మాణాత్మకంగా చేపట్టారు.

నందిగామ, కంచికచర్ల, మైలవరం, తిరువూరు, ఇబ్రహీంపట్టణం మండలాలలోని గిరిజనుల వృత్తి అయిన బుట్టలు, తట్టలు, జల్లలు అల్లుకోవడానికి అటవీ ప్రాంతం నుంచి వెదురు బద్ద తెచ్చుకోవడానికి అనుమతి గురించి ప్రభుత్వం వారికి అర్జీ పెట్టగా, ప్రభుత్వం ఫారెస్టు రేంజరుకు ఈ విషయం గురించి ఆలోచించవలసిందిగా సిఫారసు చేసింది.

యానాదులకు చేపలు పట్టుకునేందుకు వలలు, సైకిళ్లు, లోనులు మంజూరు చేయమని జిల్లా కలెక్టరును కోరారు. నందిగామ, చందర్లపాడు మండలంలోని యానాదులకు లోనులు మంజూరు చేసి, నైలాన్‌దారం, సైకిళ్లు ఇప్పించేరు.

ఎరుకల, యానాది, లంబాడిలకు సైకిల్ రిక్షాలు ఇప్పించారు. నందిగామ, కంచికచర్ల, చందర్లపాడు మండలాలలో అవి నేటికీ తిరుగుతున్నాయి.

చందర్లపాడు, కోనాయపాలెం, కొడవటికల్లు గ్రామాల గిరిజనుల ఇండ్లకు పట్టాలు మంజూరు చేయవలసినదిగా జిల్లా కలెక్టరుకు అర్జీలు పెట్టారు.

కొడవటికల్లులో 30 మంది యానాదులకు నివేశన స్థలాలుగా ఒకొక్కరికి మూడు శెంట్లు చొప్పున ఇప్పించారు.

నందిగామ మండలం లచ్చుపాలెం గ్రామ యానాదులకు చెరువులో చేపలు పెంచుకొనేందుకు రు.20 వేలు మంజూరు చేయించారు. లచ్చుపాలెంలో యానాదులు

ఆక్రమించుకున్న నివేశన స్థలాలకు పట్టాలు మంజూరు చేయవలెనని ప్రభుత్వంవారిని కోరారు.

కోనాయపాలెం గిరిజనులు సాగుచేసుకుంటున్న బంజరు భూమికి పట్టాలను మంజూరు చేయవలసిందిగా అధికారులను కోరారు.

నందిగామ, చందర్లపాడు మండలాలలోని గిరిజన కాలనీలలో రోడ్లు, కరెంటు ఏర్పాటుకు ప్రయత్నించారు.

కృష్ణాజిల్లా తెలుగుదేశం పార్టీ ఎస్.టి. సెల్ కార్యవర్గం సమావేశాలను క్రమం తప్పక తరచూ నిర్వహించి, ముఖ్యమైన కొన్ని తీర్మానాలను ప్రభుత్వం వారికి పంపేవారు. హైదరాబాదుకు వెళినపుడు వాటి విషయమై ఆరా తీస్తుండేవారు.

గిరిజన సెల్ విభాగంలో సభ్యత్వంగా అయిదు వందల మందిని చేర్పించారు.

# ఉప్పెన, తుపాను బీభత్సాల అంచన



'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్' ప్రధాన కార్యదర్శిగా శ్రీ చదల జానకి రామారావు చేసిన కృషి అనన్యసామాన్యమైనది, ఆదర్శప్రాయమైనది. ముఖ్యంగా ఆంధ్ర కోస్తా జిల్లాలను అతలాకుతలంచేసి ప్రజా జీవనాన్ని కకావికలం చేసిన ఉప్పెన, పెను తుపానుల సమయాలలో శ్రీ జానకి రామారావు కనబరచిన చొరవ, తెగువ, చేసిన సేవలు అపూర్వమైనవి. ఆ సమయంలో అస్వస్థతగావుండి కూడా, అనారోగ్యాన్ని సయితం లక్ష్యపెట్టక ఆయా ప్రాంతాలలో పర్యటించి జరిగిన బీభత్సాన్ని అంచనావేసిన వైనం సహ కార్యకర్తలసే ఆశ్చర్యపరచింది. **1977** నవంబరు **19** వ తేదీ అర్ధరాత్రి సంభవించిన ఉప్పెన, **1979** పెనుతుపాను గురించి శ్రీ జానకి రామారావు తయారు చేసిన నివేదిక ఈ కింది విధంగా వున్నది:

"ఉప్పెన వల్ల కృష్ణాజిల్లాలో శివార్లతో సహా మొత్తం **112** గ్రామాలు తుడిచి పెట్టుకుపోయాయి. ఉప్పెన - తుపానువల్ల **91,785** మంది ప్రజలు దెబ్బతిన్నారు. **8,033**

మంది మృతి చెందారు. వీరిలో 1,200 మంది ఆదివాస - గిరిజనులు వున్నారు. 92,300 జీవాలు చనిపోయాయి. కూలిపోయిన కొంపలు కోకొల్లలు.

'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్' కార్యకర్తలు వెంటనే రంగంలోకి దుమికి కృష్ణాజిల్లా బందరు, దివి తాలూకా; గుంటూరు జిల్లా పొన్నూరు, బాపట్ల, రేపల్లె తాలూకాలు; ప్రకాశం జిల్లా చీరాల, ఒంగోలు తాలూకాలు; నెల్లూరు జిల్లా నెల్లూరు, గూడూరు తాలూకాల గ్రామీణ ప్రాంతాలలో మారుమూలలలో కూడా పర్యటించి బాధితులకు సహాయక చర్యలను చేపట్టారు."

శ్రీ జానకి రామారావు తమ నివేదికలో మరొక సున్నితమైన అంశాన్ని ప్రస్తావించడం గమనార్హం. "తెలంగాణా ప్రాంతం" శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ జిల్లాల నుంచి; తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలనుంచి వ్యవసాయ పనుల నిమిత్తం వేలాదిమంది కూలీలు వలస వచ్చారు. వీరంతా ప్రధానంగా ఎస్. సి. ఎస్. టి.లకు చెందిన వారే. రైతుల చావిళ్ళలో, చేలగట్ల మీద, చెరువుగట్ల మీద వీరు వంటా వార్పు చేసుకొనేవారు. వీరంతా ఉప్పెన, తుపాను దెబ్బలకు బలైపోయారు. కాని, వీరు స్థానికులు కాకపోవడంతో లెక్కల్లోకి రాలేదు, గుర్తింపుకు నోచుకోలేదు."

"1979 మే నెల 12 - 13 వ తేదీలలో కృష్ణ, గుంటూరు, ప్రకాశం జిల్లాలను పెనుతుపాను కుదిపివేసింది. బందరు తాలూకా గిలకలదిండి, రెడ్డిపాలెం, బందరుపట్టణం, దివి తాలూకా సొర్లగొంది, గణపేశ్వరం గ్రామాలు సముద్ర జలాలతో మునిగిపోయాయి. మా కార్యకర్తలు ఈ గ్రామాలకు చెందిన 40 వేల మందిని రక్షించారు."

1979 పెనుతుపాను నష్టాల గురించి 1980 జూన్ నాలుగవ తేదీన భారతీయ ఆదిమజాతి సేవక్ సంఘ్‌కు సంక్షిప్త నివేదికను శ్రీ జానకి రామారావు సమర్పించారు. "కందుకూరు, ఒంగోలు, కావలి, బిట్రగుంటలో చాలా భాగాలు వరద నీట మునిగిపోయాయి. 630 మంది చనిపోయారు. వీరిలో 62 మంది ఆదిమవాసులే. వీరు కలికిపాయ బిట్రగుంట వాసులు. ఈ తుపాను వల్ల, ఉప్పెన వల్ల తీవ్రాతితీవ్రంగా నష్టపోయినవారు మత్స్యకారులు. వీరి పడవలు, నైలాన్ వలలు ఇతర సామాగ్రి కొట్టుకుపోయాయి".

జరిగిన నష్టాలను, ఉప్పెన - తుపాను, విధ్వంసాన్ని స్వయంగా పరిశీలించడానికి భారతీయ ఆదిమ జాతి సేవక్‌సంఘ్ కార్యదర్శి శ్రీ చించాల్కర్‌ను, ఇతర నాయకులను,

జాతీయ, విదేశీ పత్రికా సంపాదకులను కూడా ఆహ్వానించారు.

శ్రీ చించాల్కర్, శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య , ఇతర నాయకులు వచ్చారు. సోవియట్ రష్యాకు చెందిన అధికారిక పత్రిక 'ఇజ్వెస్థియ' ఎడిటరు కూడా వచ్చారు. సంఘం అధ్యక్షులు శ్రీ పాలపర్తి వీరయ్య, సర్వశ్రీ రామావతు లాలూనాయక్, పోట్లూరి లక్ష్మీనారాయణ, మోపూరి రమణయ్య, శ్రీ జానకి రామారావు వీరిని బీభత్స ప్రాంతాలలో పర్యటింపచేసి, నష్టాలను వివరించారు.

తక్షణ సహాయాన్ని బాధితులకు అందచేసే నిమిత్తం ఆయన తమ నివేదిక ప్రతులను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు, జిల్లాల కలక్టర్లకు, సంబంధిత ఉన్నతాధికార్లకు కూడా నివేదించారు.

ఇట్లాగే 1987 నవంబరు రెండు - నాలుగవ తేదీలలో సంభవించిన పెనుతుపాను బీభత్స నష్టాల గురించి; ఇతర తుపానుల నష్టాల గురించిన నివేదికలను కూడా శ్రీ చదల జానకి రామారావు క్రమం తప్పక పంపుతూ బాధితులకు సహాయపడినారు.

## నందిగామలో ఇళ్ళు



శ్రీ చదల జానకి రామారావు అధ్యక్షతన నందిగామ పట్టణ హౌసింగ్ బోర్డు ఏర్పడి చురుకుగా పని చేసింది. కమిటి సభ్యులుగా సర్వశ్రీ తంగిరాల ప్రభాకరరావు, సూర్యదేవర సూర్యనారాయణ, చిరుమామిళ్ళ చైతన్య కుమార్, షేక్ సైదా వున్నారు. వీరు ఎప్పటికప్పుడు లబ్ధిదారులకు తగు సమాచారాన్ని అందజేస్తుండేవారు. ఉదాహరణకు ఒకటి :

"నందిగామ పట్టణంలో పక్కా బిల్డింగులు కట్టుకొను నిమిత్తం సొంత స్థలం కలిగినవారు, ఒక్కొక్కరు ఆరు వందల రూపాయలను లోగడ ప్రభుత్వం వారికి చెల్లించారు. వారికి ఇండ్లు మంజూరయాయి. వెంటనే పక్కా బిల్డింగులు నిర్మాణం

చేయుటకుగాను, ఎవరి పేరుతో డబ్బు కటినారో, వారి ఫోటోలు ప్రభుత్వం వారికి పంపవలసివున్నది. నాలుగు పాస్‌పోర్టుసైజు ఫోటోలు తీసుకుని 27-7-1997 వ తేదీ ఉదయం పది గంటలలోగా న్యూకాలనీలోని చదల జానకి రామారావు గారి ఇంటికి రావలసినదిగా కోరడమైనది."

నందిగామ పట్టణ హౌసింగ్ బోర్డు ప్రెసిడెంటు శ్రీ చదల జానకి రామారావు 1997 జులై 22 వ తేదీన ఒక ప్రకటన చేస్తూ, 'నందిగామ పట్టణంలో అన్ని వర్గాల ప్రజలకు పక్కా భవనాల నిర్మాణానికి నేడు హౌసింగు బోర్డు డి. ఇ. గారి నుండి 787 ఇండ్లు మంజూరైనట్లు వర్తమానం అందినది. స్వాతంత్ర్యం సిద్ధించిన 50 వ సంవత్సరం సందర్భంగా నందిగామలో మొరటిసారిగా పక్కా ఇండ్ల నిర్మాణం జరుగుతున్నది. ఇందుకు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి, స్థానిక శాసన సభ్యునికి ధన్యవాదాలు.' అని పేర్కొన్నారు.

1998 ఏప్రిల్ 19 వ తేదీన నందిగామ శాసన సభ్యులు 'శ్రీ దేవినేని వెంకటరమణ గిరిజన కాలని' వాసులు న్యూకాలనీలో ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ చదల జానకిరామారావు అధ్యక్షతన సమావేశమయ్యారు.

నందిగామలో గిరిజన తదితరులకు నివేశన స్థలాలు లేని 350 మందికి ఒక్కొకరికి రెండ్లు శెంట్లు చొప్పున మంజూరు చేసి, పట్టాలు పంపిణీ చేసినందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారికి, నందిగామ నియోజక వర్గం శాసన సభ్యులు శ్రీ దేవినేని వెంకట రమణ గారికి కృతజ్ఞతలను తెలియచేస్తూ తీర్మానించారు.

కాలనీలో రోడ్లు, కరెంటు, మంచినీటి వసతి కల్పించవలసినదిగా ప్రభుత్వం వారికి విజ్ఞప్తి చేస్తూ కూడా వీరు తీర్మానించారు.

శ్రీ దేవినేని వెంకట రమణ గిరిజన కాలనీలో గిరిజన బాల బాలికలకు పాఠశాలను ఏర్పాటు చేయవలసినదిగా వీరు ప్రభుత్వం వారిని కోరారు.

నివేశన స్థలం లేని 60 మంది గిరిజనులకు కాలనీ ప్రక్కనే వున్న దేవస్థానం వారి భూమిని సేకరించి వారికి కూడా రెండేసి శెంట్లు చొప్పున మంజూరు చేసి పట్టాలు ఇప్పించవలససినదిగా అభ్యర్థించారు.

జిల్లా ఆదిమ జాతి సేవక్ సంఘ కార్యదర్శిగా మొగలి నాగయ్య, నందిగామ పట్టణ బి.సి . సెల్ అధ్యక్షులు శ్రీ మనబోతుల శ్రీరామ, మండల తెలుగుదేశం పార్టీ

ఎస్. టి. సెల్ అధ్యక్షులు శ్రీ చడమల తిరుపతయ్య, నందిగామ మండల పరిషత్తు సభ్యులు శ్రీ బొజ్జగాని రామకోటయ్య, నందిగామ పట్టణ ఎస్. టి. సెల్ అధ్యక్షులు శ్రీ మొగిలి నూకయ్య ప్రభృతులు సమావేశంలో పాల్గొన్నారు.

తెలుగుదేశం ప్రభుత్వం గిరిజనులకు చేస్తున్న సంక్షేమ కార్యక్రమాలను అధ్యక్షులు శ్రీ చదల జానకి రామారావు వివరించారు.

## ఒక సమీక్ష



ఏదేని ఒక సంస్థకు లేక సంఘానికి ప్రధాన కార్యదర్శిగా వ్యవహరిస్తున్న వ్యక్తి తన నివేదికలను, సమీక్షలను ఎంత బాధ్యతాయుతంగా సమర్పించవలెనో శ్రీ చదల జానకి రామారావు గారి నుంచి నేర్చుకోవచ్చు. ఒక ఉదాహరణగా **1990** జూన్ **28** వ తేదీన విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయంలో జరిగిన 'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్' జనరల్ కౌన్సిల్ సభ్యుల సమావేశానికి ఆయన సమర్పించిన **1987 - 90** కార్యదర్శి నివేదికను చూద్దాము. అది ఇలావుంది:

"అధ్యక్షా! సోదరీ, సోదరులారా! ఈ రోజున మన సంఘ రాష్ట్ర జనరల్ కౌన్సిల్ సమావేశాన్ని అత్యంత సంతోషంతో జరుపుకుంటున్నాము. చాలాకాలం తరువాత జరుపుకుంటున్న ఈ కౌన్సిల్ సమావేశానికి రాష్ట్ర వివిధ జిల్లాల నుంచి, సుదూర ప్రాంతాలనుంచి విచ్చేసిన ప్రతినిధులకు, కార్యకర్తలకు సంఘం తరఫున స్వాగతం. ప్రతినిధులైన మీకు కొన్ని ముఖ్యమైన విషయాలను తెలపడానికి ప్రయత్నిస్తాను.

**1948** వ సంవత్సరానికి పూర్వం ఆంధ్ర రాష్ట్ర ఎరుకల సంఘం, ఆంధ్ర రాష్ట్ర యానాది సంఘం, ఆంధ్ర రాష్ట్ర సుగాలి సంఘం, ఆంధ్ర రాష్ట్ర చెంచు సంఘం ఉన్నాయి. ప్రసిద్ధ గాంధేయవాది, స్వాతంత్ర్య సమర యోధులు, నిరాడంబరి, నిస్వార్థ ప్రజాసేవకులు, భారతీయ ఆదిమ జాతి సేవక్ సంఘ్ స్థాపకులు అయిన 'పద్మభూషణ్' వెన్నెల కంటి రాఘవయ్య గారి పిలుపుతో ఈ నాలుగు సంఘాలు ఏకమై **1948** వ సంవత్సరంలో ఆంధ్ర రాష్ట్ర ఆదిమజాతి సేవక్ సంఘ్‌గా ఏర్పడినది. రిజిస్ట్రేషన్ నెల్లూరులో

# భారత ఆదివాసి 'జాతిపిత'



పూజ్యశ్రీ ధక్కర్‌బాపా గారు

నాలుగు దశాబ్దాలపాటు తమ నిస్వార్థ సేవలను
మైదాన గిరిజనులకు అందించిన '**ఆదివాసి భూషణ్**'



**కీర్తి శేషులు తిరువీధుల సాంబయ్య గారు**



'పద్మభూషణ్' వెన్నెలకంటి రాఘవయ్యా గారి పుత్రుడు, మాజీ రాష్ట్రపతి వి.వి.గిరి గారి అల్లుడు, మిత్రుడు వెన్నెలకంటి గోపాల కృష్ణయ్యా గారు.

# ఆదర్శ దంపతులు



మోపూరి రమణయ్య - శ్రీమతి రమణమ్మ

# అబ్ ఢిల్లీ దూర్ నహి !



నాడి రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి కి ఆదివాసుల సమస్యలను వివరిస్తున్న శ్రీచదల జానకి రామారావు.

# శంకుస్థాపన



నెల్లూరు అల్లిపురం కత్తి చల్లమ్మ యానాది సంఘం వారి ఆదివాసి కాలనీకి వెన్నెలకంటి రాఘవయ్య గారు దగ్గర వుండి శ్రీ చదల జానకి రామారావు చేత శంకుస్థాపన చేయించారు.

# ప్రారంభోత్సవం



ఆ కాలనీలో మొక్కను నాటడంద్వారా 1973వ మార్చి ఏడవ తేదీన ఆయనే దానికి ప్రారంభోత్సవం చేసారు.

## 58 వసంతాల అన్యోన్య దాంపత్యం



శ్రీ పాలపర్తి వీరయ్య - శ్రీమతి తిరుపతమ్మ

# మహోద్యమంలో ఒక భాగం



శ్రీ చదల జానకి రామారావు, నాటి శాసన సభ్యులు శ్రీ వంగవీటి చలపతి రావు, అధ్యక్షులు శ్రీ యలమంచిలి బాబూ రాజేంద్ర ప్రసాద్, 'తెలుగు మహిళ' అధ్యక్షులుశ్రీమతి గంగారత్నం ప్రభృతులు.



అప్పటి కంచికచర్ల మండల పరిషత్తు అధ్యక్షులు శ్రీ మల్లెల పుల్లయ్యా బాబు తదితర యువకులతో మంతనాలు

## సన్మానించడమూ ఒక కళే !



వెన్నెలకంటి రాఘవయ్య గారి వర్ధంతి సభలో ఆయన పేర వృద్ధ కళాకారులను సన్మానిస్తున్న శ్రీ చదల జానకీ రామారావు.

## వస్త్రదానం



# 'సప్తతి 'సమ్మాన సారథులు

ఆహ్వాన సంఘం అధ్యక్షులు

శ్రీ కొమ్మన గంగాధర తిలక్



'సామాజిక వాల్మీకి'

శ్రీ చదల జానకి రామారావు



ప్రధాన కార్యదర్శి

శ్రీ తోట వెంకటేశ్వరరావు





కోశాధికారి

శ్రీ యరబడి కృష్ణారావు



ఎడిటరు

శ్రీ అడ్డుమిల్లి పూర్ణచంద్రరావు

## ధర్మవరప్పాడు తండా శిబిరం



అక్షరజ్ఞానం
మహిళలకు వయోజన విద్యా శిబిరం

## శిక్షణ శిబిరం



నెల్లూరులో **1988** జూన్ **23** నుంచి జులై **24**వ తేదీ వరకు బాల సేవికల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. చించాల్కర్‌జీ, పొన్నా కోటేశ్వరరావు ప్రభృతులు హాజరయ్యారు. నిర్వహణ సారథులు శ్రీ పాలపర్తి వీరయ్య, శ్రీ చదల జానకి రామారావు.

## స్మృతంజలి



నెల్లూరులో శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య గారి సంస్కరణ సభ పిదప ....

## సంఘనేతల సమ్మేళనం



భారతీయ ఆదిమజాతి సేవక్ సంఘ దక్షిణ భారత సంఘనాయకుల సమావేశం నెల్లూరులో జరిగినప్పటి దృశ్యం.



నెల్లూరులో జరిగిన దక్షిణ భారత సంఘ నాయకుల సమావేశం. చించాల్కర్‌జి, ఆర్గనైజరు శర్మ.



ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘం శిశు పోషణాలయం **1986-87**

# నాటి విద్యార్థులే నేటి ఉద్యోగులు



శ్రీ పాలపర్తి బెంజిమన్
అగ్నిమాపక దళంలో రిటైర్ అయారు, వరంగల్లు.



శ్రీ పి. రాజరత్నం
ఆంధ్రప్రదేశ్ ఐ. అండ్. సి ఎ డి . శాఖ
ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, హైదరాబాదు



శ్రీ పి. జాకబ్
విద్యుచ్ఛక్తి ఉద్యోగి, వరంగల్లు



శ్రీ కె. రోశయ్య
ఉద్యోగి, వరంగల్లు జిల్లా.

నందిగామ శ్రీ చదల జానకి రామారావుగారి హాస్టల్‌లో వుండి చదువుకుని, సంఘంలో సగౌరవంగా బ్రతుకుతున్న వందలాది మందిలో వీరు నలుగురు.

మంజూరుచేసి పంపిణీ చేసిన భూములకు కమ్యూనిటీ బావుల మంజూరుకు కృషి చేసింది. గిరిజనులు ఆక్రమణ చేసిన బంజరు భూములకు, ఆక్రమణ చేసి గుడిశలు వేసుకున్న వారికి పట్టాల మంజూరుకు కృషి చేసింది.''

## శిశు, బాల్వాడీ, అనాథ శరణాలయాలు

"ఈ సంఘం కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో **84** శిశు కేంద్రాలు, **12** బాల్వాడీ కేంద్రాలు, **9** అనాథ శరణాలయాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వం వారి గ్రాంటుతో, భారతీయ ఆదిమ జాతి సేవక్ సంఘం ద్వారా నడుపుతున్నది, సంఘం ద్వారా గుంటూరు పట్టణంలో అప్పర్ ప్రయిమరీ స్కూలును, కృష్ణా జిల్లా రాఘవాపురం తండాలో ప్రాథమిక పాఠశాలను నడుపుతున్నాము. సంఘం ద్వారా కృష్ణాజిల్లా నందిగామ న్యూకాలనీలో కీర్తిశేషులు పొన్నా సత్యనారాయణ మెమోరియల్ ప్రయోజన పాఠశాలను నడుపుతున్నాము.

సంఘానికి అనుబంధంగా కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో నాలుగు గిరిజన మహిళా మండలులు వున్నాయి. అనంతపురం జిల్లాలో ఒకటి వున్నది. గిరిజనుల బాలబాలికలు, వారి తల్లిదండ్రులు పనులకు వెళ్లిన సమయంలో, ఆ బిడ్డలను శిశు పోషణ కేంద్రాలలో వుంచి, వారికి ఆహార, ఆరోగ్య, క్రమశిక్షణ, బిడ్డల పెంపకం చేసే విధానంలో వారి రక్షణకు వున్న టీచర్లకు, ఆయాలకు ప్రముఖ డాక్టర్లు, విద్యావేత్తలతో ట్రైనింగ్ క్యాంపులలో ఉపన్యాసాలు నెల్లూరులో జరుపబడినవి. సంఘానికి అనుబంధంగా షెడ్యూల్ ట్రైబ్స్ ఫీల్డు లేబర్ కో ఆపరేటివ్ సొసైటీలను, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో నడుపుతున్నాము.

ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘం అనుబంధంగా నెల్లూరులో ట్రుస్టు బోర్డు వున్నది. ఈ బోర్డుకు ప్రత్యేకత వున్నది. ఈ కమిటీ ద్వారా ఈ జాతుల సంక్షేమ కార్యక్రమాలు నడుపబడుచున్నవి. ఈ ట్రుస్టుబోర్డుకు నెల్లూరులో విశాలమైన స్థలంలో లక్షలాది రూపాయల విలువ చేసే రెండు భవనాలు వున్నాయి.

ఇంతవరకు సంఘం చేసిన కృషిని నాకు తెలిసినంతవరకు ఈ నివేదిక ద్వారా అంద జేశాను. స్వాతంత్ర్యం వచ్చి నలుబది సంవత్సరాలు దాటినా; రాష్ట్ర - కేంద్ర

ప్రభుత్వాలు గిరిజనులకు, ఆర్థిక ప్రణాళికలు ఎన్ని ప్రవేశపెట్టినా, ఎక్కడో కొంతమంది అభివృద్ధి చెందినా, ఇంకా పట్టణాలలో, గ్రామాలలో లక్షలాదిమంది గిరిజనులు తినటానికి తిండి లేక, కట్టు బట్ట లేక; వుండ ఇల్లు లేక, ఆరోగ్య, విద్యా, ఉద్యోగాలు లేక పస్తులువుండే వారిని - మన ప్రక్కన వుండే మన ప్రజలను - చూస్తున్నాం. అటువంటి ప్రజల కొరకు మన సేవ చాలా అవసరం.

ఇప్పటి నుంచి ఒక నూతన పంథాలో నిర్మాణాత్మకమైన విధానాలను రూపొందించుకుని ముందుకుసాగడమే మన విద్యుక్త కర్తవ్యం. ఈ విషయంలో అనుభవజ్ఞులైన మీరు మంచి నాయకత్వంతో ముందుకు సాగుతారని, అనాథ అయిన మన జాతికి ప్రభుత్వం ద్వారా ఇవ్వబడే సంక్షేమ కార్యక్రమాలు అందజేయడానికి ముందుకుసాగుతారనీ ఎన్నో ఆశలు. మీకు నా వందనాలు. జై ఆదివాసి!''

# యానాదుల యాతనలు

కృష్ణాజిల్లా నూజివీడు బి. డి. ఓ. ఆఫీసుకు దగ్గరలో సుమారు రెండు వందల కుటుంబాల గిరిజన తెగకు చెందిన యానాదులు నివశిస్తున్నారు. దాదాపు **50** ఏండ్ల క్రిందట ఎం. ఆర్. అప్పారావు గారు దానం చేసిన అయిదు ఎకరాల స్థలంలో వీరు గుడిశలు వేసుకొని ఉంటున్నారు. వీరి ప్రధానమైన వృత్తి చేపలు పట్టడం. వీరిలో **34** మంది చేపలు పట్టడంలో ఎంతో నైపుణ్యాం, పనితనం కలిగినవారు. వల తాళ్ళుఅల్లడం, కుట్టడంలో తర్ఫీదు గలవాళ్ళు. నాపుడు వలనైన, విసురుడు వలనైన, బెండు వలనైనా వీరు నేస్తారు. చెరువులలో దిగి చేపలు పట్టడంలో నిపుణులు. ఒకరిని మించి మరొకరు చురుకుగా నేర్పరితనంతో ఎంత లోతైన కుంటలలో అయినా లేదా పెద్ద చెరువులలో సయితం భయమన్నది ఎరుగక దిగి. ఏలాంటి చేపలనైనా వేటాడే శక్తి కలిగివున్న గిరిజన యానాది యువకులు వీరు.

నూజివీడు, చుట్టుప్రక్కల గ్రామాల చెరువులలో ఆసాములు లేదా యజమానులు చేపలు పట్టడానికి వీరిని కూలికి పిలుస్తారు. అది అతి తక్కువ కూలి.

ఎలాగైనా ప్రభుత్వపరంగా ముఖ్యంగా మత్స్యశాఖ అధికార పెద్దల అండదండలతో కొత్తగా చేపల సొసైటీని ఏర్పాటు చేసుకోవచ్చునని గతంలో వీరు

చేశాము. అప్పటి నుంచి శ్రీ రాఘవయ్య గారి నాయకత్వంలో- సమాజంతో సంబంధం లేని అనాగరికులు, నోరువాయిలేక జీవచ్ఛావాలుగా బ్రతికే ఎరుకల, యానాది, లంబాడి, చెంచు, మొండి, బండ, పాముల, బుడబుక్కల, మందుల, వడ్డెర మొదలైన సంచార, ఆదిమ గిరిజన జాతుల అభివృద్ధికి సర్వతోముఖంగా, పట్టువీడని సంకల్ప బలంతో గత 40 సంవత్సరాల నుంచి కృషి చేస్తూవస్తున్నది.

ఈ కృషిలో తమ జీవితాలను లెక్కచేయక అహోరాత్రులు నిర్విరామంగా కృషి చేసిన ఎందరో మహానుభావులు, త్యాగశీలులరు వున్నారు. మనం మరువలేని శ్రీయుతులు తిరువీధుల సాంబయ్య, రామేశ్వరం నాగయ్య, పొన్నా సత్యనారాయణ, బాణావత్ జోగా నాయక్, తోకల కోటయ్య, కుంభా వెంకటపతి, బొజ్జగాని హుళక్కయ్య, దేవరశెట్టి పున్నారావు ప్రభృతులు మన ముందు లేరు, వారు లేకపోయినా, వారి ఆశయాలను జయప్రదం గావించడానికి మనమంతా ఒకే త్రాటిపై ఐకమత్యంతో ముందుకు వెళదాం.

భారతీయ ఆదిమ జాతి సేవక్ సంఘ్‌కు మన సంఘాన్ని అనుబంధంగా చేశాము. ఆ సంఘం వారి అమూల్యమైన సహాయంతో సలహాలతో అనేక కార్యక్రమాలను చేపట్టాము. శిశుపోషణ కేంద్రాలు, బాల్వాడీ కేంద్రాలను నడుపుతున్నాము. అందుకు ప్రత్యేకంగా ఆ సంఘం అధ్యక్షులు గౌరవనీయులైన చించాల్కర్‌జీ గారికి, ఆ సంఘ ఆఫీసు బేరర్సుకు మన సంఘం తరుపున హృదయపూర్వకమైన కృతజ్ఞతలను తెలుపుతున్నాను.

ఈ సంఘం కృష్ణా, గుంటూరు, నెల్లూరు, ప్రకాశం, పశ్చిమ గోదావరి జిల్లాలలో కొంతవరకు కార్యక్రమాలను జరుపుతున్నది. చిత్తూరు, అనంతపురం, కడప, నల్గొండ, ఖమ్మం, హైదరాబాద్, తూర్పుగోదావరి జిల్లాలలో నామమాత్రంగా పనిచేస్తున్నది. మిగిలిన జిల్లాలలో కార్యకర్తలంటూ లేరు. సంఘం నాయకత్వం గ్రామీణ శాఖలను సత్వరమే ఏర్పాటు చేయాలని సంఘం తీర్మానాలు చేసినా, ఎవరూ పట్టించుకోవడం లేదు.

కేవలం శిశు కేంద్రాలు, బాల్వాడిలు, అనాథ శరణాలయాలను నిర్వహించటమే మన సంఘం కార్యక్రమం కాదు. ఈనాడు లక్షలాది గిరిజనులు గ్రామీణ ప్రాంతాలలో నివసించడానికి కనీసం శెంటు స్థలం లేని అభాగ్యులు వున్నారు. ప్రభుత్వం ఈ జాతులకు చేస్తున్న సంక్షేమ కార్యక్రమాలేమిటో తెలియని అమాయకులు వున్నారు. వీరందరిని చైతన్యవంతులుగా తయారుచేసినప్పుడే, మన సంఘం విజయవంతం అవుతుంది. అందుకు

కీర్తిశేషులు. శ్రీ పోన్నా సత్యనారాయణ గారు
ఆంధ్రరాష్ట్రఏఱుకులసంఘ స్థాపకులలో ముఖ్యులు



జననము : **1925.4.23** మరణము : **1975.10.27**

# వరదబాధితులకు ఒకింత ఓదార్పు









**1977** లో సంభవించిన పెనుతుపాను, వరదలలో వేలాది మంది నిరుపేదలు నిర్వాసితులు అయ్యారు. నాడు వరద బీభత్సాన్ని స్వయంగా తిలకించి, బాధితులను ఓదార్చడం కోసం సోవియెట్ రష్యాకు చెందిన అధికార దినపత్రిక 'ఇజ్వెస్తియా' ఎడిటరు నెల్లూరు జిల్లా వచ్చారు. శ్రీ చదల జానకీ రామారావు స్వాగతం పలికారు. వెన్నెలవంటి రాఘవయ్య పాలపర్తి వీరయ్య ప్రభృతులు నాడు వరద బీభత్సాన్ని ఆయనకు ప్రత్యక్షంగా కనబరచారు.

సంఘు నాయకత్వం నిర్లక్ష్యం చేయక పట్టణ, గ్రామీణ ప్రజలకు ఇతోధిక సహాయం అందేటట్లు కృషిచేయవలసినదిగా ప్రతినిధులకు విజ్ఞప్తి చేస్తున్నాను.

ఈ సంవత్సరం మాత్రమే జిల్లాలలోని కార్యకర్తలు కదలి, పోటీలుపడి సంఘ సభ్యత్వం చేర్పిస్తున్నారు. ఇప్పటివరకు అందిన సమాచారం ప్రకారం ఐదు వేల సభ్యత్వం వుండవచ్చు. గత జనరల్ కౌన్సిల్ సమావేశం తదుపరి 13 కార్యవర్గ సమావేశాలను జరిపి 92 తీర్మానాలను అమోదించాము. ఈ తీర్మానాలను ప్రభుత్వం వారికి, జిల్లా అధికార్లకు పంపాము. ఈ తీర్మానాల వల్ల సంఘానికి కొంత మేలే జరిగింది.

ప్రతి సంవత్సరం కోస్తా తీర ప్రాంతంలో సంభవించే పెనుతుపానుల వల్ల నష్టపడిన ఈ జాతుల ప్రజలకు ప్రభుత్వం ద్వారా సహాయ సహకారాలను ఈ సంఘం ద్వారా చేయబడినవి. గత మే నెల 9 - 10 వ తేదీలలో సంభవించిన పెను తుపానువల్ల, నష్టపోయిన ఈ జాతుల ప్రజలను సంఘ కార్యకర్తలు కలుసుకుని, నష్టాల వివరాలను ప్రభుత్వ అధికారులకు రిపోర్టులుగా పంపాము.

'మెదడు వాపు వ్యాధి' మిషతో పట్టణాలలో పందుల నిర్మూలన కార్యక్రమాన్ని మున్సిపల్ అధికారులు చేబట్టి వేలాది పందులను రాష్ట్రంలోని అన్ని మున్సిపాల్టీలలో చంపడం జరిగింది. ఈ సందర్భంగా సంఘం కలుగచేసుకొని మున్సిపల్ అధికారులన కలుసుకొని విజ్ఞప్తులు చేశాము. అంతేకాకుండా, కోర్టులకు వెళ్లి పందులను చంపకుం స్టే ఆర్డర్లు తీసుకువచ్చాము.

రాష్ట్రంలోని గిరిజన విద్యార్థులకు స్కాలర్‌షిప్‌ల మంజూరుకు సంఘం కృషిచేసింది. చిన్న ఉద్యోగాలు-అనగా కండక్టరు, డ్రైవరు, స్వీపరు ఉద్యోగాలు ఇప్పించటంలో కృషి చేసినది. నిరుపేదలైన గిరిజనులకు నివేశన స్థలాల మంజూరుకు ప్రభుత్వానికి అర్జీలను సంఘం ద్వారా పంపాము. అన్ని జిల్లాలలో పక్కా గృహాలు ప్రభుత్వం ద్వారా నిర్మించడానికి కృషి చేసింది. రాష్ట్రంలోని గిరిజనులకు వృత్తి సంబంధమై ఆవులు, గేదెలు, గొర్రెలు, మేకలు, వలలు, సైకిళ్లు, రిక్షాసైకిళ్లు, చిల్లరకొట్లు, సోడా బం పందుల పెంపకానికి బ్యాంకుల నుంచి రుణాలను ఇప్పించడంలో సంఘ కార్యకర్తలు ఎనలేని కృషిచేశారు.

గిరిజనులు భూములను సాగుచేసుకునేందుకు ప్రభుత్వం ద్వారా ఉచితంగా విత్తనాలు, స్ప్రేయర్లు ఇప్పించడం జరిగింది. సొంత భూములకు, ప్రభుత్వంవారు

మంజూరుచేసి పంపిణీ చేసిన భూములకు కమ్యూనిటీ బావుల మంజూరుకు కృషి చేసింది. గిరిజనులు ఆక్రమణ చేసిన బంజరు భూములకు, ఆక్రమణ చేసి గుడిశలు వేసుకున్న వారికి పట్టాల మంజూరుకు కృషి చేసింది."

## శిశు, బాల్వాడీ, అనాథ శరణాలయాలు

"ఈ సంఘం కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో **84** శిశు కేంద్రాలు, **12** బాల్వాడీ కేంద్రాలు, **9** అనాథ శరణాలయాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వం వారి గ్రాంటుతో, భారతీయ ఆదిమ జాతి సేవక్ సంఘం ద్వారా నడుపుతున్నది, సంఘం ద్వారా గుంటూరు పట్టణంలో అప్పర్ ప్రయిమరీ స్కూలును, కృష్ణాజిల్లా రాఘవాపురం తండాలో ప్రాథమిక పాఠశాలను నడుపుతున్నాము. సంఘం ద్వారా కృష్ణాజిల్లా నందిగామ న్యూకాలనీలో కీర్తిశేషులు హొన్నా సత్యనారాయణ మెమోరియల్ వయోజన పాఠశాలను నడుపుతున్నాము.

సంఘానికి అనుబంధంగా కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో నాలుగు ।రిజన మహిళా మండలులు వున్నాయి. అనంతపురం జిల్లాలో ఒకటి వున్నది. గిరిజనుల ాలబాలికలు, వారి తల్లిదండ్రులు పనులకు వెళ్లిన సమయంలో, ఆ బిడ్డలను శిశు పోషణ కేంద్రాలలో వుంచి, వారికి ఆహార, ఆరోగ్య, క్రమశిక్షణ, బిడ్డల పెంపకం చేసే విధానంలో వారి రక్షణకు వున్న టీచర్లకు, ఆయాలకు ప్రముఖ డాక్టర్లు, విద్యావేత్తలతో ట్రైనింగ్ క్యాంపులలో ఉపన్యాసాలు నెల్లూరులో జరుపబడినవి. సంఘానికి అనుబంధంగా షెడ్యూల్ ట్రైబ్స్ ఫీల్డు లేబర్ కో ఆపరేటివ్ సొసైటీలను, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో నడుపుతున్నాము.

ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘం అనుబంధంగా నెల్లూరులో ట్రస్టు బోర్డు వున్నది. ఈ బోర్డుకు ప్రత్యేకత వున్నది. ఈ కమిటీ ద్వారా ఈ జాతుల సంక్షేమ కార్యక్రమాలు నడుపబడుచున్నవి. ఈ ట్రస్టుబోర్డుకు నెల్లూరులో విశాలమైన స్థలంలో లక్షలాది రూపాయల విలువ చేసే రెండు భవనాలు వున్నాయి.

ఇంతవరకు సంఘం చేసిన కృషిని నాకు తెలిసినంతవరకు ఈ నివేదిక ద్వారా అందజేశాను. స్వాతంత్ర్యం వచ్చి నలుబది సంవత్సరాలు దాటినా; రాష్ట్ర - కేంద్ర

ప్రభుత్వాలు గిరిజనులకు, ఆర్థిక ప్రణాళికలు ఎన్ని ప్రవేశపెట్టినా, ఎక్కడో కొంతమంది అభివృద్ధి చెందినా, ఇంకా పట్టణాలలో, గ్రామాలలో లక్షలాదిమంది గిరిజనులు తినటానికి తిండి లేక, కట్టు బట్ట లేక; వుండ ఇల్లు లేక, ఆరోగ్య, విద్యా, ఉద్యోగాలు లేక పస్తులువుండే వారిని – మన ప్రక్కన వుండే మన ప్రజలను –చూస్తున్నాం. అటువంటి ప్రజల కొరకు మన సేవ చాలా అవసరం.

ఇప్పటి నుంచి ఒక నూతన పంథాలో నిర్మాణాత్మకమైన విధానాలను రూపొందించుకుని ముందుకుసాగడమే మన విద్యుక్త కర్తవ్యం. ఈ విషయంలో అనుభవజ్ఞులైన మీరు మంచి నాయకత్వంతో ముందుకు సాగుతారని, అనాథ అయిన మన జాతికి ప్రభుత్వం ద్వారా ఇవ్వబడే సంక్షేమ కార్యక్రమాలు అందజేయడానికి ముందుకుసాగుతారనీ ఎన్నో ఆశలు. మీకు నా వందనాలు. జై ఆదివాసి!"

# యానాదుల యాతనలు

కృష్ణాజిల్లా నూజివీడు బి. డి. ఓ. ఆఫీసుకు దగ్గరలో సుమారు రెండు వందల కుటుంబాల గిరిజన తెగకు చెందిన యానాదులు నివశిస్తున్నారు. దాదాపు **50** ఏండ్ల క్రిందట ఎం. ఆర్. అప్పారావు గారు దానం చేసిన అయిదు ఎకరాల స్థలంలో వీరు గుడిశల వేసుకొని ఉంటున్నారు. వీరి ప్రధానమైన వృత్తి చేపలు పట్టడం. వీరిలో **34** మంది చేప పట్టడంలో ఎంతో నైపుణ్యం, పనితనం కలిగినవారు. వల తాళ్ళుఅల్లడం, కుట్టడంల్ తర్ఫీదు గలవాళ్ళు. నాపుడు వలనైన, విసురుడు వలనైన, బెండు వలనైనా వీరు నేస్తారు చెరువులలో దిగి చేపలు పట్టడంలో నిపుణులు. ఒకరిని మించి మరొకరు చురుకుగా నేర్పరితనంతో ఎంత లోతైన కుంటలలో అయినా లేదా పెద్ద చెరువులలో సయితం భయమన్నది ఎరుగక దిగి. ఏలాంటి చేపలనైనా వేటాడే శక్తి కలిగివున్న గిరిజన యానాది యువకులు వీరు.

నూజివీడు, చుట్టుప్రక్కల గ్రామాల చెరువులలో ఆసాములు లేదా యజమానులు చేపలు పట్టడానికి వీరిని కూలికి పిలుస్తారు. అది అతి తక్కువ కూలి.

ఎలాగైనా ప్రభుత్వపరంగా ముఖ్యంగా మత్స్యశాఖ అధికార పెద్దల అండదండలతో క్రొత్తగా చేపల సొసైటీని ఏర్పాటు చేసుకోవచ్చునని గతంలో వీరు

ప్రయత్నించారు. అనేక పర్యాయాలు అర్జీలు పెట్టుకున్నారు.

లేదా కనీసం పట్టణంలో అనేక ఏండ్లుగా నడుస్తున్న మత్స్య పారిశ్రామిక కోఆపరేటివ్ సొసైటీలో గిరిజన తెగకు చెందిన-చేపలు పట్టడంలో తర్ఫీదు గలిగిన-ఈ **34** మంది యానాదులకు సభ్యత్వం ఇప్పించవలెనని కోరారు. గతంలో ఈ విషయమై వీరు ప్రభుత్వ అధికార పెద్దలకు వివిధ రకాలుగా చెప్పుకున్నారు. దరఖాస్తులను వినతి పత్రాలను వరుసగా **1.2.1996, 8.2.96, 16.2.96, 24.2.96, 4.3.96** తేదీలలో సమర్పించుకున్నారు.

ప్రభుత్వం నుంచి ఏమాత్రం స్పందన లేదు. మత్స్యకారులు ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ ప్రధాన కార్యదర్శి శ్రీ చదల జానకి రామారావును ఆశ్రయించారు. సమస్య పరిష్కారానికి ఆయన నడుం బిగించారు.

శ్రీ జానకి రామారావు స్వయంగా వెళ్ళి అధికారులతో, ఉన్నతాధికారులతో సంప్రతించారు. ఉత్తరాలు వ్రాశారు. కృష్ణాజిల్లా కలక్టరుకు, ఫిషరీస్ అసిస్టెంటు డైరక్టరుకు, కాకినాడలోని డిప్యూటీ డైరక్టరుకు, శాసన సభా ఎస్.టి. కమిటి చెయర్మన్‌కు, రాష్ట్ర గిరిజన శాఖ మంత్రికి, పాఠశాల విద్యాశాఖ మంత్రి దేవినేని వెంకట రమణ గారికి, తెలుగుదేశం పార్టీ రాష్ట్ర ఎస్.టి.సెల్ ప్రెసిడెంటుకు (శ్రీ జానకి రామారావు వైస్-ప్రెసిడెంటు), చివరకు ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు దృష్టికి కూడా ఈ అంశాన్ని తీసుకువెళ్ళారు. సమస్య పరిష్కృతం అయేంతవరకు నిదురపోలేదు. శ్రీ జానకి రామారావు ముఖ్యమంత్రికి సమర్పించిన వినతి పత్రంలో ఈ కింది విధంగా అభ్యర్థించారు:

"కృష్ణాజిల్లా నూజివీడు యానాది కాలనీలో రెండు వందల కుటుంబాలవారు నివసిస్తున్నారు. వీరంతా నిరుపేదలు. ఎటువంటి స్థిరచరాస్తులు లేనివారు. అనామకులు. వీరికి గ్రామంలో గౌరవం అంటూ లేదు. చిన్నచిన్న గుడిశలు వేసుకుని కాపురాలు చేసుకుంటున్నారు.

తరతరాలనుంచి ప్రభుత్వానికి సంబంధించిన వాగులు, చెరువులు, మురికి గుంటలలో చేపలు పట్టుకొని జీవించే వృత్తిమీద ఆధారపడిన వారు. చేపలు పట్టుకుని జీవించే వృత్తిమీద ఆధారపడినవారు. చేపలు దొరకని రోజున కటిక పస్తులతో అల్లాడుతుంటారు. వీరికి వేరే పని చేతకాదు.

పంచాయతీ వ్యవస్థ ఏర్పడ్డాక, వీరి బ్రతుకులు బజారుపాలయ్యాయి. కష్టాలుపాలైన యానాదులు, నూజివీడు ఫిషర్‌మెన్ కో-ఆపరేటివ్ సొసైటీలో 30 మందికి సభ్యత్వం కల్పించమని ప్రభుత్వం వారికి అర్జీలు దాఖలు చేసుకుమన్నారు. ఫిషర్‌మెన్ కో-ఆపరేటివ్ సొసైటీ ఇన్‌స్పెక్టరు నూజివీడు వచ్చి ఈ యానాదులు అసలు చేపలు పట్టేవారా, కాదా అని తనిఖీ కూడా చేసుకొని వెళ్ళారు. వీరు అర్హులేనని కూడా వ్రాసుకు వెళ్ళారు. కానీ, ఇంతవరకు ఎటువంటి చర్య తీసుకోలేదు.

ఈ సొసైటీలో కనీసం చేపలు పట్టడం చేతకానివారు, చనిపోయిన సభ్యులు కూడా ఇంకా సభ్యులుగానే కొనసాగుతున్నారు. కానీ, ఈ యానాదులను చేర్చుకోవడానికి ఏవేవో సాకులు, అడ్డంకులు కల్పించి చేర్చుకొనకుండా చేస్తున్నారు.

ఇందులో వీరి అర్జీని, ప్రభుత్వానికి సంబంధించిన చెరువుల వివరాలను జతపరచాను. ఇంతేకాదు, ఈ సొసైటీలో ఒక్క యానాది కులస్తుడు కూడా లేడు. కనుక, తమరు దయతో వీరి మొరాలకించి, పై సొసైటీలో సభ్యత్వం మంజూరు చేసి, వీరికి జీవనాధారం కల్పించగలందులకు ప్రార్థిస్తున్నాను."

# భాషలకు లిపి

**చదల** జానకి రామారావు గారిది పారదర్శిక దృష్టి. రాజకీయ, సాంఘిక రంగాలలోనే కాదు, సాంస్కృతికంగా కూడా ముందు చూపుగల వ్యక్తి.

ఆదిమ జాతులవారు మాట్లాడుకునే భాషలకు లిపులు లేవని, అందువల్ల తరాలు గడుస్తున్న కొలది ఆ గిరిజన మాతృ భాషలు అంతరించిపోయే ప్రమాదం వున్నదని శ్రీజానకి రామారావు ఆందోళన చెందుతూవుంటారు. ఈ జానపద భాషలను కాపాడుకుని, ప్రాచీన భాషా - సాహిత్య - సంస్కృతులను పరిరక్షించుకోవలసిన

అవసరం ఎంతగానో వున్నదని ఆయన నిశ్చితాభిప్రాయం.

ఈ విషయమై తగు చర్యలు తీసుకోవలసిందిగా కోరుతూ శ్రీ జానకి రామారావు ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘానికి **1984** జులై **23** వ తేదీన ఒక లేఖను కూడా వ్రాశారు. అధికార భాషా సంఘం ఈ లేఖను పరిగణనలోకి తీసుకుంది. ఇందుకు స్పందనగా అధికార భాషా సంఘం కార్యదర్శి శ్రీ జి. రామకృష్ణారావు ఆగస్టు పదవ తేదీన జానకి రామారావు గారికి ఈ కింది విధంగా తగు సమాధానం పంపారు:

"శ్రీ జానకి రామారావు గారికి, నమస్కారం. అధికార భాషా సంఘం అధ్యక్షులు డాక్టరు సి. నారాయణరెడ్డి గారికి మీరు వ్రాసిన లేఖ అందినది. దానిని వారు చదివారు. రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో వున్న గిరిజనులు మాట్లాడే భాషలను కాపాడవలెనని; ఆ భాషలు మాట్లాడే ప్రజల ఆర్థిక, సాంఘిక అభ్యున్నతికి దోహదకరంగా వుండే నిమిత్తం ఆ భాషలను తెలుగులో బోధించాలని అధికార భాషా సంఘం అధ్యక్షులు డాక్టరు సి. నారాయణ రెడ్డి గారు సూచించారు. మీ లేఖలో తెలిపిన అంశాలను సంబంధించిన అధికారులకు తెలియజేయగలం."

శ్రీ చదల జానకి రామారావు వ్రాసిన లేఖ పూర్తి పాఠం: "ఆంధ్రప్రదేశ్‌లో ఎరుకల, లంబాడి, కోయ, గోండు, యానాది, చెంచు, సవర మొదలైన ఆదిమ జాతులు వున్నాయి. రాష్ట్రంలో ఎక్కువ జనాభా గల తెగలలో ఎరుకల తెగ ఒకటి. పైన పేర్కొన్న తెగలల్లో ఒక్క యానాది తెగకు మినహా మిగతా తెగలన్నింటికి సొంత భాషలు ఉన్నాయి. సవరలకు మినహా మిగతా తెగల భాషలకు లిపులు లేవు. గిడుగు రామమూర్తి పంతులుగారు సవర భాషకు లిపిని కనిపెట్టారు. మిగతా తెగల భాషలకు లిపులు కనిపెట్టినవారు లేరు.

ఇటీవల కోయ భాషకు లిపిని కనుగొన్నట్టు వచ్చిన వార్త ఈ తెగలకు ఎంతో సంతోషం కలిగించింది. భాష, సాహితి, విద్యావేత్తలు మిగతా తెగల భాషలక్కూడా లిపులను కనిపెడితే మన దేశంలోని ఆదిమ- ప్రాచీన జాతుల ప్రత్యేక భాషలు, ఆచారాలు, సంప్రదాయాలు మొదలయిన వాటిని నిలబెట్టుకోవడానికి వీలువుంటుంది.

ఎరుకల ప్రజలు మాట్లాడే భాషను బట్టి ఈ భాషకు తమిళ భాషకు సంబంధం ఉన్నట్టు, ఈ ప్రజలు దక్షిణాదినుంచి దేశంలోని ఇతర ప్రాంతాలకు వలసి వచ్చినట్టు

కనబడుతుంది. దక్షిణాది రాష్ట్రాలన్నిటా ఈ తెగ ఎరుకల, కొరవంజి, కురువన్, కావనూర, కొట్టునాయకన్ మొదలయిన పేర్లతో పిలువబడుతూ గోత్రాలు, కుల కట్టుబాట్లు, ఆచారాలు, వృత్తులు అన్నీ ఒకటిగానే ఉంటూ ఈ అన్ని ప్రాంతాలలోనూ ఆయా ప్రాంతీయ భాషలతో మిశ్రితమయిన తమ భాషను కలిగి వున్నాయి.

అయితే, ఇటీవల కొంత కాలంగా ఎరుకల ప్రజలు తమ సొంత భాషను ఎక్కువగా వాడక, తాము కలసిమెలసి ఉంటున్న రైతాంగం, కూలీలతో తెలుగులో మాట్లాడుతూ ఉండటంవల్ల తమ ఇండ్లలో కూడా తమ భాషలో మాట్లాడుకోవడం తగ్గించివేశారు. దాదాపు మూడు దశాబ్దాల క్రితం నుంచి ఈ భాష వాడుక పూర్తిగా తగ్గిపోయింది. ఫలితంగా ఈ తెగలో చదువుకుంటున్న పిల్లలకు ఈ భాషే తెలియని పరిస్థితి ఏర్పడింది. ముమ్ముందు ఈ భాషే అంతరించి పోయే ప్రమాదం కనిపిస్తుంది.

ఇందుకు బలీయమైన రెండు కారణాలు వున్నాయి. బ్రిటిష్ వాళ్ళ హయాంలో ఈ తెగను ఏకమొత్తంగా దొంగ జాతిగా పరిగణించడం వల్ల, అదే స్థితి ఈనాడు కూడా కొనసాగుతూ ఉండటంవల్ల ఈ కులస్థులు తమ భాషలో మాట్లాడుకోవడానికే భయపడుతున్నారు. ఇతర కులస్థులు ఈ తెగ వాళను సింగి, సింగడు అంటూ అవహేళన చేస్తూ, అనుమానంగా చూస్తుండుందువల్ల ఈ తెగలో చదువుకుంటున్నవాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నవాళ్ళు తమ మాతృభాషలో మాట్లాడడం మానివేశారు. చాలా మందికి తమ భాషే తెలియదన్నా ఆశ్చర్యపోవలసిన పనిలేదు.

ఇక్కడ మరొక ప్రమాదకర అంశం ఏమంటే: వృత్తి విద్యాకోర్సులకు వెళ్ళేటప్పుడు, స్కాలర్‌షిప్పులు తీసుకోవలసి వచ్చినప్పుడు, ఉద్యోగాలకోసం ఇంటర్వ్యూలకు హాజరు అయినప్పుడు ఈ తెగ అభ్యర్థులను మీకు మీ భాష వచ్చా? అని ప్రశ్నిస్తున్న సందర్భాలు ఎన్నో వున్నాయి. రాదంటే నీవు ఎరుకల కులస్తుడివి కాదు పొమ్మంటున్నారు.

ఈ ప్రమాదకర పరిస్థితికి సమాజానిదే పూర్తి బాధ్యత. ప్రభుత్వాలు కూడా ఈ తెగల పట్ల సాదరపూర్వకంగా వ్యవహరించకపోవడం వల్ల కూడా ఈ ఆదిమ తెగ సొంత భాష అంతరించిపోయే ప్రమాదకర పరిస్థితి ఏర్పడింది.

అలాగే లంబాడీ, గోండు తదితర ఆదిమ తెగ భాషలకు కూడా ఇదే దుర్గతి పట్టే ప్రమాదం వున్నది.

అందుచేత, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు భాషా, సాహితీ, విద్యావేత్తలతో ఈ సమస్యను కులంకషంగా పరిశీలింపచేసి ఈ ఆదిమ తెగ భాషలకు లిపులు కనుగొనే కార్యక్రమం చేపట్టవలెనని కోరుతున్నాను.

కాగా, ఈ లోపుగా ఎరుకల - తమిళ భాషల సామీప్యత, స్వారూప్యతలను బట్టి; అలాగే లంబాడి - రాజస్థానీ భాషల సాన్నిహిత్యాన్ని బట్టి ఎరుకలకు తమిళాన్ని, లంబాడీలకు రాజస్థానీని బోధనా భాషగా ప్రాధమిక పాఠశాల స్థాయినుంచి అయినా ప్రవేశపెట్టవలెనని సూచిస్తున్నాను.

# వ్యక్తిత్వం

శ్రీ చదల జానకి రామారావు వ్యక్తిత్వం చాలా దొడ్డది. క్షమాగుణం అధికం. అందుకు పెక్కు సంఘటనలను ఉదహరించవచ్చు.

ఒక వ్యక్తి-బొజ్జగాని తాతయ్య- శ్రీ జానకి రామారావుతో విరోధించాడు. పగపెంచుకున్నాడు. అకారణంగా తిట్టడం, పుకార్లను షికారు చేయించడంలో ఘనాపాటి అయ్యాడు. ఒకానొక దశలో జైలు పాలయ్యాడు. దిమ్మెర పోయాడు. దిక్కు తోచలేదు. ఆదరించేవారు లేరుకదా అసలు పలుకరించేవారు కరువయ్యారు. ఆ క్లిష్ట దశలో శ్రీ జానకి రామారావు గారే దిక్కు అనుకున్నాడు. అన్యధా శరణమ్ నాస్థి! శ్రీ జానకి రామారావు పట్ల తను ఎంత అనుచితంగా వ్యవహరించిందీ తన కుమారుల దగ్గర వెళగక్కి భోరుభోరున విలపించాడు. అతని పుత్రులు శ్రీ జానకి రామారావును అశ్రయించారు. తమ తండ్రిని క్షమించమని కోరారు. అతనిని విడిపించడం మీ ఒక్కరి వల్లే సాధ్యమవుతుందని అభ్యర్థించారు. శ్రీ జానకి రామారావు సరేనన్నారు, క్షమించేశారు. అతనిని చెర విడిపించేశారు !

నాటి బ్రిటిష్ వారి పాలనలో కల్లు, సారా దుకాణాలు పబ్లిక్‌గా పుష్కలంగా వుండేవి. రాఘవాపురంలో ఒక దుకాణం వద్ద జరిగిన సంఘటన: తిమ్మసర్తి దుర్గయ్య, అతని భార్యకు వివాదం ఏర్పడి భార్య పుట్టింటికి వెళిపోయింది. అతను శ్రీ జానకి రామారావును మధ్యవర్తిగా ఎంచుకొని, తన భార్యకు తనకు సఖ్యత ఏర్పరచ వలసిందిగా అభ్యర్థించాడు. శ్రీ చదల జానకి రామారావు ఎంత ప్రయత్నించినా ఆ ఆలు మగల మధ్య

సయోధ్య ఏర్పడలేదు. దీనితో సదరు దుర్గయ్య శ్రీ జానకి రామారావు పట్ల కక్ష ఏర్పరచుకున్నాడు. అంతక ముందునుంచి శ్రీ జానకి రామారావుకు గల పేరుప్రఖ్యాతలకు, పలుకుబడికి ఈర్ష్యాసూయలతో దహించుకుపోతున్నాడు. చుప్పనాతితనంతో అతను ఒకనాడు కల్లు దుకాణం సమీపంలో శ్రీ రామారావుతో ఘర్షణకు దిగాడు. హటాత్తుగా దుడ్డుకర్ర అందుకుని రామారావు నుదిటిమీద మోదేశాడు. ఆ దెబ్బకు శ్రీ రామారావు నుదిటిపయిన చిట్లిపోయి నెత్తురు బొటబొట చిమ్మింది. హటాత్తుగా జరిగిన ఈ దుస్సంఘటనకు అక్కడ అప్పటికే పోగయివున్న గ్రామీణులు దిగ్భ్రమెరపోయారు. కొట్టినతను పారిపోతుండగా గ్రామీణులు తరిమి పట్టుకుని స్థంబానికి కట్టేసి కొట్టబోయారు. శ్రీ జానకి రామారావు పట్ల గ్రామీణుల అభిమానం అట్టిది ! దుర్గయ్య భీతితో వణికిపోతూ తప్పు కాయండయ్యా, మన్నించండయ్యా, ఇంకెప్పుడు దురుసుగా పోనయ్యా అంటూ ఏడుస్తూ పెడబొబ్బలు పెట్టాడు. శ్రీ జానకి రామారావు ఆ దుండగుని క్షమించి విడిపించి వదిలేశారు.!

## మానవ సేవే..



1997 మే నెల మూడవ తేదీన శ్రీ మొగిలి ఆంజనేయులు గారి సన్మాన సందర్భంగా ఉపన్యసిస్తున్న శ్రీ చదల జానకీరామారావు

మానవ సేవే మాధవ సేవగా భావించిన శ్రీ చదల జానకి రామారావు తమ ఔబ్బది ఏండ్ల సుదీర్ఘ జీవన యానంలో ఏనాడూ తమను తాము తగ్గించుకోలేదు. ఏ పని చేసినా, ఏ ఉద్యమానికి ఉద్యమించినా ఎంతో ఆత్మస్థైర్యంతో కృత నిశ్చయంతో కదిలేవారు. ఎప్పుడూ ఎవరినీ కించపరచడంగానీ, న్యూనతపరచడం కానీ, చిన్నబుచ్చడం

గానీ చేసి ఎరుగరు. పైగా, అన్య నాయకత్వాన్ని అంగీకరిస్తారు. వారిని ప్రోత్సహిస్తారు. అహంభావం ఆయన రక్తంలోనే లేదు. సంయమనం, సమదృష్టి ఆయన సొత్తు. ఈ ఉన్నత మనస్తత్వం కారణంగానే ఆయన ఎన్నో విజయాలను సాధించారు.

ఆదివాస జాతులవారి ఆరోగ్య పరిరక్షణకు, ఉచిత చికిత్సకు ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ వారు తరచూ ఉచిత వైద్య చికత్సా శిబిరాలను నిర్వహించేవారు. వ్యాధిగ్రస్తుల వైద్య పరీక్ష, చికిత్స, మందులు, ఆహారం వసతి సౌకర్యాలన్నింటినీ ఉచితంగానే కల్పించేవారు. రోగితో అవసరార్థం ఉండే బంధువులకు కూడా భోజనం, వసతి ఉచితమే.

దుర్బలులయిన ఆదివాసులు పౌష్టికాహార లోపం వల్ల, పురుగు - పుట్రల వల్ల, అసలు ఏది తినవచ్చునో ఏది తినరాదో తెలియనితనం వల్ల, పస్తులు - పడగడుపులవల్ల, ఇతర పెక్కు అజ్ఞాన, అజ్ఞాత కారణాల వల్ల తరచూ జబ్బుపడుతూ వుంటారు. వీటిలో కొన్ని ప్రాణాంతక వ్యాధులు, కొన్ని దీర్ఘవ్యాధులు కూడా ఉంటాయి.

కొందరు సొంత వైద్యం చేసుకుంటారు. కీళ్ళ నొప్పులకు, నడుం నొప్పులకు నులకతాడు-ఆముదం వొత్తితో గురులు పెడతారు. అంటే బాధవున్న చోట గురుచూసి కాలుస్తారు. చీదరపుళ్ళకు పిప్పింటాకు పసరు పూస్తారు. తలనొప్పికి ఇస్కార్ గింజలను కళ్ళలో పెడతారు. వీరు తమ నాటు వైద్యంలో భాగంగా రోగి చూట్టూ చేరి ఢముకులు వాయిస్తారు. పాటలు పాడతారు, సోది చెపుతారు. ఆసుపత్రులకు వెళరు. ఇటువంటి వారిని విజ్ఞానవంతలను చేయడానికి సంఘం కృషి చేసింది.

# తీర్పులు

కుల పంచాయతీలలో తీర్పులు చెప్పడంలో శ్రీ చదల జానకి రామారావు నిష్ణాతులు. ఎంతటి తగాదాను అయినా ఇట్టే సర్దివేస్తారు. ఉదాహరణకు రెండు తీర్పులు చూద్దాము:

నందిగామ మండలం అడవిరావులపాడు గ్రామ కాపురస్తుడు పూనూరి రాములు కుమార్తె వెంకటనరసమ్మ (యానాది కులస్తులు); పెనుగంచిప్రోలు మండలం, పెనుగంచిప్రోలు గ్రామ కాపురస్తుడు శ్రీరాం వెంకటేశ్వర్లు (ఎరుకల కులస్తుడు).

ఈ ఉభయులు సంవత్సర క్రితం ప్రేమించుకుని వివాహం చేసుకున్నారు. వివాహం జరిగిన తరువాత నాలుగు నెలలకు వీరిద్దరి మధ్య మనస్పర్థలు ఏర్పడుతూ వచ్చాయి. సంవత్సరం తరువాత వెంకట నరసమ్మ బాలుని కన్నది. ప్రసవించిన పది రోజులకే, భర్త వెంకటేశ్వర్లు పిల్లవాడిని లాక్కొని భార్యను వెళ్ళగొట్టాడు. నరసమ్మ తరఫువారు నందిగామ వచ్చి, సంఘ సెక్రటరీ గారితో చెప్పుకున్నారు. ఈ సందర్భంగా వెంకట నరసమ్మ తల్లిదండ్రులను తీసుకొని జగ్గయ్యపేట సంఘ కార్యకర్తలు చదల ఆంజనేయులు, అబ్రియానాయక్ పెనుగంచిప్రోలు వెళ్ళి చంటిపిల్లవానిని తల్లికి ఒప్పచెప్పినారు. **18-9-86** వ తేదీ రాత్రి ఎనిమిది గంటలకు, భార్య - భర్తలను (ప్రేమించుకొన్న జంట) పిలిపించి ఉభయుల వాదనలు విన్న తరువాత వెంకటనరసమ్మ తల్లిదండ్రులు పిల్లను భర్త వద్దకు పంపడానికి నిరాకరించినప్పటికి, పిల్లను ఒప్పించి భర్త వద్దకు పంపడమైనది. ఈ పంచాయతి సుమారు మూడు గంటలు పట్టినది.

**28-9-86** వ తేదీన నందిగామలో పెద్దల ఎదుట రాఘవాపురం గ్రామానికి చెందిన వడ్డెర కులస్తులు దుర్గారావు, నందిగామ గ్రామ కాపురస్తులు పల్లెపు గురవమ్మకు గల భార్యా భర్తల తగాదాను విచారించి వారి ఉభయులను కలిపి పంపటమైనది.

రాఘవాపురం సర్పంచ్ జేమ్సుగారు, ఇంకా రాఘవాపురం పెద్దలు; నందిగామ పెద్దలు పల్లెపు అంకాళ్ళు, నరసింహం వగైరా మొత్తం **50** మంది పెద్దలు.

తగాదా స్వభావం: అత్తను అల్లుడు కొట్టడం మూలాన, కుమార్తెను అల్లుని వద్దకు పంపకపోవడం, పోలీసు కేసులు పెట్టుకోవడం. ఈ పంచాయతీ తీర్పు మూడు గంటలు పట్టినది.

# సహాయాలు

నిస్సహాయులకు సహకరించడంలో శ్రీ చదల జానకి రామారావు సర్వకాల సర్వావస్థలలోను సంసిద్ధులుగా వుంటారు. ఇందుకు ఆయనకు ఆధికారిక పదవులు అవసరం లేదు. చొరవ, వ్యక్తిత్వమే ప్రధానం.

పోలంపల్లికి చెందిన శ్రీ పొన్నా ఆదినారాయణ భార్య శ్రీమతి శ్రీదేవికి **1990**లో గుండె ఆపరేషన్ చేయవలసి వచ్చింది. వారు నిరుపేదలు. వారు దిక్కుతోచని స్థితిలో శ్రీ

జానకి రామారావును ఆశ్రయించారు. శ్రీ జానకి రామారావు వెనువెంటనే - ఫిబ్రవరిలో ముఖ్యమంత్రికి ఈ విషయాన్ని నివేదించారు. వారికి ఆర్థిక సహాయాన్ని సమకూరుస్తూ సెప్టెంబరు 20 వ తేదీన ప్రభుత్వం ఉత్తర్వులను జారీచేసింది. ఇట్టివి ఎన్ని సంఘటనలో చెప్పలేము.

## రహదారి కాగితాలు:

శ్రీ చదల జానకి రామారావు ఇచ్చే రహదారి కాగితాలు కూడా చెల్లుబాటు అవుతాయి. ఉదాహరణకు: **1985** ఆగస్టు **23** వ తేదీన నందిగామకు చెందిన పల్లెపు చిన రామస్వామిని కుమారుడు అంకాళ్ళు అనే అతను పాడి గేదెను, కుడుపు పెయ్యతోసహా పరిటాలకు చెందిన చిట్లూరి చన్నయ్య కుమారుడు కొన్నాడు. ఈ విషయాన్ని ధృవపరుస్తూ, ఇది యదార్థం అంటూ అమ్మిన - కొన్నవారి సంతకాలు తీసుకుని శ్రీ జానకి రామారావు చేవృత్తరం ఇచ్చారు. ఇక దానికి తిరుగులేదు!

ఇట్లాంటివి ఎన్నో!

## సర్టిఫికెట్లు

రాఘవాపురం శివారు కమ్మవారిపాలెం పౌరుడు శ్రీ పెసరవెల్లి సుందరరావు కుమారుడు జోసఫ్ **1981** ఫిబ్రవరి **22** వ తేదీన సాంఘిక పద్ధతిలో వివాహం చేసుకున్నాడు. ఇతనిది షెడ్యూల్డ్ కేస్ట్. ఉపకులం మాదిగ. మతం హిందు. ఈ విషయాన్ని ధృవీకరిస్తూ శ్రీ జానకి రామారావు **1984** మార్చి ఆరవ తేదీన సర్టిఫికెట్ ఇచ్చారు.

ఈ జోసఫ్‌కే మరల **1984** సెప్టెంబరు ఏడవ తేదీన శ్రీ జానకి రామారావు కుల ధృవీకరణ పత్రాన్ని ఇచ్చారు.

ఇట్టి సర్టిఫికెట్లు మరెన్నో ఇచ్చారు.

## జమా ఖర్చులు

ఇటు పార్టీ సంబంధంగా గాని, అటు సంఘం సంబంధంగా గాని, చివరకు

కుటుంబం విషయంలో సయితం ఎప్పటికప్పుడు జమా ఖర్చులను సరిచూసుకోవడం జానకి రామాయ్యగారికి అలవాటు. ప్రతి రూకకు విధిగా ఓచర్లు, రశీదులు తీసుకుని ఫైల్ చేస్తారు. కొన్ని ఉదాహరణలు:

**1984** ఆగస్టు మూడవ తేదీన శ్రీ జానకి రామారావు తెలుగుదేశం పార్టీ కృష్ణాజిల్లా శాఖ కార్యదర్శిగా ఉత్తరాన్ని టైప్ చేయించారు. ఇందుకు రెండున్నర ఖర్చయింది. ఈ మేరకు జాబ్- టైపిస్టు శ్రీ సి హెచ్. వెంకటేశ్వరరావు నుంచి రిసీప్ట్ తీసుకొని భద్రపరచారు. మరొక సందర్భంలో మూడు రూపాయలయాయి. ఇందుకు సూర్య టైప్ ఇన్స్టిట్యూట్ ప్రొప్రయిటరు శ్రీ హెచ్.ఎస్. ప్రకాశరావు నుంచి **1984** ఆగస్టు **24** వ తేదీన రిసీప్ట్ తీసుకున్నారు. మరొక సందర్భంలో ఇరవై రూపాయలు అయ్యాయి. ఇందుకు శ్రీవాణీ శ్రీనివాస టైప్ అండ్ ఎడ్యుకేషనల్ ఇన్స్టిట్యూట్ ప్రిన్సిపాల్ శ్రీ కృష్ణమూర్తి నుంచి కేష్ బిల్ తీసుకుని ఫైల్ చేశారు. పార్టీ సెక్రటరీగా లెటర్ పేడ్‌ను అచ్చువేయించారు. ఇందుకుగాను శ్రీ వెంకటేశ్వర ఆర్ట్‌ప్రెస్ నుంచి తీసుకున్న పాతిక రూపాయల బిల్లు నేటికీ వుంది. పేడ్ ఎప్పుడో అయిపోయింది!

## అనుదినం...

చదల జానకి రామారావు గారికి డైరీ వ్రాసే అలవాటు మొదటినుంచీ వుంది. అనుదిన చర్య అందులో లిఖితమై వుంటుంది. నిన్న జరిగింది, నేడు జరుగుతున్నది, రేపు జరగనున్నదీ తెలుపుతూ ఆ డైరీ ఆయనకు గైడ్‌గా ఉపకరిస్తుంది. ఉదాహరణకు:

**29.12.1992:** అక్షర ఉద్యమంలో పాల్గొనడమైనది.

**3.1.1993 - 4.1.1993:** పెంచిన ఆర్.టి.సి. బస్సు చార్జీలకు వ్యతిరేకంగా మధ్యాహ్నం**1.00**నుండి **2.00** గంటల వరకు అన్ని మిత్ర పక్షాలతో కూడిన కార్యకర్తలు, నియోజకవర్గ ప్రజలు బస్సులను ఘరావ్ చేయడమైనది. నందిగామ మండల రెవిన్యూ ఆఫీసరు గారికి మెమోరాండాన్ని సమర్పించడమైనది. **6.1.1993: 10.00** గంటల నుండి **11.30** గంటల వరకు బస్సు స్టేషను వద్ద ధర్నా చేయబడినది.

**1993** జనవరి నెల నుండి ఫిబ్రవరి నెల వరకు పోస్టు కార్డుల ఉద్యమం. సారా నిషేధించాలని - సంసారాలను కాపాడాలని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారిని, హైదరాబాదుకు సంతకాలు చేయించిన కార్డులు పంపడమైనది. సుమారు రెండు వేల

కార్డులు పంపినారు.

**4.2.1993** నుండి **6.2.1993** వరకు హైదరాబాదు గండిపేటలో జరిగిన పార్టీ సమీక్ష మీటింగుకు హజరైనారు. **17.2.1993:** నందిగామ పట్టణ కమిటీ సమావేశానికి హజరైనారు. **20.2.1993:** హైదరాబాదులో రాష్ట్ర గిరిజన విభాగం సమావేశానికి హజరైనారు. **22.2.1993:** నందిగామ మండల టి.డి.పి. సర్వసభ్య సమావేశం.

విద్యుత్ చార్జీలు పెంచినందులకుగాను **1.12.1992** వ తేదీన ఉదయం **10.00** గంటలకు స్థానిక విద్యుత్ కేంద్రం వద్ద అన్ని మిత్ర పక్షాలతో ధర్నా చేయడమైనది.

**7.12.1992:** నందిగామలో సారా వ్యతిరేకోద్యమ కమిటీ సమావేశాలులో జరిపారు. డిశంబరు ఆఖరు వరకు సారా ఉద్యమంలో పాల్గొన్నారు. హైదరాబాదులో శ్రీ రామోజీరావుగారు ఏర్పరచిన 'ఐక్యవేదిక' కు హజరయ్యారు.

# వెదురు

అన్ని వృత్తుల వారి జీవన విధానాలను సునిశితంగా పరిశీలించడం శ్రీ చదల జానకి రామారావు ప్రవృత్తి. తట్టలు బుట్టలు అల్లుకుని, వాటిని అమ్ముకుని బ్రతికే నిరుపేదలకు వీటికి ముడిసరకు అయిన వెదురు లభించడం దుర్లభం కావడాన్ని ఆయన గమనించారు. వెంటనే ముఖ్యమంత్రికి వినతి పత్రాన్ని సమర్పించారు. అంతటితో ఆగక, నాటి ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావును కలుసుకుని పరిస్థితిని వివరించారు. రామారావుగారు వెంటనే స్పందించి తగు చర్యల నిమిత్తం సంబంధిత అధికారులకు ఆదేశాలను పంపారు. శ్రీ జానకి రామారావు సమర్పించిన వినతి పత్రం పూర్తి పాఠం:

"షెడ్యూల్ జాతులకు చెందిన ఎరుకల ప్రధానవృత్తి తట్టలు, బుట్టలు, బండి జల్లలు వగైరా అల్లుకొని గ్రామాల వైపుగా వెళ్లి రైతులకు, కూలీలకు కావలసినవి అమ్ముకొని వారి కుటుంబాలను పోషించుకొంటూ ఉండేవారు. పూర్వకాలం నుంచి ఈ వృత్తి తప్ప వేరే పనికిపోయేవారు కాదు. ఆ పనులు చేతనూకావు.

చీకటితో లేవడమే ఇంటిల్లపాది వీటిని అల్లుకొని ఒక కుటీర పరిశ్రమగా చెమటోడ్చి పనిచేస్తూవుంటారు. నందిగామ, కంచికచర్ల, వీరులపాడు, ఇబ్రహీంపట్నం, మైలవరం, జి.కొండూరు, ఎ.కొండూరు మండలాలు, తిరువూరు ప్రాంతాలలోను ఎరుక

కులస్తులు ఈ వృత్తిమీద జీవించేవారు షుమారు రెండు వేల మంది వుంటాయి. చాలా సంవత్సరాల నుంచి వీరు గొట్టుముక్కల, అల్లూరు, గంగినేని, కొండపల్లి గుట్టలలో పున్న వెదురు, ఫారెస్టు వారి అనుమతితో చీట్లు వ్రాయించుకొని గట్టుకు వెళ్లి వెదురు వారు మోసుకున్నంత కొట్టుకొని వచ్చి అల్లుకునేవారు.

సొంత పనిగా చేసుకొవడమే వారి ఆశయం. ఇతరుల పనికి పోరు. కాని, ఈ గుట్టలలో వుండే వెదురును రాజమండ్రి పేపరు మిల్లుకు తీసుకున్నందున గత కొన్ని సంవత్సరాల నుంచి వీరికి కొట్టుకొనే పర్మిషన్ లేనందున , వీరి వృత్తి పడిపోయింది. పస్తులతో కాలయాపన చేస్తున్నారు. చాలా మంది ఈ ప్రాంతాల నుంచి ఖమ్మంజిల్లా కల్లూరు వైపు గట్లకు వలసవెళ్లారు. దొంగచాటుగా తెచ్చుకుంటే - వారి కష్టాలు చెప్పనలవికావు. అంటే ఫారెస్టు డిపార్టుమెంటువారు పెట్టేబాధలు అన్నీ ఇన్నీకావు. పొట్టగడవక, తమ బిడ్డలను పోషించే శక్తి లేక, ఇతర పనులు చేతకాక, పొట్టకోసం దొంగతనంగా గట్టుకు పోయి వెదురు తెచ్చుకొని అల్లుకొనేవారు.

మరికొంతమంది ఏనాడూ పనిచేయని కూలికో, రిక్షాకో; స్త్రీలు వున్నవారి ఇండ్లలో అంట్లు, పాచిపని చేసో, దినదిన గండంగా బ్రతుకుతున్నారు. తిండి లేనందున బలహీనులు కావడం, రోగాలు రావడం జరుగుతున్నది.

సుఖంగా తోటిమానవుని వలె బ్రతకాలని కోరిక వున్నా వృత్తి పడిపోయినందున. ఈ కుటుంబాలే క్షీణించిపోతున్నాయి.

ఈ గ్రామాలలో నేను పర్యటించాను. వారి ఆవేదన, వారి కుటుంబ పరిస్థితులు తెలియపరుస్తుంటే ఎంత కఠినునికైనా దుఃఖం రాకమానదు.

అందువల్ల ఈ జాతిని రక్షించేందుకు ఫారెస్టు డిపార్టుమెంటు వారి అనుమతితో వెదురు కొట్టుకునే పరిస్థితి కల్పించమని విజ్ఞప్తి చేస్తున్నాను.

ప్రయివేటు డిపోలలో వెదురు కొనాలంటే అధిక ధరలతో కొని జీవించలేమని ఈ వృత్తిదారులు అంటున్నారు.

కనుక, ప్రభుత్వం వారు వెంటనే కలుగచేసుకొని, యుద్ధప్రాతిపదికన, ప్రభుత్వమే నేరుగా కంచికచర్ల, కొండపల్లి, మైలవరం, తిరువూరులో వెదురు డిపోలు ఏర్పరచి నామినల్ రేటుతో వీరికి ఇవ్వవలసినదిగా కోరుతున్నాను.''

# రెండు ఉత్తరాలు

శ్రీ చదల జానకి రామారావుగారు ఎన్నో రకాలుగా వేలాది మందికి వ్యక్తిగతంగా కూడా సహకరించారు. సహజంగా కొందరు చేసిన మేలును మరచిపోవడం కద్దు. కొందరు ఆజన్మాంతం గుర్తుంచుకుంటూ ఆ మేరకు తరచు ఉత్తరాలు వ్రాస్తూవుంటారు. అటువంటి ఉత్తరాలు జానకి రామారావుగారి ఫైళ్ళలో దొంతర దొంతర్లుగా వున్నాయి. ఉదాహరణకు రెండు:

కరీంనగర్ జిల్లా ముషీరాబాద్ తాలూకా కేశవపట్టణం నుంచి ఆంధ్ర బ్యాంక్ క్లర్క్ శ్రీ వై. రామారావు **1984** జూలై **27** వ తేదీన వ్రాసిన ఉత్తరం:

"పూజ్యనీయులైన మేనేజరు గారికి, మేనేజరమ్మ గారికి వై. రామారావు వ్రాయుట. ఇచ్చట నేను క్షేమం. మీరు క్షేమంగా వుండగలందులకు కృపగల దేవుని ప్రార్థించుచున్నాను. ముఖ్యంగా వ్రాయుట: మీ దయవల్ల నేను ఒక ఉద్యోగిని అయినాను. మీ మేలు ఈ జన్మకు మరువను. మీరు మా కుటుంబానికి చేసిన సహాయం మేము జన్మజన్మలకు మరువం. మీకు లెటరు వ్రాయుట ఆలస్యం అయినందుకు క్షమించగలరు. నాకు మంచి బ్రాంచీ ఇచ్చినారు. మా మేనేజరు గారు చాలా మంచివారు. ఇచ్చట మన ఎస్. టి. వాళ్ళం ముగ్గురం వున్నాము. మీ గురించి మన వాళ్ళకు రోజూ చెపుతుంటాను. ఇచ్చట మన వారినందరిని అడిగినట్లు చెప్పగలరు."

మరొక ఉత్తరం హైదరాబాద్ నుంచి ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్సియల్ కార్పొరేషన్ ...లప్‌మెంట్ ఆఫీసరు శ్రీ పి. జయనాథ్ వ్రాసినది తేది : **1984** ఆగస్టు **27**.

"శ్రీయుతులు గౌరవనీయులైన జానకి రామయ్యగారికి నమస్కారములు. నేను కంచికచర్ల లాజరస్ మాష్టర్‌గారి (హాస్టల్ మేనేజరు) రెండవ అబ్బాయిని. గతంలో చాలాసార్లు కలుసుకున్నాము. చాలాకాలం అయింది గనుక మీరు మరచిపోయివుంటారు. మీరు మా కుటుంబానికి చేసిన సేవలనే మేము గుర్తుచేసుకుంటూఉంటాము. మా అన్నయ్య మీ హస్టల్ లోనే వుండి చదువుకున్నారు. మీ ఆశీస్సులతోనే ఉద్యోగం చేస్తున్నాడు! మా హాస్టల్ విషయంలో కూడా మాకు మీరెంతో సహాయం చేశారు. నేను ఢిల్లీలో ఉన్నపుడు కూడా మీకు ఉత్తరం వ్రాసాను. మీరు చేసిన సహాయాన్ని జీవితంలో

మరచిపోలేము. ఆ విషయాలనే అప్పుడప్పుడు గుర్తుచేసుకుంటాము. అమ్మ బ్రతికున్న రోజులలో కూడా మీరు చేసిన సహాయాన్ని గుర్తుచేసుకుంటూనేఉన్నాము. మీరు మా తమ్ముడు నిర్మలరావు విషయంలో తీసుకుంటున్న శ్రద్ధకు, సహాయానికి మీకు మా కృతజ్ఞతలు ఏ విధంగా చెప్పుకోవాలో అర్థం కావడంలేదు.

మీరు తీసుకు రమ్మనిన జి. ఓ. విషయం ఇక్కడ తెలుసుకున్నాము. నిన్న వెళ్ళి సచివాలయంలో వెతికించాను. రెండు మూడు రోజులలో ఇస్తామన్నాడు. దయచేసి మా వాడిని జాయిన్‌చేసుకోండి. నేను త్వరలోనే జి. ఓ. పంపుతాను. రాజకీయంగా పరిస్థితులు సక్రమంగా లేనందున ఏ ఎం. ఎల్. ఎ కూడా దొరకటంలేదు. అందుచేత జి. ఓ. లు వెదుకుట ఆలస్యం అవుతున్నది. మీరు మావాడు ఇచ్చిన రిఫరెన్స్ నెంబర్లతో అప్లికేషన్ ఇవ్వవచ్చు. మీరు చేస్తున్న సహాయానికి మరొకసారి కృతజ్ఞతలు. హైదరాబాదులో ఎటువంటి పనులున్నా నాకు వ్రాయండి.''

## సంతాపాలు



తమకు సన్నిహితులు, చిరపరిచితులు అయిన ఏ ఒక్కరు చనిపోయినా శ్రీ జానకి రామారావు పసివానిలా రోదిస్తారు. గుండె బరువుతో స్పందిస్తారు. ఉదహరణకు:

'ప్రముఖ గిరిజన నాయకులు శ్రీ పొన్నా కోటేశ్వరరావు **1999** మార్చి అయిదవ తేదీ ఉదయం **10.30** గంటలకు విజయవాడలో మరణించినందుకు, వారి కుటుంబానికి సంతాపాన్ని తెలియచేస్తున్నాను. ఆయన అర్ధ శతాబ్దం పాటు ఆంధ్రప్రదేశంలోని ఎరుకల, యానాది, లంబాడి కులస్తుల ఆర్థికాభివృద్ధికి విద్యాభివృద్ధికి ఎంతో కృషిచేశారు. బ్రిటిష్ ప్రభుత్వం ఈ జాతులపై పెట్టిన క్రూరాతిక్రూరమైన సి. టి. యాక్టు రద్దుకు, వీరిని షెడ్యూల్ ట్రైబ్స్ లిస్టులో చేర్పించడానికి వారు చేసిన కృషిని మరవలేము. వారు లేని లోటును పూడ్చడం కష్టం. గిరిజనుల కులకట్టుబాట్లు, మూఢాచారాలపై 'కల్లుముంత' బుర్ర కథను వ్రాసి, ఒక దళంగా ఏర్పడి ఆంధ్రప్రదేశ్ అంతటా వైజ్ఞానిక కార్యక్రమాలద్వారా గిరిజనులను చైతన్యపరచిన వారిలో వారు మొదటివారు. వారికి ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్

సంఘం జోహర్లు అర్పిస్తున్నది.'

ఇట్లాగే శ్రీయుతులు హొన్నా సత్యనారాయణ, రామేశ్వరం నాగయ్యా, దేవరకొండ హనుమంతరావు, తిరువీధుల సాంబయ్యా, పోట్లూరి లక్ష్మీనారాయణ, మోపూరి రమణయ్యా తదితరులు చనిపోయినప్పుడు కూడా ఆయన ఉద్విగ్న హృదయంతో సంతాపం వ్యక్తం చేశారు.

# పిండ ప్రదానం

**ఆదివాసుల** నెయ్యము, సారథి, సచివుడు పద్మభూషణ్ వెన్నెలకంటి రాఘవయ్య 1981 నవంబరు 24 వ తేదీ రాత్రి తమ 84 వ యేంట నెల్లూరులో స్వగృహంలో కాలధర్మం చెందారు.



మన నెయ్యము మన సారథి మన సచివుడు పద్మభూషణ్ వెన్నెలకంటి రాఘవయ్యా గారు 1981 నవంబరు 24వ తేదీన కాలధర్మం చెందారు. పంతులు గారి అస్తికలను డిసెంబరు 14వ తేదీన భద్రాచలం వద్ద పవిత్ర గోదావరిలో శ్రీ పాలపర్తి వీరయ్యా నిమజ్జనం చేశారు. నాటి క్రతువులో సర్వశ్రీ కాంద్రుగుంట పుల్లయ్యా, చదల జానకీరామారావు, రామావతు లాల్ నాయక్, పొట్లూరి లక్ష్మీనారాయణ, మోపూరు రమణయ్యా, శ్రీమతులు చదల సుశీల, తిరుపతమ్మ కూడా

పంతులుగారి ఆత్మశాంతికోసం సంచార జాతుల పెద్దలు జ్ఞాతులుగా పిండప్రదానం చేయడం చారిత్రక సాహసం. పంతులుగారి అస్థికలను డిశంబరు 14 వ తేదీన ఈ నాయకులు పవిత్ర గోదావరిలో నిమజ్జనం చేశారు. వారిలో సర్వశ్రీ పాలపర్తి వీరయ్యా చదల జానకి రామారావు, రామావతు లాల్ నాయక్, కొంద్రకొండ పుల్లయ్యా, పోట్లూరి

లక్ష్మీనారాయణ, మోపూరి రమణయ్య ఉన్నారు. శ్రీమతి పాలపర్తి తిరుపతమ్మ, శ్రీమతి చదల సుశీల కూడా పుణ్యస్థానాలాచరించారు.

## మిత్ర పక్షాల మానవ హారం



**1993** జనవరి **26** రిపబ్లిక్ డే సందర్భంగా నందిగామ గాంధీ విగ్రహం వద్ద మిత్రపక్షాల ఆధ్వర్యాన సభ జరిగింది. శ్రీ చదల జానకి రామారావు అధ్యక్షత వహించారు. సి.పి.ఐ. నాయకులు శ్రీ రవీంద్రబాబు జాతీయ పతాకను ఎగురవేశారు. డాక్టరు అంబేద్కరు విగ్రహానికి శ్రీ యర్రంరెడ్డి రామకృష్ణమూర్తి, మహాత్మ గాంధీ విగ్రహానికి సి.పి.ఎం. నాయకులు శ్రీ బాణాల సత్యనారాయణ పూలమాలలు వేశారు. దేశ సమైక్యతను, మత సామరస్యాన్ని కాపాడుదామని ప్రజల చేత ప్రతిజ్ఞ చేయించారు. వందలాది ప్రజలతో గాంధీ సెంటరులో మానవహారం జరిగింది. తదనంతరం గొప్ప ప్రదర్శన చేశారు. కార్యక్రమంలో అన్ని పాఠశాలల నుంచి విద్యార్థినీ విద్యార్థులు పాల్గొన్నారు.

## సారా వ్యతిరేకోద్యమం



సారావ్యతిరేకోద్యమం సందర్భంగా ఒకానొక సభలో ప్రధాన వక్తగా శ్రీ చదల

శ్రీ చదల జానకి రామారావుగారు నడిపిన ఉద్యమాలలో సారా వ్యతిరేకోద్యమం ప్రధానమైనది. గ్రామ, పట్టణ, మండల, నియోజకవర్గ, జిల్లా, రాష్ట్ర స్థాయిలలోని మద్యనిషేధ, సారా వ్యతిరేక ఉద్యమంలలో వివిధ హోదాలలో చాలా చురుగ్గా

పాల్గొన్నారు. ఈ పోరాటాలలో ఆయన ఎన్నో కష్ట నష్టాలను కూడా ఎదుర్కొన్నారు. అయినా, ఉద్యమాల నిర్వహణలో రాటుదేలిన ఆయన ఈ ఉద్యమంలు ఫలప్రదం అయేంత వరకు వెనుకంజ వేయలేదు. సహ కార్యదర్శిగా శ్రీ తోట వెంకటేశ్వరరావు, శ్రీ శ్రీరామ ప్రభృతులు వీరికి సహకరించారు.

నందిగామ నియోజకవర్గ సారా వ్యతిరేకోద్యమ సమన్వయ కమిటీవారు ఈ ఉద్యమం ఎక్కువ సంఖ్యలో గిరిజనులను ప్రవేశపెట్టారు.

**1992** అక్టోబరు రెండవ తేదీ గాంధీ జయంతి రోజున నందిగామ న్యూకాలనీలో పరిసర ప్రాంతాల గిరిజనుల సమావేశాలు జరిపి, వారి చేత 'సారా తాగం' అని ప్రతిజ్ఞ చేయించారు. ఈ కార్యక్రమానికి సుమారు రెండు వందల మంది గిరిజనులు హాజరయ్యారు. **23, 26, 29**; నవంబరు ఎనిమిదవ తేదీలలో నందిగామలో సారా వ్యతిరేక సమావేశాలు ఏర్పాటు చేసి, సారా గోడౌన్ల వద్ద ధర్నా చేశారు.

నవంబరు తొమ్మిదవ తేదీన ప్రజా ప్రదర్శనగా వెళ్ళి మండల రెవిన్యూ ఆఫీసరుకు మెమొరాండం ఇచ్చారు. గిరిజనులు ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు. **12** న నందిగామలో రాస్తారోఖో నిర్వహించారు. **14** న మౌన ప్రదర్శనను నిర్వహించారు. **18** న సారా గోడౌన్ల వద్ద ధర్నా చేశారు. **23** న నందిగామ సారా వ్యతిరేకోద్యోమ కమిటీ సమావేశాన్ని ిర్వహించారు. **26** న మానవ హారం నిర్వహించారు. **30** వ తేదీన ఉదయం ఎనిమిది నుంచి రాత్రి ఎనిమిది గంటల వరకు నందిగామ గాంధీ విగ్రహం వద్ద సారా వ్యతిరేక సామూహిక నిరాహార దీక్షలు చేశారు.

ఉద్యమ ఉపాధ్యక్షులుగా శ్రీచదల జానకి రామారావు మాట్లాడుతూ, ఒక కట్టుదిట్టమైన ప్రత్యేక యంత్రాంగాన్ని ప్రభుత్వం ఏర్పాటు చేసి, నీతి కలిగిన ఉద్యోగస్తుల్ని ఎన్నిక చేసి, వారికి సర్వసత్తాక అధికారాలిచ్చి, రాజకీయ పెద్దల సిఫార్సులు లక్ష్యపెట్టకుండా ఉండేలా చూసి, ఇందులో ఉద్యమకారులతో కూడిన ప్రచార కమిటీల సహకారం తీసుకుంటుండాలని అన్నారు. అంతేగాక రేడియో, టి.వి.ల ద్వారా నిషేధం ించి ప్రచారం చేస్తూ గ్రామగ్రామన గ్రూపు మీటింగ్‌లు ఏర్పాటు చేసి మహిళలను ఈ చారంలో ముందు భాగాన ఉంచాలి అని; నాటికలు, పాటలతో కూడిన ప్రదర్శనను ఒక కుటుంబం ఇతివృత్తంగా తీసుకొని సారా వలన జరిగే నష్టాలను వివరించాలని, అంతేగాక ప్రభుత్వ ప్రచార కమిటీలలో మద్యం ముట్టనివారికి, కుల, వర్గ, వయోభేదం

లేకుండా విద్యావేత్తలకు, రిటైర్డు ఉపాధ్యాయులకు, కళాకారులకు అవకాశం కల్పించి, వీరికి నిషేదం అమలుకు మెజిస్టీరియల్ అధికారాలిచ్చి, వాహన సౌకర్యం సమకూర్చాలని, అప్పుడే ఈ నిషేధం విజయవంతమవుతుందని అన్నారు.



## నారీమణుల విజృంభణ !

సారా అమ్మకాలను నిషేధించాలని డిమాండు చేస్తూ నందిగామలో మహిళలు సారా గిడ్డంగులపై దాడిచేసి దాదాపు వెయ్యి సారా ప్యాకెట్లను దగ్ధం చేశారు. నందిగామలో సారా వ్యతిరేక ఉద్యమం ప్రారంభం అయిన తొలిరోజునే అన్ని వర్గాలకు చెందిన వందలాదిమంది మహిళలు నినాదాలు చేస్తూ పట్టణ వీధుల్లో ప్రదర్శన జరిపారు. విద్యార్థి, యువజన, వివిధ రాజకీయ పక్షాల కార్యకర్తలు వారికి అండగా ఉద్యమంలో పాలుపంచుకున్నారు. తొలుత అన్ని పక్షాలకు చెందిన కార్యకర్తలు, మహిళలు ప్రదర్శనగా వెళ్ళి స్థానిక రైతుపేటలో గల సారా గిడ్డంగిపై దాడిచేసి గిడ్డంగి లోపల ట్రేలలో ఉన్న సారా పొట్లాలను వెలుపలకు తెచ్చి నిప్పంటించారు. అనంతరం మహిళలు ప్రదర్శనగా వచ్చి స్థానిక మండల రెవిన్యూ కార్యాలయం ఎదురుగాగల ప్రభుత్వ సారా గిడ్డంగిపై దాడిచేసి సారా ప్యాకెట్లను బైటికి తెచ్చి దగ్ధం చేశారు. తరువాత ఎం. ఆర్. ఓ కార్యాలయం వద్దకు చేరి దాదాపు గంటసేపు ధర్నా చేశారు. 'పేదల జీవితాలను బలితీసుకుంటున్న సారాను నిషేధించండి, సంసారాలను రక్షించండి, ప్రాణాలయినా అర్పిస్తాం - సారా షాపులు మూయిస్తాం' అంటూ నినాదాలు చేశారు. ఉద్యమ కార్యక్రమంలో తెలుగుదేశం, తెలుగు యువత, తెలుగు మహిళ, సి.పి.ఐ; ఎ. ఐ. ఎస్. ఎఫ్; ఎ. ఐ.వై. ఎఫ్; సి.పి.ఐ మహిళా సమాఖ్య, సి.పి.ఎం, సి.పి.ఎం మహిళా సమాఖ్య, నందిగామ వాసవ్య మహిళామండలి, కాంగ్రెస్ పార్టీకి చెందిన మహిళా సంఘాల కార్యకర్తలు కూడా పాల్గొన్నారు.

ఈ సందర్భంగా మధ్యాహ్నం జరిగిన సభలో తెలుగుదేశంపార్టీ గిరిజన విభాగం జిల్లా అధ్యక్షులు శ్రీ చదల జానకి రామారావు, ఎ.ఐ.ఎస్.ఎఫ్ రాష్ట్ర అధ్యక్షులు శ్రీకందిమళ్ల రవీంద్రబాబు, చందర్లపాడు పాల ఉత్పత్తిదారుల మహిళా సొసైటీ అధ్యక్షులు, సి.పి.ఎం. డివిజన్ కార్యదర్శి శ్రీమతి యార్లగడ్డ జోయ, కాంగ్రెస్ పార్టీ మహిళా విభాగం స్థానిక నాయకులు పాల పద్మ మాట్లాడుతూ రాజకీయ విభేదాలు విస్మరించి సారా నిషేధ

ఉద్యమానికి అందరూ కలసికట్టుగా కదలి రావాలని పిలుపునిచ్చారు.

ఈ కార్యక్రమానికి వక్తలతోపాటు జిల్లా తెలుగుయువత ఉపాధ్యక్షులు వడ్డెల్లి సాంబశివరావు, ఎ.ఐ.ఎస్.ఎఫ్. జిల్లా ప్రధాన కార్యదర్శి యానాల శ్రీనివాసరావు, ఎ.ఐ.వై.ఎఫ్. జిల్లా అధ్యక్షులు జరబన నాగేశ్వరరావు, సి.పి.ఐ. పట్టణ కార్యదర్శి యండ్రవల్లి శ్రీనివాసరావు, తెలుగు విద్యార్థి నాయకులు చిరుమామిళ్ల శ్రీనివాసరావు, సి.పి.ఐ. మండల నాయకులు ఎం.ఎస్.ఆర్. ఆచారి, కొండూరు సర్పంచ్ తోట వెంకటేశ్వరరావు, తెలుగు మహిళ జిల్లా ఉపాధ్యాక్షులు యండ్రవల్లి బాలసరస్వతి, సి.పి.ఐ. జిల్లా మహిళా సమాఖ్య నాయకులు సామినేని సైదేశ్వరి, పంచాయతి మహిళా సభ్యులు చావా నాగ సూర్యమణి, వాసిరెడ్డి బేబి సరోజిని, స్థానిక వాసవ్య మహిళా మండలి నాయకులు నూతక్కి జయమ్మ తదితరులు నాయకత్వం వహించారు.

# వీరులపాడులో ప్రదర్శన

సారా వ్యతిరేక సమన్వయ కమిటీ ఆధ్వర్యంలో సారాకు వ్యతిరేకంగా వీరులపాడులో పెద్దప్రదర్శన జరిగింది. సారా పాటలను రద్దు చేయాలని, సారా అమ్మవద్దని, మద్యపాన నిషేధం అమలుపరచాలని, సారా రద్దు చేసి, నిర్బంధ విద్యావిధానం అమలుపరచాలని ప్రదర్శన అనంతరం మండల రెవిన్యూ అధికారికి ఇచ్చిన మహజరులో పేర్కొన్నారు.

# చీప్‌లిక్కర్

జిల్లాలలో కొత్తగా బ్రాందీ షాపులకు ఇచ్చిన లైసెన్సులను రద్దు చేయాలని, కొత్తగా లైసెన్సులు మంజూరు చేయరాదని డిమాండ్ చేస్తూ అన్ని మండల కార్యాలయాల ఎదుట ధర్నాలు నిర్వహించాలని కృష్ణాజిల్లా సారా వ్యతిరేక పోరాట సమితి తీర్మానించింది.

ఉయ్యూరు సి.ఐ.టి.యు. కార్యాలయంలో జిల్లా కమిటీ సమావేశం అధ్యక్షులు శ్రీ వై.వి.బి. రాజేంద్ర ప్రసాద్ అధ్యక్షతన జరిగింది. చీప్‌లిక్కర్‌ను నిషేధించాలని కోరుతూ అన్ని మండల కేంద్రాల్లో బహిరంగ సభలు నిర్వహించాలని సమావేశం నిర్ణయం తీసుకున్నది. ధర్నాలు, బహిరంగ సభలు జరుగుతాయని శ్రీ ప్రసాద్ తెలిపారు.

ఈ కార్యక్రమాలకు ఎక్కువ సంఖ్యలో మహిళలు, యువత చేయూతనిచ్చి సంపూర్ణ మద్యపాన నిషేధానికి పూర్తి మద్దతు తెలియజేయాలని కోరారు. 'మా గ్రామానికి బ్రాందీషాపు వద్దు' అని సర్పంచులు తీర్మానాలు చేయాలని సమావేశం కోరింది. అనధికారంగా గ్రామాల్లో అమ్ముడవుతున్న చీప్‌లిక్కరు, దొంగసారా, కాపుసారాలను యువతరం, మహిళలు ధైర్యంగా ఎదుర్కోవాలని కోరింది. నిబంధనలకు నీళ్ళొదిలి అవినీతికి ఎక్సైజ్‌శాఖ ప్రతిరూపంగా తయారయ్యిందని సమావేశం ఆరోపించింది. సమావేశంలో సమితి ఉపాధ్యక్షులు శ్రీ చదల జానకి రామారావు, సహాయ కార్యదర్శులు శ్రీ తోట వెంకటేశ్వరరావు, శ్రీమతి బోన్ వెంకాయమ్మ, కార్యవర్గ సభ్యులు మల్లాది మాణిక్యం, పటమట కృష్ణకుమారి ప్రసంగించారు.

# మద్యపాన నిషేధ ప్రచార శిబిరం

**భారతీయ** ఆదిమ జాతి సేవక్ సంఘ్ ఆధ్వర్యాన ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ నిర్వహణలో తాలుకాస్థాయి మద్యపాన నిషేధ ప్రచార శిబిరం గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా నల్లమోతువారిపాలెంలో **1984** మార్చి మూడు, నాలుగవ తేదీలలో జరిగింది.



**1993** నవంబరు ఒకటవ తేదీన నందిగామ నియోజక వర్గ సారా వ్యతిరేకోద్యమ సమన్వయ కమిటీ ఆధ్వర్యాన సాయంత్రం నందిగామ న్యూకాలని, గిరిజన కాలని, బి.సి. కాలనీలలో సారా, బ్రాంది, కల్లు త్రాగ వద్దని ఏబది మంది పురుషులు మహిళలతో ఇంటింటికి తిరిగి ప్రజలతో ప్రమాణం చేయించారు.

ఈ ప్రచార కమిటీలో పాల్గొన్నవారు: సర్వశ్రీ చదల జనకి రామారావు, వడ్డెల్లి సాంబశివ రావు, తోట వెంకటేశ్వరరావు, మనబోతుల శ్రీరాము, చావ నాగ సూర్యనారాయణ, శ్రీ పోట్లూరి సామ్రాజ్యం, శ్రీ కొజ్జా వెంకట రమణ ప్రభృతులు.

**1994** ఆగస్టు **15**వ తేదీ ఉదయం కృష్ణాజిల్లా మద్య వ్యతిరేక పోరాట సమితి

ఆధ్వార్యాన నందిగామలో న్యూకాలనీ నుంచి రెండు వందల మంది మహిళలు, పురుషులు ఊరేగింపు జరిపారు. మద్యాన్ని సంపూర్ణంగా నిషేధించాలని, చీప్ లిక్కరును ఎత్తివేయాలని, బ్రాందీ షాపులను మూసివేయాలని, దొంగ సారాను, కాపు సారాను అరికట్టాలని వీరు నినాదాలు చేశారు. గాంధీ విగ్రహం వద్ద బహిరంగ సభ జరిగినది.

**1993** జనవరి ఒకటవ తేదీన మద్యపాన వ్యతిరేక పోరాట సంవత్సరంగా నందిగామ గాంధీ సెంటరులో నందిగామ మండల ప్రజా పరిషత్ మాజీ అధ్యక్షులు శ్రీయర్రంరెడ్డి రామకృష్ణ అధ్యక్షతన సభ జరిగినది. మద్యపాన వ్యతిరేక పోరాట జండాను కృష్ణాజిల్లా సారా వ్యతిరేక పోరాట కమిటీ వైస్- ప్రెసిడెంటు శ్రీ చదల జానకి రామారావు ఎగుర వేశారు. రాష్ట్రంలో సారానువెంటనే నిషేధించాలని, లేకుంటే ఈ ఉద్యమాన్ని ఇంకా ఉధృతం చేస్తామని ఆయన చెప్పారు.

# గ్రామ కమిటీలు

జనవరి **29** వ తేదీన విజయవాడలో జరగనున్న సారా వ్యతిరేక పోరాట సమితి నాలుగవ మహాసభకు పెద్దఎత్తున ప్రజలను సమీకరిస్తున్నట్లు సమితి జిల్లా ఉపాధ్యక్షులు శ్రీ చదల జానకి రామారావు, జిల్లా కార్యవర్గ సభ్యులు శ్రీ తోట వెంకటేశ్వరరావు తెలిపారు. మహాసభలను పురస్కరించుకుని నియోజకవర్గంలో పర్యటిస్తూ అన్ని తెగలకు చెందిన బలహీనవర్గాల ప్రజలను కలసి ప్రచారం నిర్వహిస్తున్నట్లు వారు వివరించారు. సారా నిషేధం వల్ల అనేక ప్రాంతాలలో తగాదాలు తగ్గి శాంతి వెల్లివిరుస్తున్నట్లు వివరించారు.

చాలాచోట్ల చీప్‌లిక్కర్ సమస్య ఉందని, దీనిని ప్రజలే సమయస్ఫూర్తితో వ్యవహరించి నిరోధించాలని శ్రీ చదల పిలుపునిచ్చారు. చీప్‌లిక్కర్‌ను నివారించడానికి సమితి కార్యకర్తలతో నిఘా ఏర్పాటు చేయడంతోపాటు గ్రామగ్రామాన కమిటీలను ఏర్పాట్లు చేస్తున్నట్లు వెల్లడించారు. ఎక్కడికి వెళ్లినా పేద, మధ్యతరగతి ప్రజానీకం సంపూర్ణ మద్యనిషేధాన్ని కోరుతున్నారని పేర్కొన్నారు.

**1994** సెప్టెంబరు **24** వ తేదీన 'ఛలో హైదరాబాద్ ' పేర సంపూర్ణ మద్యనిషేధానికై ఉద్యమించారు. ఇందుకు ప్రోత్సాహంగా కృష్ణాజిల్లా మద్యనిషేధ మహిళా ఐక్యవేదిక, కృష్ణాజిల్లా మద్యవ్యతిరేక పోరాట సమితి ఆధ్వర్యాన ఆ సభకు ముందు, తరువాత కూడా భారీ కార్యక్రమాలను నిర్వహించారు.

సెప్టెంబరు 15 వ తేదీన విజయవాడ భారత మహిళా మండలి భవనంలో జిల్లా సదస్సును నిర్వహించారు. 16 నుంచి 23 వ తేదీ వరకు మద్యనిషేధ జిల్లా ర్యాలీను నిర్వహించారు. అక్టోబరు రెండున మద్యానికి వ్యతిరేకంగా గ్రామాలలో ప్రతిజ్ఞా కార్యక్రమాన్ని నిర్వహించారు. అయిదవ తేదీన బ్రాందీ షాపుల ముందు పికెటింగ్లు చేశారు.

## ప్రతిజ్ఞ

'ఈనాడు' చీఫ్ ఎడిటరు శ్రీ రామోజీరావు, మద్యపాన వ్యతిరేకోద్యమ 'ఐక్య వేదిక' సమష్టి కార్యాచరణకు 1992 డిశంబరు 12 వ తేదీన ఉద్యమించారు. హైదరాబాదు శ్రీనగర్ కాలనీ శ్రీ సత్యసాయి నిగమాగమంలో జరిగిన నాటి కార్యక్రమానికి శ్రీ చదల జానకి రామారావు తమ సహచరులతో సహా కదలి వెళ్ళి ఉద్యమంలో పాలు పంచుకున్నారు. అప్పటి ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ కృష్ణకాంత్ ముఖ్యఅతిథిగా పాల్గొని సదస్యుల చేత మద్యరహిత సమాజం కోసం ప్రతిజ్ఞ చేయించారు. ఆ ప్రతిజ్ఞ ఇలా ఉన్నది:

"ప్రజా జీవనం సుఖ సంతోషాలతో వర్ధిల్లాలని కోరుకొంటున్న నేను, ఒంటినీ ఇంటినీ గుల్లచేస్తూ, సమాజాన్ని నిస్సారం చేస్తున్న మద్యం తదితర మత్తుపదార్థాలను ఏనాడూ సేవించనని నా జననిపైన, జన్మభూమిపైన ప్రమాణం చేస్తున్నాను. ఈ వ్యసనానికి బానిసలైన సోదరీ సోదరులను సన్మార్గంలోకి మళ్ళిస్తానని మద్యరహిత సమాజంకోసం కృషి చేస్తాననీ ఆత్మసాక్షిగా ప్రతిజ్ఞ చేస్తున్నాను."

## మద్యనిషేధం కోరుతూ మహిళల ధర్నా

**1994** ఆగస్టు 16 న రెడ్డిగూడెంలో సంపూర్ణ మద్యనిషేధం అమలుచేయాలని డిమాండుచేస్తూ ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కూలీల (మహిళా) సమాఖ్య, 'ప్రజాశక్తి' విద్యా సంఘాల ఆధ్వర్యాన మండల రెవిన్యూ కార్యాలయం ముందు మహిళలు ధర్నా నిర్వహించారు. తొలుత సంపూర్ణ మద్యనిషేధాన్ని కోరుతూ 500 మంది మహిళలు రెడ్డిగూడెం, రాఘవాపురం, కొత్తరెడ్డిగూడెం పురవీధులలో పలు నినాదాలతో ప్రదర్శన జరిపారు. అనంతరం రెడ్డిగూడెం ఎమ్మార్వో శ్రీ ఎస్. వి. ఆర్. నాగభూషణరావుకు వారు వినతిపత్రాన్ని అందజేశారు.

ధర్నాలో పాల్గొన్న మహిళలను ఉద్దేశించి ప్రజాశక్తి విద్యాసంఘం మండల ఆర్గనైజరు శ్రీ దాసు మాట్లాడుతూ, సారా నిషేధం అమలుచేసిన రాష్ట్ర ప్రభుత్వం చీప్‌లిక్కర్‌ను విరివిగా గ్రామాల్లో ప్రవేశపెట్టి పేదల బతుకులను బలిగొంటున్నదన్నారు.

కృష్ణాజిల్లా మద్యవ్యతిరేక పోరాట సమితి ఉపాధ్యక్షులు శ్రీ చదల జానకిరామారావు మాట్లాడుతూ సారా ఉద్యమాన్ని విజయవంతంచేసిన మహిళలే ఈ సంపూర్ణ మద్యనిషేధం అమలుకు కృషిచేయాలని కోరారు. ఈ ఉద్యమంలో ప్రతి ఒక్క మహిళ తమవంతు సహాయాన్నందించాలని కోరారు. మహిళలు తలచుకుంటే సాధించలేనిదేమీ లేదన్నారు. అందుకు ప్రతి ఒక్కరు నడుం బిగించాలని కోరారు.

ప్రజాశక్తి విద్యాసంఘం ఎగ్జిక్యూటివ్ డైరక్టరు మోరిస్ థెరిసా మాట్లాడుతూ మద్య నిషేధాన్ని అమలుచేయకపోతే ఉద్యమాలు నిర్వహించక తప్పదన్నారు. కార్యక్రమంలో అరుంధతి మహిళామండలి నాయకులు చిన్నమ్మాయి, ఆదిలక్ష్మి, ప్రజాశక్తి విద్యాసంఘం ఆర్గనైజరు సుశీల, విస్సన్నపేట ఆర్గనైజరు రావుల దావీదు, తెలుగుదేశం నాయకులు తోట వెంకటేశ్వరరావు పాల్గొన్నారు.

# కమిటీ విస్తరణ

కృష్ణాజిల్లా నందిగామ నియోజకవర్గ సారా వ్యతిరేకోద్యమ సమన్వయ కమిటీ సమావేశం కన్వీనరు శ్రీ చదల జానకి రామారావు అధ్యక్షతన 1993 జనవరి 19 వ తేదీన నందిగామ న్యూకాలనీలో జరిగింది.

కృష్ణాజిలా నందిగామ నియోజకవర్గ సారా వ్యతిరేకోద్యమ కమిటీ ఇంకా సమర్థవంతంగా పనిచేడానికి వీరులపాడు మండలంలో సి.పి.ఎం. నుంచి జిల్లా మహిళా మండలి కార్యవర్గ సభ్యులు శ్రీమతి చావా తులిశమ్మను, తెలుగు మహిళ అధ్యక్షులు శ్రీమతి పుల్లమ్మను, మండల తెలుగుదేశంపార్టీ ప్రెసిడెంటు, కార్యదర్శి, శ్రీ దగ్గుల కేశవరెడ్డి, శ్రీ మధుసూదనరావుగార్లను, సి.పి.ఐ. నుంచి ఒకరిని; కంచికచర్ల మండలం సి.పి.ఎం. నుంచి జిల్లా మహిళామండలి సభ్యులు శ్రీమతి బసవకుమారిని, తెలుగు మహిళ ప్రెసిడెంటు శ్రీమతి విజయలక్ష్మిని, సి.పి.ఐ. నుంచి ఒకరిని, కంచికచర్ల మండల టి.డి.పి. ప్రెసిడెంటు శ్రీ గోనెల నాగయ్య, కార్యదర్శి శ్రీ అర్లప్పగార్లను, మండల మాజీ టి.డి.పి. అధ్యక్షులు

శ్రీ బండారుపల్లి రామచంద్రరావును, చందర్లపాడు మండల టి.డి.పి. అధ్యక్షులు శ్రీ యార్లగడ్డ రామనరసింహం మండల ప్రజా పరిషత్తు మాజీ అధ్యక్షులు శ్రీ దాసరి ప్రసాద్‌రావు గార్లను కమిటీలో చేర్చుకుంటూ వీరు తీర్మానించారు.

## కృతజ్ఞతలు

కృష్ణాజిల్లా సారా వ్యతిరేక పోరాట సమితి ఉపాధ్యక్షులు శ్రీ చదల జానకి రామారావు 1993 ఏప్రిల్ 16 వ తేదీన ఒక ప్రకటన చేస్తూ, ప్రభుత్వం సారాను నిషేధించడం ప్రజాందోళన ఫలితమేనని వ్యాఖ్యానించారు.

ఆంధ్రప్రదేశ్‌లో మహిళా సంఘాలు, వివిధ రాజకీయ పార్టీల నాయకులు, కార్యకర్తలు, వివిధ సేవా సంస్థలు నిర్విరామంగా, ప్రభుత్వం సారా కాంట్రాక్టర్లు ఎన్ని అవరోధాలు కల్పించినా, మహిళలు చేసిన ఉద్యమ ధాటికి తట్టుకోలేక ప్రభుత్వం దిగివచ్చి కొంతవరకైనా సారాను నిషేధించడం జరిగిందని, అందుకు సంతోషమే అని పేర్కొన్నారు.

అయితే, ఇది కంటి తుడుపుగా చేసిన పనిమాత్రమేనని, ఇంత మాత్రాన సారా మహిళా ఉద్యమాలు ఆగిపోవని, మొత్తంగా అన్ని జిల్లాలలో ఒకే దఫా సారాను నిషేధించాలని, అప్పుడే ప్రభుత్వం చిత్తశుద్ధి కనపడుతుందని ఆయన తెలుపుతూ, ఈ మహత్తర సారా నిషేధ పోరాటంలో పాల్గొన్న యావన్మంది ప్రజలకు జేజేలు పలికారు.

## అప్రమత్తత

శ్రీచదల జానకి రామారావు 1995 ఫిబ్రవరి నాలుగవ తేదీన మరొక ప్రకటన చేస్తూ, మహిళల పోరాట ఫలితంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జనవరి 17 వ తేదీన సంపూర్ణ మద్యపాన నిషేధం విధించినందుకు హర్షామోదాలను వెల్లడించారు.

మద్యనిషేధం అమలుకు ప్రభుత్వం అన్ని విధాల ప్రయత్నం చేస్తున్నదని, అయితే, ప్రభుత్వ ఎక్సైజ్ డిపార్టుమెంటు సిబ్బంది చిత్తశుద్ధి వుండి, నీతి నిజాయితీలతో వుంటే

మద్యనిషేధం అమలు సునాయాసంగా చేయవచ్చునని ఆయన తెలిపారు.

మద్యపానం వల్ల జరిగే నష్టాలు తెలిసి కూడా అమలు జరపవలసిన వారే సారా కాచే వారి నుంచి అమ్మే వారి నుంచి నెలవారీ ముడుపులు పొందుతుంటే అమలు జరగడం కష్ట సాధ్యమని శ్రీచదల జానకి రామారావు పేర్కొన్నారు.

# మద్య నిషేధ ఉద్యమం

**అసలు** 'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్' ప్రచార ఘట్టం అయిదు దశాబ్దాల క్రితం మద్యపాన వ్యతిరేక 'కల్లుముంత' బుర్ర కథలతోనే ప్రారంభమైంది. తదాది ఉధృతంగా ఆందోళన చేస్తూనేవస్తున్నారు. ఈ ప్రచారంలో భాగంగా 1980 మార్చి 16,17,18 వ తేదీలలో నందిగామలో జరిగిన మద్యపాన వ్యతిరేక సదస్సు అప్పటిలో చరిత్రాత్మకమైన ఫలితాలను సాధించింది. కేంద్ర, రాష్ట్ర సంఘాల ఆధ్వర్యాన జరిగిన ఈ మూడు రోజుల సదస్సుకు అధ్యక్షత వహించింది శ్రీ పాలపర్తి వీరయ్య కాగా, సారధ్యం వహించి జయప్రదంగా నిర్వహించింది శ్రీ చదల జానకి రామారావు.

అప్పటి శాసనసభ్యులు శ్రీ ముక్కపాటి వెంకటేశ్వరరావు లాంఛనంగా ప్రారంభించిన ఈ సదస్సులో పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు; చిత్తూరు; నల్గొండ, వరంగల్లు, హైదరాబాదు జిల్లాల నుంచి అత్యధిక సంఖ్యలో ప్రతినిధులు పాల్గొన్నారు. వీరిలో నాలుగవ వంతు మంది మహిళలు వుండడం విశేషం.

'భారతీయ ఆదిమ జాతి సేవక్ సంఘ్' నాటి కార్యదర్శి శ్రీ చించాల్కర్ తో పాటు శ్రీయుతులు ఎం.సుబ్బారావు, ఎస్.ఎస్. నంద, రామావతు లాలు నాయక్, డాక్టరు ఎన్.సుబ్బారావు, డి.ఎస్.ఆర్.మూర్తి, గోపరాజు లవణం, పొన్నా కోటేశ్వరరావు, రాష్ట్ర భూదాన కౌన్సిల్ ఛైర్మన్ సి.వి.చారి ప్రభృతులు పాల్గొని సదస్సుకు జాతీయ స్థాయిని సమకూర్చారు.

కొందరు మద్యపాన ప్రియులు ఇకపై తాము మద్యాన్ని ముట్టమని ప్రతిజ్ఞ కూడా చేశారు.

# సహకారం

**సహకార** రంగంలో సయితం శ్రీ చదల జానకి రామారావు ఎంతో అనుభవజ్ఞులు. ఎస్.సి.లు, ఎస్.టి.లు, బి.సి.లు, ఓ.సి. లలో ఉద్యోగులు, చేతివృత్తుల వారు, వ్యవసాయ కూలీలు, సన్నకారు రైతాంగం మొదలైన అనేకానేక పేద - మధ్య తరగతి వారితో, మహిళలతో వందలాది సహకార సంఘాలను ఏర్పరచి, ప్రోత్సహించి, వారికి సమష్టిగా జీవనోపాధి కల్పనకు విశేషంగా కృషిచేశారు. వ్యక్తిగతంగానే కాక సామూహిక – సాముదాయక పథకాల అమలు పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించారు. ఆయన స్వయంగా కొన్ని సహకార సంస్థలను వ్యవస్థాపించారు. పేదలకు అప్పులు ఇప్పించడంలో, తీసుకున్న ఋణాలను లబ్ధిదారులచే మరల జాగ్రత్తగా క్రమం తప్పకుండా చెల్లింపజేయడంలో చర్యలు గైకొన్నారు.

'ది కృష్ణా డిస్ట్రిక్ కోపరేటర్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్' కు శ్రీ జానకి రామారావు తొలిసారి 1987 జులై తొమ్మిదవ తేదీన సభ్యునిగా ఎన్నికయ్యారు. అప్పటి ఎన్నికల అధికారి అయిన కృష్ణాజిల్లా సహకార శాఖాధికారి శ్రీ వాసిరెడ్డి వీరభద్రరావు ఆ మేరకు 19 వ తేదీన ధృవీకరణ పత్రాన్ని ఇచ్చారు. శ్రీ యెర్నేని ఉమాప్రసాద్ ప్రెసిడెంటుగా వున్నప్పుడు డైరక్టరుగా ఎన్నికైన శ్రీ జానకి రామారావు, మరల రెండవసారి డైరక్టరుగా ఎన్నికై ప్రెసిడెంటుగా శ్రీ తొండపు దశరథ జనార్ధనరావు హయాంలో ప్రస్తుతం కొనసాగుతున్నారు.

కె.డి.సి.సి. బ్యాంకి డైరక్టరుగా శ్రీ జానకి రామారావు డైరక్టర్ల బోర్డు నిర్ణయం మేరకు పెక్కు కీలకమైన బాధ్యతలను విజయవంతంగా నిర్వహించారు. కొందరు బంగారు నగలను కుదవపెట్టి అప్పులు తీసుకుంటూవుంటారు కదా బ్యాంకి శాఖలలో వున్న అట్టి బంగారం ఆభరణాలను తనిఖి చేసి, సవివర జాబితాలతో సహా నివేదికలనుశ్రీజానకీరామారావు గారు సమర్పించేవారు.

అనేక సహకార సంస్థలను శ్రీ జానకి రామారావు సిఫారసు మేరకు ఈ బ్యాంకి అనుబంధ సంస్థలుగా నమోదు చేయించి, సహకరించారు.

# మెదడు వాపు వ్యాధికి కారణం పందులు కాదు గాక కాదు!



**కృష్ణా జిల్లా** మచిలీపట్టణం మునిసిపల్ కమిషనరు శ్రీ ఎం.ఎస్.ఆర్. ఆంజనేయులు 1985 ఏప్రిల్ 20 వ తేదీన అధికారికంగా ఒక నోటీసును జారీచేసి, దాని ప్రతులను శానిటరీ మేస్త్రీల ద్వారా పట్టణంలోని పందుల పెంపకందార్లందరకు జారీ చేయించారు. ఆ నోటీసు:

"ఇందుమూలముగా మచిలీపట్నం పురపాలక సంఘమునందు పందులు పెంచు యజమానులకు తెలియచేయునది ఏమనగా, పట్టణము నందు మెదడు వాపు వ్యాధి ప్రబలి యున్నందున, ఈ నోటీసు అందిన 24 గంటలలోగా పందులు పెంచు యజమానులు వారి పందులను పట్టణ సరిహద్దునకు మూడు కిలోమీటర్ల దూరమునకు తరలించుకొని పోవలసినదిగా హెచ్చరించడమైనది. అట్లు 24 గంటలలోగా వారు పట్టణమునందలి వారి పందులను తరలించనిచో, ఆంధ్రప్రదేశ్ పురపాలక సంఘం చట్టం 1965 సెక్షను 255 ననుసరించి పురపాలక సంఘ కమీషనరుగారు వాటి నిర్మూలన కొరకు గైకొను చర్యలకు బాధ్యులు కారని హెచ్చరించడమైనది."

ఇందుపై అప్పటి శాసనసభ్యులు శ్రీ వడ్డే రంగారావు అప్పటి పురపాలక శాఖామాత్యులు శ్రీ కె.కళా వెంకటరావుకు మే నెల అయిదవ తేదీన సుదీర్ఘమైన లేఖ వ్రాశారు.

## లేఖ:

"మచిలీపట్నం మునిసిపాలిటీ వారు పందులను పెంచువారికి ఇచ్చిన నోటీసు నందు పట్టణమునకు మూడు కిలో మీటర్ల దూరానికి పందులను 24 గంటలలోగా తీసుకొని వెళ్లవలసినదిగాను, అట్లుకానిచో పందులను నిర్మూలించెదమని తెలిపి కాల్చి చంపుచున్నారు. ఇప్పటికి షుమారు వంద పందులను కాల్చి చంపినారు. వాటి విలువ రు.30 వేలు ఉండును.

'మెదడు వాపు వ్యాధి' నివారణ నిమిత్తం పందులను కాల్చి చంపుట పరిష్కార మార్గం కాదని నా అభిప్రాయం. పందులను కాల్చి చంపుట దారుణమని, చాలా అన్యాయమని వేరుగా మనవి చేయనక్కరలేదు. పందులను పెంచు ఎరుకుల, యానాది కులస్థులు కడు బీదవారు, నివాస స్థలం లేక, తిన తిండి లేక, అతి హీన స్థితిలో బ్రతికే వారికి రక్షణ కల్పించవలసిన అవశ్యకత వున్నదని తమకు మనవి చేయుచున్నాను. పందులను తిరగకుండా అదుపు చేయవలసి వచ్చిన ఎడల, పందులను పెంచు ఎరుక, యానాది కులస్థులకు పందులను నిర్బంధించు శక్తి సామర్థ్యములు లేవనే సంగతి ప్రభుత్వం, ప్రభుత్వ అధికారులు గుర్తించవలసివున్నది.

"మెదడు వాపు వ్యాధి" పందుల వలన వచ్చుచున్నదని నిపుణులు నిర్ధారణ చేసిన ఎడల పందులనన్నింటినీ నిర్మూలించ వలసివున్నది. అది సాధ్యపడునా?

పందులను పట్టణమునకు దూరముగా వుంచవలెననే నిర్ణయము ప్రభుత్వం వారు తీసుకున్న ఎడల పందులను పెంచుటకు, వారు నివశించుటకు ప్రభుత్వము వారు స్థలము సేకరించి వారికి సమకూర్చి సదరు స్థలములో పందులను పెంచుటకు అవకాశం కల్పించవలసివున్నది. అంతవరకు పందులను కాల్చి చంపకుండా తగిన ఉత్తర్వులను ఇవ్వవలసినదిగా ప్రత్యేకంగా కోరుతున్నాను.

"మెదడు వాపు వ్యాధి" కేవలం పందుల వలననే వ్యాపించుచున్నదని ఏ విధమైన ఋజువు కన్పడుట లేదు. నిత్యము పందుల మధ్య నివసించుచున్న ఎరుకుల, యానాదుల బిడ్డలకు ఈ వ్యాధి సోకుచున్నట్లు నిర్ధారణ లేదు.

పందుల వలననే మెదడు వాపు వ్యాధి వస్తూవున్నదని ప్రభుత్వంవారుగాని, నిపుణులు గాని నిర్ధారణ చేసుకున్న యెడల, పందుల పెంపకమునకు పైన వివరించిన విధంగా స్థలములను సమకూర్చి సమాజంలో అట్టడుగునవున్న ఎరుకుల, యానాదులకు రక్షణ కల్పించవలసినదిగాను, అంతవరకు పందులను కాల్చి చంపకుండా ఉత్తర్వులు జారీ చేయించ గలందులకు తమకు మనవి చేయుచున్నాను."

**1986** నవంబరు ఎనిమిదవ తేదీన కృష్ణాజిల్లా గంఢ్రాయి గ్రామ వెటర్నరీ అసిస్టెంట్ సర్జను డాక్టరు బి. వెంకటరంగం ఒక ప్రకటన చేస్తూ, మెదడు వాపు వ్యాధికి కారణం పందులు కాదని, అది కీటక వ్యాధి అని స్పష్టం చేశారు. ప్రపంచ దేశాలలో పందుల పెంపకంలో అగ్రస్థానం పొందిన విదేశాలలో కనిపించని ఈ మెదడు వాపు వ్యాధి

ఛాంది.దేశంలో పందుల ద్వారా ఎలా వ్యాపిస్తుందని ఆయన ప్రశ్నించారు.

దోమల విజృంభణే ఈ వ్యాధికి కారణమని ఆయన అన్నారు. ఘంటశాల, విజయవాడ, మచిలీపట్నం ప్రాంతాలలో పందుల కాల్చివేతకు ఉత్తర్వు లిచ్చారని, అయితే, దీని వల్ల నష్టపోయేది ఆర్థికంగా వెనుకబడిన గిరిజనులేనని ఆయన అన్నారు. పందుల వల్ల వ్యాధి వ్యాపిస్తుందనే వాదనకు ముందు పందుల పెంపకందారుల పిల్లలు ఎంత మంది మెదడు వాపు వ్యాధికి గురై మరణించారో సర్వే జరపాలని ఆయన కోరారు.

దోమలను నివారించటం, దోమ తెరలను ఉపయోగించటం ద్వారా ఈ వ్యాధిని అరికట్టవచ్చునని ఆయన సూచించారు.

కాగా, మన చదల జానకి రామారావుగారు ఆంధ్రప్రదేశ్ ఆరోగ్యశాఖ మంత్రికి ఈ కింది విధంగా విజ్ఞప్తి చేశారు:

"మానవ సమాజంలో అన్ని కులాలతోపాటు ఎరుకుల కులం అనేది ఒకటి. వీరి జీవిత పరిస్థితులు ఇతర కులాలకంటే అతిహీనంగా వుంటాయనేది జగద్విదితం. వీరి జీవిత ప్రధాన వృత్తి పందుల పెంపకం. పందుల పెంపకంతో వారి జీవిత మనుగడ ముడివడివున్నది.

వీరికి భూములు లేవు. వుండడానికి నివేశన స్థలాలు లేవు. మనుషులకే నివేశన స్థలం లేనప్పుడు పందులుకు ఎలా వుంటాయి? బ్రిటిషు ప్రభుత్వం మొదలు కాంగ్రెసు ప్రభుత్వం వరకు వీరి గురించి పట్టించుకున్నవారు లేరు.

పందులు పల్లెటూళ్లలోగాని, పట్టణాలలో గాని గొందు సందులలో వాటికి అవసరమైన ఆహారం తిని అక్కడే వుంటూంటాయి. పట్టణాలలో మురికి ఏర్పడడానికి కారకులు ఎవరు? పందులంటారా, ప్రజలంటారా? ప్రజలు మురికి చేస్తే ఆ మురికిని శుభ్రం చేయడానికి పందులు బయలుదేరుతాయి. మురికిలోనే దోమలు పుట్టుకువస్తాయనేది అందరికీ తెలుసు. ఈ మురికిని పోగొట్టడానికి మునిసిపాలిటీ వారుగాని కార్పొరేషన్‌వారుగాని, గ్రామ పంచాయతీలవారు గాని ఎందుకు శ్రద్ధ తీసుకోరు?

మెదడు వాపు వ్యాధి గత నాలుగు సంవత్సరాల క్రితం వచ్చిన సంగతి గుర్తు వుండే వుంటుంది. అయితే, ఈ వ్యాధి నిర్మూలనకు ప్రభుత్వం తీసుకున్న చర్యలు లేవనే చెప్పాలి.

# పాండవులు పాండవులు తుమ్మెదా...!

దీనాతి తీనులైన అమాయక ఆదివాసి - సంచార - గిరిజన జాతుల సంక్షేమానికి తమ పరిధిలో తాము కృషిచేసి ఇటు ప్రజలకు ప్రేమ పాత్రులై అటు ప్రభుత్వానికి వనెతెచ్చిన ఉన్నతాధికారులు



ఆర్.పార్థసారధి, ఐ.ఎ.ఎస్.



ఎస్. ఆర్. శంకరన్, ఐ.ఎ.ఎస్.



ఆర్. ఎన్. మలయప్పన్, ఐ.ఎ.ఎస్



పి. వి. రావు, ఐ. ఎ. ఎస్.



వి. చంద్రమౌళి, ఐ. ఎ. ఎస్

# ఊతప్పమ్ !



చెరువు దొరికింది, చేపలు వున్నాయి. చేత ఊతం పట్టుకు కదలనున్న రెడ్డి యానాదులు



డెబ్బది రెండు వేలతో నిర్మితమైన ఆంధ్రరాష్ట్ర ఆదిమజాతి సేవక్ సంఘ అపురూప వస్తు ప్రదర్శన కార్యాలయము, నెల్లూరు.

# తిన తిండి



కనుక్కుంటే, కందమూలాలైన దొరకవా !



నిరంతరం అటవుల్లో (దిమ్మరచుండు చెంచులు ఆనాటికానాటికి తలదాచుకొనుటకు నిర్మించుకొన్న పర్ణకుటీరము.

# చూడు చూడు నీడలు నీడలు పొగమేడలు


















నేటికీ నాగరికతకు నోచుకోని నల్లమల చెంచుల వ్యధార్త బ్రతుకులు

('ఆంధ్రభూమి' సౌజన్యంతో)

# నాగరికత అంటే ?



నూరు సంవత్సరాలనాటి యానాదులు



ఆనాది యానాది

## నేటి కిక చాలు, కొంపకు పోదాం!



చేపల వేట చాలించి కొంపలకు చేరుతున్న యానాది అబ్బ కొడుకులు



చమురు చూడని కురులు - చింతలెరుగని నరులు

## కర్నూలు కొండ చెంచులు





నెల్లూరు నెరజాణ ఒడిన కూర్చుని పేలు కుక్కించుకుంటూ గంటల తరబడి గడిపే తుపాకుల యల్లమందకు సొరగం ఇక బెత్తెడు దూరం !

ప్రభుత్వం యుద్ధప్రాతిపదికపై ఈ వ్యాధిపై పరిశోధన చేయించి తగు చర్యలు తీసుకుని వుంటే ఇప్పుడు ఈ వ్యాధి సోకివుండేది కాదు. అసలు ప్రభుత్వం వద్ద- పందులవల్లనే ఈ వ్యాధి వస్తున్నదని ఆధారాలు వున్నాయా?

ఇక్కడ ఒక విషయాన్ని గమనించవలసివున్నది. ప్రొద్దస్తమానూ పందుల వెంట వుండి, వారి ఇంటి ప్రక్కనే మురికి వుండి, దానిలో పొర్లాడి, అక్కడే దోమలు వుండివున్నా గుడిశలలో పందుల యజమానుల పిల్లలు వాటితోనే కలసి వుండినా, వారికి ఈ వ్యాధి గ్రామంలోనో లేక పట్టణంలోపల వున్నవారికి రాకపోవడం ఏమిటో ప్రభుత్వం, ప్రజలు గమనించమని, పరిశోధించమని విజ్ఞప్తిచేస్తున్నాను.

ఒకవేళ, పందులవల్లనే ఈ వ్యాధి సోకుతున్నదని నిర్ధారణకు వచ్చినపుడు- నిలువ నీడలేని, నోరువాయిలేని, అండదండలు లేని, వేరే వృత్తి చేతకాని, తినడానికి తిండిలేని పందులపెంపకందారులైన యజమానులకు ప్రత్యామ్నాయ వృత్తి అయినా కల్పించాలి. లేదా, వూరి చివర వీరికి వసతి కల్పించి, కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసి వుంటే వీరి జీవిత వృత్తికి భృతికి నష్టం ఉండదు. అలాకాక, ఏవో నోటీసులు ఇచ్చి, పందులను చంపడం వల్ల వారి బ్రతుకులను హతమార్చడం తప్ప మరొకటి కాదని ప్రభుత్వం వారికి మనవి చేస్తున్నాను. ఇందువల్ల ఏ వృతీ చేతకాని లక్షలాది మంది ఎరుక కులస్తులు ఏమైపోతారో ప్రభుత్వంవారు ఎంత త్వరగా గుర్తిస్తే అంతమంచిదని భావిస్తున్నాము.

ప్రభుత్వంవారు యుద్ధప్రాతిపదికన కదలి, పందుల యజమానులకు పట్టణాల శివారుల స్థలం సేకరించి, వారి పందులను రక్షించేందుకు షెడ్లు కట్టించి, వారి జీవన భృతికి తోడ్పడవలసినదిగా, పందులను చంపి నష్టపరచవద్దని, రాజ్యాంగరీత్యా వారు బ్రతికేందుకు పనిని కల్పించమని, ఇంతవరకు పట్టణాలలో చంపిన పందులకు నష్టపరిహారం మంజూరు చేయవలసిందిగా ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాము.”

## 'తెలుగుదేశం'

## పార్టీతో మమేకం

శ్రీ చదల జానకి రామారావు 1982 లో 'తెలుగుదేశం' పార్టీ స్థాపన నుంచి దానిలో క్రియాశీలక సభ్యునిగా వ్యవహరిస్తూవస్తున్నారు. కృష్ణాజిల్లా తెలుగుదేశం పార్టీ ప్రధాన కార్యదర్శిగా, వైస్- ప్రెసిడెంటుగా, నందిగామ నియోజకవర్గం పార్టీ ఇన్‌చార్జిగా, కృష్ణాజిల్లా ఎన్నికల కమిటి సభ్యునిగా పార్టీ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్నారు.

కృష్ణాజిల్లా పార్టీ పర్యవేక్షక మండలి సభ్యునిగా, రాష్ట్ర తెలుగుదేశం పార్టీ ప్రచార కమిటి సభ్యునిగా అధ్యక్షులు శ్రీ ఎన్.టి. ఆర్. ఇచ్చిన ఆదేశాల ప్రకారం గుంటూరు, నెల్లూరు జిల్లాలలో అనేక సదస్సులలో పాల్గొని నివేదికలు పంపారు. 1983, 85, 94 ఎన్నికలలో పరిశీలకునిగా పనిచేసి రిపోర్టులు సమర్పించారు. 1994 సెప్టెంబరు లో 1999 సెప్టెంబరులో జరిగిన ఎన్నికలలో నందిగామ నియోజకవర్గ పార్టీ అభ్యర్థిగా అర్జీ పెట్టుకున్నారు. టికెట్ పొందలేకపోయారు.

## బాధ్యత

తెలుగుదేశం పార్టీ అధినేత శ్రీ నందమూరి తారక రామారావు గారికి శ్రీ చదల జానకి రామారావు 1994 జులై 24 వ తేదీన ఒక లేఖ వ్రాశారు. అది ఇలా వున్నది:

"మహాశయా! తమరు పంపిన 20వ తేదీ లేఖ 23 వ తేదీన నాకు అందినది. అందలి విషయాలపైదే కార్యక్రమం తీసుకొన్నాను. ఇప్పటికే పూర్తయిన సభ్యత్వం రుసుం జిల్లా అధ్యక్షులవారికి చెల్లించాము. ఈ నెల 26, 27, 28 తేదీలలో జరుప తలపెట్టిన కార్యక్రమం గురించి నందిగామ నియోజకవర్గ గ్రామాలలో ప్రచారం చేయడం జరిగినది. ఓట్లు నమోద కార్యక్రమం పూర్తిచేసి ఎం. ఆర్. ఓ. గారికి ఇవ్వడం జరిగినది.

కాని, ఈ నియోజకవర్గ అసెంబ్లీ స్థానానికి టిక్కెట్లకోసం అప్లయి చేసినవారు గ్రామాలలో తిరుగుతూ తమకే టిక్కెట్టు ఇస్తున్నారని చెపుతూ, మద్దతుగా సంతకాలు

సేకరిస్తున్నారు. అటువంటివారిలో ఈ నియోజక వర్గంలో ఏనాడూ పార్టీలో పనిచేయనివారు, ప్రజల అవసరాలు తీర్చనివారు వున్నారు. వీరు ఓటర్లను గందరగోళపరుస్తున్నారు. ఇందువల్ల పార్టీలో ఎన్నడూలేని అసంతృప్తి కార్యకర్తలలో, ఓటర్లలో చోటుచేసుకున్నది. ఇది నా బాధ్యతగా తమరికి తెలియజేసుకొన్నాను.''

# ప్రచారం

రాష్ట్ర పార్టీ ప్రచార కమిటీ సభ్యునిగా, పర్యవేక్షకునిగా శ్రీ చదల జానకి రామారావు గుంటూరు, నెల్లూరు జిల్లాలో వ్యవహరించారు. ఇందుగురించి 1994 సెప్టెంబరు 30 వ తేదీన కేంద్ర కార్యవర్గానికి సమగ్రమైన నివేదికను సమర్పించారు. అది ఇలా వున్నది:

''గుంటూరు జిల్లా ప్రచార కార్యక్రమం మొదటి పర్యాయం: 06-08-1994 తేదీన ఉదయం 12.00 గంటలకు నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యాన కార్యకర్తల సమావేశం, ఊరేగింపు జరిపారు. సభావేదిక: విజయభాస్కర్ టుబాకో కంపెనీ అవరణ, గుంటూరు II నియోజకవర్గం నాటి సాయంత్రం నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యాన ఊరేగింపు, పెద్ద బహిరంగ సభ జరిగినది. సభావేదిక: పేరేచర్ల సెంటరు.

దుగ్గిరాల నియోజకవర్గం: ఏడవ తేదీ ఉదయం 10-30 గంటలకు కార్యకర్తల విస్తృత సమావేశం జరిగినది. సభావేదిక: కొల్లిపర గ్రామం. వేమూరు నియోజకవర్గం : నాటి రాత్రి 7-30 గంటలకు వేమూరులో ఊరేగింపు, బహిరంగ సభ జరిగినది. వేదిక: వేమూరు సెంటరు.

పొన్నూరు నియోజకవర్గం: ఎనిమిదవ తేదీన ఉదయం పది గంటల నుంచి మధ్యాహ్నం వరకు పొన్నూరు కార్యకర్తల సమావేశం జరిగినది. వేదిక : కళామండపం. బాపట్ల నియోజకవర్గం: నాటి సాయంత్రం బహిరంగ సభ జరిపారు. వేదిక: ఎన్.జి. ఓస్. ఆవరణ (పాత బస్సుస్టాండు దగ్గర.)

రెండవ పర్యాయం- వినుకొండ నియోజకవర్గం: 21 వ తేదీన సాయంత్రం నాలుగు గంటలకు నియోజకవర్గ స్థాయిలో తెలుగుదేశం పారీ కార్యకర్తల సమావేశం స్థానిక ఎన్. ఎస్. పి. బంగాళలో జరిపారు. తదనంతరం 5-30 గంటలకు బహిరంగ సభ జరిగినది. సభావేదిక: జుషువా కళా ప్రాంగణం.

మంగళగిరి నియోజకవర్గం: **22** వ తేదీ రాత్రి ఆరు గంటలకు ప్రకాశం బ్యారేజి నుంచి ఊరేగింపు తాడేపల్లి గ్రామం మీదుగా మంగళగిరి చేరి రాత్రి ఎనిమిది గంటలకు బహిరంగ సభ జరిగినది. వేదిక: దేవాలయం సెంటరు.

ప్రత్తిపాడు నియోజకవర్గం: **23** వ తేదీ ఉదయం పది గంటలకు కార్యకర్తల విస్తృత సమావేశం జరిగినది. ఊరేగింపు బ్రహ్మాండంగా జరిగినది. వేదిక: ప్రత్తిపాడులోని మిల్లు అవరణ. సభలో బలహీన వర్గాల వారు పార్టీలో చేరారు. గుంటూరు I నియోజకవర్గం: నాటి సాయంత్రం నాలుగు గంటలకు కార్యకర్తల సమావేశం, ఊరేగింపు, బహిరంగ సభ జరిగాయి. వేదిక : శ్రీ వేంకటేశ్వర విజ్ఞాన మందిరం.

తెనాలి నియోజకవర్గం : **24**వ తేదీ ఉదయం **10-30** గంటల నుంచి మధ్యాహ్నం **12** గంటల వరకు కార్యకర్తల సమావేశం జరిగినది. వేదిక: ఎన్. వి. ఆర్. కళ్యాణ మండపం. చిలకలూరిపేట నియోజకవర్గం : నాటి సాయంత్రం నాలుగు గంటల నుంచి రాత్రి ఏడు గంటల వరకు ఊరేగింపు, బహిరంగ సభ జరిపారు. ఈ సభలో మైదావల్లి గ్రామంలో జెండా ఆవిష్కరణ తదనంతరం హరిజనులు **60** మంది పార్టీలో చేరారు. వేదిక: చిలకలూరిపేట గంగయ్యచౌక్ సెంటరు.

నెల్లూరు జిల్లా ప్రచార కార్యక్రమం- మొదటి పర్యాయం- ఉదయగిరి నియోజకవర్గం : **14** వ తేదీ సాయంత్రం నాలుగు గంటలకు నియోజకవర్గ స్థాయిలో తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యాన బహిరంగ సభ జరిగినది. శ్రీ కంభం విజయరామిరెడ్డి, శ్రీమతి కొండా చెంచులక్ష్మి గారులు నిర్వహించారు. సభావేదిక: ఉదయగిరి పంచాయతీ కార్యాలయం అవరణ. అల్లూరు నియోజకవర్గం: **15** వ తేదీన సాయంత్రం నాలుగు గంటలకు బుచ్చి గ్రామంలో నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ కార్యకర్తల విస్తృత సమావేశం జరిగినది. వేదిక: మిల్లు అవరణ.

గూడూరు నియోజకవర్గం: **17** వ తేదీన ఉదయం **11** గంటలనుంచి మధ్యాహ్నం మూడు గంటల వరకు కార్యకర్తల సమావేశం జరిపారు. సూళ్ళూరుపేట నియోజకవర్గం: నాటి సాయంత్రం ఆరు గంటల నుంచి రాత్రి **11-30** గంటల వరకు నియోజకవర్గ స్థాయిలో సూళ్ళూరుపేటలో ఊరేగింపు, తదనంతరం బహిరంగ సభ జరిపారు.

ఇతర రాష్ట్ర ప్రచార కమిటీ సభ్యులతో పాటు లయిదు నుంచి **24** వ తేదీ వరకు గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో ఆయా నియోజకవర్గ స్థాయిలలో, కార్యకర్తల విస్తృత సమావేశాలలో, ర్యాలీలలో, బహిరంగ సభలలో పాల్గొని, తెలుగు దేశం ప్రభుత్వం

హాయంలో ప్రజలకు జరిగిన అభివృద్ధి కార్యక్రమాలు, గత నాలుగున్నర సంవత్సరాల కాలంలో కాంగ్రెస్ ప్రభుత్వం పరిపాలనలో సంభవించిన-సంభవిస్తున్న ప్రజావ్యతిరేక చర్యలు, వారి వైఫల్యాలు ప్రజలకు సవివరంగా తెలియచేయడమైనది.

కార్యకర్తల సమావేశాలకు, బహిరంగ సభలకు అత్యంత ఉత్సాహంతో ప్రజలు వేలాదిగా పాల్గొని సభలను జయప్రదం చేశారు. ర్యాలీల్లో పాల్గొన్న కార్యకర్తల కోలాహలం, నృత్యవిన్యాసాలు, సాంస్కృతిక ప్రదర్శనలు, నూతన జండా ఆవిష్కరణల మధ్య సభా స్థలాలకు చేరే సరికి గంటల సమయం పట్టింది. ఈ విధంగా సభలు అర్ధరాత్రి వరకు జరుగుతుండేవి.

తెలుగుదేశం ప్రభుత్వం ఏర్పడాలి, అన్నగారు ముఖ్యమంత్రిగా రావాలి, మా కష్టాలు తీరాలి అని ప్రజలు నినాదాలు చేసేవారు. ఎంతకష్టమైనా ఎదుర్కొని, కాంగ్రెస్‌ను చిత్తుగా ఓడించి, తెలుగుదేశం పార్టీ అభ్యర్థులను రానున్న శాసనసభ ఎన్నికల్లో గెల్పించి తీరాలి, ఇది జరుగుతుంది అని ప్రతిజ్ఞలు చేశారు.

గుంటూరు జిల్లా తెలుగుదేశం పార్టీ కమిటీ చైర్మన్ డాక్టరు ఎం. ఎస్. ఎస్. కోటేశ్వరరావు, ఎన్నికల కమిటీ సభ్యులు, ప్రత్తిపాడు ఎం. ఎల్. ఎ. డాక్టరు మాకినేని పెదరత్తయ్య, గుంటూరు అర్బన్ జిల్లా తెలుగుదేశం పార్టీ ఎన్నికల కమిటీ చైర్మన్ షేక్ సయ్యద్ సాహెబ్ గారలు ఐక్యంగా వుంటూ, కార్యకర్తల్లో స్ఫూర్తిని కలిగిస్తూ సభలను జయప్రదం చేశారు.

నెల్లూరు జిల్లా తెలుగుదేశం పార్టీ ఎన్నికల కమిటీ చైర్మన్ సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి, కోవూరు శాసనసభ్యులు నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి, జిల్లా ఎన్నికల కమిటీ సభ్యులు షేక్ మొహిద్దీన్ గారలు; ఎన్నికల కమిటీ సభ్యులు కార్యకర్తల్లో ఉత్తేజాన్ని కలిగిస్తూ, సభల జయప్రద నిర్వహణలో కృషి చేశారు.”

# పరిశీలనా నివేదిక

1998 జులై 28 వ తేదీన హైదరాబాద్‌లో నియోజకవర్గాల పరిశీలకుల శిక్షణ శిబిరం జరిగింది. శ్రీ చదల జానకి రామారావు దానిలో పాల్గొన్నారు. ఆ నెల 30,31 వ తేదీలలో రాష్ట్రవ్యాప్తంగా జరిగే శాసన సభా నియోజక వర్గాల పార్టీ విస్తృత సమావేశాలకు రాష్ట్రపార్టీ పరిశీలకులను ఆ రోజునే ఎంపిక చేశారు. 30 వ తేదీన జరగనున్న ప్రకాశం

జిల్లా గిద్దలూరు నియోజకవర్గం పరిశీలకునిగా శ్రీ చదల జానకి రామారావును నియమిస్తూ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్. ఎం. లాల్ జాన్ బాషా లేఖను అందజేశారు. ఆగస్టు పదవ తేదీలోగా నివేదికను అందజేయమన్నారు. అయితే, శ్రీ జానకి రామారావు జులై 30 వ తేదీనే గిద్దలూరు నుంచే తమ నివేదికను రాష్ట్ర పార్టీ నాయకత్వానికి పంపారు. ఆ నివేదిక పూర్తి పాఠం:

"మహారాజశ్రీ రాష్ట్ర తెలుగు దేశం పార్టీ అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌరవనీయులు శ్రీ నారా చంద్రబాబు నాయుడి గారి దివ్యసముఖమునకు ప్రకాశం జిల్లా గిద్దలూరు నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ సమీక్షా సమావేశానికి పరిశీలకునిగా నియమించబడిన చదల జానకి రామారావు వ్రాసిన పరిశీలన రిపోర్టు:

రాష్ట్ర తెలుగుదేశం పార్టీ ఆదేశానుసారం ప్రకాశం జిల్లా గిద్దలూరు నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ విస్తృత సమీక్షా సమావేశం 30-7-98 వ తేది ఉదయం 11-30 గంటలకు గిద్దలూరు గెస్టుహౌస్ ఆవరణలో స్థానిక శాసనసభ్యులు శ్రీ పిడతల రాం భూపాల్ రెడ్డి అధ్యక్షతన జరిగినది. సమావేశానికి నాలుగు మండలాల నుంచి సుమారు ఆరు వందల మంది వ్రాలు-నిశానుదారులు హాజరైనారు. వారిలో సంతకం దారులు 426 మంది. ఇందులో పది మంది మాత్రమే మహిళలు హాజరైనారు.

సమావేశంలో ఎక్కువ భాగం వెనుకబడిన కులాలవారు పాల్గొన్నారు. తెలుగుదేశం పార్టీ అనుబంధ సంస్థలైన యువత, మహిళ, ఎస్.సి; ఎస్.టి; బి.సి. మైనార్టీ కమిటీలను ఈ నియోజకవర్గంలో ఇంకా ఏర్పాటు చేయలేదు. కాని, మైనార్టీ ప్రజలు ముస్లింలు, వెనుకబడిన జాతులకు చెందిన గౌడ, మంగలి, యాదవ, రజక, దూదేకుల కార్యకర్తలు ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు. సమావేశం ప్రశాంతంగా, క్రమశిక్షణగా నిర్వహించబడినది.

ముందుగా స్థానిక శాసనసభ్యులు శ్రీ పిడతల రాం భూపాల్ రెడ్డిగారు సమావేశం వుద్దేశాల గురించి వివరించారు. ఆ తరువాత పలువురు కార్యకర్తలు ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలను వివరిస్తూ, ముఖ్యమంత్రిగారు రాత్రింబవళ్లు కష్టించి పనిచేస్తున్నందుకు శ్లాఘించారు. స్థానిక శాసన సభ్యుడు ప్రతిగ్రామంలో ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలను అమలుచేయడంలో బాగా కృషి చేస్తున్నట్లుగ వారు మాట్లాడినారు.

ప్రస్తుతం నియోజకవర్గ పార్టీ కార్యకర్తలు సమైక్యంగా పని చేస్తున్నారు. బూత్ కమిటీలు, ఏరియా కమిటీలు నామమాత్రంగా వున్నాయి, మండల కమిటీలు చురుకుగా

పనిచేస్తున్నాయి. జిల్లా తెలుగు దేశం పార్టీ కమిటీ ఏర్పడనందున క్రింది కమిటీలు నిరుత్సాహంగా వున్నట్లు తెలిసికోవడమైనది. శాసన సభ్యునిపై ఎవరు ఎలాంటి ఆరోపణలు చేయలేదు. అందరూ శాసన సభ్యునికి మంత్రి పదవి ఇవ్వాలని ఉద్ఘాటించారు.

ఇతర పార్టీల తీరు తెన్నులు: ఉభయ కమ్యూనిస్టు పార్టీల ప్రభావం ఇక్కడ అంతగా లేరు. బి.జె.పి. ప్రభావం అసలు లేదు. కాంగ్రెసు పార్టీ రెండు గ్రూపులుగా పని చేస్తున్నది. వారిలో ఒక గ్రూపుకు శాసన సభ టిక్కెట్టు ఇస్తే మరొక గ్రూపువారు వ్యతిరేకంగా పని చేస్తారని తెలిసినది.

సమావేశంలో పరిశీలకునిగా నేను ప్రభుత్వ పథకాల గురించి, ముఖ్యమంత్రిగారు చేపడుతున్న ప్రజోపకారమైన నూతన విధానాల గురించి మాట్లాడుతుండగా కార్యకర్తలు హర్షధ్వానాలు వెలిబుచ్చారు. తెలుగుదేశం పార్టీ నూతనంగా చేపడుతున్న ఆరు అంచెల కమిటీ వివరణ ఇచ్చాను.

నియోజకవర్గం గురించి నా అభిప్రాయం: రాష్ట్ర ప్రభుత్వంపై, ముఖ్యమంత్రిగారి నూతన సంస్కరణ విధానాలపై ప్రజలలో మంచి స్పందన కనిపించినది. స్థానిక శాసన సభ్యునిపై ఎట్టి ఆరోపణలు లేవు. వారిపై కార్యకర్తలలో, ప్రజలలో మంచి స్పందన వున్నది. వెంటనే జిల్లా కమిటీ ఏర్పాటు చేయడం అవసరం.

గిద్దలూరు మార్కెట్టు యార్డు కమిటీ ఛైర్మన్ పదవి వెనుకబడిన తరగతులవారికి ఇవ్వడం మంచిది. అందువల్ల వెనుకబడిన తరగతుల వారిలో పార్టీ ఇంకా బలపడే అవకాశం కలదు.

స్థానిక శాసన సభ్యుడు ప్రజా సమస్యలపై ప్రజలు ఎలాంటి ఇబ్బందులకు గురి కాకుండా సంబంధిత ఎం.ఆర్.ఓ; ఎం.డి.ఓ. ఆఫీసులకు తనే స్వయంగా వెళ్లి సమస్యలను పరిష్కారం చేస్తున్నట్లు తెలుసుకున్నాను.

ఈ నియోజకవర్గంలో మహిళా కమిటీలు చాలా బలహీనంగా వున్నాయి. ప్రభుత్వ పదవులలో వున్న మహిళా ప్రతినిధులు హజరు కాలేదు. నియోజకవర్గంలో మహిళలను చైతన్యం చేయవలసిన ఆవశ్యకత చాలా వున్నది.

ప్రస్తుత పార్లమెంటు సభ్యునికి, శాసన సభ్యునికి మధ్య సరైన ఐక్యత లేనట్లుగా తెలుసుకున్నాను. నియోజకవర్గంలో పార్టీలోని అన్ని స్థాయి కమిటీలను పునరుద్ధరించవలసి వున్నది.

ప్రస్తుత శాసన సభ్యుడు నియోజకవర్గంలోని ప్రజలకు అందుబాటులో వుండి

పని చేస్తున్నట్లు ప్రతి గ్రామంలో అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టినట్లుగా తెలుసుకున్నాను.''

పార్టీ సంస్థాగత ఎన్నికల సందర్భంలో కూడా శ్రీ చదల జానకి రామారావుకు సంచాలకునిగా నియమిస్తూ శ్రీ లాల్ జాన్ బాషా **1999** జనవరి **12** వ తేదీన పత్రాన్ని అందజేశారు. గ్రామ శాఖల ఎన్నికల అధికారుల, ఉప అధికారుల శిక్షణా శిబిరాన్ని జనవరి **20** వ తేదీన గుంటూరు డివిజన్‌లో నిర్వహించవలెనని, గ్రామ ఎన్నికల నిర్వహణ కాలంలో గుంటూరు డివిజన్‌లో ఎన్నికల నిర్వహణను పర్యవేక్షించవలెనని శ్రీ జానకి రామారావును కోరారు. ఆ విధిని ఈయన సక్రమంగా నిర్వహించారు.

ఇలాగే కృష్ణాజిల్లా అవనిగడ్డ నియోజకవర్గ పార్టీ ఎన్నికల పర్యవేక్షకునిగా శ్రీ చదల జానకి రామారావు ఎంతో ఓర్పుతో, నేర్పుతో వ్యవహరించారు.

**1986** నవంబరులో మండల పార్టీ ఇన్‌చార్జ్ పర్యవేక్షకునిగా కృష్ణాజిల్లా జగ్గయ్యపేట, వత్సవాయి, పెనుగంచిప్రోలు, నందిగామ, వీరులపాడు, కంచికచర్ల, ఇబ్రహీంపట్టణం, జి.కొండూరు, మైలవరం, విజయవాడ రూరల్ మండలాలలో వ్యవహరించారు.

# అభినందనలు

రాష్ట్ర పార్టీ కార్యాలయ కార్యదర్శి శ్రీ బి. భుజంగరావు **1983** ఆగస్టు **25** వ తేదీన శ్రీ చదల జానకి రామారావు గారికి లేఖ వ్రాస్తూ ఈ కింది విధంగా పేర్కొన్నారు:

''శ్రీ జానకి రామారావు గారికి : మీరు ఆగస్టు తొమ్మిదన, **15** వ తేదీన పార్టీ అధ్యక్షులవారికి పంపిన రిపోర్టులు చేరినవి. పార్టీ వివిధ స్థాయిలలో అందకూ తరచు మీలాగా సమావేశాలు జరిపి, ప్రజా సమస్యలను చర్చించి, అవసరమైనప్పుడు పార్టీ తరఫున ప్రజలకు ఉపయోగపడే కార్యక్రమాలు చేపట్టడం ఎంతైనా అవసరం. మీ కర్తవ్యాన్ని చిత్తశుద్ధితో నెరవేర్చుతున్నందుకు అభినందనలు.''

# ప్రెస్ మీడియ

''శ్రీ చదల జానకి రామారావు ప్రెస్ మీడియాతో సన్నిహితంగా వుంటారు. తరచు పత్రికా ప్రకటనలు చేస్తూవుంటారు. పత్రికా విలేకరులను కలుస్తూ తవ్య

కార్యక్రమాల గురించి చెపుతూవుంటారు. వారు కూడా శ్రీ జానకి రామారావు పట్ల గౌరవ భావంతో వుంటారు. **1995** నవంబరు **13** వ తేదీన 'ఈనాడు' విలేకరితో భేటీ వివరాలు:

"తెలుగుదేశం ప్రభుత్వం అమలు చేస్తున్న సంక్షేమ, అభివృద్ధి కార్యక్రమాలను, ప్రభుత్వ విధానాలను అట్టడుగువర్గాల ప్రజల వద్దకు తీసుకుపోవడం ద్వారా పార్టీని మరింత పటిష్టం చేయడానికి కృషిచేస్తానని తెలుగుదేశం పార్టీ కృష్ణాజిల్లా ఉపాధ్యక్షులు శ్రీ చదల జానకి రామారావు పేర్కొన్నారు. జిల్లాలో సీనియర్ నాయకునిగా పేరుగాంచిన శ్రీ చదల ఇటీవల జిల్లా దేశం కమిటీలో ఉపాధ్యక్షునిగా నియమితులయ్యారు. ఈ సందర్భంగా 'న్యూస్‌టుడే' తో మాట్లాడుతూ , బాధ్యతను అప్పగించినందుకు పార్టీ అభివృద్ధికి శక్తివంచన లేకుండా పనిచేస్తానని స్పష్టం చేశారు.

పార్టీ సంస్థాగత కార్యక్రమాలు, ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాల అమలుకు, పార్టీ ప్రతిష్ఠను పెంచడానికి తర తమ భేదం లేకుండా అందరిని కలుపుకుని పనిచేస్తానని ఆయన వెల్లడించారు. పార్టీ ప్రతినిధిగా ఈ ప్రాంత ప్రజలలో ఒకనిగా, బాధ్యతగల పౌరునిగా దీర్ఘకాలంగా ఈ ప్రాంత ప్రజలను పట్టిపీడిస్తున్న సమస్యలను వివిధ రూపాలు వివిధ సాధనాల ద్వారా ప్రభుత్వ దృష్టికి తీసుకుపోయి వాటి పరిష్కారానికి తమవంతు కృషిచేస్తానని హామీ ఇచ్చారు.

**1982** లో తెలుగుదేశం పార్టీ ఆవిర్భవించిన నాటినుంచి పార్టీలో ఉన్న శ్రీ చదల **1983** లో 'దేశం' తొలి జిల్లా కార్యదర్శిగా పనిచేశారు. నాటినుంచి నేటివరకు జిల్లా ఉపాధ్యక్షునిగా, జిల్లా పరిశీలకునిగా, నియోజకవర్గ ఇన్‌ఛార్జిగా, జిల్లా ఎన్నికల కమిటీ సభ్యునిగా, రాష్ట్ర ప్రచార కమిటీ సభ్యునిగా, రాష్ట్ర ఎన్నికల కమిటీ సభ్యునిగా, జిల్లా దేశం ఎస్.టి.సెల్ అధ్యక్షునిగా, స్టేట్ సెల్ వైస్ - ప్రసిడెంటుగా పలు పార్టీ పదవులను నిర్వర్తించారు.

ఇవే కాక రెండుసార్లు కేంద్ర సహకార బ్యాంకు డైరక్టరుగా, **25** సంవత్సరాలపాటు పంచాయతీ సభ్యునిగా, పది సంవత్సరాలు నందిగామ ఉపసర్పంచిగా, **20** సంవత్సరాల పాటు గిరిజన సంక్షేమ సంఘం జిల్లా అధ్యక్షునిగా, ఇటీవల జరిగిన ఆర్థిక అభివృద్ధి సంస్థ రాష్ట్ర డెరక్టరుగా పలు పదవులను అలంకరించారు. నాలుగు దశాబ్దాల నుంచి ఆదిమ జాతుల సేవక సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా కొనసాగుతున్నారు. ప్రస్తుతం కె.డి.సి.సి. బ్యాంకు డైరెక్టరుగా, మద్య వ్యతిరేక పోరాట సమితి జిల్లా ఉపాధ్యక్షునిగా, దేశం జిల్లా ఉపాధ్యక్షునిగా, పాఠశాల కమిటీ అధ్యక్షునిగా శ్రీ చదల

బాధ్యతలు నిర్వర్తిస్తున్నారు.

పార్టీలో జిల్లా ఉపాధ్యక్ష బాధ్యతలు తిరిగి అప్పగించినందుకు జిల్లా పార్టీకి, జిల్లా మంత్రులకు, స్థానిక శాసనసభ్యులు శ్రీ దేవినేని వెంకట రమణకు, ముఖ్యమంత్రి శ్రీ చంద్ర బాబుకు చదల జానకి రామారావు కృతజ్ఞతలు తెలిపారు.''

# పేరు మారిస్తే!

వై.వై. కాలనీ పేరును మార్చినట్లయితే తీవ్రస్థాయిలో ప్రతిఘటిస్తామని ఆదిమ జాతి సేవక్ సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి, దేశం ఎస్.టి. సెల్ రాష్ట్ర ఉపాధ్యకులు శ్రీ చదల జానకిరామారావు హెచ్చరించారు. గత పాతిక సంవత్సరాలుగా ఎస్.టి. కాలనీగా పేరొందిన వై.వై. (యెరుకల - యానాది) కాలనీ పేరును మార్పుచేసే యోచనను జగ్గయ్యపేట మున్సిపాలిటీ విరమించుకోవాలని ఆయన డిమాండ్ చేశారు. ఈ వివాదంపై సంఘం తరఫున పర్యటించి విషయ సేకరణ చేశారు. తగుచర్యల నిమిత్తం జిల్లాకలెక్టరుతో సహా సంబంధిత అధికారులు, సి.ఎం. తో పాటు ఇతర ప్రజాప్రతినిధులకు వినతిపత్రాలను పంపారు.

చట్టం 170 ప్రకారం గిరిజనులకు కేటాయించిన భూములు, స్థలాలను అమ్మే హక్కు, కొనే హక్కు ఎవరికీ లేదని చదల ఉటంకించారు. వై.వై. కాలనీ ఆవిర్భావానికి సంబంధించి పూర్వాపరాలను ఆయన ఉదహరించారు.

ఆదిమజాతి సేవక సంఘం కృషి ఫలితంగా 1975 లో జగ్గయ్యపేటలో 300 మంది గిరిజనులకు నివేశన స్థలాలు లభించాయి. ఇళ్ల నిర్మాణం జరిగిన తరువాత, కొనుగోలు - అమ్మకాలతో చేతులు మారాయి. ప్రస్తుతం గిరిజనేతరులకన్నా గిరిజనులే కాలనీలో అధికంగా ఉన్నట్లు పేర్కొన్నారు. గతంలో జగ్గయ్యపేట నగర పంచాయతీ సైతం ఎస్.టి. వార్డుగా గుర్తించినట్లు ఆయన పేర్కొన్నారు. ఇటీవల కొందరు రాజకీయ దురుద్దేశంతో కాలనీ పేరు మార్చడానికి ప్రయత్నిస్తున్నారని, ఇందువల్ల ఎస్.టి. లకు వచ్చే రాయితీలు కోల్పోయే అవకాశం ఉందన్నారు. పేరు మార్చకుండా ఇందిరాగాంధీ విగ్రహాన్ని ఏర్పాటుచేస్తే గిరిజనులకు ఎలాంటి అభ్యంతరం లేదని, తమవంతు సహకారాన్ని అందిస్తామని అన్నారు.

# చౌకడిపోలు

గిరిజన కాలనీలలో ప్రత్యేకంగా చౌకడిపోలను ఏర్పాటుచేసి గిరిజనులందరికి బియ్యం కార్డులు మంజూరుచేసి, కాలనీల్లో మంచినీటి వసతి, విద్యుత్, రోడ్లు, కమ్యూనిటీహాళ్లు వంటి సౌకర్యాలు కలుగజేయాలని ఆదిమజాతి సేవక సంఘం రాష్ట్ర సమావేశం తార్మానం ఆమోదించింది.

సంఘం రాష్ట్ర అధ్యక్షులు శ్రీ పాలపర్తి వీరయ్య అధ్యక్షతన విజయవాడ కస్తూరిబాపేట సంఘ కార్యాలయంలో సమావేశం జరిగింది. సమావేశ ప్రతిపాదనలను, తీర్మానాలను సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి చదల జానకి రామారావు తెలియజేశారు.

గిరిజనుల సంక్షేమం కొరకు ప్రభుత్వం మంజూరు చేస్తున్న నిధులు సకాలంలో లబ్దిదారులకు అందకపోవడంతో నానాఇబ్బందులకు గురికావలసి వస్తుందని సమావేశం ఆందోళన వ్యక్తం చేసింది.

తుపాను, భారీవర్షాలకు నష్టపడ్డ కాలనీవాసులకు యుద్ధ ప్రాతిపదికన సహాయక చర్యలు తీసుకోవాలని, సంఘం ఆధ్వర్యంలో నిర్వహించే శరణాలయాలకు రావలసిన బకాయిలను తక్షణమే ప్రభుత్వం విడుదల చేయాలని సమావేశం తీర్మానం ఆమోదించింది.

# నిబంధనల మార్పు

ఎంతోకాలంగా గిరిజన సంఘాల ఆందోళన ఫలితంగా ఇప్పటికి ప్రభుత్వం గిరిజన సంఘాల ఆందోళన గుర్తించి షెడ్యూలు ప్రాంతాలలో అమలుపరచే భూమి కొనుగోలు నిబంధనలను నాన్-షెడ్యూల్ ఏరియాలో కూడా అమలుపరచేందుకు ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయం హర్షదాయకం అని, ఇందుకు ప్రభుత్వానికి అభినందనలని, మిగిలిన షెడ్యూల్ ఏరియాలో అమలుపరుస్తున్న నిబంధనలను కూడా అమలుపరచవలసినదిగా కోరుతున్నామని సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ చదల జానకిరామారావు 1998 నవంబరు రెండవ తేదీన విజ్ఞప్తి చేశారు.

# గిరిజనులకు కూడా....

శ్రీ చదల జానకి రామారావు 1987 మే నెల ఎనిమిదవ తేదీన ప్రభుత్వానికి వినతి పత్రాన్ని పంపుతూ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భూమి లేని నిరుపేద హరిజనులకు ఆర్థిక సహాయం కల్పించి, సేద్యభూములను కొని ఇచ్చి, పది సంవత్సరాలలో అప్పుతీర్చుకొనే విధంగా ఉత్తర్వులు జారీచేసినందుకు ఆంధ్రరాష్ట్ర ఆదిమజాతి సేవక్ సంఘం హర్షం వెలిబుచ్చుతూ ప్రభుత్వాన్ని అభినందిస్తున్నదని పేర్కొన్నారు.

హరిజనుల కంటే అతిహీనంగా బ్రతుకుతున్న ఎరుకల, యానాది, సుగాలీ, చెంచు, ఆదిమ జాతులకు కూడా ఆ ఉత్తర్వులను వర్తింపచేయడం సమంజసమైన విధానమని, అట్టి ఉత్తర్వును జారీచేసి అన్ని జిల్లాల అధికారులకు, మండల పరిషత్తుల అధ్యక్షులకు తెలియచేయవలెనని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి, ముఖ్యమంత్రికి ఆయన విజ్ఞప్తి చేశారు.

# సర్వే

రాష్ట్రంలోని గిరిజనుల జీవన స్థితిగతుల గురించి 15-6-1998 నుంచి ఆదిమ జాతి సేవక్ సంఘం ద్వారా సమగ్రమైన సర్వేను నిర్వహించారు. సంఘానికి చెందిన ప్రతినిధుల బృందం రాష్ట్రంలోని ఏజెన్సీ; మైదానం ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించి గిరిజనుల జీవన స్థితిగతులపై సర్వే జరిపింది.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గిరిజనుల సంక్షేమంకోసం అమలుచేస్తున్న సంక్షేమ పథకాలు గిరిజనులకు చెందుతున్నాయా, లేదా? ఎస్.టి. బ్యాగ్‌లాగ్ పోస్టుల భర్తీ జరుగుతున్నదా, లేదా? గిరిజన వసతి గృహాల నిర్వహణ పనితీరు వంటి విషయాల గురించి వీరు సర్వే జరిపారు. గిరిజనులకు కేటాయించే భూములు, ఇతర వనరుల వినియోగంలో దళారుల ప్రమేయం వంటి విషయాల గురించి కూడా సమగ్రమైన సర్వేను నిర్వహించారు.

సంచార జాతులకు స్థిర నివాసం కల్పించడానికి చేపట్టవలసిన చర్యల గురించి అధ్యయనం చేసి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు సంఘం ద్వారా సమగ్రమైన నివేదికను సమర్పించారు.

మూఢాచారాల నుంచి విముక్తి కలిగించడానికి సర్వేలో భాగంగా చైతన్య సదస్సులకు కూడా వీరు నిర్వహించారు.

ఆయా ప్రాంతాలలో పర్యటించే టీములకు ఆయా ప్రాంతాల గిరిజన పెద్దలు, చదువుకున్న యువతీ యువకులు సహకరించి గిరిజనుల సంక్షేమానికి తోడ్పడాలని, సంఘం కోరింది.

జీవన పోరాటంలో నిత్యం ఎదుర్కొనే సమస్యలు, వివిధ శాఖల అధికారులు, అనధికారుల వల్ల సంభవించే కష్టనష్టాల గురించి కూడా సంఘం ప్రతినిధి బృందాలు అధ్యయనం చేశాయని ప్రధాన కార్యదర్శి శ్రీ చదల జానకి రామారావు తెలియజేశారు.

## డారీ డొంకా లేని గ్రామం

1999 ఫిబ్రవరి ఎనిమిదవ తేదీన శ్రీ చదల జానకి రామారావు ప్రభుత్వానికి ఈ కింది విధంగా విజ్ఞప్తి చేశారు:

"కృష్ణాజిల్లా వీరులపాడు మండలం చెన్నారావుపాలెం పంచాయతీ శివారు తిమ్మాపురం గ్రామవాసుల ఇక్కట్లు చూడనలవిగాదు. ఇటీవలే ఈ గ్రామంలో పర్యటించాను. ఈ గ్రామంలో విముక్త జాతులకు చెందిన ముతరాసి కులస్తులు 60 కుటుంబాలవారు వున్నారు. వీరంతా వ్యవసాయ కూలీలు. అంతా నిరక్షరాశ్యులు. వీరు ప్రక్క గ్రామాలకు వెళ్ళడానికి సరయ్యెన మార్గాలులేవు. ఇది ఒక దీవిగా వున్నది. శ్మశాన భూమికి వెళ్లాలనా రైతుల పొలాలగుండా వెళ్లాలి. అందువలన పొలాల రైతులకు వీరికి ఘర్షణలు ఏర్పడికేసులు కూడా వీరిమీద పెడుతున్నారు. వీరు నిత్యావసర సరుకుల కోసం పెద్దాపురం చౌకడిపోకు వెళ్లాలి. పనిపాటులకుకూడా గూడెంమాధవరం, పెద్దాపురం గ్రామాలకు వెళ్లాలి. డొంక దారిన వెళ్లాలంటే మధ్యన రైతుల పొలాలనుంచే వెళ్లాలి. ఇందువలన అనేక ఇబ్బందులకు ఈ ప్రజలు గురవుతున్నారు. మంచినీళ్ల వసతి కూడా లేదు. గ్రామానికి ఒక్కబోరు మాత్రమే వున్నది.

వీరు గత 20 ఏండ్లుగా అర్జీలు పెట్టుకుంటున్నా ఇంత వరకు వారి మొరనాలకించినవారు లేరు. అమాయకులు, వ్యవసాయ కూలీలు అయిన వీరికి బయటి ప్రపంచంతో సంబంధం లేదు.

తక్షణమే వీరికి దారి కోసం భూమిని సేకరించి, యుద్ధప్రాతిదికన సహాయం చేయగలందులకు ప్రభుత్వాన్ని కోరుతున్నాను. త్వరలోనే ఈ విషయమై తగుచర్య తీసుకొనకపోతే, వీరులపాడు మండల రెవిన్యూ కార్యాలయం ఎదుట నిరాహారదీక్షలు, ధర్నాలు చేయగలమని హెచ్చరిస్తున్నాము."

# విద్యాభిమానం

శ్రీ చదల జానకి రామారావు అలనాడు హాస్టళ్ళను, పాఠశాలలను వ్యవస్థాపించడమే కాక, ఇటీవల కూడా పేద బాల బాలికల విద్య విషయంలో ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తున్నారు. ఇందుకు ఉదాహరణ ఆయన అధ్యక్షతన నందిగామ న్యూకాలనీలోగల పాఠశాలే. ఈ పాఠశాలను మోడల్‌స్కూల్‌గా మార్చడానికి ఆయన శతథా యత్నిస్తున్నారు.

శ్రీ జానకి రామారావు విద్యాభిమానాన్ని గమనించిన కాకాని వెంకటరత్నం కళాశాలవారు **1995** ఫిబ్రవరిలో జరిపిన ఆ కళాశాల రజితోత్సవ కమిటీ సభ్యునిగా ఆయనను ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.



అంతేకాదు, నందిగామలోని శ్రీత్రివేణి ఎడ్యుకేషనల్ అకాడమి వారు కూడా తమ సంస్థ సభ్యునిగా శ్రీ జానకి రామారావును ఎన్నుకున్నట్లు ప్రెసిడెంటు శ్రీ కిలారు వెంకటేశ్వరరావు **1994** జులై **16** వ తేదీన తెలియజేశారు.

# ఎం. ఎల్. సి. ఎన్నికలు

**1984** జులై ఆరవ తేదీన ఆంధ్రప్రదేశ్ శాసన మండలికి ఎన్నికలు జరిగాయి. కృష్ణాజిల్లా స్థానిక సంస్థల నియోజకవర్గాల నుంచి శ్రీ కొల్లి పావన వీరరాఘవరావు, శ్రీ కమ్మిలి విఠల్‌రావు తెలుగుదేశం పార్టీ తరఫున పోటీ చేశారు. వీరిని గెలిపించవలసిందిగా

కృష్ణాజిల్లా తెలుగుదేశం పార్టీ కార్యదర్శిగా శ్రీ చదల జానకి రామారావు విజ్ఞప్తి చేశారు. అందుకు కారణాలను కూడా ఆయన ఈ కింది విధంగా తెలియజేశారు:

"స్వరాష్ట్రం ఏర్పాటు జరిగినప్పటి నుంచి శాసన సభ, శాసన మండలిలో తిరుగులేని బలం కలిగివుంటూ ఎదురులేని పరిపాలన సాగిస్తూవచ్చిన కాంగ్రెసు పార్టీ, దాని నాయకులు ప్రజల స్థితిగతుల మెరుగుదలకోసం, రాష్ట్రాభివృద్ధికోసం కృషి చేయడానికి బదులు, స్వప్రయోజనాలు నెరవేర్చుకున్న ఫలితంగా మన రాష్ట్రం అభివృద్ధి బాగా కుంటువడిపోయినది. అక్షర క్రమంలో ముందు, అభివృద్ధి క్రమంలో చివర - ఇదీ మన రాష్ట్ర పరిస్థితి. కాంగ్రెసుపార్టీ దగాకోరు విధానాల ఫలితంగా దివాళా తీసిన రాష్ట్రాన్ని క్రమబద్ధమైన, నిజాయితీపూర్వకమైన విధానాల ద్వారా మాత్రమే ఉద్ధరించగలుగుతాం. అందుకు చిత్తశుద్ధిగల నాయకత్వం, చైతన్యవంతమైన ప్రజల పార్టీ నాయకత్వం అవసరం. అలాంటి నాయకత్వాన్ని శ్రీ ఎన్.టి. రామారావు మాత్రమే సమర్థవంతంగా అందించగలిగారు. గత 18 మాసాల తెలుగుదేశం పాలనే ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యం.

శాసన మండలిలో తనకున్న బ్రూట్ మెజారిటీని ఆసరా చేసుకుని, తెలుగుదేశం ప్రభుత్వం చేపట్టిన ప్రజాహిత, ప్రజోపయోగకర శాసనాలను కేంద్ర ప్రభుత్వం, కాంగ్రెసు పార్టీలు నిరోధిస్తున్నాయి. శాసన మండలిలో కూడా కాంగ్రెసు పార్టీ బలాన్ని బాగా కుంచింపజేస్తేనే గాని రాష్ట్రానికి విముక్తి, ముక్తి లభించవు.

అందుచేత కృష్ణాజిల్లా స్థానిక సంస్థల నియోజకవర్గాల నుంచి శాసన మండలికి జరగనున్న ఎన్నికలలో తెలుగుదేశం పార్టీ అభ్యర్థులుగా పోటీ చేస్తున్న శ్రీ కొల్లి పావన వీరరాఘవరావు, శ్రీ కమ్మిలి విఠల్‌రావు గార్లకు ఆ నియోజక వర్గాలలోని ఓటర్లు తమ ఓట్లు ఇచ్చి అఖండ విజయం చేకూర్చవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను.

శ్రీ పావన పంచాయతీ రాజ్ సంస్థలలో విశేషానుభవం గడించిన దిట్ట. అలాగే శ్రీ విఠల్ యువకుడు, చురుకైన కార్యకర్తగా పేరు పొందిన వ్యక్తి. శాసన మండలిలో ఈ ఇద్దరు చేరి తమ అనుభవాలను ఆధారంగా చేసుకొని జిల్లా అభివృద్ధికి ఎంతైనా కృషిచేయగలరు. కనుక ఈ ఇద్దరినీ గెలిపించవలసినదిగా, రాష్ట్రాన్ని అధోగతికి నెట్టిన కాంగ్రెసు పార్టీకి మరోసారి తగిన గుణపాఠం నేర్పవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను."

# ఉపసర్పంచ్‌గా....

శ్రీ చదల జానకి రామారావు నందిగామ పంచాయతీ సభ్యులుగా వ్యవహరించారు. ఉపసర్పంచ్‌గా కూడా కొంతకాలం వున్నారు. తమ పదవీ కాలంలో ఆయన కేవలం తన వార్డులోనే కాక అన్ని వార్డులలోను పేదలవాడలకు పెక్కు సౌకర్యాలను కల్పించారు. అయితే, 1990 సెప్టెంబరు 22 వ తేదీన ఆయనపై అవిశ్వాస తీర్మానాన్ని పెట్టి, నెగ్గించుకున్నారు.

ఇందుపై శ్రీ జానకి రామారావు వ్యాఖ్యానిస్తూ, రోజ్‌గార్ నిధుల దుర్వినియోగాన్ని తాను అమోదించనందున, తాను షెడ్యూల్ తెగలకు చెందినవాడనైనందున, స్థానికులైన రాష్ట్ర మార్కెటింగ్ శాఖ మంత్రికి లొంగనందున పంచాయతీలోని అగ్రవర్ణాల సభ్యులందరు ఏకమై ఉపసర్పంచ్‌నైన తనపై అవిశ్వాస తీర్మానాన్ని పెట్టి నెగ్గించుకున్నారని, ఏ విధమైన అవినీతి - తప్పుడు కార్యక్రమాలలో తాను పాల్గొన లేదని, అది అసలు తన నైజం కూడా కాదని, అసలు తనపై అవిశ్వాస తీర్మాన ప్రతిపాదనకు కారణాలేమీ ప్రత్యేకంగా కనిపించలేదని స్పష్టీకరించారు.

# ముఖ్యమంత్రులకు లేఖలు

**వివిధ** ప్రజా సమస్యల పరిష్కారం నిమిత్తం సంబంధితాధికారులకు, కలక్టర్లకు, జిల్లా, మండల పరిషత్తుల అధ్యక్షులకు, ప్రజాప్రతినిధులకు, అమాత్యవర్యులకు శ్రీ చదల జానకి రామారావు లేఖల రూపంలో వ్యక్తిగత ఉత్తరాలను తరచు వ్రాస్తూవుంటారు. ఆ సమస్యల పరిష్కారంలో జాప్యం జరుగుతున్నదని గుర్తించినపుడు, ఆ సమస్యల తీక్షణతను, వాటి తక్షణ పరిష్కారావశ్యకతను విశదీకరిస్తూ శ్రీ జానకి రామారావు నేరుగా స్పష్టమవుతావుంటుంది. ఇట్టి పెక్కు లేఖలను నాడు నందమూరి తారక రామారావుగారికి, నేడు నారా చంద్రబాబునాయుడు గారికి ఆయన వ్రాశారు. వాటికి వారి నుంచి తగు స్పందన లభించేది. అటువంటి అనేకానేక లేఖల నుంచి నారా వారికి వ్రాసిన రెండు ఉత్తరాలు: ఒకటి 1997 సెప్టెంబరు 20 వ తేదీన:

# కుల ధృవీకరణ పత్రాలు

"ఆంధ్రప్రదేశ్‌లో నివసించుచున్న ఎస్.సి; ఎస్.టి; బి.సి. కులాలవారికి కుల శాశ్వత ధృవీకరణ పత్రాలను మండలరెవిన్యూ అధికారులు జారీచేయడంలో విపరీతమైన జాప్యం జరుగుతున్నది. తత్ఫలితంగా కొంతమంది విద్యార్థులు, ఉద్యోగార్థులు తదితర అవసరమైనవారు సకాలంలో ధృవీకరణ పత్రాలు అందక అనేక కష్ట నష్టాలకు గురవుతున్నారు. ఈ కాలాతీతం వల్ల విపరీతమైన నష్టం కలుగుతున్నది. ఈ విషయంలో రెవిన్యూ అధికారులు తమకు నిర్దిష్టమైన ఆదేశాలు వున్నాయని, వాటి పరిశీలన కొరకు 15 రోజులు వ్యవధి వున్నదని చెపుతూ, కుల ధృవీకరణ పత్రాలను జారీచేయడానికి ఇంకా కొంత వ్యవధిని పొడిగిస్తూ, ధృవీకరణ పత్రాలను జారీచేడంలో జాప్యం చేస్తున్నారు. కనుక, వ్యక్తిగతంగా తమ దృష్టికి ఈ విషయం తెస్తున్నాను. ఈ ఎస్.సి; ఎస్.టి., బి.సి. శాశ్వత కుల ధృవీకరణ పత్రాలకు దరఖాస్తు చేసినవారికి, జాప్యం లేకుండా సత్వరమే వాటిని విడుదల చేయడానికి తగిన ఉత్తర్వులను జిల్లా కలెక్టర్లకు జారీ చేయవలసినదిగా ప్రార్థిస్తున్నాను."

# పక్కా ఇండ్లు

మరొకటి 1998 ఏప్రిల్ పదవ తేదీన వ్రాసినది:

"మహారాజశ్రీ గౌరవనీయులు రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారి దివ్యసముఖమునకు కృష్ణాజిల్లా నందిగామ గ్రామ కాపురస్తుడు, ఆదిమ జాతి సేవక్ సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి, తెలుగుదేశం పార్టీ గిరిజన విభాగం రాష్ట్ర ఉపాధ్యక్షుడు చదల జానకి రామారావు సమర్పించుకొను విజ్ఞాపన పత్రము:

అమాత్యశేఖరా! ఏజెన్సీ, మైదానం అనే వివక్ష లేకుండా రాష్ట్రంలోని గిరిజనులందరికీ, పూర్తి సబ్సిడీపై గ్రామీణ శాశ్వత గృహ నిర్మాణ పథకం కింద పక్కా గృహాలను మంజూరు చేయాలని సంఘం తరఫున మనవిచేసుకుంటున్నాను.

శాశ్వత గృహాలు లేనందున గిరిజనులు చాలావరకు సంచార జాతులుగానే మిగిలిపోతున్నారు. నూటికి 90 మంది గిరిజనులు కాల్వగట్లు, మురికి కాల్వలు, రోడ్ల

ఆహ్వాన సంఘం ప్రధాన కార్యదర్శి, పురప్రముఖులు, కొండూరు పంచాయతీ మాజీ సర్పంచ్ శ్రీ తోట వెంకటేశ్వరరావు మృదు మధుర స్వరంతో స్వాగతం పలుకుతూ సభాధ్యక్షుని, ముఖ్య అతిథులను, ప్రత్యేక ఆహ్వానితులను, చదల జానకి రామారావు, అర్ధాంగి శ్రీమతి చదల సుశీలమ్మ గార్లను వేదికమీద ఆశీనులను చేశారు. 'సప్తతి' సన్మానోత్సవ సంఘం ఏర్పాటు, ప్రముఖుల తోడ్పాటు మొదలైన విషయాలను స్థాలీపులక న్యాయంగా వివరించిన పిదప, శ్రీ తోట వెంకటేశ్వరరావు తమ హృదయాన్ని ఆవిష్కరించారు:

"శ్రీ చదల జానకి రామారావు గారితో మూడు దశాబ్దాలకుపైగా నాకు సాన్నిహిత్యం వున్నది. వారు నాకు రాజకీయ గురువు. రాజకీయాలే కాదు- వారి నుంచి నేను ఎన్నో విషయాలను నేర్చుకున్నాను. అసలు మనిషి ఎలా వుండాలో, మానవతను ఎలా ప్రదర్శించాలో తెలుసుకున్నాను. సమాజాన్ని ఎలా అవగాహన చేసుకోవాలో, సంఘసేవ అంటే అర్థం ఏమిటో తెలుసుకున్నాను. జానకి రామారావుగారు ఒక మహోన్నత వ్యక్తి. వారి ముందు పిపీలకంవంటి నేను, వారి 'సప్తతి' సన్మానోత్సవ సంఘం ప్రధాన కార్యదర్శిని కావడం నా పురాకృత సుకృతంగా భావిస్తున్నాను." అని ఆయన తమ వినమ్రతను ప్రదర్శించారు.

ఆహ్వాన సంఘం అధ్యక్షులు - సభాధ్యక్షులు అయిన శ్రీ కొమ్మన గంగాధర తిలక్ గొప్ప విద్యావేత్త. స్థానిక కాకాని వెంకటరత్నం కళాశాల కులపతి. మానవతావాది. క్రమశిక్షణకు మారుపేరు. లోకజ్ఞతకు సా . . వారు తమ అధ్యక్షోపన్యాసంలో శ్రీ చదల జానకి రామారావు బహుముఖ సేవలను ప్రస్తావించి, ప్రస్తుతించారు. మనకు వున్న బహుకొద్దిమంది ఆదర్శనాయకులలో శ్రీ జానకి రామారావు ఒకరని ప్రశంసించారు. ఆయన ఏ ఒకటి రెండు వర్గాలకో కాక సమాజంలో వున్న పేద ప్రజలందరి ప్రేమాభిమానాలను చూరగొన్న ప్రజానాయకులని కొనియాడారు.

నాటి శాసన మండలి సభ్యునిగా రెండుసార్లు ఎన్నికైన ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, ప్రముఖ విద్యావేత్త శ్రీ పేర్నా శ్రీరామమూర్తి సభను ప్రారంభిస్తూ, శ్రీ చదల జానకి రామారావుతో విద్యార్థి దశనుంచే తమకుగల అనుబంధాన్ని ఆమూలాగ్రంగా గుర్తు చేశారు. శ్రీ జానకి రామారావు స్వయం కృషితో, ప్రతిభాపాటవాలతో అంచలంచెలుగా

ఎదిగి అగ్రశ్రేణి నాయకులయారని, ఆయన నిజమైన పేద ప్రజల నేత అని శ్రీశ్రీరామమూర్తి పేర్కొన్నారు.

ఆచార్య ఎన్.జి. రంగా అంతేవాసి, జాతీయ స్థాయి రైతునాయకులు, ఫార్మర సంస్థ వ్యవస్థాపకులు, కృష్ణాజిల్లా పరిషత్తు మాజీ అధ్యక్షులు శ్రీ సుంకర సత్యనారాయణ మంగళతూర్యనాదాల మధ్య, ఆహూతుల జయ జయ ధ్వానాలు మారు మ్రోగుతుండగా శ్రీ చదల జానకి రామారావును దుశ్శాలువతో, పట్టుపీతాంబరాలతో, గౌతమబుద్ధుని ఫలక బహూకరణతో ఘనాతిఘనంగా, కనుల పండువగా సమ్మానించారు. అంతేకాదు. ఆయన సేవలకు నిజమైన చిహ్నంగా 'సామాజిక వాల్మీకి' అనే గౌరవ బిరుదు పురస్కారంతో సత్కరిస్తూ, సమ్మాన పత్రాన్ని సమర్పించారు.

ఈ సందర్భంగా నాయకాగ్రణి శ్రీ సుంకర తమ జలదగభీర అనర్గళోపన్యాసంలో "ఇన్నేళ్ళ కిన్నేళ్ళకు నా చేతులమీదుగా నేనొక మంచి వ్యక్తిని సన్మానిస్తున్నానని సగర్వంగా చెపుతున్నాను. ఈ సన్మానం వెనుక శ్రీ చదల జానకి రామారావు అయిదు దశాబ్దాల అకుంఠిత సేవ వుంది. చిత్తశుద్ధితో కూడిన కార్య సాధన వుంది. దీక్ష వుంది. దక్షత వుంది. నిరుపేదల క్షుద్బాధను తీర్చిన ఆర్తి వుంది. ఈ సన్మానం ఇటువంటి అంకిత భావనలుగల సమాజ సేవకులు అందరికీ వర్తిస్తుంది." అని ఉద్ఘాటించారు.

కె. వి. ఆర్. కళాశాల తెలుగు అధ్యాపకులు డాక్టరు లగడపాటి సంగయ్య ఆహ్వాన సంఘం తరఫున సన్మాన పత్రాన్ని చదువుతూ, 'సామాజిక వాల్మీకి' బిరుదు ప్రాధాన్యతను విశదీకరించి, దీనిని చదల జానకి రామారావు గారికి ప్రదానం చేయడం అన్నివిధాల ఔచిత్యంగా వున్నదని అభినందించారు.

శ్రీ చదల జానకి రామారావు అర్ధాంగి శ్రీమతి సుశీలమ్మను కూడా సన్మాన సంఘం వారు సభలో సన్మానించారు. సన్మాన సంఘం తరఫున నందిగామ మండల పరిషత్తు సభ్యులు శ్రీమతి చావ నాగ సూర్యమణి శ్రీమతి సుశీలమ్మను పట్టు పీతాంబరాలతో సత్కరించారు. "ఇది మంచి సంప్రదాయం" అని ఆమె సంతోషాన్ని వ్యక్తం చేశారు.

పలువురు నాయకులు, అభిమానులు, శిష్య ప్రశిష్యులు, అనుచరులు, సహచరులు శాలువలు, నూతన వస్త్రాలు, ఫల పుష్పాదులతో చూడముచ్చటగా చదల దంపతులను సత్కరించి తమ ప్రేమాభిమానాలను సభాముఖంగా చాటుకున్నారు.

ఆదిమ జాతుల ఆశాజ్యోతి, పేదప్రజల ప్రియతమనేత

# శ్రీ చదల జానకి రామారావు

# సప్తతి సన్మాన సంఘం

అధ్యక్షులు : శ్రీ కొవ్వూన గంగాధర్ తిలక్, కులపతి : కాకాని వెంకటరత్నం కళాశాలనందిగామ

ప్రధాన కార్యదర్శి : శ్రీ తోట వెంకటేశ్వరరావు - కొండూరు పంచాయతి మాజీ సర్పంచ్, బేతేల్ చర్చి వీధి, నెహ్రూనగర్, నందిగామ, కృష్ణాజిల్లా.

కోశాధికారి: శ్రీ యరబడి కృష్ణారావు, ఏకలవ్య సేవాసమితి కార్యదర్శి, నందిగామ.

గౌరవ సలహా సమితి:

గౌరవనీయ శ్రీ జి. ఎం. సి. బాలయోగి - లోక్‌సభస్పీకరు

శ్రీ కె. నరశింహ, ఎ. పి. ఎస్, ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ మాజీ చైర్మన్

'కళాప్రపూర్ణ' శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య

'కళాప్రపూర్ణ' శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

శ్రీ సుంకర సత్యనారాయణ - కృష్ణాజిల్లా పరిషత్తు మాజీ చైర్మన్

శ్రీ కడియాల రాఘవరావు - కృష్ణాజిల్లా పరిషత్తు చైర్మన్

శ్రీ తొండపు దశరథ జనార్థన్ - కె. డి. సి. సి. బ్యాంకు చైర్మన్

శ్రీ వీరమాచనేని నాగేశ్వరరావు-కేంద్ర ప్రభుత్వ కన్స్యూమర్స్ ప్రొటక్షన్ కౌన్సిల్ మాజీ సభ్యులు

డాక్టరు సుంకర సుబ్బారావు - నందిగామ పంచాయతీ మాజీ సర్పంచ్

శ్రీ యర్రంరెడ్డి రామకృష్ణమూర్తి - అడ్వకేట్, నందిగామ మండల పరిషత్తు మాజీ అధ్యక్షులు

శ్రీ భూక్యా చిన వెంకటేశ్వర్లు - ఎడిటరు: 'గిరిజన స్రవంతి'. మండల పరిషత్తు అధ్యక్షులు: బెల్లంకొండ, గుంటూరు జిల్లా.

ఉపాధ్యక్షులు:

శ్రీ పాలపర్తి వీరయ్య - ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘం అధ్యక్షులు

శ్రీ రామావతు లాలూ నాయక్ - ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘం ఉపాధ్యక్షులు,
శ్రీమతి పొన్నా సౌభాగ్యమ్మ - ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘం కార్యవర్గం సభ్యులు, చీరాల.
శ్రీగాలేటి వెంకటేశ్వర్లు - మాజీ శాసన మండలి సభ్యులు
శ్రీ పెర్నా శ్రీరామమూర్తి - మాజీ శాసన మండలి సభ్యులు
శ్రీ తంగిరాల ప్రభాకరరావు - అడ్వకేట్, కృష్ణాజిల్లా పరిషత్తు సభ్యులు
శ్రీ దాసరి ప్రసాదరావు - కృష్ణాజిల్లా పరిషత్తు సభ్యులు, తుర్లపాడు, చందర్లపాడు మండలం
శ్రీ మంగునూరి కోటిరెడ్డి - కె.డి.సి.సి. బ్యాంక్ మాజీ ఉపాధ్యక్షులు
శ్రీ సూర్యదేవర నాగేశ్వరరావు - కృష్ణాజిల్లా రైతు సంఘం నాయకులు
శ్రీ కోగంటి వెంకటేశ్వరరావు - పంచాయతీ సర్పంచ్, పరిటాల
శ్రీ దావులూరి మధుసూదనరావు - పంచాయతీ సర్పంచ్. పెద్దాపురం
జనాబ్ బడేమియా - లారీ ఓనర్స్ అసోసియేషన్ నాయకులు

## కార్యదర్శులు:

శ్రీ దేవినేని ఉమామహేశ్వరరావు - శాసన సభ్యులు
శ్రీ మనబోతుల శ్రీరామ - బి.సి. నాయకులు
శ్రీ చల్లా సంగమేశ్వరరావు - వాణిజ్య మండలి అధ్యక్షులు
శ్రీ బొబ్బెళ్లపాటి గోపాలకృష్ణ శాయి - కళాకారులు, కాంగ్రెసు నాయకులు
షేక్ సైదా - బి.జె.పి. మైనారిటీ మోర్చా కృష్ణాజిల్లా శాఖ ప్రెసిడెంటు
శ్రీ కొమరగిరి కృష్ణమోహన్ - ఎడిటరు: 'శ్రీవాణి' బుట్టాయపేట, మచిలీపట్నం
శ్రీ మేచర్ల కోటితిరుపతిరావు - సాంఘిక సేవకులు
శ్రీ కోపాటి కోటేశ్వరరావు - స్వచ్ఛంద సేవకులు, కోదాడ, నల్లగొండ జిల్లా
శ్రీ సుంకర నరసింహారావు - రచయిత
శ్రీ కనపర్తి కిశోర్‌కుమార్ - డాక్టరు అంబేడ్కరు జాతీయ యువజన సాంస్కృతిక సమాఖ్య అధ్యక్షులు, విజయవాడ
శ్రీ చదల ఆంజనేయులు - ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ సహ కార్యదర్శి
శ్రీ ఎం.సి. రాజు - ఏకలవ్య సేవా సమితి కార్యదర్శి, విజయవాడ

కార్యవర్గ సభ్యులు:

శ్రీ పరిమి యాకోబ్ - మండల పరిషత్తు అధ్యక్షులు, నందిగామ.

శ్రీబొందలపాటి శివరామకృష్ణ - మండల పరిషత్తు అధ్యక్షులు, చందర్లపాడు.

శ్రీపాటిబండ్ల హరి జగన్నాథరావు - మండల పరిషత్తు అధ్యక్షులు, కంచికచర్ల.

శ్రీ నాగవరపు రాజు - మండల పరిషత్తు అధ్యక్షులు, వీరులపాడు.'

శ్రీ పొపట్ల ముక్కంటి - మండల పరిషత్తు అధ్యక్షులు, పెనుగంచిప్రోలు

శ్రీ బాణావతు నాగేశ్వరరావు - మండల పరిషత్తు అధ్యక్షులు, జగ్గయ్యపేట

శ్రీ గజ్జి కృష్ణమూర్తి - జిల్లాపరిషత్తు, చీఫ్‌విప్; పెనుగంచిప్రోలు

శ్రీ కందిమళ్ల రవీంద్రబాబు - కృష్ణాజిల్లా పరిషత్తు సభ్యులు, నందిగామ.

శ్రీ కె.పుల్లయ్య - కృష్ణాజిల్లా పరిషత్తు సభ్యులు, కంచికచర్ల

శ్రీ కోట వీరబాబు - వ్యవసాయ మార్కెట్ కమిటీ చైర్మన్, నందిగామ

శ్రీ బండారుపల్లి రామచంద్రరావు - వ్యవసాయ మార్కెట్ కమిటీ చైర్మన్

శ్రీ శ్రీరామ్ పురుషోత్తం - వ్యవసాయ మార్కెట్ కమిటీ చైర్మన్

శ్రీ చిరుమామిళ్ల చైతన్య కుమార్ - సొసైటీ ప్రెసిడెంటు, నందిగామ

శ్రీ యార్లగడ్డ రామనరసింహం - సొసైటి ప్రెసిడెంటు, చందర్లపాడు

శ్రీ వేగినేటి గోపాలకృష్ణమూర్తి - సొసైటి ప్రెసిడెంటు, పెనుగంచిప్రోలు.

శ్రీ చిరుమామిళ్ళ శ్రీనివాసరావు (బుజ్జి) - తెలుగుదేశం పార్టీ నందిగామ మండలాధ్యక్షులు,

శ్రీ గుత్తా వెంకటరత్నం - తెలుగుదేశం పార్టీ, మండలాధ్యక్షులు, కంచికచర్ల.

శ్రీ దగ్గుల కేశవరెడ్డి - తెలుగుదేశం పార్టీ మండలాధ్యక్షులు, వీరులపాడు, అల్లూరు.

శ్రీ సూర్యదేవర సూర్యనారాయణ- జగ్గయ్యపేట నియోజకవర్గం తెలుగుదేశం ప్రచార కమిటీ కార్యదర్శి.

శ్రీ పబ్బాతి పొంగళ్లు - వాణిజ్య వేత్త

శ్రీ శాఖమూరి దుర్గాప్రసాద్ - రైతుబజారు ఎస్టేట్ ఆఫీసరు, నందిగామ,

శ్రీ నకరికంటి విశ్వేశ్వరరావు - వెంకటేశ్వరస్వామి ధర్మకర్తల మండలి అధ్యక్షులు, నెహ్రూనగర్, నందిగామ.

శ్రీ వడ్డెల్లి సాంబశివరావు - అఖిలభారత ఎన్.టి.ఆర్. అభిమాన సంఘం అధ్యక్షులు

డాక్టరు జి. గంగాధర్, కరుణ పిల్లల ఆసుపత్రి, సిద్ధార్థ కళాశాల వద్ద, విజయవాడ.

శ్రీ జయంతి కాకుళయ్య, పురప్రముఖులు, నందిగామ.
శ్రీ వాసిరెడ్డి సాంబశివరావు - మాజీ భూమి అభివృద్ధి బ్యాంకి అధ్యక్షులు, నందిగామ
శ్రీ నందం పుల్లయ్య - పురప్రముఖులు, నందిగామ.
శ్రీ చడమల తిరుపతయ్య - నందిగామ మండల ఆదిమ జాతి సేవక్ సంఘ్ అధ్యక్షులు
శ్రీ బొజ్జగాని రామకోటయ్య - మండల పరిషత్తు సభ్యులు, నందిగామ.
డాక్టరు ఘంటా విజయ కుమార్ - జర్నలిస్టు.
శ్రీ పోపూరి సంగీతరావు, మండల కాంగ్రెసు అధ్యక్షులు, నందిగామ.
శ్రీ పేల్పుల ప్రసన్నరావు - మండల పరిషత్తు సభ్యులు, నందిగామ.
మహమ్మద్ అబూబాకర్ - పురప్రముఖులు,
షేక్ ముస్తాన్ వలి - మండల పరిషత్తు సభ్యులు, నందిగామ.
శ్రీ పరుచూరి పిచ్చేశ్వరరావు - లెక్చరరు, కె. వి. ఆర్. కాలేజి.
డాక్టరు లగడపాటి సంగయ్య - లెక్చరరు, కె. వి. ఆర్. కాలేజి.
శ్రీ చావలి సాంబశివరావు - బార్ అసోసియేషన్ సెక్రటర్
డాక్టరు బి. నరసింహరావు , నందిగామ.
డాక్టరు విజయరామన్, నందిగామ.
శ్రీ నర్రంనేని నరసింహారావు - లక్ష్మీప్రసన్న థియేటరు అధినేత
శ్రీ కొమరగిరి రామమోహన్ - వివేకానంద హైస్కూలు కరస్పాండెంటు,
శ్రీ కూర్మారావు - రిటైర్డు టీచరు, బళ్ళారి రాఘవ ఆర్ట్స్ గౌరవాధ్యక్షులు, నందిగామ.
శ్రీ చందు హర్షవర్ధన్ - రచయిత, సి.ఐ., జగ్గయ్యపేట.
శ్రీ నండూరి హనుమంతరావు - రచయిత, రామిరెడ్డిపల్లి
శ్రీ కట్టా సాంబశివరావు- ఆదిమ జాతి సేవక్ సంఘ్ నాయకులు, గుడివాడ.
శ్రీ మొగిలి నాగయ్య - ఆదిమ జాతి సేవక్ సంఘ్ సెక్రటరీ, కొండపల్లి.
శ్రీ కోండ్రుకొండ పుల్లయ్య - ఆదిమ జాతి సేవక్ సంఘ ఉపాధ్యక్షులు, కొండపల్లి.
శ్రీ పాముల కృష్ణయ్య - చిత్తూరు జిల్లా.
శ్రీ సముద్రాల - కందుకూరు, ప్రకాశం జిల్లా
శ్రీ తట్టా నరసింహం - పొన్నూరు, గుంటూరు జిల్లా.
శ్రీ యడవల్లి జ్వాలా నరసింహం - మండల బి.సి. సెల్ అధ్యక్షులు, ఐతవరం.
శ్రీ చిలుకోటి గోపాల కృష్ణ గోఖలె - మండల పరిషత్తు సభ్యులు, గూడూరు.

శ్రీ పుట్టబంతి వెంకటేశ్వర్లు - కంచికచర్ల.
శ్రీ గరిక లక్ష్మణరావు - ఆదిమ జాతి సేవక్ సంఘ్ సభ్యులు, జగ్గయ్యపేట.
శ్రీ కుంభా వెంటేశ్వరరావు - ఆదిమ జాతి సేవక్ సంఘ్ సభ్యులు, చల్లపల్లి.
శ్రీ ఉయ్యాల వీరాస్వామి - ఆదివాసి నాయకులు.
శ్రీ గేదెల బాబూరావు - తాడేపల్లి గూడెం.
శ్రీ కొండపల్లి వెంకట నారాయణ - కోపరేటివ్ బ్యాంకి డైరక్టరు, అనాసాగరం.
శ్రీ పల్లం కోట దాసు - రిటైర్డ్ టీచరు, గండేపల్లి, కంచికచర్ల మండలం.
శ్రీ కె. యోగానందశర్మ - స్థానిక ప్రముఖులు, గండేపల్లి, కంచికచర్ల మండలం.
శ్రీ కంకణాల రామకోటయ్య - పంచాయతీ మాజీ సర్పంచ్, గండేపల్లి
శ్రీ చ ట్టు బ్రహ్మం - బి. సి. నాయకులు,
శ్రీ కూతాటి కృష్ణమూర్తి - కృష్ణాజిల్లా ఆదిమ జాతి సేవక్ సంఘ్ అధ్యక్షులు, విజయవాడ
శ్రీ యరబడి నరసింహారావు - సంఘసేవకులు, అశోక్‌నగర్, నందిగామ.
శ్రీ కోపూరి గంటయ్య - నందిగామ
శ్రీ తిమ్మిసర్తి రాధాకృష్ణ - ఇండియన్ బ్యాంక్ మేనేజరు, చందర్లపాడు
శ్రీ కూతాటి భాస్కరరావు - పోలీసు కానిస్టేబుల్
శ్రీ కుంజ నరసింహం - రిటైర్డ్ టీచరు, కవి
శ్రీ చదల అమరలింగం - రిటైర్డ్ రైల్వే ఉద్యోగి
శ్రీ చదల రాఘవులు - సంఘ నాయకులు
శ్రీ జెర్రిపోతుల వెంకటరత్నం - టీచర్స్ యూనియన్ నాయకులు
శ్రీ తలమాల డేవిడ్‌రాజు - కాంగ్రెసు నాయకులు
శ్రీ అన్నెపాక సుందరరావు - కృష్ణాజిల్లా తెలుగుదేశం పార్టీ అడ్‌హక్ కమిటీ సభ్యులు,
శ్రీ బి. శ్రీరాములు నాయక్ - తెలుగుదేశం నాయకులు, ధర్మవరప్పాడు తండా.
శ్రీ పొన్నారామమోహనరావు - సంఘసేవకులు, వరంగల్లు
శ్రీ బొజ్జగాని వెంకటపతి - సంఘ సేవకులు
శ్రీ దాసరి చినకోటయ్య - విముక్త జాతుల సంఘ అధ్యక్షులు, నందిగామ
శ్రీ దాసరి గోపయ్య - విముక్త జాతుల సంఘ నాయకులు, నందిగామ.
శ్రీ మొగిలి నూకయ్య - తెలుగుదేశం ఎస్. టి. సెల్ టౌన్ శాఖ ప్రెసిడెంటు, నందిగామ
శ్రీ నంద్రు వెంకయ్య - కె. డి. సి. సి. బ్యాంకి డైరక్టరు, రుద్రవరం, నందిగామ మండలం

శ్రీ ధీరావతు అమరసింగ్ నాయక్ - ఆదిమ జాతి సేవక్ సంఘ్ నాయకులు, గుంటూరు.
శ్రీ సాతుపాటి నాగయ్య - ఆంధ్ర రాష్ట్ర ఆదిమజాతి సేవక్ సంఘ్ నాయకులు,
శివరామనగర్, గుంటూరు.
శ్రీ సఘావతు అమ్రియా నాయక్ - ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ నాయకులు,
ధర్మవరప్పాడుతండ
శ్రీ చల్లా యజ్ఞనారాయణ - వాణిజ్యవేత్త.
శ్రీ ఎం. గురునాథం - రిటైర్డు టీచరు, నందిగామ
శ్రీ వెంకటు నరసయ్య - సంఘ సేవకులు, నందిగామ
శ్రీ కొమగిరి రామమోహన్ - విద్యావేత్త, నందిగామ
శ్రీ పాలపర్తి సుదర్శనం - ఆదిమజాతి సేవక్ సంఘ్ సర్కారు జిల్లా ఆర్గనైజరు.
శ్రీమతి మోపూరి రమణమ్మ - ఆంధ్ర రాష్ట్ర ట్రస్టు బోర్డు సభ్యులు, నెల్లూరు.
డాక్టరు కృష్ణమూర్తి - నాయీ బ్రహ్మణ సంఘం నాయకులు, చెరువు బజారు, నందిగామ
శ్రీ ఆకుల వెంకయ్య - పంచాయతీ ఉపసర్పంచ్, కంచికచర్ల.
శ్రీ పసుపులేటి పెద్ద వెంకయ్య - విముక్త జాతుల సంఘ నాయకులు, నవాబుపేట.
శ్రీ పంచుమర్తి శ్రీనివాసరావు (సిద్ధాంతి) - నందిగామ
శ్రీ పాలపర్తి బెంజిమన్, వరంగల్లు
శ్రీ సదాశివరావు - టీచరు - చందాపురం
శ్రీ యండ్రపల్లి నారాయణ రావు - కో-ఆపరేటివ్ సొసైటీ మాజీ అధ్యక్షులు, మాగల్లు
శ్రీ చెరుకుమల్లి శంకరరావు
శ్రీ చదల గోవర్ధనరావు - ఎఫ్.సి. ఐ; తాడేపల్లి, గుంటూరు జిల్లా
శ్రీ శ్రీరామ్ సుబ్రహ్మణ్యం, జుజ్జూరు
శ్రీ పొన్నా వెంకటేశ్వర్లు, కంచికచర్ల
శ్రీమతి దేవరశెట్టి నాగరత్నం - గుంటూరు
శ్రీ చిట్టారెడ్డి గాంధి - హుజూరునగరు, నల్లగొండ జిల్లా
శ్రీ పోట్లూరి ప్రసాద్ - నెల్లూరు జిల్లా ఆదివాసి నాయకులు
శ్రీ శ్రీనివాసరావు - తూర్పుగోదావరి జిల్లా చెంచు సంఘం నాయకులు
శ్రీ పబ్బిశెట్టి రామకృష్ణ - కళాకారులు
శ్రీ జేమ్సు - కళాకారులు

శ్రీ చడమల పెద్ద చెంచు - యానాది సంఘం నాయకులు
శ్రీ తిమ్మసర్తి వెంకటేశ్వర్లు - కోదాడ, నల్లగొండ జిల్లా
శ్రీ గోపేరు పార్థసారధి - రిటైర్డ్ డిప్యూటి కలక్టరు
శ్రీ కాసు హనిమి రెడ్డి- పండితులు
శ్రీ నంద్రు వెంకటరత్నం
శ్రీ మద్దెల కాళహస్తి
శ్రీ యరబోలు నరసింహారావు
శ్రీ చవట గోవిందస్వామి, వాణిజ్యవేత
శ్రీ ఇండ్ల వెంటేశ్వర్లు
శ్రీ ఆకుల సత్యనారాయణ
శ్రీ చలంచర్ల వెంకటేశ్వరరావు
శ్రీ మేడా అచ్చారావు
శ్రీ కర్ణాటి సుబ్బయ్య
శ్రీ ఆదిపూడి గంగయ్య
శ్రీమతి పిన్నమనేని కళావతి
శ్రీ కె. శ్రీనివాసరావు-చెంచు సంఘ నాయకులు, కాకినాడ
శ్రీ ఆకుల విజయ - చెంచు సంఘ నాయకులు, జగ్గయ్యపేట
శ్రీ మెలికె సురేష్- గుణదల

# ఉద్యమ నాయకునికి సముజ్వల నుతులు



ప్రశంసలు ప్రస్తుతలు నమస్కృతులు



# ఉద్యమనేత

## కళాప్రపూర్ణ శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య

శ్రీ చదల జానకి రామారావు నిస్సంకోచంగా ఉద్యమ నాయకుడు. అలనాడు నేరస్థ జాతుల చట్టానికి వ్యతిరేకంగా, ఆదివాస-సంచార జాతులను షెడ్యూల్ ట్రైబ్స్‌గా గుర్తింపు చేయడంకోసం, మద్యపాన నిషేధంకోసం, గిరిజనుల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక ప్రగతికోసం జరిపిన అన్ని ఉద్యమాలలోను ఇటీవలి సారా వ్యతిరేకోద్యమం లోను మటిమధప్పని మోద్ధగా ముందంజవేసిన మొనగాడు మా జానకి రామయ్య. అట్టి మహోద్యమాలలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో కాస్తోకూస్తో నా భాగస్వామ్యం వున్నదని చెప్పడానికి గర్విస్తున్నాను. మైదాన ప్రాంతం గిరిజన ఉద్యమకర్తలు సర్వశ్రీ వెన్నెలకంటి రాఘవయ్య, పాలపర్తి వీరయ్య, పోట్లూరి లక్ష్మీనారాయణ, చంచయ్య, పొన్నాసత్యనారాయణ, సాంబయ్య ప్రభృతుల సరసన నిలచిన ధీరోధాత్తుడు శ్రీ జానకి రామారావు.

చైతన్యం అతని ఊపిరి, ఉద్యమాలు కొనవూపిరి. సర్దుబాట్లు, అవకాశవాదం, మోమాటం, దొంగాటకం అతనికి సుతారాము గిట్టవు. ముక్కుసూటి మనిషి. శ్రీ జానకి రామారావు పోరాటాలు అన్నీ ధనబలం, కులబలం, నేరప్రవృత్తి, అరాచకం, మూఢాచారాలకు వ్యతిరేకంగా జరిగినివే కానీ వ్యక్తిగతమైనవి కావు. పతితులు, భ్రష్టులు. బాధా సర్పభ్రష్టులను ఆదుకోవడానికే శ్రీ జానకి రామారావు తన జీవితాన్ని అంకితం చేశాడని మామట్టుకు మాకు స్వయంగా తెలుసు.

మనం ఇప్పుడు మగత నిద్రలో వున్నాం. మరల ఒక సామాజిక చైతన్యోద్యమం ఉద్ధతంగా రావలసివున్నది. అనైతిక, కుల మత వర్గ నిషాలో వున్నాం. ఇట్టి దుస్థితిలో సాంఘిక సంస్కరణాయుత సమర శంఖం పూరించవలసివున్నది. శ్రీ చదల రామారావు, "సప్తతి" ఉత్సవం ఇందుకు కాహళి కాగలదని, సంస్కరణాభిలాషులను అదలించి కదలించ గలదని ఆశిస్తున్నాను.



# ఆదర్శజీవి

## "కళాప్రపూర్ణ" శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

సమాజంలో అనాదిగా, అనాధులుగా వుండి ఇల్లులేక కట్టుకోవటానికి బట్ట లేక తినటానికి తిండిలేక, ఆదరించేవారు లేక అట్టడుగున పడిపోయిన తరగతుల జీవితాలను సరిదిద్దటానికి అవిశ్రాంతంగా పోరాడిన చదల జానకి రామారావు గారు ఆదర్శపురుషులు. రామారావు గారి "సప్తతి" సన్మానోత్సవం జరుపుతున్నందుకు సన్మాన సంఘాన్ని అభినందిస్తున్నాను. రామారావు గారి సేవలకు ముగ్ధుడనై, హృదయపూర్వక అభినందనలు అందచేస్తున్నాను. ఆయన జీవిత పయనంలో విజయాలు కలగాలని, సుఖాలు వినిపించాలని, ఆయురారోగ్యాలతో అనాధల సేవచేస్తారని మనసారా ఆశిస్తున్నాను.

# కోటికొకరు



## శ్రీ సుంకర సత్యనారాయణ

(కృష్ణాజిల్లా పరిషత్తు మాజీ చెయిర్మన్)

**నూటి** కొకడు కోటి కొకడు అని తెలుగు నుడికారం. అట్టి కోటి కొకరిలో మన చదల జానకి రామారావు గారు ఒకరు.

చదల జానకి రామారావు గారిది ముందు చూపే కాని నేల చూపులు లేవు, మెల్ల చూపులూ లేవు. ఆయన నేత్రాంచలులలో ఆర్ద్రత తొంగిచూస్తుంది. అనురాగం వర్షిస్తుంది, కరుణామయ కాంతి కిరణాలు ప్రసరిస్తుంటాయి.

జానకి రామారావు గారికి ముందంజే కాని వెనుకడుగు లేదు. కడచిన అర్థ శతాబ్దిగా ఆయన ఏ రంగంలో అడుగిడినా పురోగమనమే కాని తిరోగతి అంటూ

తెలియదు.

ఎరుకలు, యానాదులు, సుగాలీలు, చెంచులు, పాముల, బుడబుక్కల, దొమ్మెర, మొండి, బండ మొదలైన సంచార - ఆదివాస - గిరిజన జనజాగృతికి, సంస్కరణలకు; వారి ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక ప్రగతికి, జీవన భద్రతకు జానకి రామారావుగారు చేపట్టని ఉద్యమం లేదు, చేయని సాహసం లేదు, సాధించని విజయం లేదు.

పైగా, మనిషి నిండుకుండ - తొణకడు బెణకడు. ఒక ధ్యేయం, ఒక గమ్యం, ఒక నీతి, ఒక నిజాయితి, ఒక వ్యక్తిత్వం, ఒక ధీరోదాత్తత, ఉత్తమ ఆలోచనలు, ఉన్నత విలువలు జానకి రామారావు సొంతం. వీటి పరిరక్షణలో ఆయన ఏనాడూ తప్పటడుగు వేయలేదు, తప్పించుకోనూలేదు.

సమ సమాజ సామాజిక పరివర్తనే మన చదల జానకి రామారావుగారి సిద్ధాంతం. ఆదివాసులకు సేవలే వారి పంచప్రాణాలు. ఇటువంటివారు నాడుకాని, నేడుకాని, రేపుకాని ఎందరుంటారని ? అందుకే అంటున్నాను......

## చరిత్రను తవ్వుదాం!

### శ్రీ పర్వతనేని శాంతి కిషోర్

(క్రాంతి విద్యా సంస్థల అధినేత)



**మన** చరిత్రను మనం తిరగ రాసుకోవాలి, తిరిగి రాసుకోవాలి. ఆది మానవుని ఎదుగుదల, భారతీయుల పెరుగుదల, మానవ సంబంధాలు, జాతులు, తెగల ఆవిర్భావం, జీవన రీతులు, సాంస్కృతిక నీతుల నుంచి మొత్తం పురాతత్వ శాస్త్రాన్ని, సామాజిక చరిత్రను పునఃపరిశీలించాలి, పునరధ్యయనం చేయాలి. పుక్కిటి పురాణాలను, బొరమ్మ కథలను కాక అసలుసిసలైన భారతీయతను వెలుగులోకి తేవాలి, నిజం కావాలి, నైజం తేలాలి.

మన చరిత్రను మనం వ్రాసుకోలేదు, అన్యులు వ్రాశారు. మన ధృక్పథాన్ని మనం ఏర్పరచుకోలేదు, ఇతరులు రుద్దారు. వేరు ఆలోచనలే లేకుండా గుడ్డిగా మనం నమ్ముతూవస్తున్నాం, కుచించుకుపోతున్నాం, నూతిలోని కప్పలం అవుతున్నాం.

వినరా, ఆంధ్రుడ ఆదిమ జాతుల వింత దీన గాధ!



తమ వేలాది బుర్రకథా ప్రదర్శనల ద్వారా ఉద్యమానికి ఊపు తెచ్చిన కళాకార బృందం; కథకులు - శ్రీ పొలపర్తి వీరయ్య, వ్యాఖ్యాత - శ్రీ చదల జానకి రామారావు, హాస్యం - శ్రీ పౌన్నా కోటేశ్వరరావు

‘ఆదివాసి భూషణ్’ శ్రీ రామావతు లాలూనాయక్, హసింబాయి దంపతులు





రాష్ట్ర సంఘం ఆధ్వర్యాన **1979** మార్చి నాలుగవ తేదీ నుంచి పక్షం రోజులపాటు కృష్ణా జిల్లా కొండపల్లిలో తొలిగా బాల సేవికల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. ఈ ఫోటో ముగింపు రోజున తీసింది.

ప్రెసిడెంటు పాలపర్తి జనరల్ సెక్రటరీ చదల జానకి రామారావు, శ్రీ పొన్నా కోటీశ్వరరావు, శ్రీమతి తిరుపతమ్మ ప్రభృతులను చూడవచ్చు.

# కల్లు మానండోయ్ బాబు !



రాష్ట్ర సంఘం ఆధ్వర్యాన శతానేక సదస్సులు జరిగాయి. వాటిలో ఒకటి కృష్ణాజిల్లా నందిగామలో జరిగిన మద్యపాన నిషేధ సదస్సు.

ఇట్లాకాదు, మన సొంత బుర్రతో, జీవన శైలితో, ఆచార వ్యవహారాలతో, సామాజిక చింతనతో మన చరిత్రను మనం పరిశీలించుదాం, పరిరక్షించుదాం, శోధించుదాం, పరిశోధించుదాం, పునరపి జననం, పునరపి జననం!

ద్రవిడులు, ఆర్యులే కాదు - అంతకు ముందునుంచీ మనకు మంచి చరిత్రే వుంది. మంచి నాగరికతే వుంది. మంచి సాంస్కృతిక సంపద, జీవన విలువలు, నైతికత, మానవత ఇక్కడ పుట్టి పెరిగి పరిమళించాయి. ఇందుకు సాక్ష్యం ఆదిమ జాతులవారే, ఆదివాసులే. తొలినాటి సమాజాన్ని, తొట్టతొలి జీవన విధానాన్ని వీరి ద్వారా తవ్వితీద్దాం, మన స్వీయ చరిత్రను తలకెత్తుకుందాం.

శ్రీ చదల జానకి రామారావు గారి 'సప్తతి' సన్మానం వారికే కాదు, మొత్తం ఆదిమ జాతులవారందరికీ వర్తిస్తుంది, మన పూర్వీకుల రక్తనాళాలలో నర్తిస్తుంది. ఈ సందర్భంగానే అంటున్నాను- చరిత్రను తిరగదోడండి!

# త్వమేవాహమ్

## శ్రీ పి. జనార్ధన రావు

(ఆర్గనైజరు : భా. ఆ. జా. సే. సం.)



**ఆంధ్ర** రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ చదల జానకి రామారావు గారితో నాకు ప్రధమంగా 1986లో మేము నిర్వహించే "క్రష్" సెంటర్లు తనిఖీ నిమిత్తం వారు నెల్లూరు వచ్చినప్పుడు పరిచయం ఏర్పడింది.

అప్పటినుంచి నా పని రీత్యానే కాక, ప్రవృత్తి రీత్యా కూడా జానకి రామారావు గారికి, నాకు సాన్నిహిత్యం పెరుగుతూవస్తున్నది . క్రష్ సెంటర్లు, బాల్వాడి సెంటర్ల విజిట్‌కు నేను, రామారావు గారు ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ అధ్యక్షులు పాలపర్తి వీరయ్యా గారు ఉపాధ్యక్షులు రామావతు లాలూ నాయక్ గారు - మేమందరం కలసి రాష్ట్రం నలుమూలలా రోజులతరబడి ఒకటే తిరగడంతో నేను, రామారావుగారు ఒకటిగా అయిపోయాము.

వారితో కలిసి నేను ఆంధ్ర రాష్ట్రంలో తిరగని చోటు లేదు. సందర్భవశాత్తు అప్పుడప్పుడు వారి అనుభవాల గురించి, వారు ఆదిమవాసులకు చేసిన సేవల గురించి కళ్ళకు కట్టినట్టు చెప్పేవారు. శ్రీ రామారావు మంచి వ్యక్తి. ప్రతిష్ఠాత్మకమైన పదవులను బాధ్యతాయుతంగా నిర్వహించుకుంటూవస్తున్నారు.

వారు ఏ పార్టీలో వున్నా వారి ఆశయం ఒక్కటే - ఎరుకలు, యానాదులు, లంబాడీలు, చెంచులు, పాముల, బుడబుక్కల, దొమ్మెర, వడ్డెర మొదలైన సంచార ఆదిమ జాతుల ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక ప్రగతికోసం అహర్నిశలు పోరాడడమే. ఇప్పుడు వారి వయసు 70 సంవత్సరాలైనా మంచి ఆరోగ్యంగా సంఘ సేవలు నిర్వహిస్తున్నారు. అటువంటి ఆరోగ్యాన్నే కొనసాగిస్తూ నూరేళ్ళు సంఘసేవ చేసేటట్టు చూడమని ఆ దేవునీ ప్రార్థిస్తున్నాను.

# స్ఫూర్తిమంతం

## శ్రీ పాలపర్తి వీరయ్య

(అధ్యక్షులు: ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్)



**నిన్నటిదా** మొన్నటిదా మా చెలిమి - అయిదున్నర దశాబ్దాల పైమాటది ! ఇది చారిత్రక సత్యం, సాంఘిక రంగంలో - ముఖ్యంగా మన ఆంధ్రులలో - ఇంత సుదీర్ఘకాలం పాటుగా మైత్రిని కొనసాగిస్తున్నవారు బహుశః మేమేనేమో ! ఇది మా ఉభయులకే కాదు, జాతికే గర్వకారణం.

వయసులో నాకంటే ఏడేండ్లు చిన్న మన చిరంజీవి చదల జానకి రామారావు. కార్యదక్షతలో , క్రియాశీలతలో నాకంటే రెట్టింపు పెద్ద చదల జానకి రామారావు గారు అని చెప్పడానికి నేనేమీ సంశయించడం లేదు. పెద్దల ప్రమేయంతో ఆహ్వాన సంఘం ఆధ్వర్యాన పెద్దఎత్తున వారికి 'సప్తతి' సన్మానోత్సవం జరగడమే ఇందుకు నిదర్శనం. అన్నట్టు - ఆహ్వాన సంఘం ప్రథమ ఉపాధ్యక్షునిగా నన్ను ఎంపిక చేసుకున్నందుకు వారికి నా హార్దిక మైన కృతజ్ఞతాభివందనలను తెలియచేస్తున్నాను. ఇది, వారు నాకు ఇచ్చిన గౌరవంగా భావిస్తున్నాను.

రాష్ట్ర ఎరుకల సంఘం ఆధ్వర్యాన 1945 లో 'ఆదిమవాసి వైజ్ఞానిక మండలి' పేర బుర్రకథ దళాన్ని ఏర్పరచాము. ఈ దళంలో నేను కథకుడను. శ్రీ కుంభా వెంకటపతి హాస్యం, శ్రీ సాతుపాటి కృష్ణమూర్తి వ్యాఖ్యానం చెప్పేవారు. 1949 లో శ్రీ వెంకటపతి చనిపోయారు. శ్రీ కృష్ణమూర్తి కుటుంబ సమస్యల కారణంగా ఇంటికి వెళ్ళిపోయారు. వీరి స్థానంలో హాస్యానికి శ్రీ పొన్నా కోటేశ్వరరావు, వ్యాఖ్యానానికి శ్రీ చదల జానకి రామారావు వచ్చారు. శ్రీ చదల జానకి రామారావు అప్పటికే ప్రజానాట్య మండలిలో పేరుమోసిన కళాకారులు. ఆయన వ్యాఖ్య శ్రోతలను మంత్రముగ్ధులను చేసి చైతన్య పరచింది. ఈ దళం 1954 వరకు పని చేసింది. 'కల్లుముంత', 'ఏకలవ్య' బుర్రకథలను కొన్ని వందల చోట్ల చెప్పాము. ' పేదబ్రతుకు', 'సుభాష్ చంద్ర బోస్' బుర్రకథలను కూడా చెప్పాము. 'ముంన్నెడుగు' (ముందడుగు) నాటికను సైతం ప్రదర్శించాము.

మహాత్మాగాంధీ హరిజన సేవక్‌సంఘ్‌ను వ్యవస్థాపించారు. వారి ఆశీస్సులతోనే శ్రీ థక్కర్ బాపా 'భారతీయ ఆదిమ జాతి సేవక్‌సంఘ్' ను 1948 అక్టోబరు 24 వ తేదీన వ్యవస్థాపించి, 1949 నవంబరు 27 వ తేదీన రిజిస్టరు చేయించారు. ఆ సంస్థకు కార్యదర్శి నెల్లూరుకు చెందిన ప్రముఖ న్యాయవాది శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య. వారు ప్రసిద్ధ ఆంత్రోపాలజిస్టు. 'యానాది గాంధీ' గా ప్రసిద్ధులు. 1949లో వేటపాలెం చీరాల ఆదినారాయణపురంలో ఆంధ్ర రాష్ట్ర ఎరుకల సంఘ మహాసభను జరిపాము. దీనికి ముఖ్యఅతిథిగా వెన్నెలకంటివారిని ఆహ్వానించాం. అదే వారితో మాకు 'తొలిపరిచయం', ఆ తరువాత వారే మా సచివుడు సారథి అయ్యారు. అప్పుడు వారే ఢిల్లీ సంఘం తరహాలో ఇక్కడ మనంకూడా ఒక సంఘాన్ని ఏర్పరచుకుందాం అని సూచించారు. ఆ విధంగా మేము 1949 జులై మూడవ తేదీన ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్‌సంఘ్‌ను వ్యవస్థాపించి 1951 ఆగస్టు ఒకటవ తేదీన రిజిస్టరు చేయించాము. దీని వ్యవస్థాపకులం నేను, జానకి రామారావు, శ్రీయుతులు వెన్నెలకంటి రాఘవయ్య, రామావతు లాలూ నాయక్, తిరువీధుల సాంబయ్య, పోట్లూరి లక్ష్మీనారాయణ. అప్పటి వరకు దేనికి అదేగా విడివిడిగా వునికిలో వున్న ఎరుకల, యానాది, లంబాడి, చెంచు ఆదిగాగల కులసంఘాలు ఈ సంస్థలో విలీనమైపోయాయి.

1962 లో నీలగిరి మహాసభ పిదప, సంస్థ రాష్ట్ర కమిటి సమావేశం నెల్లూరులో జరిగింది. కృష్ణా జిల్లాలో శాఖను ఏర్పరచవలెనని నాటి సమావేశంలో నిర్ణయించారు. ఆ మేరక జిల్లా స్థాయి సభ జరిగి నేను కార్యదర్శిగా, శ్రీ చదల జానకి రామారావు గారిని

అధ్యక్షులుగా కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు.

**1973** డిసెంబరు ఆరవ తేదీన గుంటూరులో జరిగిన రాష్ట్ర సంఘం సర్వసభ్య సమావేశంలో నన్ను అధ్యక్షునిగా శ్రీ చదల జానకి రామారావుగారిని ప్రధాన కార్యదర్శిగా ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

**1976** జనవరి పదవ తేదీన నెల్లూరులో జరిగిన సంఘం సర్వసభ్యసమావేశంలో కూడా ఉభయులను ఆ పదవులకే ఎన్నుకున్నారు. మరల మరల అంతే. ఇలా కడచిన పాతిక ఏండ్లుగా మా సంఘ బాధ్యతలను కొనసాగించుకుంటూనేవస్తున్నాము. ఇది మరొక చారిత్రక సన్నివేశం కాదా ! పరస్పర సదవగాహనకు, పాలనా వైదుష్యానికి ఇది ప్రతీక అని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

మేము సమష్టిగా, సహనంతో, శాంతియుతంగా నిర్వహించిన ఉద్యమాలు, సాధించిన ఫలితాలు కోకొల్లలు. నేరస్థ జాతుల చట్టం నిర్మూలన నుంచి, ఆదివాసుల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక ప్రగతికోసం, సంస్కరణలకోసం; వీరికి కూడు, గుడ్డ, గూడు కల్పించడంకోసం, వీరిని సంఘంలో సహమానవులుగా గుర్తింపుకు నోచుకునేటట్టు చేయడంకోసం దశాబ్దాల తరబడి మేము విజయవంతంగా నిర్వహించిన కార్యకలాపాలను వివరించుకుంటూపోతే అది చర్వితచరణమే అవుతుంది. నిజానికి, ఈ అన్ని పోరాట దశలలోను శ్రీ చదల జానకి రామారావుగారి విశిష్టమైన పాత్ర మరచిపోలేనిది, త్యాగపూరితమైనది.

శ్రీ చదల జానకి రామారావు గారు మితభాషి, మృదుభాషి, స్నేహశీలి, శ్రమజీవి. నిజానికి పని రాక్షసుడు ! సంఘం నివేదికలను సమర్పించడంలో, శాఖలు, నాయకత్వం, వ్యక్తుల మధ్య సమన్వయాన్ని సాధించడంలో, క్రమశిక్షణ పాటించడంలో ఆయనకు ఆయనే సాటి. మా స్వచ్ఛంద సేవా సంస్థకు ఆయన ప్రధాన కార్యదర్శిగా కొనసాగడం ఈ సంస్థ అధ్యక్షునిగా నాకు పరమసంతోషదాయకం.

స్నేహమేరా జీవితం అని మమ్ము ఇతరులు స్ఫూర్తిమంతంగా తీసుకోవచ్చు! శ్రీ జానకి రామారావుగారి శత వసంత కేళికి ఈ 'సప్తతి' ఒక ప్రహేళిక కావలెనని ఆశిస్తున్నాను, అనుశాసిస్తున్నాను.

*

ఆశాజ్యోతి

## "కళాప్రపూర్ణ" శ్రీ తుర్లపాటి కుటుంబరావు గారు



**గిరిజన నేత**, ప్రముఖ ప్రజాసేవకులు శ్రీ చదలవాడ జానకి రామారావు గారు గిరిజన సంక్షేమానికి ఎనలేని సేవ చేసి, వారి అభ్యున్నతిలో పాలుపంచుకున్నారు. ఆయన స్వార్థరహిత సేవానిరతి నేటి యువకులకు ఆదర్శప్రాయం.

ఆయన "సప్తతి" మహోత్సవం జరగడం అత్యంత ముదావహం. పీడిత ప్రజానీకానికి ఆయన ఆశాజ్యోతి.

పేదల- ముఖ్యంగా గిరిజనుల -సంక్షేమ సాధన కోసం ఆయునకు దీర్ఘాయురారోగ్యాలు లభించాలని భగవానుని ప్రార్థిస్తున్నాను.

చారిత్రకుడు

## శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు

(కృష్ణా జిల్లా పరిషత్తు మాజీ చెయిర్మన్)



**అది** తెల్లదొరతనం ఏలుబాటుకాలం. సామ్రాజ్యవాద ప్రజాస్వామ్య ముసుగులో నియంతృత్వం చలామణి అవుతున్న రోజులవి. ఏ తెల్లదొర పుట్టలో ఏ పురుగు తొలచినా, అది మహానాగై భారతీయ నాగరికతనే కాటువేసిన దశ.

చెరగని మచ్చలాంటి చరిత్ర గలవాడొకడున్నాడు. వాడి పేరు జె. ఎం. స్టీఫెన్స్. వాడు గవర్నరు ఎగ్జిక్యూటివ్ మెంబరే కాక, నాటి బ్రిటిష్ ఇండియ ప్రభుత్వ కార్యదర్శి కూడాను. అప్పటిలో వాడి మాటే శాసనంగా చెల్లుబాటు అయ్యింది. "ఇండియా కులాల

మయం. నేరస్థులు కూడా ఒక కులం వారే. పాత నేరస్థుడు ఎప్పుడూ కొత్త నేరస్థుడే. వాడికి పుట్టబోయే వాడుకూడా నేరస్థుడే నేరం వాడి కులం" అని వాడు సిద్ధాంతీకరించాడు. వాడి ప్రతిపాదన మేరకు **1924**లో నేరస్థ జాతుల చట్టాన్ని ( క్రిమినల్ ట్రైబ్స్ యాక్ట్ ) తెచ్చారు.

ఈ చట్టం అమలుతో ఇక మొదలయింది నరకలోక యాత్ర. ఎరుకలు, యానాది, చెంచు, చుంచు, సుగాలి, బుడబుక్కల, దొమ్మెర, బండ, మొండి మొదలయిన సంచార - ఆదివాస జాతులవారు నేరం చేసినా చేయకున్నా కేవలం వదంతులు - ఫిర్యాదుల పేర వారికి యావజ్జీవ కారాగారవాసం లేక ద్వీపాంతరవాస శిక్షలు విధించేవారు. స్త్రీలు, పురుషులు, ముసలి-ముతక అనే విచక్షణే లేకుండా ఆదివాసులను చిత్రహింసల పాలుచేశారు. కొందరిని 'సెటిల్మెంట్స్' పేరుతో కాలనీలలో నిర్బంధించారు. లింగాల, కప్పరాల తిప్ప, భూమలగడ్డ, స్టువర్టుపురం, సీతానగరం అలా ఏర్పడినవే.

ఇట్టి దిక్కుమాలిన చట్టాన్ని రద్దు చేయవలెనని కోరుతూ అన్ని ఆదివాస సంఘాల వారు సుసంఘటితులై మహోద్యమాలను నిర్వహించాడు. టంగుటూరి ప్రకాశం గారి మంత్రివర్గం **1947**లో ఈ చట్టాన్ని ఉమ్మడి మద్రాసు రాష్ట్రమంతటా రద్దు చేసింది. కేంద్ర ప్రభుత్వం **1957** అగస్టు **31**వ తేదీన ఈ క్రిమినల్ ట్రైబ్స్ చట్టాన్ని యావత్తు భారత దేశమంతటా రద్దు చేసింది.

ఇంతటి మహత్తర చారిత్రక సాంఘిక పోరాటానికి నేతృత్వం వహించింది వెన్నెలకంటి రాఘవయ్య గారు కాగా, నాయకత్వం వహించింది పాలపర్తి వీరయ్య గారు, ఇదితర పెద్దలు కాగా ; నిర్వహించిన సేనానులలో చదల జానకి రామారావు ముఖ్యులు. అట్టి నిశబ్ద సాంఘిక విప్లవకారులు చదల జానకి రామారావు గారికి మన మధ్య 'సప్తతి' సన్మానం జరపడం మన తెలుగువారికే గర్వకారణం. నిస్సంకోచంగా అయనొక చారిత్రకుడు

*

# శుభకరమ్

## 'ఆదివాసి ప్రజాభూషణ్'

## శ్రీ రామావతు లాలూ నాయక్

(ఉపాధ్యక్షులు: ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్)



శ్రీ చదల జానకి రామారావు జగమెరిగిన జగజ్జెట్టి. ఎరుకల, యానాది, లంబాడీ, చెంచు, బుడబుక్కల తదితర ఆదివాస - సంచార జాతులకు ఆయన చేసిన సేవలు అపారం. వారు ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ ప్రధాన కార్యదర్శిగా, భారతీయ ఆదిమ జాతి సేవక్ సంఘ్ లైఫ్ మెంబరుగా అనేక సేవాకార్యక్రమాలను జయప్రదంగా నిర్వహిస్తున్నారు.

శ్రీ జానకి రామారావు గిరిజన - ఆదిమవాసుల సేవే కాక రాజకీయంగా కూడా తెలుగు దేశం పార్టీ కార్యకలాపాలలో బాధ్యతలతో, అమోఘమైన ఉపన్యాసాలతో ప్రజలను ఉర్రూతలూగిస్తున్న ఒక గొప్ప ఆదివాసీ నాయకుడు.

శ్రీ రామారావుగారు, నేను, వి. గోపాల్‌నాయక్, జీవ్‌లాల్‌నాయక్, హరిశ్చంద్ర నాయక్ గారలం గుంటూరు జిల్లా పెదవడ్లపూడిలో **1948** లో సుగాలి మహాసభ జరిగినప్పుడు కలిశాం. రామారావు గారు, ప్రెసిడెంటు పాలపర్తి వీరయ్యగారు, కార్యకర్తలైన గిరిజన - ఆదిమవాసులు మా సభకు వచ్చారు. సభలో 'ఏకలవ్య' బుర్రకథ చెప్పి ఆదివాసుల గురించి చాలా ముఖ్యమైన విషయాలను వెల్లడించారు. అప్పటి నుంచి శ్రీ రామారావు, నేను సన్నిహితుల మయ్యాం. వారూ మేము కలసి ఆదివాసులైన ఎరుకల, యానాది, లంబాడీ, చెంచు, సుగాలీలను షెడ్యూల్ ట్రైబ్స్ లో చేర్పించే కార్యక్రమాన్ని **1956** లో జయప్రదం చేశాం. శ్రీ జానకి రామారావు గారికి 'సప్తతి' సన్మానం చేయడం చాలా సంతోషదాయకం. ఈ కార్యక్రమం జయప్రదం కావాలి. వారు చేసిన సేవల ఫలితంగా సుగాలీలు, చెంచులు, యానాదులు, ఎరుకలు, బుడబుక్కల తదితర సంచా - ఆదివాస - గిరిజన వర్గాలవారు ఎన్నో లాభాలను పొందారు. ఇళ్ళస్థలాలు, ఉద్యోగ తదితర ప్రభుత్వ సహాయ కార్యక్రమాలు చాలా జరుగుతున్నాయి. ఇంకా జరుగవలసి చాలా వున్నది. అటువంటి సేవా కార్యక్రమాలను మునుముందు ఇంకా బాగా అభివృద్ధి చేయడానికి ఇలా సన్మానించడం ప్రజలందరికి మేలు కలిగే విషయం. ఆదివాస గిరిజనులకు

ఇది శుభకరం అని భావిస్తున్నాను.

# గోరంత దీపం కొండంత దేవునికి

## శ్రీ మొగలి నాగయ్య

(ప్రధాన కార్యదర్శి :

ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ కృష్ణా జిల్లా శాఖ)

**మా** నెయ్యము, మా సారథి శ్రీ చదల జానకి రామారావు వెలిగించిన చిరుదివ్వే మా సంఘం లక్షలాది ఎఱుకలు, యానాదులు, లంబాడీలు, చెంచులు, బుడబుక్కల ఇతర సంచార, విముక్త ఆదిమ జాతుల వారి చీకటి బ్రతుకులలో ఈ నాటి అభివృద్ధి.

ఎరుకల, యానాది, లంబాడీలు, చెంచు, దొమ్మర, పాముల, బుడబుక్కల మొదలైన సంచార - ఆదిమ జాతుల అభివృద్ధికి నిరంతరం, అహర్నిశలు శ్రమిస్తున్న నిరాడంబర నాయకులు శ్రీ చదల జానకి రామారావుగారు. ఈయన మంచి కళాకారుడు కూడాను. 'ఏకలవ్య' బుర్రకథ ప్రదర్శనలో వ్యాఖ్యాత.

ఆదిమ జాతి బడుగు జీవులను చైతన్యవంతులను చేస్తూ, గాఢాంధకారంలో ...స్తున్న వారి జీవితాలలో వెలుగులు నింపాలనే ఆశయాన్ని మూటగట్టుకొని, తమ ...లను నెరవేర్చుకోవడానికి పయనించిన బాటసారి. ఏమాత్రం ఆర్థిక సౌలభ్యం ...కపోయినా, ఆత్మస్థయిర్యంతో కృష్ణా, గుంటూరు జిల్లాలలో వివిధ గ్రామాలలో కాలి నడకన పర్యటిస్తూ గ్రామ, తాలూకా, జిల్లా స్థాయిలలో సభలు, సమావేశాలను నిర్వహించి ఆదివాసి తెగలలో కొత్త చైతన్యం కలిగించగలిగారు. ఆదివాసులపై నాటి పోలీసులు కొనసాగించిన పాశవిక దౌర్జన్యాలను ప్రతిఘటించి, పోరాడి 'సీటీ' ఆక్టునే రద్దు చేయించి సంచార ఆదివాసులను విముక్తి చేసి, వీరిని షెడ్యూల్ ట్రైబ్స్‌గా కేంద్ర ప్రభుత్వం చేత గుర్తింపు పొందించినవారిలో ఒకరు. ఆదివాసుల సంఘసేవే తమ జీవిత ఆశయం అని వారు అనుకున్నారు. ఆదివాసులకే కాదు, సర్వ

సమాజానికి వీరు ఆదర్శప్రాయులు.

**1982**లో తెలుగుదేశం పార్టీలో చేరి పెక్కు ప్రతిష్టాత్మకమైన పదవులను బాధ్యతాయుతంగా నిర్వహిస్తూ, ప్రభుత్వ రాయితీలను ఆదివాసులకు ఇప్పిస్తున్నారు.

వెన్నెలకంటి రాఘవయ్య గారి సహచరునిగా, ముఖ్య శిష్యునిగా సమష్టి కృషితో, త్యాగ దీక్షతో, పట్టుదలతో, నిజాయితీతో ఆదిమ జాతుల సంక్షేమానికి, వారి జీవన పునరుద్ధరణకు శ్రీ చదల జానకి రామారావు గారు చేసిన, చేస్తున్న సేవ ఘననీయమైనది, గణనీయమైనది.

శ్రీ చదల జానకి రామారావు జీవితంలో ఎదుర్కొన్న కష్ట నష్టాలు, జయాల గురించి ఈ పుస్తకం ద్వారా ముఖ్యంగా ఆదివాసులు తెలుసుకొని తమ జీవితాలను వారివలె మలచుకోవలెనని ఆకాంక్షిస్తున్నాను.

## నేనూ వున్నాను !

### శ్రీ తట్టా నరసింహం

(డైరక్టరు : గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంకి)

శ్రీ చదల జానకి రామారావు ఆదివాస జాతుల సామాజిక, సాంస్కృతిక ప్రగతికోసం పోరాడిన త్యాగమయులు. వారితోపాటు యానాది, ఎరుకల, చెంచు మొదలైన ఆదిమ జాతుల సంక్షేమం కోసం నేను కూడా అనేకమైన సంఘ కార్యక్రమాలలో పాల్గొన్నాను.

ఎరుకల, యానాది, లంబాడి, చెంచులు మొదలైన జాతులను షెడ్యూల్ తెగలలో చేర్పించుకోవడానికి అనేక సార్లు బి.ఎస్. దాతార్ గారిని కలుసుకున్నాము. ఆం ధ్రదేశంలో ఈ జాతులవారి కష్ట నష్టాల నివారణకు ఎన్నో కార్యక్రమాలలో పాల్గొన్నాము

*

# హార్దికాభినందనలు



## శ్రీ గాలేటి వెంకటేశ్వర్లు

(మాజీ శాసన మండలి సభ్యులు)

**చదల** జానకి రామారావు గారూ, నేనూ దాదాపు ఒకే ఈడు వాళ్ళం అనుకుంటాను. ఆయన రాజకీయాలు ఆయనవి, నా రాజకీయాలు నావి. అయినా, సంఘ సేవాతత్పరతలో మా జానకి రామారావు నన్ను మించిన వారు అని సగర్వంగా చెప్పగలను. నేను పెక్కు అధికార పదవులలో బాధ్యతలను నిర్వర్తించాను. ఏ అధికార పదవీ లేకుండానే మన జానకి రామారావు ప్రజాసేవలో పునీతులై ప్రజల మనిషి అనిపించుకున్నారు. వారికి గల ప్రజాదరణ అంతాఇంతా కాదు. అందుకు నిదర్శనమే ఈ 'సప్తతి' సన్మానం. వారికి నా హార్దికాభినందనలు.

# అభ్యర్దిత్వాన్ని ఆశించినా.....



## శ్రీ కోగంటి వెంకటేశ్వరరావు

(జాతీయ స్థాయి రైతు నాయకులు)

**శ్రీ చదల** జానకి రామారావు బడుగు, బలహీన వర్గాలకు ముఖ్యంగా ఎరుకలు, యానాది, లంబాడా తదితర సంచార జాతులకు నాటి బ్రిటిష్ పాలనలో జరుగుతున్న అన్యాయాలను ఎదుర్కొని, వారూ సభ్య సమాజంలో గౌరవం గల పౌరులేనని ఋజువు చేసిన త్యాగమూర్తి.

కుగ్రామమైన గండేపల్లిలో ఎరుకల కుటుంబంలో పుట్టి, కడుపేద కుటుంబమైనప్పటికీ స్వయంకృషితో విద్యాభ్యాసం చేసి తను పుట్టిన జాతికి ఎంతో కొంత సహాయం చేసి మాతృఋణం తీర్చుకున్న ధన్యజీవి శ్రీ చదల జానకి రామారావు. తెలుగు దేశం పార్టీ ఆవిర్భావం నుంచి ఆ పార్టీలో వివిధ పదవులను తనదైన శైలిలో నిర్వహించి,

అన్న నందమూరి తారక రామారావు గారి ప్రేమకు పాత్రలయిన పెద్ద.

శాసన సభ ఎన్నికలలో తెలుగుదేశం పార్టీ అభ్యర్థిత్వాన్ని ఆశించినా, ప్రయత్నం ఫలించకపోయినప్పటికీ నిరాశ చెందక, టికెట్ వచ్చిన పార్టీ అభ్యర్థి కోసం ఇతోధికంగా కృషి చేసి, ఆ అభ్యర్థి గెలుపుకు ప్రధాన కారకులుగా నిలిచారు.

శ్రీ చదల జానకి రామారావు నేటి రాజకీయ నాయకులకు ఆదర్శనీయులు. నీతి - నిజాయితీలకు నిలయం.

శ్రీ జానకి రామారావు గారు నిండు నూరేళ్ళు ప్రజాసేవలో పునీతులు కావలెనని, అంతటి భాగ్యం భగవంతుడు వారికి ప్రసాదించవలెనని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

# స్ఫూర్తి మంత్రం

## శ్రీ పంచుమర్తి శ్రీనివాస రావు

(సిద్ధాంతి, నెహ్రూనగరం, నందిగామ)

**దీనజనుల** అభ్యున్నతికి అవిశ్రాంతంగా కృషి సాగిస్తూ వస్తున్న మహా మనీషి శ్రీ చదల జానకి రామారావు.

మానవసేవే మాధవసేవ అన్న పరమార్థాన్ని గుర్తెరిగి తోటివారి కష్టసుఖాలలో పాలుపంచుకొంటూ వారి హృదయాలలో స్థానం సంపాదించుకోగలిగిన ధన్యజీవి మా చదల జానకి రామారావు గారు.

ప్రజల మనిషిగా పారదర్శక జీవితాన్ని గడిపిన శ్రీ చదల జానకి రామారావు గారి 70 వసంతాల కాలాన్ని పర్యావలోకనచేస్తే - ఒక మనిషి నిండు జీవితంలో ఎంత చేయగలుగుతాడో అంతా సాధించిన పరిపూర్ణ వ్యక్తి మనకు ఈ కొలది వ్యవధిలో దర్శనమిస్తాడు.

మానవ జీవితాన్ని నాటి మహర్షులు మొదలు నేటి మహనీయుల వరకు భిన్న కోణాల నిర్వచిస్తూవచ్చారు. విలువలు కలిగిన వ్యక్తిత్వం, వజ్రహృదయం, సాటివారి సమస్యలు తనవిగా భావించే బాధ్యతాయుతమైన ఆలోచన - శ్రీ చెదల జానకి రామారావు

గారిని ఆదర్శ ప్రాయునిగా మూర్తీభవింప జేశాయి.

శ్రీ చదల 'సప్తతి' ఉత్సవం యువతరాలకు స్ఫూర్తిదాయకం కావలెననే ఆకాంక్షను వ్యక్తపరుస్తూ వారికి మా అభివందనలను అందజేస్తున్నాను.

# శత వసంతోత్సవం

## శ్రీ సి.వి. ఎన్. ధన్

(రవి కళాశాల అధినేత, గుంటూరు)

శ్రీ చదల జానకి రామారావు గారికి తలపెట్టిన సన్మానం ఎంతో మంచిది. ఎప్పుడో జరగవలసింది. ఇప్పటికైనా చేస్తున్నందుకు సంతోషం, 70 వసంతాల యువకుడు శ్రీ జానకి రామారావు. ఇది 'సప్తతి' సన్మానమే కదా! మునుముందు శతవసంతోత్సవాన్ని జరుపుకుందాం.

# ధైర్యశాలి

## డాక్టరు ఎస్. ఎస్. నందా

(వ్యవస్థాపకులు : శ్రీ ఏజెన్సీ సేవాసంఘం)



**ఆదివాసి** జాతుల నాయకులైన శ్రీ తిరువీధుల సాంబయ్య, శ్రీ పాలపర్తి వీరయ్య గారలు, మన జానకి రామారావు గారిని BASS లైఫ్ మెంబరుగా తొలిసారి కేంద్ర సంఘ సమావేశంలో పరిచయం చేశారు.

సంచార జాతులైన ఎరుకుల, యానాదుల, లంబాడీల, చెంచు మొదలైన వారి అభ్యుదయానికై విద్యయే ప్రధానమని గ్రహించి వందలాది శిశు పోషణాలయాలను, హాస్టళ్లను నెలకొల్పి, పర్యటిస్తూ, చక్కని సలహాల నిచ్చేవారిలో శ్రీ రామారావు ఒకరు.

మహాసభలలో నివేదికలను సమర్పించి, తనదైన శైలిలో ధైర్యసాహసాలతో జానకి రామారావు వివరణ గావించేవారు. శ్రీ జానకి రామారావు మితభాషి. తాను

నమ్మినది, తనకు నచ్చినది, నిక్కచ్చిగా(చెడును నిరశించి) వ్యవహరించిన మహావ్యక్తి. శ్రీ జానకి రామారావు వంటి నిర్మోహమాటి నేటి ఫిరాయింపుల సమాజంలో లభించడం చాలా దుర్లభం.

# చెదలంటని చదల

## రెవరెండ్ పి.ఎస్.వి. ప్రసాద రావు



**చదల** జానకి రామారావు గారిని నేనొక పార్టీ నాయకునిగా, 'ప్రజలమనిషి' గా, పుర ప్రముఖునిగా ఎరుగుదును. నేను వారితో ప్రప్రథమంగా పరిచయమైనది 1962లో మా గురువు పూజ్యులు రెవరెండు పి.దేవదానం గారు జానకి రామారావు గారు చాలా సన్నిహితులు, కులాలు వేరైనా మతాలు వేరైనా వారిరువురి మనసులు, మార్గాలు ఒకే విధంగా వుండేవి.

సమాజంలోని అల్పసంఖ్యాకుల సాధక బాధకాలను ఆమూలాగ్రంగా అనుభవ పూర్వకంగా అర్థంచేసుకొన్న జానకి రామారావు గారు సకల ప్రగతి కొరకు తమదైన ప్రత్యేక విధానంలో పాటుపడుతున్నారు. అనేక బాధ్యతాయుతమైన కీలక స్థానాలను అధిష్టించిన చదల జానకి రామారావు గారికి చెదల మచ్చలేదు. ఇట్టి నిస్వార్థత, సచ్ఛీలత కలిగిన వారే నేటి సమాజానికి అవసరం.

జానకి లోని సచ్ఛీలత, రామునిలోని నిస్వార్థత జానకి రామారావు గారిలో నిండినిబిడీకృతమై వున్నాయి : సార్థక నామధేయులు !

నేను వారిని కలసినపుడు నేనొక క్రైస్తవ మత గురువునని తెలిసిన జానకి రామారావు గారు నన్ను 'ప్రైస్ ది లార్డ్' అని పరామర్శించినప్పుడు వారి పరమ సహనానికి నేనెంతో ఆశ్చర్యపడి, ఆనందించాను.

అల్పసంఖ్యాకుల ఆశాజ్యోతి, సచ్ఛీలురు, నిస్వార్థపరులైన మన ప్రియతమ జానకి రామారావు గారికి రాజ్యాంగపరమైన చట్ట సభలలో (పార్లమెంటు లేక శాసనసభ) సభ్యత్వాన్ని కూడా అనుగ్రహించి వారి ద్వారా బడుగు, బలహీన,

అల్పసంఖ్యాకుల అభ్యున్నతి కొరకు ఇంకా అనేక సంక్షేమ కార్యక్రమాలు చేయడానికి వారికి దీర్ఘాయువు నిచ్చి ఆశీర్వదించవలెనని ఆ ప్రభువును ప్రార్థిస్తున్నాను.

*



# ఎన్నని చెప్పేది !

## డాక్టరు వినుకొల్లు కృష్ణమూర్తి

(అధ్యక్షులు : పశ్చిమ కృష్ణా నాయీబ్రాహ్మణ సంఘం)

**చదల** జానకి రామారావు గారు గొప్ప సంఘ సంస్కర్త. ఇటువంటి నాయకులు చాలా అరుదు. బ్రిటీషు ప్రభుత్వ కాలంలో సమకాలీనులతో కలసి ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్‌ను నిర్మించి, ఆదివాసులపై వున్న 'సి.టీ' ఆక్టును రద్దుచేయించి, స్వకులస్తులకు సత్ప్రవర్తనా నియమావళిని పొందపరచి అమలుపరచిన ధన్యజీవి.

నమ్మిన సిద్ధాంతాలను తూచాతప్పక అనుసరించి, ఆదిమ జాతులకు ఆనాటి సమాజంలో ఔన్నత్యంకొరకు తపించి తరించారు. శ్రీ చదల జానకి రామారావు ప్రభుత్వంలో లేకున్నా ప్రభుత్వంద్వారా అనేక సంస్కరణలను ప్రతిపాదించి అమలు చేయించిన లక్ష్యశుద్ధి శ్లాఘనీయం.

విద్యాప్రదాతగా శ్రీ జానకి రామారావు గారు అనేక హాస్టల్స్‌ను స్థాపించి తద్వారా ఆదిమ జాతులవారిని విద్యావంతులుగా తీర్చిదిద్దారు. విద్యాధికులైన వారికి ప్రభుత్వ ఉద్యోగాల ద్వారా దారిద్ర్య రేఖకు దిగువ నుంచి ఉన్నత స్థితిని కల్పించారు.

గృహ నిర్మాణ కృషీవలునిగా శ్రీ జానకి రామారావు గారు కృష్ణా జిల్లాలో ముమ్మొదట ఎరుకలవారికి కాలనీ స్థలాలను ఏర్పాటు చేయించి నందిగామ పట్టణంలో అనేక కుటుంబాలకు నివాస యోగ్యం కల్పించారు. ఇంకా ఎన్నో ఎన్నో వున్నాయి, ఎన్నని చెప్పను !

# 'బాస్' కాదు, 'మాస్' మాన్



శ్రీ ఎం. సి. రాజు
(అఖిల భరత ఏకలవ్య సేవా సమితి

కృష్ణా జిల్లా శాఖ ప్రధాన కార్యదర్శి)

**1979** ఏప్రిల్ **21** వ తరీఖున 'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్' లో ఎకౌంటెంటుగా అడుగిడిన నాకు మొదటి రోజునే శ్రీ చదల జానకి రామారావు గారితో పరిచయం ఏర్పడింది. ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ ప్రధాన కార్యదర్శిగా రాష్ట్ర వ్యాప్తంగా సంఘాన్ని విస్తరించాలన్న బలీయమైన కోరిక వారికి వుండేది. వారి సూచనల మేరకు విజయవాడ నగర కార్యకర్తలతో నగర సంఘాన్ని ఏర్పాటు చేశాము.

**1987-88** మధ్య కృష్ణా జిల్లాలోని మండల సంఘాలను ఏర్పాటు చేశారు. కృష్ణా జిల్లా ప్రధాన కార్యదర్శిగా నన్ను ఎంపిక చేశారు.

దివి సీమ ఉప్పెన సందర్భంగా నివేదికకు సమాచారాన్ని సేకరించే నిమిత్తం జిల్లా వైస్ ప్రెసిడెంటుగారైన కూతాడ కృష్ణ మూర్తి గారితో కలసి శ్రీ జానకి రామారావు గారు ఆ ప్రంతం ఆదివాసి గ్రామాలను సందర్శిస్తున్న సందర్భంగా జానకి రామారావు గారు అనారోగ్యానికి గురైనారు. అయినా సరే మౌన దీక్షతో, పట్టుదలతో నివేదికను పూర్తిచేయడం నన్ను ఆశ్చర్యచకితుని చేసింది.

శ్రీ జానకి రామారావు గారి పట్టుదల, అంకిత భావం, సేవా ధృక్పధం నాకు మరింత స్ఫూర్తిని కలుగజేశాయి. **1991** లో కొన్ని పరిస్థితుల కారణంగా నా ప్రధాన కార్యదర్శి పదవికి రాజీనామా చేసి 'అఖిల భారత ఏకలవ్య సేవా సమితి' ఆధ్వర్యాన పొన్నా కోటేశ్వరరావు గారి సారధ్యంలో 'కృష్ణా జిల్లా ఏకలవ్య సేవా సమితి' ఏర్పరచాము. ప్రధాన కార్యదర్శిగా నన్ను ఎన్నుకున్నారు. ఆ సంఘం ద్వారా ఇప్పటి వరకు అనేక విజయాలను సాధించాము అంటే అది ఆనాటి జానకి రామారావు గారి స్ఫూర్తే అని గట్టిగా చెప్పగలను.

ఉడుతా భక్తిగా **1998** లో 'ఏకలవ్య అవార్డు' నిచ్చి సత్కరించి నిజమైన ఆదివాసి

నాయకునిగా శ్రీ జానకి రామారావుని నిరూపించడం జరిగింది.

అటు ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ ప్రధాన కార్యదర్శిగా, ఇటు రాజకీయ నాయకునిగా మా జానకి రామారావు గారు ఎంత ఎత్తులకు ఎదిగినా, అధికారం చెలాయించే 'బాస్' గా కాక, నిజమైన కార్యకర్తగా 'ప్రజల మనిషి' గా, మంచి మనసున్న వ్యక్తిగా వారికి వారే సాటి అనిపించుకున్నారు.

ఆదిమ జాతుల అభ్యున్నతికి, వారి సాంఘిక, ఆర్థిక, విద్య, రాజకీయ స్వచ్ఛంద సేవా నిరతిని పెంపొందించడానికి శ్రీ చదల జానకి రామారావు గారు జీవిత కాలంలో అయిదు దశాబ్దాలు వెచ్చించి కృషి చేసిన మహా మనీషి. వారి శేష జీవితాన్నికూడా అణగారిన ఈ ఆదిమ , గిరిజన జాతులకు సేవలందించాలని మనసారా కోరుకుంటూ నా హృదయపూర్వకమైన అభినందన చందనాలను సమర్పించుకుంటున్నాను.

## ఇంకా ఇంకా సన్మానాలు

### శ్రీ మనబోతుల శ్రీరామ

(బి. సి. నాయకులు.)



**పెద్దలు** శ్రీ జానకి రామారావు గారి సామాజిక సేవలు ప్రజలు మరువలేనివి. వారు ఎరుకలు, యానాది, లంబాడీలు, చెంచులు, పాముల, బుడబుక్కల, దొమ్మరి, వడ్డెర మొదలైన సంచార, ఆదివాస జాతుల ఆర్థిక, సామాజిక, సాస్కృతిక ప్రగతికి అహర్నిశలు పోరాడిన త్యాగమయ భారతీయ సమకాలీన నాయకులలో ముఖ్యులు.

శ్రీ చదల జానకి రామారావు ఆంధ్ర రాష్ట్ర ఎరుకల సంఘం అధ్యక్షులుగా అంతకముందు 'కల్లుముంత', 'ఏకలవ్య' బుర్రకథా దళం వ్యాఖ్యాతగా జన జాగృతిని కల్పించిన విఖ్యాత కళాకారులుగా, 'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్' వ్యవస్థాపక-ప్రధాన కార్యదర్శిగా భారత దేశ చరిత్రలోనే నూతనాధ్యాయాన్ని నెలకొల్పారు.

ప్రజల కోసం అష్ట కష్టాలుపడి, నిరుపమాన సేవలు చేసిన శ్రీ జానకి రామారావు పేద ప్రజలను ఇళ్ళ స్థలాలు, రేషన్ కార్డులు, ఋణాలు - ఇలా ఎన్నో రీతుల ఆదుకున్నారు. ఆయన నిరుపమాన సేవలకు ఇంకా ఎన్నో సన్మానాలు చేయవలసివుంది. అందుకు ప్రజలు పూనుకుంటారని, ప్రభుత్వం సయితం కదలగలదని ఆశిస్తున్నాను.

# చంద్రునికొక నూలుపోగు




## శ్రీ మళ్ళ కృష్ణ

(ఆంధ్రప్రదేశ్ బిల్డింగ్ వర్కర్స్ ఫెడరేషన్ కార్యదర్శి)


**శ్రీ** చదల జానకి రామారావు గారు తమ ఏడు దశాబ్దాల సుదీర్ఘ జీవన గమనంలో ఐదు దశాబ్దాలుగా తమ జీవితాన్ని పేద, బడుగు, బలహీన, వర్గాలకు ముఖ్యంగా ఎరుకలు, యానాది, సుగాలి, చెంచు, పాముల, దొమ్మరి, బుడముక్కల మొదలైన అణగారిన వర్గాలవారి అభ్యున్నతికోసం నిరంతరం అవిశ్రాంతంగా కృషి చేశారు.

ఇన్ని దశాబ్దాల సుదీర్ఘమైన సాంఘిక, రాజకీయ మహాప్రస్థానంలో అనేకమైన వడుదుడుకులు, కష్ట నష్టాలు అనుభవిస్తూ, తాను నమ్మిన సిద్ధాంతంకోసం, ఆశయ సాధన కోసం శ్రమించిన, శ్రమిస్తున్న కార్యశీలి, త్యాగశీలి శ్రీ చదల జానకి రామారావుగారు తెనుగు జాతికే ఒక వరం.

చిన్ననాటనే వామపక్ష రాజకీయాలలో ప్రవేశించి, సమాజంలో అణగారిపోతున్న ఆదిమ జాతి సముద్ధరణకు నడుంబిగించి, కార్యాచరణ సాధనకోసం సమర శంఖం పూరించిన మహా సాహసవంతులు శ్రీ చదల జానకి రామారావుగారు సమాజానికే రక్ష.

విషయ విచక్షణ, రాజకీయ పరిజ్ఞానం కలిగిన మహా యోధులు శ్రీ వెన్నెలకం రాఘవయ్య శ్రీ పాలపర్తి వీరయ్య గార్ల సాహచర్యంతో కార్యాచరణ ప్రారంభిం సమాజంలో నీచంగా, నిర్లక్ష్యంగా, నికృష్టంగా, నిర్భాగ్యంగా చూడబడుతున్న ఆదిమ జాతి సంతతి వారికి సమాజంలో ఉన్నత స్థానం కల్పించాలని, వారికి సామాజిక న్యాయం కల్పించాలని, వారి కొరక మంచి గుర్తింపు రావాలని చేసిన కృషి అజరామరం.

మహా కవి శ్రీశ్రీగారన్నట్లు, కదిలేది కదిలించేది పెనునిద్దుర వదలించేది శ్రీ జానకి రామారావు గారి కృషి. ప్రజలను కదలించి, మేలుకొలిపి, వారిలో చైతన్యం కలిగించి, వారి హక్కుల సాధనకోసం ముందుకు మునుముందుకు నడిపించేవాడే నాయకుడు. అటువంటి నాయకత్వ లక్షణాలు పుష్కలంగా వున్నవారు శ్రీ చదల జానకి రామారావుగారు.

భారత దేశ రాజకీయ చరిత్ర గతినే అనతి కాలంలో మార్చివేసిన మహానటుడు శ్రీ నందమూరి తారక రామారావు గారు .ఆయన **1982** లో తెలుగుదేశం పార్టీని స్థాపించినప్పుడు, ఆ రాజకీయాలకు ప్రఖ్యాతులై ఆ పార్టీలో చేరి, క్రియాశీలక పాత్ర నిర్వహిస్తూ గత **17** సంవత్సరాలుగా తన కంటూ ప్రత్యేక స్థానాన్ని ఏర్పాటుచేసుకొని నిరంతరం పేద, బడుగు, బలహీన వర్గాల ప్రజల, ఆదిమ జాతుల వారికి ప్రభుత్వంనుంచి వచ్చే అన్ని రాయితీలు, సంక్షేమ కార్యక్రమాలు అందించడానికి విశేషంగా కృషి చేస్తున్న శ్రీ చదల జానకి రామారావు గారు ధన్యులు.

తమ సుదీర్ఘ జీవన యానంలో శ్రీ జానకి రామారావు గారు 'సప్తతి' సంఘం వారి సత్కారం పొందడం చంద్రునికొక నూలుపోగు చందమే. ఈ సన్మానం అందరూ ఆనందించ దగ్గదే కాదు, అరుదైనది కూడాను ! శ్రీ జానకి రామారావు గారికి జరిగే ఈ సన్మానం వారికే కాదు - ఇది అణగారిన వర్గాలవారికి, ఆదరణకు కరువయినవారికి, అట్టడుగు వర్గాలవారికి, ఆదిమ జాతుల సంతతి వారికికూడాను.

పవిత్రమైన, అనిర్వచనీయమైన, అనుపమాన మైన, అనన్య సాధ్యమైన ఈ సన్మానం శ్రీ చదల జానకి రామారావు గారి నిస్వార్థ, నిరాడంబర జీవితానికి నిలువుటద్దం. వారి త్యాగం, పట్టుదల, కార్యదీక్ష, భావితరాలకు ఆదర్శప్రాయం కావాలని నిండు మనసుతో కోరుకుంటున్నాను.

*

# స్థానిక సేవలు

## షేక్ సైదా

( బి.జె.పి. మైనారిటీ మోర్చా కృష్ణాజిల్లా శాఖ అధ్యక్షులు)



**పూజ్యులు,** గౌరవనీయులు శ్రీ చదల జానకి రామారావు సంచార - ఆదిమ జాతుల ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, ప్రగతి కోసం అహర్నిశలు పోరాడిన యోధులు.

కృష్ణా జిల్లా కోపరేటివ్ బ్యాంకి డైరక్టరుగాకూడా శ్రీ జానకి రామారావు ఆదిమ జాతుల ఆశాజ్యోతి.

స్థానికంగా నందిగామ పంచాయతీ వార్డు మెంబరుగా, ఉపాధ్యక్షునిగా నందిగామ పట్టణ ప్రజలకు కూడా సేవలు అందించిన ప్రియతమ నాయకులు శ్రీ చదల జానకి రామారావు గారి సేవలు మరువరానివి.

# నేర్చుకుందాం !

## షేక్ అబూ బేకర్

(కాంగ్రెసు నాయకులు)



**చదల** జానకి రామారావు గారి సాంఘిక జీవితమంత లేదు నా వయసు. ఆయన సేవల ముందు మేము మరిగుజ్జులం ! సేవాభావం, కార్యదీక్ష, నిష్కాపట్యం, ముఖ్యంగా చిత్తశుద్ధి నేనే కాదు, ఏ రాజకీయ కార్యకర్త అయినా, ఏ స్వచ్ఛంద సేవకుడైనా ఆయన నుంచి నేర్చుకోవలసిందే ! కుల మత వర్గ రాజకీయాలకు అతీతం ఆయన సేవలు. మనకు వున్న వ్రేళ్ళపై లెక్కించదగిన నిజాయితీగల వేత్తలలో శ్రీ జానకి రామారావుగారు నిస్సంకోచంగా ఒకరు. 'సప్తతి' సందర్భంగా వారికి చేతులెత్తి నమస్కరిస్తున్నాను.

*

# గుండెలలో స్థానం

## శ్రీ కె. రవీంద్రనాథ్



**ఆదివాస**-సంచార జాతుల సంక్షేమమే ధ్యేయంగా, తమ జీవిత ఆశయంగా కృషిచేస్తున్న ధన్యజీవి శ్రీ చదల జానకి రామారావు.

భారతీయ, ఆంధ్ర రాష్ట్ర గిరిజనాభివృద్ధి సంఘం సభ్యునిగా, కార్యదర్శిగా వివిధ ప్రాంతాలలో సంచరిస్తూ, తమ సేవలు అందిస్తూ, ప్రభుత్వ అవార్డులు, రివార్డుల కంటే ప్రజల గుండెలలో పదిలమైన స్థానం సాధించిన వ్యక్తి శ్రీ చదల.

రాజకీయ రంగంలో ధనార్జనకు అవకాశం వున్నా, తను నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి సాధారణ వ్యక్తిగానే నిలచిన జానకి రామారావు గారికి ప్రజాసేవలో కొనసాగే ఆయురారోగ్యాలను, మానసిక పుష్టిని భగవంతుడు ఇవ్వాలని కాంక్షిస్తున్నాను.

# నిజమైన నాయకుడు

## శ్రీ కొమరగిరి కృష్ణ మోహన రావు

(ఎడిటరు :-ʻశ్రీవాణిʼ మాస పత్రిక)



**శ్రీ** చదల జానకి రామారావు గారు నాకు చిరపరిచితులు. ఎట్టి అధికారాలను ఆశించకుండా నిస్వార్థంగా, నిర్విరామంగా, నిరంతరంగా పేద ప్రజల సంక్షేమం కోసం కృషి సల్పుతున్న జానకి రామారావు గారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. ఆయన పేద ప్రజలకు నిజమైన నాయకుడు. వారి సేవలకు గుర్తింపుగా సరయిన ఉన్నత పదవి త్వరలోనే వారిని వరిస్తుందని విశ్వసిస్తున్నాను.

## ఆశాకిరణం

### శ్రీ కొమరగిరి రామమోహన్

(కరస్పాండెంటు : వివేకానంద హైస్కూలు, నందిగామ)

**స్నేహశీలి,** సహృదయుడు, జీవితాంతం ఆదివ జాతుల వారి ఉన్నతికి అపారమైన కృషి చేసిన, చేస్తున్న మహామనిషి శ్రీ చదల జానకి రామారావు. వారు నాకు గత 35 సంవత్సరాల సన్నిహిత పరిచయులు. ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్‌ను ప్రారంభించడమే కాక, అఖిల భారత స్థాయిలో గిరిజనాభివృద్ధి కొరకు అహర్నిశలు కృషి చేస్తున్న కార్యశీలి శ్రీ జానకి రామారావు.

పార్టీలకు అతీతంగా, తన అట్టడుగు జాతివారి అభివృద్ధే ప్రధానంగా నిరంతర కృషే వారి జీవనరాగం. పనులను కార్యదక్షతతో ఇటు హైదరాబాదు అటు ఢిల్లీ వరకు వెళ్ళి సాధించగలరు.

వారి 70 వసంతాల సందర్భంగా వారికి ఆయురారోగ్యాలను భగవంతుడు ప్రసాదించాలని కోరుతున్నాను.

## అజాతశత్రువు

### శ్రీ పారేపల్లి సాయిబాబు

(వాసవి యువసేన అధ్యకులు)

**ఆదివం** జాతుల ఆశాజ్యోతి, ప్రముఖ సంఘ సేవకులు, నిరంతరం ప్రజాసేవలో నిమగ్నమై తాను కొవ్వొత్తిలా కరుగుతూ వేలాది మందికి వెలుగుబాటను నింపుతున్న ప్రియతమ నాయకులు శ్రీ చదల జానకి రామారావు గారికి 'సప్తతి' సన్మానం చేయడం ఎంతో ముదావహం.

తమ 70 వసంతాల జీవన యానంలో ఎన్నో తీపి, చేదు అనుభవాలను చవిచూచి

ఉన్నత స్థాయికి ఎదిగిన మహోన్నతమైన వ్యక్తి. ఔన్నత్యం, నేర్పు, మనోబలం, అంతర్-బాహ్యా పవిత్రత, అజాత శత్రుత్వం, నిగర్వత్వం కలగలిపిన ఉత్తమమైన ప్రజానాయకులు మన చదల జానకి రామారావు గారు.

"ఉత్తముడు చేసిన పనిని అన్యులు సయితం అనుకరిస్తారు.

అతను నెలకొల్పిన ప్రమాణాలనే అనుసరిస్తుంది సంఘం."

# స్వాతి ముత్యం



## శ్రీ చదల వెంకట గోవర్ధన రావు

(అసిస్టెంట్ మేనేజరు : ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియ)

**ఆదివ**ము జాతుల అభ్యుదయానికి అహర్నిశలు శ్రమించి అర్ధశతాబ్దికి పైగా సేవలందించి, ఎన్నో గిరిజన కుటుంబాలను అభివృద్ధి మార్గాన నడిపిన మహావ్యక్తి శ్రీజానకి రామారావు గారు.

సంచార జాతుల కుటుంబాలను చైతన్యపరచి సమాజంలో ధైర్యంగా, సగౌరవంగా బ్రతకగలిగేలా ముందుకు నడిపించి, వారి హక్కుల సాధనకై పోరాడి, జీవనోపాధి మార్గాలను సూచించి, వారి పిల్లల విద్యాబుద్ధులకొరకు వసతి గృహాలను ఏర్పరచి, అణగారిన కుటుంబాల ఆశ్రయంకొరకు కాలనీలను నెలకొల్పి, వారి ఆర్థిక, సాంఘిక, సాంస్కృతికమైన అభివృద్ధికి అవిరళమైన కృషి సల్పి, తమ శక్తివంచన లేకుండా సేవల నందించిన మహామనిషి, గిరిజన జాతుల స్వాతిముత్యం శ్రీ చదల జానకి రామారావుగారు.

ఆ మహామహుని సారథ్యంలోని వసతి గృహంలోనే నా అయిదవ తరగతి విద్యాభ్యాసం చేశాను. ఆ కాలంలో వారి ఆదరణ, ఆప్యాయతలు మరువలేనివి. ఆయన వద్ద క్రమశిక్షణతో విద్యనభ్యసించడమే ఇప్పటి నా పురోభివృద్ధికి, ప్రగతికి పునాదులై నాంది పలికింది. నావలనె ఎందరో నిరుపేద విద్యార్థులు ఈనాడు ఎంతో ఉన్నత స్థితికి చేరుకోగలగడానికి, వారి సేవా దృక్పథంతో కూడిన వసతి గృహం ప్రగతి మార్గాన్ని నిర్దేశించింది. మా తండ్రిగారు కాలధర్మం చెందిన సమయాన ఆపుకోలేని ఉద్వేగంతో

ఉప్పొంగిన ఆయన కన్నీటిని చూడగానే, గంభీరమైన ఆ వదనంలో తన వారి వేదనను తాళలేని సున్నితమైన పసి హృదయాన్ని చూడగలిగాను. ఇది కవితా భాష కాదు - నా హృదయానుభూతి.

బహుముఖ ప్రజ్ఞాశాలి, అర్ధశతాబ్దికి పైగా ఆదిమ జాతుల అభివృద్ధికి కృషిసల్పిన అట్టి మహాయోధునికి 'సప్తతి' సన్మానం జరపడం చంద్రునికొక నూలుపోగు మాత్రమే. వారికి, మీకు మా హృదయపూర్వకమైన అభినందనలు.

# అభినందనీయం



## శ్రీ కె. జోషి

(ప్రథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయులు, తాటిగుమ్మి)

**గౌరవనీయులైన** శ్రీ చదల జానకి రామారావు గారు వ్యవస్థాపించిన హాస్టలులో 1958 లో ఆరవ తరగతి చదువుటకు చేరి ఎస్.ఎస్.ఎస్.సి వరకు విద్య పూర్తిచేశాను. నేను ఉపాధ్యాయునిగా పని చేయడానికి దోహదపడిన వారికి నా హృదయపూర్వకమైన నమస్సుమాంజలులు.

నా వలె ఎంతో మంది కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో ఉద్యోగాలు చేయడానికి వారు చేసిన అవిరళమైన కృషి ఎంతో శ్లాఘనీయమయినది. వారు తమ కర్తవ్యంగా భావించి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాలలో చేసిన నిస్వార్ధమైన కృషి అభినందనీయం.

# అరుపు



## శ్రీ బుగ్గినేని నరసింహారావు

**వార్ధక్యం** కారణంగా కొంచం వంగి నడుస్తూనో, గూడు రిక్షాలోనో, ఆటోలోనో, చిన్నకారులోనో ప్రయాణించే చదల జానకి రామయ్య గారిని నందిగామ గాంధీ బొమ్మ

సెంటరులో తరచు చూస్తూ ఉంటాను. వెంట ఎప్పుడు ఇద్దరు ముగ్గురు సహచరలు. ఖాదీ వస్త్ర ధారణ. శిల్కు చొక్కాల వారినుంచి గోచిపాతరాయుళ్ళ వరకు దారి పొడవునా ఆయనకు ప్రత్యేకాభివందనలు. ఎవరీయన ?

ఆయన ఎవరో తరువాత తరువాత తెలుసుకున్నాను. కొందరు రామారావు అని మరి కొందరు రామయ్యా అని సంబోధించే ఆయన- నందిగామ జాతీయ రహదారి కూడలిలో కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠించదగిన లక్షలాది పేదప్రజల ప్రియతమ నాయకుడు.

నిజమే సుమా అని పించింది - నందిగామలో దాదాపు మూడవ వంతు భాగంగా వున్న ఎరుకలు, యానాది, సుగాలీ, పాములు, బుడబుక్కల మొదలైన ఆదివాస ఆదిమ జాతుల వారి నవజీవన విధానాలను పరిశీలించిన పిదప. వీరికిప్పుడు కూడుకు, గుడ్డకు, నీడకు కొదవ లేదు. సంసారయుతమైన నాగరిక సమాజపు స్రవంతిలో వీరూ భాగస్వాములే. ఇదంతా అ చదల రామారావు గారి పుణ్యమే అంటారు - అన్నివర్గాలకు చెందిన వృద్ధులు, యువకులు, పిన్నలతో సహా - ఏకగ్రీవంగా.

నాకు తెలిసిన నందిగామలోనే -కాదు మొత్తం ఆంధ్రప్రదేశ్ అంతటా తమ సంఘం ఆసరాతో శ్రీ చదల జానకి రామారావు గారు ఆదిమ జాతులలో ఇట్టి పరివర్తననే తీసుకు వచ్చారట, ఇట్టి సంస్కరణలనే కొనసాగించారట. నిజానికి, ఆయన మానవతకే కేతనం!

మాకు కూడా - అంటే అగ్రవర్ణాలు అనుకుంటూ విర్రవీగేవారికి కూడా శ్రీచదల జానకి రామారావు వంటి ఒక నాయకుడు - కనీసం ఒక్కడైనా- వుంటే ఎంత బావుండును! అని నా బోటి నిరుపేద నిర్వేదనాపూర్వకమైన అరుపు.

ఉద్యమ నాయక, నీకు ప్రణతులు !

# అభినందనలు

## శ్రీ వి. కృష్ణార్జున రావు

**సంచార** ఆదివాస జాతుల ఆర్థిక, సామాజిక ప్రగతికోసం అహర్నిశలు పోరాడి, పోరాడుతున్న నిష్కళంక సేవాతత్పరులు శ్రీ చదల జానకి రామారావు గారు

త్యాగశీలి, రాజకీయ రంగంలో వారి చిత్తశుద్ధి, విధి నిర్వహణలోని సామర్థ్యం అనితర సాధ్యం, అనన్య సామాన్యం. శ్రీ జానకి రామారావుగారు మరిన్ని సేవా కార్యక్రమాలలో పాల్గొని గిరిజన, సంచార, ఆదిమ జాతులవారి సామాజిక, ఆర్థిక, విద్య, వైద్య, రాజకీయ రంగాల అభ్యున్నతికి తోడ్పడాలని; అందుకు వారికి భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

# ఉడుంపట్టు

## శ్రీ చదల రాఘవులు



**మా** పెద్దన్న చదల జానకి రామారావు గారిది ఉడుంపట్టు. కుటుంబ పరంగాగాని, సంఘపరంగా గాని, రాజకీయంగా గాని ఏ రంగంలోనైనా తలచుకున్నదే తడవు- కార్యసాధన వరకు పట్టిన పట్టు వదలని దిట్ట. ముఖ్యంగా బడుగు జీవులైన మా సంచార ఆదిమ జాతుల వారికి వేలాది మందికి చదువు - సంస్కారాలను నేర్పడంలో, కుల వర్గాల సంస్కరణలో, వారికి స్థలాలు, ఇళ్ళు, పొలాలు, ఉద్యోగాలను ఇప్పించడంలో పట్టిన పట్టు విడవకుండా ఈ వయసులో నేటికీ అవిశ్రాంతంగా కృషి చేస్తూనేవస్తున్నారంటే ఆయన పట్టుదల ఎలాంటిదో ఊహించుకోవచ్చు. అధికార - అనధికార ప్రముఖులను నేరుగా కలుసుకుని, విషయాలను విపులీకరించి పనులు సాధించుకురావడం ఆయన ప్రత్యేకత. అట్టి అన్నగారికి తమ్ముడు అయినందుకు నేను నిజంగా గర్విస్తున్నాను.

*

# మేలుకొలుపు



తిమ్మసర్తి నాగేశ్వర రావు
(ట్రైబల్ వెల్ఫేర్ సంఘ సెక్రటరి)

**పేద** ప్రజల ప్రియతమ నాయకులు శ్రీ చదల జానకి రామారావు గారికి 'సప్తతి' సన్మాన సందర్భంగా ఆయన జీవిత చరిత్రను పుస్తక రూపంలో విడుదలచేస్తున్న కమిటీ సభ్యులకు ముందుగా నేను ధన్యవాదాలను తెలుపుకుంటున్నాను.

భారత దేశానికి స్వాతంత్ర్యాన్ని తీసుకు వచ్చిన ప్రముఖులలో మహాత్మా గాంధీతో సహా ఎందరెందరో ప్రముఖులు వుండగా; ఎరుకుల, యానాది, సుగాలి తదితర గిరిజన జాతుల అభ్యున్నతికి పొన్నా సత్యనారాయణ, పోట్లూరి చెంచయ్య, తిరువీధుల సాంబయ్య, పాలపర్తి వీరయ్య, చదల జానకి రామారావు, పొన్నా కోటేశ్వర రావు మొదలయిన ప్రముఖులు వున్నారు.

అమానుష క్రిమినల్ ట్రబల్ చట్టాన్ని (సి.టీ యాక్టు) రద్దుకోసం, దాని స్థానంలో అంతే క్రూర స్వభావంతో ప్రవేశపెట్టిన 'అలవాటుపడిన నేరస్తుల చట్టం' రద్దుకోసం అహర్నిశలు శ్రమించి, మా స్వాతంత్ర్యం గురించి పాటుబడిన ప్రముఖులలో ముఖ్యులు శ్రీ చదల రామారావు గారు. ఎన్నో కష్టాలు అనుభవించిన త్యాగమూర్తి. ఆనాడు యువకునిగా శ్రీ పొన్నా సత్యనారాయణ గారి స్ఫూర్తితో ఉద్యమ శంఖారావాన్ని పూరించిన ఫలితమే ఈనాడు చట్ట సభలలో, ప్రభుత్వ పదవులలో మా వాణిని వినిపించుకోగలుగుతున్నాము.

ఆదివాసులు తరతరాలుగా కల్లు,సారా, మత్తు పానీయాలకు అలవాటుపడి వారి ఆరోగ్యాలను, కుటుంబాలను పాడుచేసుకుంటున్నారని కలతచెంది పొన్నా సోదరులు రచించిన కల్లుముంత, ఏకలవ్య, పేద బ్రతుకులను బుర్ర కథల రూపంలో చెప్పుకుంటూ పల్లె పల్లెలో ప్రదర్శనలు ఇస్తూ, వారి యోగ క్షేమాలను తెలుసుకుని, ఆ సమస్యలను ఎదుర్కొని, పరిష్కరించిన ఇట్టి మహానాయకులు ఎందరో- అందరూ అందుకోండి నా నిండు నమః సుమాంజలులు!

గిరిజన ప్రజలలో చైతన్యం రావాలని, వారి జీవన ప్రమాణాలను అభివృద్ధిపరుచుకోవాలని కోరుతూ ప్రదర్శించిన ముందడుగు నాటిక వారి త్యాగాలకు నిదర్శనం. సంఘ సంస్కర్తలు నడచిన, నడిపించిన ఆశయ ఆదర్శాలే నేటి యువతరానికి ముందడుగు కావాలి. వారు చూపిన ధైర్య సాహసాలే నేటి యువతరానికి చైతన్యం కాగలగాలి. ఆదిమ జాతుల వారందరూ ఈనాడు వారికి రుణపడి వున్నారు.

శ్రీ చదల జానకి రామారావు గారు జయమే గాని అపజయం ఎరుగరు. అట్టడుగు బలహీన వర్గాలకు, ఆదివాసీయులకు ఆప్తుడు, ఆరాధ్యుడు. అన్నమో రామచంద్రా అని అలమటిస్తున్న వారి బ్రతుకులలో వెలుగు చూపిన ఆశాజ్యోతి శ్రీ జానకి రామారావు గారి స్ఫూర్తి, కార్యదక్షత, ధైర్యసాహసాలు, సేవాభావాలు నేటి యువతరానికి మేలుకొలుపు కావాలని కోరుకుంటున్నాను.

## భాగస్వామినే!

### శ్రీ పుట్టబంతి వెంకటేశ్వర్లు

(సంఘ సేవకులు, కంచికచర్ల)



శ్రీ చదల జానకి రామారావు 1948 నుంచి నేటి వరకు సంఘ సేవలో అగ్రగణ్యులని చెప్పక తప్పదు. ఆదివాసి జాతుల్లో అనగా కొండలలో గుట్టలలో నివసించే ఎరుకల, యానాది, లంబాడి, చెంచులు, పాముల, బుడబుక్కల, వడ్డెర, దొమ్మర మొదలయిన సంచార జాతుల వారికి సాంఘికంగా, ఆర్థికంగా ఎంతో వెనుక బడిన వారికి సేవలందించారు. అహర్నిశలు ఎన్నో ప్రయాసల కోర్చి, వాననక ఎండనక రేయింబవళ్ళు ప్రచారంచేస్తూ ఎంతో చైతన్యం కలిగించిన వారిలో అగ్రగణ్యులు. స్వార్థమెరుగని మహామనిషి.

అప్పటి ప్రభుత్వం వారు ఆదివాసులపై ( ఎరుకల ) సి.టి.యాక్టు పెట్టి, ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి తమ గ్రామ మునసబు ద్వారా మంచివాడని చీటి పొంది ( అంటే దొంగ కాదని అర్థం )వెళ్ళవలసివచ్చేది. ఇలా ఎన్నో బాధలుపడే ఈ ఎరుకల వారి స్వేచ్ఛకోసం ప్రభుత్వంతో పోరాడి సి. టి. యాక్టును రద్దు చేయించిన వారిలో శ్రీ జానకి రామారావు ఒకరు.

శ్రీ చదల జానకి రామారావును ఘనంగా సత్కరించడానికి ప్రజలు, అభిమానులు పూనినందుకు సంతోషం. వారితో నేను కూడా ఏకీభవిస్తున్నాను. అభినందన సంచిక ప్రచురణలో నేనూ భాగస్వామినే !

# అప్పటికి అప్పుడే



## శ్రీ గరిక లక్ష్మణరావు

( ఆదివాసి మండల అధ్యక్షులు, జగ్గయ్యపేట)

1960 లో చదల జానకిరామారావుగారు, పొన్నా సత్యనారాయణ గారు జగ్గయ్యపేట వచ్చి మా ఎరుకల కాలనీ పెద్దలైన శ్రీ మొగలి గడ్డియ్యను తిమ్మసర్తి నాగయ్యను, కలుపుకుని ఈ ప్రాంతంలో ఎరుకలు, యానాది, లంబాడి కులస్తులకు పోలీసువారు పెట్టేబాధలను గ్రహించి, ఇక్కడ ఒక సంఘాన్ని ఏర్పాటుచేసి బహిరంగసభ పెట్టారు. అప్పుడు నేను ఎస్. ఎల్. సి చదువుతున్నాను.

బూదవాడ గ్రామం జగ్గయ్యపేటకు 12 కిలోమీటరుల దూరంలో వున్నది. అక్కడ గ్రామ మునసబు ఈ నిరుపేద జాతులను పెట్టే బాధలను తెలుసుకుని వారు అక్కడ కూడా సభలు పెట్టి మునసబు గారితో స్వయంగా, మాట్లాడి, వారి బాధలను పోగొట్టారు.

జగ్గయ్యపేటలో ఎరుకలు, యానాది కులస్తులు సుమారు మూడు వందల మంది నివాసం ఉంటున్నారు. మేము చెరువు ప్రక్కన వున్నాం. ఆర్. టి. సి. బస్‌స్టేషన్ నిర్మాణానికి చెరువు ప్రక్కన వున్న మా స్థలాన్ని కోరారు. మేము చదల జానకిరామారావు గారిని ఆశ్రయించాము వారు వెంటనే జిల్లా కలెక్టరు గారితో సంప్రతించి మాకు ఆర్. టి. సి. డిపో ప్రక్కన 13. 29. ఎకరాలను ఇండ్ల స్థలాలుగా ఇప్పించేసారు.

ధర్మవరప్పాడు లంబాడి తండాకు చదల జానకి రామారావు గారు, చదల అంజనేయులుగారు, శ్రీ అమ్రయానాయక్, శ్రీ శ్రీరామ్ నాయక్‌గారు, నేను వెళ్ళి తండా నాయకులతో మాట్లాడాము. వారు ఋణాలను అడిగారు. శ్రీ జానకి రామారావు గారు వెంటనే ఆంధ్రాబ్యాంకు వారితో మాట్లాడి ఆ తండాను వారు దత్తత తీసుకొనేటట్లు చేశారు.

జగ్గయ్యపేట వత్సవాయి పెనుగంచిప్రోలు మండల గ్రామాలలో శ్రీ జానకి రామారావు మమ్ము కలుపుకుని పర్యటించిఅక్కడ నిరుపేదల జీవనాధారాలను తెలుసుకుని

విజయవాడ సబ్‌కలెక్టరు గారితో సంప్రతించి, చేతి వృత్తులవారికి మనిషికి మూడు వందల రూపాయల చొప్పున ఇప్పించినారు.

అతి ముఖ్యమైన పనిమీద చదల జానకి రామారావుగారు జగ్గయ్యపేట వచ్చి కార్యకర్తలను కలుసుకున్నారు. ఇక్కడ వారిని కలుపుకొని వేదాద్రికి కాలినడకన అక్కడ వెళ్ళి అక్కడ వున్న సుగాలీలను కలుసుకున్నారు. వారికి కావలసిన వృద్ధాప్యపు పెన్షన్ ఇండ్ల స్థలాల గురించి తెలుసుకున్నారు. అప్పుడు బస్సులు లేనందున కాలి నడకనే వేదాద్రి నుంచి జగ్గయ్యపేట వరకు నడచివచ్చారు. మరునాడే ఉన్నతాధికారులతో సంప్రతించి, వాటిని ఏర్పరచారు

## సుగ్రీవ ఆజ్ఞ

### శ్రీ బొజ్జగాని రామకోటయ్య

(నందిగామ మండల పరిషత్తు సభ్యులు)



**నేను**, మా చదల జానకి రామారావు బాల్యమిత్రులం. వయస్సులో కూడా రెండు - మూడు సంవత్సరాలు మాత్రమే తేడా అనుకుంటాను. చిన్ననాట మాగల్లులో మా నాన్న బొజ్జ గాని వెంకయ్యగారి ప్రోత్సాహంతో మా ఇంటనే మా జానకి రామారావు బుఱ్ఱకథ చెప్పడం నేర్చుకున్నట్టు గుర్తు. ఏండ్లు గడిచాయి. మా జానకి రాముడు సామాజికంగా చాలా ఎత్తులకు పెరిగాడు. అయితే, అతను ఎంతగా పెరిగాడో అంతగానూ నమ్రతను, సంస్కారాన్ని, స్నేహభావనను పెంచుకున్నాడు. చిన్ననాటి చెలికానినైన నన్ను మూడు దశాబ్దాల క్రితం తనతో పాటే నందిగామకు తీసుకువచ్చాడు. ఆనాటి తాలూకాలో - అనగా నేటి ఏడు మండలాలలో - ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ బాధ్యతల పర్యవేక్షణకు నన్ను కార్యదర్శిగా నియమించారు. మాగల్లు సొసైటీకి రెండుసార్లు ఎన్నిక చేయించాడు. నాలుగున్నరేళ్ళ క్రితం నందిగామ మండలి పరిషత్తు సభ్యునిగా గెలిపించాడు.

మా సంఘం ఆధ్వర్యాన నందిగామ తాలూకాలో, పట్టణంలో ఎన్నో ప్రజాహిత సేవాకార్యక్రమాలను అమలుపరచడం ఇప్పుడు తలచుకుంటేనే ఆశ్చర్యం వేస్తుంది. సైకిళ్ళు, సైకిల్ రిక్షాలు, బడ్డీకొట్లు, ఋణాలు, వృత్తి పరికరాలను ఎన్ని ఇప్పించామో

లెక్కలేదు. చేపలు పట్టుకునే వారికి వలలను, పెట్రొమాక్స్ లైట్లను కూడా ఇప్పించాము. మైకులు, కిరాణ దుకాణాలు, ఫిష్ మార్కెట్‌లు గొర్రెలు, మేకలు- ఓహ- ఇలా చెప్పుకుంటూపోతే ఎన్నో ! విచిత్రం ఏమంటే - మాద్వార బ్రతుకు తెరవును ఏర్పరచుకున్నవారు మమ్ము మరచిపోయేవారు ! ఇది పేదల నైజం కాబోలునని మేము సరిపెట్టుకునేవాళ్ళం.

జొన్న సంకటికి నోచుకోని రోజులలో ఆయన ! పల్లెల వెంట కాలికి బలపం కట్టుకు తిరిగి అనాధ పిల్లలను వెతికి తీసుకువచ్చి హాస్టళ్ళలో సౌకర్యాలను కల్పించి చదివించేవారు. ఆరోజులలో తలచుకుంటేనే మాకు గర్వకారణంగా వుంటుందని, నేటితరానికి చోద్యంగా వుంటుంది.

కుల మత వర్గ రాజకీయ వివక్షత లేకుండా, రెండు దశాబ్దాల పోరాటం పిదప నాలుగు వందల నిరుపేద కుటుంబీకులకు నందిగామలో దేవినేని వెంకటరమణ కాలనీని నిర్మింప చేయడం ఒక్క మా చదల జానకి రామారావుకే సాధ్యమయ్యింది. ఇటువంటి అనన్య సామాన్యమైన ఎన్నో సాహస పథకాలను సాధించాడు మా జానకి రామారావు. కనుకనే, నేటికి అతని మాట మాకు సుగ్రీవాజ్ఞ !

## ఇంటి దీపం పెట్టుకుని



— చడమల తిరుపతయ్య
( ఆదిమ జాతి సేవక్ సంఘ్,

నందిగామ నియోజకవర్గం అధ్యక్షులు)

**గిరిజన** గణం గళం శ్రీ చదల జానకి రామారావు గారి సప్తతి సన్మాన కార్యక్రమం చాలా గొప్పది. ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ ప్రధాన కార్యదర్శిగా శ్రీ చదల జానకి రామారావుగారి సేవలు మరువరానివి, వర్ణించనలవిగానివి. మన రాష్ట్రంలో గిరిజన కుటుంబాలు ఇప్పుడు తమ ఇంట దీపం వెలిగించుకొని ఈ మహనీయుని పేరు తలచుకుంటారు.

కృష్ణా జిల్లా నందిగామలో నిరుపేద యానాది కుటుంబంలో జన్మించిన నన్ను ఆదిమ జాతి సేవక్ సంఘంలో చేర్చి, అనేక కార్యక్రమాలలో పాలుపంచుకొనేట్టు చేసి,

వారి అడుగుజాడలలో ఎన్నెన్నో అభివృద్ధి కార్యక్రమాలలో ముందుకు నడిపించారు. వారి సేవలు వినూత్న చరిత్ర వారి దీవెనలే నాకు, మా జాతికి శ్రీరామరక్ష.

ఆ త్యాగశీలి ఆశీస్సులతో, ఆదేశాలతో నందిగామ, కంచికచర్ల, వీరులపాడు, చందర్ల పాడు మండలాలలో నేను ఒక కార్యకర్తగా, ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలలో పాలుపంచుకున్నాను.

వారు చేసిన త్యాగాలు, సేవల ఫలితంగా ప్రస్తుతం ఎన్నో గిరిజన కుటుంబాలు ఎంతో వెలుగులో పయనిస్తున్నాయి. ఎంతోమంది విద్యార్థులు పైచదువులు చదివి ఐ.ఎ.ఎస్. ఐ. పి. ఎస్. తదితర ఉన్నత ఉద్యోగాలలో రాణిస్తున్నారు.

పల్లెపట్టులలో గిరిజన కుటుంబాలు రోడ్డు ప్రక్కల పోరంబోకు స్థలాలలో వెదురు కర్రలతో గుడిశలు, గుడారాలు వేసుకొని జీవించేవారు. శ్రీ జానకి రామారావు గారు వారి బాధలు చూసి, వారి వద్దకు స్వయంగా వెళ్ళి వారి ఆర్థిక భాధలను తెలుసుకుని ప్రభుత్వంవారితో చర్చించి, ప్రభుత్వంనుంచి సహాయకకార్యక్రమాలను అమలు జరిపించారు. ఇందుకు నిదర్శనం ప్రతీ పల్లెలలో వెలసిన గిరిజన కాలనీలే, అంతే కాదు, కాలనీలలో వారికి కావలసిన విధ్య, వైద్య, మంచినీరు, విద్యుచ్ఛక్తి సదుపాయాలను కల్పించారు. మన జానకి రామారావు గారు మా ఆదివాస గిరిజనులకే కాదు, మైనారిటీ వర్గాలకు, బి. సిలు, ఇతర పేదలకుకూడా వారి శాయశక్తుల, పై అధికారుల సహాయ సహకారాలతో ఎంతో మేలుచేస్తున్న నిజమైన ప్రజలమనిషి.

ఇట్టి మహనీయుని సహాయ సహకారాలు, మునుముందు కూడా మాకు దక్కవలెనని, వీరి చేయూత దీవెనలు కలకాలం మాకు లభించవలెనని దేవుని ప్రార్థిస్తున్నాను. వారికి మా గిరిజన కుటుంబాల తరపున ధన్యవాదాలను తెలుపుకుంటున్నాను

*

# అన్నగారి అంతరంగం

## శ్రీ చదల ఆంజనేయులు

( ఆంధ్ర రాష్ట్ర ఆదమ జాతి సేవక్ సంఘ్ సహకార్యదర్శి)



**మా** తల్లి దండ్రులు చదల అమ్మయ్య అచ్చమ్మ గార్లకు ఎనమండగురు సంతానం. మాది నిరుపేద కుటుంబం. పెద్దఅన్న సీతారామయ్యలు చనిపోయారు, చిన్నన్న జానకి రామారావు గారే ఇక పెద్దన్న. మానాన్నగారూ పోయారు.

ఆర్థిక బాధలవల్ల మా అన్నయ్య చదువు మానేసుకున్నారు. కుటుంబం భారం అయినందున అన్న జానకి రామారావుగారు తల్లి అచ్చమ్మ గారికి తోడుగా వున్నారు.

ఆరోజులలో ఎరుకుల కులస్థులు గ్రామంలో దొంగలు రాకుండా కాపలా కాసేవారు. మా నాన్న గారు చనిపోయినందున గ్రామరక్షణ కోసం మా తల్లిగారు కాపలాగా తిరిగుతుండేవారు, మా అన్నయ్య దానిని గమనించి తల్లితోనే రాత్రివేళలలో తిరిగేవారు. పగలు కుటుంబ పోషణకై అన్నిరకాల పనులకు వెళ్ళేవారు.

గుంటూరు జిల్లా నుంచి పాండురంగ భజన, పంతులుగారు మాగండేపల్లి గ్రామం వచ్చారు. కొంతమంది పాండురంగ భజనను నేర్చుకుంటున్నారు. ఆ విషయం మా అన్నయ్య తెలుసుకుని తల్లి అనుమతితో ఉత్సాహంగా భజన పంతులు గారి దగ్గర శిష్యునిగా చేరాడు. ఆరు నెలల కాలంలోనే పట్టుదలతో పాండురంగ భజనలు నేర్చుకొని సర్టిఫికెట్ పొందాడు.

కంచికచర్ల ఫీర్కా అల్లూరు గ్రామం రెడ్లు మా గ్రామం వ్యక్తి ద్వారా తెలుసుకొని మా అన్న జానకిరామారావు గారి దగ్గరకు 20 మంది వచ్చారు. 'మా గ్రామంలో కొంతమంది పాండురంగ భజన నేర్చుకొనే కుతూహలంతో ఉన్నారు. మీరు భజన పంతులుగా వచ్చి మా గ్రామంలోని 30 మందికి భజనను నేర్పాలి' అని అడిగారు. మా అమ్మ గారి అనుమతితో అన్నగారు అల్లూరు వెళ్ళారు. అక్కడ అందరికీ చక్కగా, త్వరితగతిన భజనలను నేర్పి తిరిగి వచ్చారు. కుటుంబ పోషణ నిమిత్తం నందిగామ ఫీర్కా రాఘవాపురం వెళ్ళిఆ ఊరి మునసబు గారి సహకారంతో కుట్టు మిషను కొనుక్కొని దర్జి పనిలో నిమగ్నమయారు.

మా అన్నయ్య సంధ్య సమయాలలో మధుర రాగాలను ఆలపించేవారు. ఆయన స్నేహితులు కూడా ఆయన రాగానికి ముగ్ధులై నేర్చుకోవడానికి మా ఇంటికి వచ్చేవారు. ఇది గమనించిన మా గ్రామంలో ప్రముఖ కమ్యూనిష్టు నాయకులు, ప్రజానాట్యమండలి పోషకులు బెజవాడ సుబ్బరెడ్డిగారు మా అన్నయ్యను కమ్యూనిస్టు పార్టీలోకి ఆహ్వానించారు. గ్రామీణ ప్రాంతాలలో పేద ప్రజలను ఉత్తేజపరుస్తూ ముందడుగు మా భూమి నాటకాలలో, నటించారు. ఎల్లమంధా పాత్రను మరొక కీలకమైన పాత్రను పోషించారు.

ఒకసారి మా గ్రామానికి ఆనుకుని ఉన్న కమ్మవారి పాలెంలోకి మా అన్నయ్య ఆయన స్నేహితులు చెలమయ్యగారు ప్రవేశించారు. అప్పుడు మిలిటరీ వారు ఆ గ్రామంలో కొందరిని తరిమి కొడుతున్నారు. దానిని గమనించిన మా అన్నగారు, ఆ స్నేహితుడు తప్పించుకోవడానికి ప్రయత్నించారు. ఎటూ దారిలేనందున , వైరా ఏటిలోకి దూకి మునగ ఈతతో మిలటరీ వారికి కనిపించకుండా మా గ్రామం వొడ్డుకు చేరారు.

పొన్నా సత్యనారాయణ గారి ప్రోత్సాహంతో ఆదివాస జాతుల కొరకు సంఘంలో ప్రవేశించారు. వీరికి తోడు గుంటూరు జిల్లా రామేశ్వరం నాగయ్యగారు శ్రీ పాలపర్తి వీరయ్య గారు, ఇంకా అనేక మంది నాయకులతో రాష్ట్ర వ్యాప్తంగా ఈ పేద ప్రజల బాగోగులను తెలుసుకుని విస్తృతంగా ప్రచారం చేశారు.

**1952 - 53** లో నందిగామ గ్రామంలో శ్రీ థక్కర్ బాపా పేరుతో పొన్నా సత్యనారాయణగారు, జానకి రామారావు గారు ఒక వసతి గృహం స్థాపించి ఆదివాసి పిల్లలను **40** మందిని చేర్పించి విద్యాబుద్ధులను నేర్పారు. కొంతకాలానికి శ్రీసత్యనారాయణ గారికి బోర్డు హైస్కూలులో రైటర్ ఉద్యోగం వచ్చి, వలదన్నా హాస్టల్ కమిటివారు ఈ హాస్టలును జానకిరామారావుగారికి అప్పగించారు. అప్పుడు నేను ఆ హాస్టల్ విద్యార్థిని .

అప్పటి నుండి మా అన్నగారికి అనేక సమస్యలు ఏర్పడినవి. గ్రామీణప్రాంతంలో ఉన్న ఎరుకల, యానాది, లంబాడి, తదితర అణగారిన జాతులను పోలీసువారు నిర్దాక్షణ్యంగా కొట్టి హింసించేవారు. అప్పుడు మా అన్నగారు బొజ్జగాని వెంకయ్యగారు, మరికొందరు పెద్దలు కలసి మా వారు దొంగలు కాదు అంతా మంచివారే అని ఎన్నో రకాలుగా విన్నవించే వారు. ఇటు హస్టలు పనులను చూసుకొని అటు సంఘం

కార్యకలాపాలలో పాల్గొనే వారు. కొన్నాళ్ళ వరకు గ్రాంటు రాకపోయినా హాస్టలు నడపడంలో ఎలాంటి లోటును రానివ్వలేదు.

వెన్నెలగంటి రాఘవయ్య పంతులు గారు, ఇతర సంఘ నాయకుల ద్వారా ఆదిమ జాతుల కొరకు అన్నగారు దేశ వ్యాప్తంగా ఎన్నో రాష్ట్రాలు తిరుగుతూ ఆదిమవాస స్థితి గతులను గవర్నమెంటు వారికి తెలియజేసేవారు.

ఈ నాయకుల కృషి వల్లనే ఎరుకలు, యానాది, లంబాడి, చెంచులు మొదలైన వారిని రాజ్యాంగ పరంగా షెడ్యుల్ జాతులలో చేర్పించారు. ఇది వారి ఘనతే. వారి ద్వారా హస్టల్‌లో ఉండి చదువుకున్న, విద్యార్థి, విద్యార్థినులు ప్రభుత్వ డిపార్ట్‌మెంటులలో మంచి కేటగిరి గల ఉద్యోగాలలో ఉన్నారు ఈనాడు. ఇది వారి చలువే.

ఆ రోజులలో గ్రామీణ ప్రాంతంలో ఆదివాసులకు ఉండటానికి ఇల్లుకాని, స్థలంగాని ఉండేవికావు. ఇప్పుడు సంఘ పరంగా కొన్ని వేల మందికి ఇళ్ళ స్థలాలు కల్పించి, వారికి గవర్నమెంటు ద్వారా కాలనీలను ఏర్పాటు చేయించారు. జిల్లా కలక్టరులను కలిసి, కొందరికి సాగు భూములను ఇప్పించడం జరిగింది.

నాకు తెలిసినంత వరకు మాఅన్న గారికి ఈ రోజు వరకు విశ్రాంతి లేదు.

మంచి పనులను చూచి ఓర్వలేని వారు, మా అన్నగారి పేరు, ప్రతిష్టలు పెరుగుదలను చూచి భరించలేనివారు ఈయనను నిరుత్సాహపరచడానికి దిగజార్చడానికి ఎన్నో అడ్డంకులను పెట్టారు. వాటిని తట్టుకొని తను అనుకొన్న లక్ష్యాన్ని సాధించడానికి మనసున్న మనిషిగా మా అన్నగారు ముందంజవేశారు. వారిని మా వదిన సుశీలమ్మగారు ఎంతో ప్రోత్సాహపరచారు.

*

# పుణ్యం

## శ్రీ మానుపాటి రామకృష్ణ

(వలిగొండ, నల్లగొండ జిల్లా)

**నిరాడంబరి**, అనుభవజ్ఞులు, నిగర్వి, నిష్పక్షపాతి అయిన చదల జానకి రామారావు గారు చాలా గొప్పవారు. వారు పేదప్రజలకు చేసిన సేవ అపారం.

వారు చిన్నప్పటినుంచి పేదలకు సేవచేయాలని కంకణం కట్టుకున్నారని ప్రజలు అనుకుంటుండగా మేము చాలా సార్లు విన్నాము. ఆయన తమ జీవితాన్ని పేదప్రజలకు అంకితం చేసిన త్యాగమయి. ఇటువంటి వ్యక్తికి సన్మానం చేయడం నిజంగా మనం చేసుకున్న పుణ్యం.

*

# కారుచీకటిలో కాంతిరేఖ



## శ్రీ పొన్నా లక్ష్మణరావు

(కోశాధికారి : కృష్ణాజిల్లా ఏకలవ్య సేవా సమితి)

**చదల** జానకి రామారావు గారి జీవిత చరిత్ర వ్రాస్తున్నారని విని చాలా ఆనందించాను. సమాజంలో అణగద్రొక్కబడిన షెడ్యూల్డు ట్రైబ్స్ అయిన ఎరుకలు, యానాది, సుగాలి, చెంచు మొదలైన జాతుల అభ్యున్నతికి ; సి. టి. యాక్టు తీసివేయడంలో పొన్నా సోదరులతో కలసి ప్రభుత్వాన్ని నిలదీసి పైన పేర్కొన్న ఆదివాసి కులస్థులు స్వేచ్ఛగా, స్వతంత్రంగా జీవించడానికి దోహదం చేసిన ఘనత శ్రీ చదల జానకి రామారావు గారికి దక్కుతుంది.

అలాగే ఈ జాతికి రిజర్వేషన్ సాధించి, ఈరోజున రిజర్వేషన్ సౌకర్య ఫలాలను భావితరాలకు అందించిన ఘనతకూడా వీరికే దక్కుతుంది.

నాడు ఎరుకల వారిని చైతన్యపరచి, దురలవాట్లను మాన్పించడంలో పొన్నా కోటేశ్వరరావు గారు రచించిన 'కల్లుముంత' బుర్రకథతో రాష్ట్రం నలుమూలల తిరిగి కల్లు మానండోయ్, కళ్ళు తెరవండొోయ్ అనే నినాదంతో వీరు, పాలపర్తివారు, పొన్నా జనపదుల హృదయాలలో శాశ్వత ముద్రగా సంస్కరణలు తెచ్చారు. ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ ప్రధాన కార్యదర్శిగా జానకి రామారావు గారు గిరిజనుల అభివృద్ధికి తోడ్పడి కారు చీకటిలో కాంతి రేఖ అయ్యారు.

ఆ త్రిమూర్తుల స్ఫూర్తితో నేను, ఎం.సి. రాజు కృష్ణా జిల్లా ఏకలవ్య సేవాసమితి ద్వారా పేద గిరిజనుల సేవకు మా జీవితాలను అంకితం చేయగలమని ప్రతిజ్ఞ చేస్తున్నాము. శ్రీ చదల జానకి రామారావుగారి దీక్షాదక్షతలు జీవితం భావి తరాల సేవా కార్యకర్తలకు ఒక బైబిల్, ఒక ఖురాన్, ఒక గీత కావలెనని మనసారా కోరుకుంటున్నాను.

# పేదప్రజాబంధు

## 'సహజ కవిచంద్ర'

## శ్రీ కోట పాల్ దేవరాజు



ఆర్థికంగా అణగారిన అట్టడుగు ప్రజానీకపు

స్వచ్ఛందసేవలో పేరెన్నికగన్న వారు మన జానకి రామారావు.

పీడిత - తాడిత ప్రజలను ఒకబాటన - ఒకే గాటన

నడిపించిన విశిష్టవ్యక్తి, సంఘటిత శక్తి మన చదల జానకి రామారావు.

తిరస్కృతుల పాలిటి దిక్సూచి,

చుక్కాని తెరచాప

దిక్కు, మొక్కు, బుక్కు

దగ్గరగా వుండి మరీ చూపారు పేదవానికి బతుకుతెరవు!

ప్రయత్నించి తీర్చారు పూటబత్తెపు వారి కరవు !

ప్రక్కన నిలచి మరీ దించారు వారి గుండెల బరువు !

కలిమిలేముల మధ్య వారధి ...
విస్తృత ప్రజల రథ సారథి
మరెంతగానో చెందాలి వారి నిండుజీవితం ధన్యం !

శాంతి, సహన, స్నేహ సుగుణాలను

అణువణువున జీర్ణించుకున్న సమసమాజ నిర్మాణ పథమున మడిమత్రిప్పని

అవిశ్రాంత పోరాట యోద్ధ పురోగామి

మన చదల జానకి రామారావు.

వారికివే నా జేజేలు !

# సప్తతి కవిత

## డాక్టరు ఎమ్. ఎస్. ప్రకాశ రావు



ఆదిమ జాతి యుగపురుషా !
శ్రీ చదల జానకి రాయా !
గిరిజన రత్నా !
నీ సేవలు ఆదినుంచి అపారం ! వర్ణణాతీతం !
రాజకీయ దురంధరా !
నీ ఖ్యాతి ఆదివాసీలకే గర్వకారణం !
నీ జాతి కోసం అహర్నిశలు
పోరాడి జయించిన ఏకలవ్యా !
ఆదివాసి దీనజనబంధు!
సుదీర్ఘ జీవనయాన సమరంలో సవ్యసాచివి !
శత వసంతాలు చూడాలని
సదా ఆదివాసీలకు సేవలందించాలనే ఆకాంక్షే ఈ కవిత !
'సప్తతి' రామయ్యకే అంకితం !

# నవరత్నాలు

## శ్రీ గుంజి నరసింహం (జయశ్రీ)



వందనమయ్యా ! చదలా !
ఆదరణను బ్రోచుచుంటివయ్యా జానకీ !
అందరూ దలచును రామా !
అందరి వాడవు గదయ్య ధరణిన్ రావూ !

ఏ పూర్వసుకృత ఫలమో !
నీపుణ్యా జనని జనకుల నీరాజనమో !
నీ ప్రగతికి సోపానం
ఏపుణ్యచరిత సుకీర్తి ఈశ్వర కృపయో !

నిరుపేద కుటుంబంలో
అరుదుగ నుదయించిన ఘనప్రముఖా ! తేజా !
గురువుల నాయకులవరా !
పరుల కుపకరించునీదు ప్రాకృత ధర్మం !

ఎన్నో బాధలనోర్చిన
మానవమూర్తి నిరతము మానవతంబున్
మానరు నీదు సుప్రక్రియల్
ఎన్నో జాత్యుద్ధరణకు ఏకరువ మదిన్.

మానవ సేవయే దైవం
బని నిజమెఱిగిన మహాత్మా ! బరువోడ్చితివి
అన్యంబెరుగవు నీవున్
మానవులెల్లరు మరువరు మానవ సేవన్.

పేదలపాలిటి పెన్నిధి !
పేదల మమత సమతను ప్రేరణతోడన్
ఆదరణజేసితివి గద !

అందరు ఆప్తునిఁ దలచును అవనీయందున్.

గిరిజన సంచార్ జాతుల
పరిరక్షించితివి ధీర! ప్రజ్ఞానిధివై
గిరిజనుల నేత రామా!
పరిపూర్ణుడవై అలరిన ప్రఖ్యాత సుతా!

పెక్కు అవార్డుల్ గాంచిన
పెక్కు జనాళి వరరత్న పేదల దాసా!
పెక్కు అధికార గణముల్
అక్కునఁజేర్చుకొనె నిన్ను ఆప్యాయంబున్.

ధన్యుడవైతివి చదలా!
అన్యులు స్మరణన్ సతతము ఆరాధించున్
మానవతా దృక్పథమున్
మన్నించున్ నీదు వాంఛ మాన్యుల్ సమతన్.

# సమైక్య శ్రామిక ఉద్యమం


## శ్రీ పరుచూరి పిచ్చేశ్వరరావు
(కె.వి.ఆర్. కళాశాల అధ్యాపకులు)


**సమాజ** పరిణామ క్రమంలో కొన్ని వర్గాలు తమమనుగడకోసం, వనరులమీద ఆధిపత్యంకోసం, దళిత జాతులను జనజీవన స్రవంతినుంచి వేరుచేశారు. భూస్వామ్య వ్యవస్థలో శ్రమశక్తి దోపిడీ వెట్టి చాకిరి, పరాకాష్టకు చేరాయి. పెట్టుబడిదారీ సంబంధాలు అసలు నేతల అంతరాన్ని పెంచాయి.

ప్రకృతి శక్తుల ప్రయోజనాలను అందరూ అనుభవించాలని, ఆనందమయమైన జీవితాలను గడపాలని తత్వవేత్తలందరూ నాటినుంచి నేటి దాకా ప్రభోదిస్తూనేవున్నారు. స్వార్ధంకోసం వర్గీకరించి సామాజిక వ్యవస్థను, అన్యాయాలకు గురవుతున్న అమాయక బడుగు జీవితాలను చూసి తీవ్రంగా కదలిపోయారు. మానవ సేవే మాధవ సేవ అని

సాంస్కృతిక సంస్కరణకు పూనుకున్నాడు స్వామివివేకానంద సాంఘిక సమానత్వం ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధికి ప్రాతిపదిక అని వివరించాడు.

మహాత్మా గాంధీ, వినోబా భావే, థక్కర్ బాపా డాక్టరు బి.ఆర్. అంబేడ్కరు, జయప్రకాష్ నారాయణ్ వారి సారథ్యంలో అణగారిన అభ్యున్నతికి ఉద్యమించిన మహనీయులు నిజంగా మానవోత్తములు. సామాజిక సమానత్వం సాధించకుండా ఆర్థిక సమానత్వం అసాధ్యమని వీరు హెచ్చరించారు. అసమాన సాంఘిక, ఆర్థిక వ్యవస్థ పేదవర్గాల అభివృద్ధికి పెద్ద అవరోధంగా నిలచింది. సామాజిక సంస్కరణలను జాతీయ ఉద్యమంలో అంతర్భాగంగా చేర్చారు. అస్పృశ్యతానివారణ, వయోజన విద్య, క్రమసాంద్రమైన ఉత్పత్తి పద్ధతులు మొదలైన సమస్కరణలు నిర్మాణ కార్యక్రమాలలో ముఖ్యాంశాలయ్యాయి.

శ్రీ చదల జానకి రామయ్య గారు సామ్యవీద ఉద్యమ ప్రభావంతో చిన్ననాటనే వర్గీకృత సాంఘీకృత వ్యవస్థ మీద ధ్వజమెత్తారు. పొన్నా సత్యన్నారాయణ, పొన్నా కోటేశ్వరరావు గార్ల సాహచర్యంతో స్వయంకృషితో సామాజికంగ, రాజకీయంగా రాష్ట్రస్థాయి నాయకులుగా ఎదిగారు. అణకువ, నిరాడంబరత, క్రమశిక్షణ, ప్రజలతో సన్నిహితంగా వుండడం జానకి రామయ్యగారి వ్యక్తిత్వ ప్రత్యేకతలు. తనకిచ్చిన కార్యక్రమాన్ని సైనికునివలె అమలు జరిపే స్వభావం జానకి రామయ్య గారిది. వయసు పైబడుతున్నా, ఇంటి సమస్యలు వున్నప్పటికీ ఆరోగ్యాన్ని సైతం లెక్కించక నిరంతరం ఆదిమ జాతులకు సేవలను అందిస్తున్నారు.

కాకాని వెంకటరత్నం కళాశాల జాతీయ సేవాసంఘానికి జానకి రామయ్య గారితో దాదాపు **25** సంవత్సరాల అనుబంధం వున్నది. మా ఎన్. ఎస్. ఎస్. విద్యార్థులను కాలనీకి తీసుకెళ్ళి పరిస్థితులను అధ్యయనం చేసేవారం. మేము ఎప్పుడు అవసరమంటే అప్పుడు మా వెంట వుండి ఆదిమ జాతులు ఎదుర్కుంటున్న సమస్యలను వివరించేవారు.

ప్రగతిదాయకమైన చట్టాలు రూపొందించినప్పటికి దళిత జాతులు అసంఘటితంగ వుండడంవల్ల ఆశించిన ప్రయోజనాలు పొందలేకపోతున్నారు. విద్య, వైద్య, గృహవసతి, ఉపాధి మొదలైన మౌలిక సదుపాయాల కల్పనద్వారా మాత్రమే పేదరికపు విషవలయంనుంచి విముక్తులవుతారు. సమగ్రమైన వ్యవస్థాపరమైన సంస్కరణలు సమర్థవంతంగా అమలుజరిపించడానికి పటిష్టవంతమైన సమైక్య ఉద్యమం అవసరం.

శ్రామిక వర్గం, దళిత నేతలు, సమైక్యంగా సంక్షేమ కార్యక్రమాల అమలుకోసం కృషిచేసిన నాడే చట్టాలు కార్యరూపం దాలుస్తాయి.

జానకి రామయ్య గారు తరతరాలనుంచి వస్తున్న ఆదివాసి సాంఘిక సంబంధాలను సంస్కరించడానికి పూనుకున్నారు. అది అంత తేలికైన విషయం కాదు. నిరక్షరాశ్యులు, అమాయకులు, నిరుపేదలుగా జీవించే గ్రామీణ దళిత జాతులను సంఘటితపరచడానికి ఎంతగానో శ్రమించారు. భూస్వామ్య ఒత్తిడిలను తట్టుకోవడానికి దళిత జాతుల వెంట నిలచి ధైర్యాన్నిచ్చి, వారి అభివృద్ధికి పలురకాలైన కార్యక్రమాలను అమలుజరిపారు.

ఆదిమ జాతి సేవక సంఘ నిర్మాణానికి జీవితాన్నే ధారిపోసిన వెన్నెలకంటి రాఘవయ్యగారు అధ్యక్షులుగా జానకి రామయ్యగారు ప్రధాన కార్యదర్శిగా అనేక సంవత్సరాలు పనిచేశారు. ఆదిమ జాతుల సమస్యలమీద రాఘవయ్య గారు విశేషంగా పరిశోధన చేసి వెలుగులోకి తీసుకువచ్చారు. రాఘవయ్య గారి సారధ్యంలో రాష్ట్ర స్థాయి సంఘానికి ప్రధాన కార్యదర్శిగా పనిచేయడం వారికి చదల గర్వకారణం. ఉద్యమ నిర్మాణంలో రాఘవయ్య గారి పేరు ప్రక్కన జానకి రామయ్య గారి పేరు వుండడమే వారి జీవితంలో గౌరవనీయమైన స్థానమని నా నిశ్చితాభిప్రాయం. రాఘవయ్య గారితో వున్న అనుబంధానికి జానకి రామయ్య గారు గర్వపడాలి.

పటిష్టవంతమైన సమైక్య శ్రామిక ఉద్యమం ద్వారా మాత్రమే పేదరికాన్ని, నిరుద్యోగాన్ని తొలగించడం సాధ్యమౌతుంది. యువనాయకులు, కార్యకర్తలు జానకి రామయ్య గారి శ్రామిక సంస్కృతి విలువల స్ఫూర్తితో స్పందించడమే వారికి మనం అందించే మహుమానం.

## పెద్దదిక్కు

### శ్రీ మల్లెల పుల్లయ్యబాబు

(మండల పరిషత్తు మాజీ అధ్యక్షులు, కంచికచర్ల)

**పేద** ప్రజల ప్రగతికోసం శ్రీ చదల జానకిరామారావు గారు చేసిన కృషి

ప్రశంసనీయం. **1982** లో తెలుగుదేశం పార్టీ ఆవిర్భావంనుంచి కృష్ణాజిల్లా నందిగామ నియోజకవర్గానికి పెద్దదిక్కుగా పార్టీ అభివృద్ధికోసం చిత్తశుద్ధితో నిర్విరామమైన కృషి సల్పిన శ్రీ చదల జానకి రామారావు గారి అంకిత భావాన్ని ఎన్నటికీ మరువలేము. నాటి నుంచే వారితో కలసి పని చేసే మహద్భాగ్యం నాకు కలిగినదని తెలపడానికి సంతసిస్తున్నాను.

శ్రీ చదల జానకి రామారావు గారి పిలుపులో కమ్మదనం, అపారమైన ఓర్పు, మాటల్లో చతురత, సంస్కారభావం, గాంభీర్యత. వీటినన్నింటిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. నిర్మోహమాటి, అనేక పదవుల ద్వారా వారు చేసిన ప్రజా సేవ అపారమైనది.

రాజకీయ నాయకులలో నైతిక విలువలు కరువైన ఈరోజుల్లో యువకులకు, ముందుతరాలవారికి శ్రీ చదల అనుసరించే విధానాలు స్ఫూర్తినివ్వ గలవని ఆశిస్తున్నాను.

అవినీతి, దౌరన్యం, కుల మత వర్గ విద్వేషాలు పెచ్చరిల్లిన ప్రస్తుత సమాజానికి శ్రీ చదల వంటి నాయకులు ఆదర్శం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

శ్రీ జానకి రామారావుగారి చెరగని చిరునవ్వు వలే శేష జీవితాన్ని మరింతగా ప్రజాసేవకే వినియోగించవలెనని మనసారి కోరుకుంటున్నాను.

# పని తీరు

## శ్రీ నందం పుల్లయ్య

(పంచాయతీరాజ్ రిటైర్డ్ ఉద్యోగి)

**నిన్న**మొన్నటిది కాదు - నాలుగు దశాబ్దాల మా చెలిమి నేటికీ చెక్కుచెదరలేదు. అంత స్నేహజీవి మా చదల జానకి రామారావు గారు. అరమరికలు పొరపచ్చాలు నాతోనే కాదు - ఎవరితోనూ అయనకు వుండవు. అంత నిష్కల్మషమైన వ్యక్తులు నేటి సమాజంలో అరుదుగా మాత్రమే కనిపిస్తారు.

శ్రీ చదల జానకి రామారావు ఎంత ఉదాత్తులో అంత ఉదారి. ఎదుటి వారిని నొప్పించడం నేను ఇంతవరకు చూడలేదు. అర్థులకు అన్నివిధాల సహకరించడమే ఆయన

నైజం. ఉద్యోగులతో పనులు చేయించుకోవడంలో ఆయనకు వున్న ఓర్పు నేర్పు అంతా ఇంతా కాదు. గౌరవం ఇస్తారు, పుచ్చుకుంటారు. ఇంటినుంచి బయలుదేరితే దారి పొడవునా నమస్కారాలు పెట్టేవారే. నమ్రతగా పలుకరించేవారే ! ఆ తీయ్యదనం మరువలేనిది, మధురమైనది, తదాత్మిక మైనది.

క్రమశిక్షణతో, నిజాయితీతో కొనసాగే ఆయన పని తీరుకు ఒకనాడు మంత్రి శ్రీమతి సదాలక్ష్మి, మరొకనాడు కృష్ణాజిల్లా కలక్టరు శ్రీ జాన్సన్ ప్రశంసించడం నాకు స్వయంగా తెలుసు.

మా జానకి రామారావు గారి 'సప్తతి' సన్మానంలో నేనూ భాగస్వామిని అయినందుకు ఆనందిస్తున్నాను.



# మంచితనం

## శ్రీ మోరంపూడి రవిరాజు

(మేనేజరు : ఆంధ్రరాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్)

**మా** ఇంటికి దగ్గరలోనే అనాధ బాలల శరణాలయం ఉండేది. శ్రీ పాలపర్తి వీరయ్యా గారు దానికి మేనేజరు. శ్రీ చదల జానకి రామారావు, శ్రీ పొన్నా కోటేశ్వరరావు గారలు ఆ శరణాలయానికి తరచూ వస్తూపోతూ ఉండేవారు.

కొంతకాలం తరువాత నేను ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ కార్యాలంలో ఉద్యోగంచేస్తున్న దగ్గరనుంచి శ్రీ జానకి రామారావుగారి పద్ధతి వారు మాట్లాడే విధానం నన్నెంతో ఆకర్షించేవి.

రాజకీయంగా అనేక పదవులను నిర్వహిస్తూ, తమకు వున్న పరపతితో చేతనైన సహాయంచేస్తూ, వారిని ఆదరిస్తూ, వారి అవసరాలను తీర్చడం నాకు బాగా తెలుసు. దానితో వారి మంచితనం, వారి సహృదయత నాకు ఇంకా బాగా తెలియవచ్చింది.

ఇటు రాజకీయంగా కాని అటు సాంఘిక సేవాపరంగా కానీ శ్రీ జానకి రామారావు గారు ఇంత కాలంగా ఏ విదమైన శారీరక అలసత్వానికి గానీ మానసిక అలజడికి కాలనీ లోనుగాక అజాత శత్రువుగా భాసించగలుగుతున్నారు. అంటే

వారిమంచితనమే అందుకు నిదర్శనం. వారి మంచితనం గురించి ఎంత చెప్పినా అది కొంచమే అవుతుంది.

శ్రీ చదల జానకి రామారావు గారు తమ 70 వ (సప్తతి) వత్సరాన్ని దిగ్విజయంగా జరుపుకుని నిండునూరేళ్ళూ అందరికీ సేవచేస్తూ జీవించవలెనని కోరుకుంటున్నాను.

# జాతికే గర్వకారణం

## శ్రీ చిత్తూరి ప్రసాదరావు

( ఇన్‌కమ్‌టాక్స్ రిటైర్డ్ జాయింట్ కమిషనర్ )

**జాతిని** మేలుకొలిపి మారుమూలలకెళ్ళి గిరిజన బాలబాలికలను తెచ్చి వసతి గృహాలు నడిపి - విద్య చెప్పించి అనేకులను ఉద్యోగస్తులుగా చేసిన ఘనతనొందిన కొద్దిమందిలో శ్రీ జానకి రామారావుగారొకరు. రాష్ట్రంలో ఏ రాజకీయ పార్టీ వచ్చినా ఆ యా నాయకుల మన్ననలను తన కల్మషంలేని జీవన విధానం వల్లనూ, నిస్వార్థ సేవా తత్వం వల్లనూ, చక్కటి వాక్ చాతుర్యం వల్లనూ ఆకట్టుకొని తను తలపెట్టిన అభివృద్ధి కార్యక్రమాలు జయప్రదం చేసిన ఆదర్శజీవి.

ధనికులు, మేధావులు, ఉన్నత వర్గాల వారితో గిరిజనుడు, అందునా ఎరుకల గిరిజనుడు సరిసమానంగానూ, గౌరవంగానూ మెలగడం, మెప్పు పొందడం అంత తేలికైన పని కాదు. శ్రీ జానకి రామారావు గారికే ఇది సాధ్యమైంది.

ఎందరో ఎరుకలు - అన్ని రాజకీయ పార్టీలలో చేరి, జాతికి సేవ చేయాలని అన్నీ పోగొట్టుకున్నా, అగ్రవర్ణాల వారి చెప్పుచేతుల్లో కీలుబొమ్మలై, అధిష్ఠాన్నె ఆక్రమించగానే - అన్నీ మరిచి, ఆశయాన్ని మరచి, చివరకు దరిచేర్చిన వారే చీదరించి, గుర్తింపు పోగొట్టుకున్నవా రనేకమంది - మన ముందున్న ఈ రోజులలో - నేటికీ గర్వంగా, ధైర్యంగా చెప్పుకునే రీతిలో తనదైన శైలిలో అందరి మన్ననల నందుకొంటూ ముందుకు పోతున్న ఈ నిస్వార్థ ఎరుకల నాయకుని సన్మానించడం, అందునా వీరి 'సప్తతి' కి జోడించడం చాలా గొప్ప విషయం. ఇది ఆంధ్రప్రదేశ్ ఎరుకలు ముఖ్యంగా గర్వించదగ్గ

ఈ ఆలోచన కలిగి - ఈ కార్యక్రమాన్ని ప్రోత్సహించి నిర్వర్తిస్తున్న సోదరులకు

నా ధన్యవాదాలు . వారెంతో అభినందనీయులు.

అవి భారత స్వాతంత్ర్యం వచ్చిన తొలి రోజులు. నేను అయిదో ఆరో చదువుతున్నాను. ఆ రోజులలో మా గ్రామం స్టువర్టుపురంలో ప్రతి నిత్యం పోలీసులు వచ్చి దౌర్జన్యాలు చేసేవారు. ముఖ్యంగా ఆదివారాలలో నాలుగైదు వాహనాలలో పోలీసులు, రిజర్వ్డ్ పోలీసులు వచ్చి వూరంతా ఆక్రమించి ప్రతి గుడిశ - ఇల్లు - వెతకి చెంబు తప్పేలాలు బయటకు విసరి పారేసేవారు. గుడ్డా, గోచీ - అన్నీ చిందరవందర చేసి, ఆడవాళ్ళను జుట్టు పట్టుకొని , మొగవారిని చొక్కా పట్టుకొని ఈడ్చుకొంటూ కొట్టుకుంటూ మేనేజరు బంగళా వరకు లాక్కొనిపోయి చితకబాదేవారు. వారికి కావలసినంత వరకు- ఆరోగ్యంగా వున్న మగవారిని బాపట్ల తదితర చోట్ల వున్న పోలీసు స్టేషన్లవారి అప్పచెప్పేవారు. ఆ తరువాయి వారనుభవించిన ఆ అగచాట్లను వేరుగా వివరించనవసరంలేదు. లేనిపోని దొంగతనాలు వారిపై మోపి ఆయా కుటుంబాలను అల్లాడించేవారు.

ఇది నా చిన్నతనంలో స్వయంగా చూచి - నా చిన్న మనస్సు కలత చెంది, నేను పుట్టి పెరిగివున్న పరిసర వాతావరణం - ఇవి గ్రహించిన నేను నిత్యము ఈ జాతికి రక్షణ లేదా! భగవంతుడా! ఇంటా బయటా వీరికున్న గౌరవ మిదేనా? అని ఆందోళన చెందే రోజులు. ఆ రోజులలో వూరూరా తిరిగి 'ఏకలవ్య' బుర్రకథ చెప్పుకొంటూ ఎరుకల జాతివారిలో సనాతనమైన ఆచారాలు మార్చి, జన స్రవంతిలో బ్రతికేందుకు కావలసిన మార్గాలు చాటిస్తూ వచ్చిన పొన్నా సోదరులు; శ్రీయుతులు పాలపర్తి వీరయ్య, చదల జానకి రామారావు గార్లను చూడడం, వారి బుర్రకథ ఆద్యంతం వినడం - చూడడం జరిగింది. అప్పట్నుంచి నేను వీరికి తెలియకుండా వారి అభిమాని నయ్యాను. ఇలాంటివారే ఈ జాతి కేదేని మేలు చేయగలరన్న నమ్మకం నాలో కలిగింది.

ఆ నమ్మకంతోనే మా వూరినుంచి ఈ జాతికి అంకితమై సంఘసేవ చేసినట్టి దేవరకొండ హనుమంతురావు, మాదుగాని దేవదత్తు గార్లను తరచూ కలసికొంటూ శ్రీ జానకి రామారావు గారిలాంటి సాటి కులానికి చెందిన సేవా పరాయణుల ఉద్యమాల పరిస్థితులు నా చిన్ననాటి నుండి తెలిసికొని, అందు వుత్సాహం చూపుతూ వుండేవాడిని. మనిషి తనకోసం బ్రతకటానికన్నా ఇతరులకోసం బ్రతకటం చాలా గొప్ప విషయం.

ఎరుకల కులంలో పుట్టి, కేవలం ఎరుకలకే కాకుండా ఆంధ్ర రాష్ట్రంలో బడుగు వర్గాల సంక్షేమానికై అహర్నిశలు శ్రమించి, తన కుటుంబమేమౌతుందోనన్న ఆలోచన

ప్రక్కన బెట్టి, ప్రభుత్వాధికారులతోనూ, రాజకీయ వేత్తలతోనూ చివరకు సమాజంలో వున్న అగ్రకులాలకు చెందిన సాంఘిక వేత్తలతోనూ తనదైన వాక్పటిమ కనుబరుస్తూ బడుగు వర్గాల వారి సాధక బాధకాలు వివరించి, వారిని అభివృద్ధిపరిచి ప్రజా సరళిలో వెలుగు చూపే వెసులుబాటును చూపునట్లు పోరాడిన గిరిజన మహా వ్యక్తులలో శ్రీ చదల జానకి రామారావుగారొకరనడంలో సందేహం లేదు.

గురువు లేకనే విద్యనభ్యసించి లోకఖ్యాతి నార్జించిన చరిత్రకారుడైన ఏకలవ్య కులంలో పుట్టి కాలస్రవంతిలో అణగారిపోయి బక్కచిక్కిన బలహీన వర్గంగా గుర్తించబడ్డ ఎరుకుల కులానికి గిరిజన గుర్తింపు తెచ్చినవారిలో శ్రీ జానకి రామారావు గారు ముఖ్యులు.

## నమస్సుమాలు

తోకల అమరలింగం



సమతను మమతను పెంచినవాడు
గుండెదిటవును నేర్పినవాడు
నిరాశను ఆశగ మార్చినవాడు
మా జానకి రాముని మెచ్చు జగం !

తెగించి ముందుకు దుమికిన వాడు
ఆదిమ జాతుల వైతాళికుడు
గ్రహణాలను వదలించిన వాడు
అన్నన్నా ! రామా ! నమస్సుమాలు !

*

# శత మానం భవతి!

శ్రీ వాసవ్య
(ఫ్రి-లాన్స్ జర్నలిస్టు)

" **The** Longing for love, the search for knowledge and unbearable pity for the suffering of mankind" అంటూ మహా మేధావి బెర్ట్రాండ్ రాస్సెల్ తన స్వీయ చరిత్ర రచనకు నాంది పలికాడు. వాస్తవంగానే ఈ మూడు తపనలూ ఆయన జీవితాన్ని నడిపించాయి. మన జానకి రామారావుగారి జీవితాన్నికూడా సంపూర్ణత్వానికి దరి చేర్చగలిగినవి ఈ మూడు తపనలే.

వెన్నెలకంటి రాఘవయ్య ప్రభృతుల సాహచర్యంతో సంచార- ఆదివాస జాతుల సముద్ధరణకు ఉద్యమశీలిగా శ్రీ చదల జానకి రామారావు ఆరాటం చెందారు, ఆవేదన పడ్డారు, వెంపర్లాడారు . ఆదివాసుల బాధల ప్రతిధ్వనులు రామారావుగారి హృదయంలో ధ్వనించాయి. పీడకుల వలన మానసిక చిత్రవధలను అనుభవించే పీడితులుగా రూపొందిన ఆదివాసులను నేరస్థ జాతుల చట్టం నుంచి విముక్తులను చేయడమే కాక, ఆ చట్టాన్నే నామరూపాలు లేకుండా చేసే కృషి సల్పడంలో రామారావుగారు ప్రముఖపాత్ర వహించారు.

70 సంవత్సరాల కాంతిమయ జీవితాన్ని గడిపిన రామారావుగారిలో మనం మేధకంటే మానవత్వాన్ని అధికంగా చవిచూస్తాం. ఈయనలో నా అవగాహనకు అందింది కేవలం సామాజిక చింతన మాత్రమే కాక వైయక్తిక చింతన కూడా మేళవించిందని. ఈ రెండింటిని సమన్వయపరచడంలో కృతకృత్యులైన ఈయన నాకు మాత్రమే కాదు , ఎందరికో, ఎందరెందరికో స్ఫూర్తి ప్రదాత.

శ్రీ చదల జానకి రామారావు రాజకీయాలలోకి వామమార్గిగానే ప్రవేశించారు. పేదలకు, బాధితులకు, నిరాశావాదులకు సేవలు చేయడంలోనే గొప్ప ఆత్మానుభూతి, ఆనందం వున్నాయని గ్రహించిన కొద్ది కాల వ్యవధిలోనే 'తెలుగుదేశం' పార్టీలో ప్రవేశించారు. ఇతరుల దుఃఖాలను రూపుమాపడంలోనే ఆనందాన్వేషణ జరిపారు. ఫలితంగా బాధ్యతాయుతమైన పెక్కు పదవులు ఆయనను వరించాయి. అయినా, పదవుల

కట్టుదిట్టాలకు దూరంగా స్వచ్ఛందంగా, స్వేచ్ఛగా ఆదివాసి సేవలను కొనసాగించారు. పార్టీపరంగా ఒక కార్యకర్తగా, సంచార- ఆదివాస జాతుల పరంగా ఒక నేతగా రాణించారు. ప్రాణ స్పందనతో నిండిన సామాజిక జీవితంలో మహోన్నత శిఖరాలను అధిరోహించారు.

స్వప్నద్రష్టగా పౌర జీవితం ప్రారంభించిన ఈయన సహచరులతో కలసి 'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్' ను స్థాపించి తమ కలలను నేలమీదకు తెచ్చారు. అర్థ శతాబ్దికిపైగా ప్రధాన కార్యదర్శిగా బరువు - బాధ్యతలను నిర్వహిస్తూ సంఘానికి రాష్ట్ర వ్యాప్త గుర్తింపునే కాక, సంచార-ఆదివాసులను షెడ్యూల్డ్ ట్రైబ్స్ గా కేంద్రప్రభుత్వం గుర్తించేలా అవిరళమైన కృషి జరిపారు.

ఈ రోజున కృష్ణా జిల్లా సహకార కేంద్ర బ్యాంకి డైరక్టరుగా వున్న రామారావు గారి నిర్మలమైన, నిశితమైనమానవతా వాదం బహుధా ప్రశంసనీయం.

ఒక వ్యక్తిలో సంస్కృతి వున్నదీ అంటే అతని ఆలోచనలు సునిశితమైనవి; అనుభూతులు సుందరమైనవి; స్వభావం లలితం; ప్రవర్తన మధురం అని భావార్థం. 'సప్తతి' సన్మానోత్సవానికి అంగీకరించడం ద్వారా అసంఖ్యాకులను మన్నించిన జానకి రామారావు గారు భవిష్యత్తరాలకు దార్శనికునిగా నిలచిపోతారు.

సంచార - ఆదివాస జాతులలో దైన్యం, దారిద్ర్యం, వ్యధలు, బాధలు, ఆకలీ - దప్పికా, రోగాలు, అకాల మరణాలూ తుడిచివేయడానికి చిత్తశుద్ధితో అహరహం శ్రమిస్తున్న రామారావు గారి 'శతమానం భవతి' ని ఆకాంక్షిస్తున్నాను.

## FELICITATION MESSAGE



Dr. D. Swaminadhan

"I am very happy to note that the 70th Birthday celebrations of Sri Chadala Janaki Rama Rao are being organised on 02 October'1999 at Nandigama.

Sri Rama Rao's selfless service to the Tribal Community in the state are well known. During hi long fruitful years of life he made remarkable an cultural development of tribals of Andhra Pradesh anc earned the name as a true "PeoplesMan".

On this happy occasion I offer sincere hearjelt felicitaions and wish him futher long happy and healthy life, so that he could continue his selfless service in the cause of tribals."

# సమ్మానార్హులు

## శ్రీ కనపర్తి కిశోర్ కుమార్

(అధ్యక్షులు: డాక్టరు అంబేడ్కరు జాతీయయువజన సాంస్కృతిక సమాఖ్య)



**లోగడ**, చదల జానకి రామారావు గారిని మా సమాఖ్య ఆధ్వర్యాన లోక్‌సభ స్పీకరు గౌరవనీయ జి. ఎం. సి. బాలయోగి గారి ద్వారా మేము సమ్మానించాము. ఎందుకు సమ్మానించాము ? ఒక విశిష్ఠ వ్యక్తిగా సమ్మానించాము. ఏమిటి ఆ విశిష్ఠత ?

చదల జానకి రామారావు గారు కేవల సామాన్య వ్యక్తి మాత్రులే కాదు - ఒక శక్తి అని తమంతట తాముగా ఋజువుపరచుకున్నారు. ఒక మహాత్మ పూలేకు, ఒక డాక్టరు అంబేడ్కరుకు, ఒక గాంధీ మహాత్మునికి, ఒక కారల్ మార్క్సుకు తను నిజమైన శిష్యుడనని- ఏకలవ్య శిష్యుడనని - మాటలలో కాక చేతల ద్వారా నిరూపించుకున్నారు.

దళితులు, నిమ్నజాతులు, ఆదివాసులు, సంచారు జాతులు- ఈ మొదలుగాగల

ఎవరికీ పట్టని బడుగుజీవుల ఆర్తనాదాలను ఆపుచేయడానికి, ఆకలి మంటలను చల్లార్చడానికి, సాంఘిక సమసమాన ప్రతిపత్తిని కల్పించడానికి - పైన పేర్కొన్న పెద్దల కలలను నిజం చేయడానికి - చదల జానకి రామారావు గారు చేసిన కృషి అంతాఇంతా కాదు. అది చరిత్రాత్మకం. నిజంగా ఆయన చరితార్థులు. అందుకే వేము సమ్మానించాము. సరా, ఇప్పుడు 'సప్తతి' సందర్భంగా మరల వారిని పుష్పమాలాలంకృతిని చేస్తున్నాము, ఇందుకు గర్విస్తున్నాము.

చదల జానకి రామారావు గారు వయసురీత్యా డెబ్బది సంవత్సరాల వృద్ధులు కావచ్చునేమో కానీ, మా దృష్టిలో మనో వాక్ కర్మల ఇంకా యువకులే. వారిని ఇంకా ఇంకా మేము సమ్మానిస్తాము, ఇట్టి సమ్మానాలకు తమకు పూర్తి అర్హతలు వున్నాయని వారు మరల మరల తమ సేవల ద్వారా నిరూపించుకుంటారు. ఇది చారిత్రక సత్యం.

## కార్యదక్షులు

### శ్రీ యలమంచిలి బాబూ రాజేంద్ర ప్రసాద్

( ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సర్పంచ్‌ల సంఘం అధ్యక్షులు)



**సారా** వ్యతిరేకోద్యమం నాకొక గొప్ప వ్యక్తిని పరిచయం చేసింది. ఆయన శ్రీచదల జానకి రామారావు. ఆ తరువాత తరువాత తెలుసుకున్నాను - జానకి రామారావుగారు మహా శక్తి కూడా అని.

జానకి రామారావుగారు పిలుపునిస్తే చాలు - క్షణాలలో వందలుగా వేలుగా ప్రజలు ప్రత్యక్షమయ్యేవారు. మహిళలు, వృద్ధులు, ఉద్యోగులు, చేతి వృత్తులవారు, కూలీ నాలీ చేసుకు బ్రతికేవారు గుంపులు గుంపులుగా వచ్చేసేవారు. ఆ ప్రజాభిమానానికి మేము మంత్రముగ్ధులమయ్యేవాళ్ళం. ఆయన మాట వారికి వేదవాక్యం. అంతటి ప్రజాబలం వెన్ను-దన్నుగా వున్నది కనుకనే ఆయన ఎన్నో మహోద్యమాలను జయప్రదంగా

నిర్వహించగలిగారని అర్థమయ్యింది.

జానకి రామారావు గారు ఏదైనా ఒక కార్యక్రమాన్ని ప్రారంభిస్తే దానిని పూర్తి చేసేంతవరకు నిదురపోరు. అలుపు సొలుపు లేని పని. పని, పని - కృషి - సాధన - ఫలితం - ఇవే ఆయన సత్య శివ సుందరాలు. ఇంతటి కార్యధ్యక్షులు బహు అరుదు.

# కల్పవృక్షం

## శ్రీ యరగొర్ల వెంకట నరసింహం

( పంచాయతీ సర్పంచ్ - నందిగామ)



శ్రీ చదల జానకి రామారావు గారు నందిగామలో అలనాడు పేద పిల్లల హాస్టలు పెట్టి వారి చదువుకు మిక్కిలి సహాయపడినారు. ఆయన మిక్కిలి దయార్ద్ర హృదయులు. అణగారిన జాతుల ఉద్ధరణే ధ్యేయంగా పేదల పాలిట కల్పవృక్షంగా సేవా హృదయంతో ప్రజా సేవకే అంకితమై ఎనలేని సేవలు చేసి మంచి కీర్తి గడించినారు. ఈ 'సప్తతి' సన్మానం సందర్భంగా ఆయన ఆయురారోగ్యాలతో సుఖశాంతులతో వర్ధిల్లాలని దేవుని ప్రార్థిస్తున్నాను.

# భీష్మాచార్యులు

## శ్రీ సొంగా రవీంద్ర వర్మ

( ఆంధ్రప్రదేశ్ ఎస్. సి. కార్పొరేషన్ మాజీ డైరక్టరు)



**తెలుగు దేశం** పార్టీకి చదల జానకి రామారావు గారు భీష్మాచార్యులు. పదిహేడు ఏళ్ళ క్రితం విజయవాడలో తొలి మహానాడు జరిగినప్పుడు మేము కుర్రకుంకలం. జానకి రామారావుగారు అప్పటికే రాజకీయాలలో కాకలు తీరిన యోధులు. మా బోటి యువతకు మార్గదర్శిక సూత్రాలతో హెచ్చరిస్తూ, అంతటా

తామే అయ్యి, అన్ని కార్యక్రమాలు విజయవంతం కావడానికి దోహదించారు. అప్పుడే పార్టీ కృష్ణా జిల్లా శాఖకు తొలి కార్యదర్శిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

తదాది - మా పార్టీకి - అంటే తెలుగుదేశం పార్టీకి - జానకి రామారావు గారు జీవగఱ్ఱ అయ్యారు. జిల్లా స్థాయిలోనే కాదు, రాష్ట్ర స్థాయిలో సయితం పార్టీ వారి సేవలను పరిపూర్ణంగా వినియోగించుకుంటూవస్తున్నది. నందమూరి తారక రామారావు గారికి చేదోడువాదోడుగా అంతేవాసి అయారు. నారా చంద్రబాబు నాయుడు గారికి ప్రీతి పాత్రుల య్యారు. మొత్తం అధిష్ఠానవర్గానికి ప్రేమపాత్రులయారు. ఒక చిత్తశుద్ధి గల నాయకునిగా గుర్తింపు వచ్చింది. వారి అప్పగించిన ప్రతి బాధ్యతను తప్పక నిర్వర్తించి ప్రశంసలను పొందారు. ఒకానొక దశలో - కృష్ణా జిల్లా పార్టీ నాయకత్వం ప్రశ్నార్థక మైనప్పుడు - వారు స్వయంగా ముందుకు దుమికి పార్టీని పటిష్టమంతం చేసారు. ఇది చారిత్రక సత్యం.

చదల జానకి రామారావుగారి వెనుక జనం వున్నారు. ఇది దాచేస్తే దాగని సత్యం. ఆయన 'పేపరు టైగర్' కాదు, నిర్మాణ కార్యకర్త. రాటు తేలిన సంఘజీవి. డెబ్బదవ వడిలో సయితం యువకిశోరంగా భాసిల్లే ప్రజల ప్రేమామృత సంజీవి. ఆయన సేవలు తెలుగుదేశం పార్టీకి, స్వర్ణాంధ్రప్రదేశ్ నిర్మాణానికి ఎంతో ఎంతో అవసరం అని మనవి చేసుకుంటున్నాను.

## శుభాకాంక్షలు



### శ్రీ చావలి సాంబశివ రావు యాదవ్
(బార్ అసోసియేషన్ సెక్రటరి)

**ఆశయాలను,** ఆదర్శాలను ఆచరించి, పేదల సంక్షేమమే ధ్యేయంగా ఎంచుకొని, అనేక అభివృద్ధికర కార్యక్రమాలను చేపట్టి, తమకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ప్రజల హృదయాలలో ఏర్పరచుకున్న మన ప్రియతమ నాయకులు, ప్రజల ఆశీర్వాదాలతోనే నిండు నూరేళ్ళు ఆయురారోగ్యాలతో తమ సేవాతత్పరతను కొనసాగించవలెనని ఆకాంక్షిస్తూ, శ్రీ చదల జానకి రామారావు గారికి ఇవే మా శుభాకాంక్షలు !

# నాయకత్వ బాధ్యత

## శ్రీ గొట్టిపాటి గోపీచంద్

(కృష్ణా జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షులు)



**అన్యులను** కించపరచడం మా అభిమతం కాదు గానీ, మా తెలుగుదేశం పార్టీలో చదల జానకి రామారావు గారు వంటి చిత్తశుద్ధిగల నాయకులు బహు అరుదు. అసలు ఆయన ఈపాటికే రాష్ట్ర పార్టీ అధిష్టాన వర్గ స్థాయిలో వుండవలసింది, బాధ్యతాయుతమైన ఏ పెద్ద పదవినో చేపట్టివుండవలసింది. ఎందుకనో గాని అది జరుగలేదు. అందుకు కారణాలు అనేకానేకం ఉండవచ్చునేమో కానీ, ఇప్పటికైనా పార్టీ అధినాయకత్వం శ్రీచదల జానకి రామారావుగారి సేవలను రాష్ట్ర స్థాయిన అధికారికంగా వినియోగించుకోవడం అవసరం. అవకాశం ఇస్తేనే కదా ఎవరయినా తమ సత్తా ఏమిటో నిరూపించుకునేది ! తాము నిజమైన ప్రజామనిషిగా, ప్రజా సేవలో తలమున్కలయే త్యాగమూర్తిగా, నిష్కళంక మానవతావాదిగా శ్రీ జానకి రామారావుగారు ఇప్పటికే ప్రజల ప్రేమాభిమానాలను చూరగొన్న మహోన్నత వ్యక్తిగా ఎదిగారు. వారికి సేవావకాశాలను కల్పించడం యువతరం నవతరం నాయకత్వం బాధ్యత.

# గురుదేవులు

## శ్రీ తోట వెంకటేశ్వరరావు

(సప్తతి సన్మాన సంఘం ప్రధాన కార్యదర్శి)



**చదల** జానకి రామారావు గారు మా గురుదేవులు అని ఇవ్వాళ నేను సగర్వంగా ప్రకటిస్తున్నాను. రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో వారు మాకు వైతాళికులు.

చూడడానికి సర్వ సాధారణంగా కనిపించే జానకి రామారావుగారు నిజానికి మహామనిషి. ఆయన ఆలోచనలు గొప్పవి, ఆచరణ స్ఫూర్తిమంతం, ఆశయాలు అత్యున్నతం, విలువలు మానవతాపూరితం. వీటికి తోడు ఆర్థిక సౌష్టవం అందివచ్చివుంటే ఈపాటికి జానకి రామారావు గారు జాతీయ నాయకుల సరసన అగ్రశ్రేణిన అలరారుతూ

వుండేవారు.

జానకి రామారావు గారికి కావలసింది కులం కాదు, గుణం. సొద కాదు, స్వేదం. మాటలు కాదు - చేతలు. తరతమ భేదాలు కాదు- తనివి తీరని మానవత. పదవులు కాదు - ప్రజాసేవ. ఇట్టి విశిష్ట వ్యక్తికి శిష్యుడను కావడం నిజంగా నా పూర్వజన్మ సుకృతం.

స్థిరచిత్తం, మానసిక స్థయిర్యం, పని సంస్కృతి, నిజాయితీ, సామాజిక స్పృహ, సంస్కారం జానకి రామారావు గారినుంచే నేను నేర్చుకున్నాను.

దశాబ్దాల తరబడి కలసిమెలసి పనిచేస్తూవస్తున్నాము. ఎన్నో ప్రజాహిత సేవా కార్యక్రమాలలో తలమున్కలుగా పాల్గొన్నాము. మా మైత్రికి, గురు - శిష్య సంబంధాలకు ఎన్నడూ ఎక్కడా ఏ విధమైన అవరోధాలు ఏర్పడలేదు - పైగా ఆత్మీయతానురాగాలు పెరుగుతూనేవస్తున్నాయి. ఇది వారి పెద్దమనస్సుకు నిదర్శనం.

గురుదేవుల 'సప్తతి' సన్మాన సంఘానికి ప్రధాన కార్యదర్శిని కావడం నిజంగా నా అదృష్టం. ఇట్టి మహదవకాశాన్ని కల్పించిన సహకార్యకర్తలకు నమస్కృతులు.

## ఇంటి కథ

### శ్రీ పబ్బిశెట్టి గోపాల కృష్ణ
(టి. వి. ఆర్టిస్టు)



**మా** ఇంటికి ఎదుటే శ్రీ చదల జానకి రామారావు గారి ఇల్లు. దానిని ఇల్లు అనే కంటే పంచాయతీ కచేరీ అనడమో, ఒక చిరున్యాయస్థానం అనడమో భావ్యం. ఆ ఇల్లు ఎప్పుడు చూసినా పదిమందితో కళకళలాడుతూనేవుంటుంది. బహుశా దాని వాస్తు అలాంటిదేమో ! వచ్చేవారు పోయేవారూను. కొందరు ఏడుస్తూ వచ్చి నవ్వుతూ పోవడం, మరి కొందరు కారాలు మిరియాలు నూరేంతటి కోపంతో వచ్చి సంతోషంగా చంక లెగరేసుకుంటూ వెళ్ళడం చూస్తుంటాను.

విశేషం ఏమంటే - చదల జానకి రామారావు గారు ఒక పెద్ద. కులపెద్ద మాత్రమే

కాదు - అన్ని వర్గాల వారికి ఒక పెద్ద. ఈ ప్రాంతంలో ఎక్కడ ఏ తగవు వచ్చినా, ఏ వివాదం ఏర్పడినా ఉభయ పక్షాలవారు ఏకగ్రీవంగా నిర్ణయించుకుని జానకి రామారావుగారి వద్దకు వచ్చి తమ వాదనలను వినిపిస్తారు. జానకి రామారావు గారికి కుల మత వర్గ విచక్షణ లేదు. వారు - వీరు, చిన్న - పెద్ద, తర - తమ బేధాలు లేవు. సమస్యను సాకల్యంగా ఆసాంతం వింటారు. కూలంకషంగా చర్చిస్తారు. నిర్మొహమాటంగా తీర్పుచెపుతారు. ఇక దానికి తిరుగు లేదు. ఆ తీర్పు ఉభయ పక్షాలకు నచ్చుతుంది. నవ్వుకుంటూ ఒక్కరుగా వెళ్ళిపోతారు. ఇదీ జానకి రామారావు గారి ఇంటి కథ!

# ప్రార్థన



## ఆర్. వి. జె. ఎస్. రామచంద్ర మూర్తి

(ఆంధ్ర శ్రామిక ధర్మరాజ్య సభ కార్యదర్శి)

**చదల** జానకి రామారావు గారు అట్టడుగున వున్న ఆదిమ జాతుల వారి సేవలో అగ్రగణ్యులు. వెన్నెలకంటి రాఘవయ్య గారి అంతేవాసులలో ముఖ్యులు. నేనూ జానకి రామారావు గారూ భారతీయ ఆదిమ జాతి సేవా సంఘంలో సహసభ్యులం. 'సప్తతి' జానకి రామారావు గారికి 'శత మానం భవతి' జరగవలెనని ప్రార్థన.

# అనుభూతి



## శ్రీ కత్తుల పాపారావు

( టాక్సీ డ్రయివరు, నందిగామ)

**మా** ఊరి నాయకులు చదల జానకి రామారావు గారు దూర ప్రయాణాలు చేసేప్పుడు సాధారణంగా మా కంపెనీ టాక్సీనే వాడుతుంటారు. డ్రయివరుగా నేనే వెళుతూవుంటాను. జానకి రామారావు గారు, వారి సహచరులతో ప్రయాణించడం డ్రయివరుగా నాకొక

గొప్ప అనుభూతి. వారు తమ సహజ ధోరణిలో ఒక టాక్సీ డ్రయివరుగా కాక, తమ సహచరులలో ఒకనిగానే నన్ను చూస్తుంటారు.

కారులో దారిలో వారు ఎన్నో విషయాలు మాట్లాడుకుంటూవుంటారు. అవన్నీ నాకెందుకు - నాదారి నేను చూసుకుంటూ పోతూవుంటాను. ఎక్కడైనా స్పీడు కాస్త ఎక్కువయినట్టు తోస్తే, 'తగ్గించు !' అంటారు నిదానంగా. 'మంచి హోటలు దగ్గర ఆపు !' అంటారు. వేళను బట్టి టిఫిన్ తినడమో భోజనం చేయడమో జరుగుతుంది. నేను వేరుగా కూర్చోపోతే ఊరుకోరు. తమ టేబుల్ దగ్గరే కూర్చోవాలి. అందరి బిల్లు వారే చెల్లించి, సర్వరు తృప్తిపడేటట్టు టిప్‌ను మిగుల్చుతారు. నా బేటాను ఆయిల్ కొట్టించేప్పుడే ఇచ్చేస్తారు. టాక్సీ బిల్లును ఏనాడు వాయిదావేయరు.

రాజకీయంగా వారు ఇతర నాయకుల గురించి పల్లెత్తు మాట అనడం ఏనాడూ నేను వినలేదు. ఒక వేళ సహచరులు చులకనగా మాట్లాడబోయినా మర్యాదగానే మందలిస్తుంటారు.

నా టాక్సీలో మా ఊరి నాయకులు మరి కొందరు తరచు ప్రయాణిస్తూవుంటారు. వారి మాటల సందర్భాలలో జానకి రామారావు గారి ప్రస్థావన వచ్చినప్పుడు వారి గురించి అందరు మంచిగానే చెప్పుకునేవారు.

దీనిని బట్టి నేను గ్రహించినదేమంటే - శ్రీ చదల జానకి రామారావు గారు మా ఊరి నాయకులే కాదు, జిల్లా నాయకులు, రాష్ట్ర నాయకులు అని !

# మహోవ్యక్తి

## శ్రీ పోట్లూరి రామమూర్తి

(నెల్లూరు జిల్లా ఆదివాసీ సేవా సంఘం నాయకులు)

**త్రిమూర్తులు** అనదగిన సర్వశ్రీ పాలపర్తి వీరయ్య, చదల జానకి రామారావు, రామావతు లాలూ నాయక్ గారులు మా ఆదివాసుల సముద్ధరణ నేతలు. నాటి ఉద్యమాలను నేటికీ మరచిపోలేము. ఆ ఉద్యమపు తొలిరోజుల నాటికి నేనూ మా

తమ్ముడు లక్ష్మీనారాయణ నెల్లూరులో వెన్నెలకంటి రాఘవయ్య గారి థక్కర్ బాపా యానాది బాలుర హాస్టలులో చేరి చదువుకుంటూ వుండేవాళ్ళం. ఆ తరువాత మేమూ పై వారితో కలసి కొన్ని ప్రజోద్యమాలలో పాలుపంచుకున్నాము. మహావ్యక్తి జానకి రామారావు గారి సేవలు మమ్మ ఉత్తేజపరచేవి. మా జిల్లా ఆదివాసులు పోపూరి రమణయ్య కుటుంబం, మా తమ్ముడు, నా తరఫున జానకి రామారావు గారికి హృదయపూర్వకమైన ధన్యవాదాలను తెలుపుకుంటున్నాము.

## ఆద్యులు



### శ్రీ గాజుల రాజేశ్వరరావు

(అనియత విద్యాశాఖ ప్రాంతీయాధికారి)

**ఆదివాసి** ప్రజోద్యమ ఆదిమ నిర్మాతలలో శ్రీ చదల జానకి రామారావు గారు ఆద్యులు. వయోజనులను అక్షరాశ్యులను చేయడంలోనే కాక, బాలబాలికలను వెతకి చేర్పించడంలో సయితం ఉద్యమ నేతగా శ్రీ జానకి రామారావు గారు చరిత్రను సృష్టించారు. ఆ విధంగా అనియత విద్యకు కూడా ఆద్యులు ఆయనే అనిపిస్తుంది. ఇది అతిశయోక్తి అనిపిస్తుంది గాని - అయిదు దశాబ్దాలు వెనుకకు వెళ్ళి ఆలోచించేవారికి ఇది నిజం అని తెలుస్తుంది.

*

# జాతి గుండెలలో

## శ్రీ చదల నాగేశ్వరరావు

(ప్రెసిడెంటు: ఎస్.సి. ; ఎస్.టి.

ఎంప్లాయిస్ వెల్ఫేర్ అసోసియేషన్ - విజయవాడ డివిజన్)

**చ** రిత్ర పుటలలో స్ఫూర్తిదాయక సేవ !

**ద** యగల మనస్కులు దారిద్ర్యరేఖ దిగువ వారికి !

**ల** క్ష్య సాధనలో పట్టువీడని విక్రమార్కులు !

**జా** తి జాగృతికి 'కల్లుముంత' బుర్రకథ ఆయుధం !

**న** వ శకానికి నాగరిక బ్రతుకు బాటకు వేగుచుక్క !

**కి** తాబు లందాయి ఎన్నెన్నో వన్నె తెచ్చారు వాటికే !

**రా** జకీయ చైతన్యంతో జాతి సేవకు పలు పదవుల స్వీకరణ !

**మా** రని మనసున్న మనీషి, నిరుపేద హృదయాల చిరస్మరణీయం !

**రా** గ రంజిత కుటుంబం ఆదర్శ జీవన యానం !

**వు** న్నవి ఘనమైన పథకాలు ఎన్నో, మా ఊహాకందని భావాలు ఎన్నెన్నో !



# జేజేలు!

## శ్రీ భూక్యా చిన వెంకటేశ్వర్లు

(అధ్యక్షులు; గుంటూరు ప్రెస్ క్లబ్.ㄱగిరిజన స్రవంతిㄴ పత్రిక సంపాదకులు)

**తరతరాలుగా** అణగారిన ఆదివాసీ గిరిజన జాతుల సముద్ధీకరణకు శ్రీ చదల జానకి రామారావుగారు అవిశ్రాంతంగా గత 50 యేళ్ళుగా కృషి చేస్తూవస్తున్నారు. ఫలితంగా సాంఘికంగా,

రాజకీయంగా అణచివేయబడిన ఆదివాసి, గిరిజన, పీడిత జనులు ఇప్పుడిప్పుడే మేలుకుంటున్నారు. అట్టడుగు వర్గాలైన ఈ అణగారిన జాతుల చైతన్యానికి శ్రీ చదల జానకి రామారావు వంటి నేతల కృషే కారణం అని చెప్పక తప్పదు.

ఆదివాసులను శారీరకంగా, మానసికంగా కృంగదీసిన పాశవిక నేరస్థ జాతుల చట్టాన్ని రద్దు చేయించి, వారికి సాంఘిక ప్రతిపత్తిని కల్పించడంలో శ్రీ చదల జానకి రామారావు గారు సాగించిన ఉద్యమం చారిత్రకమైనది. మరువలేనిది. ఆదివాసి, గిరిజన జాతుల సేవకు తమ జీవితాన్ని అంకితం చేసుకున్న త్యాగధనులు శ్రీ చదల జానకి రామారావు.

స్వీయ జీవన యానంలో నిరాడంబర జీవితాన్ని గడుపుతున్న శ్రీ జానకి రామారావుగారు అహరహం అట్టడుగు వర్గాల సేవలనే కొనసాగిస్తూవస్తున్నారు.

ఆదివాసుల సాంస్కృతిక కళా రూపాలను వివిధ ప్రాంతాలలో ప్రదర్శనలిస్తూ, కల్లుముంత, ఏకలవ్య బుర్ర కథా దళం వ్యాఖ్యాతగా గిరిజనులను చైతన్యవంతులను గావించిన కళాకారులు మన జానకి రామారావు గారు. ఆయనే నాకు స్ఫూర్తి!

సాంఘిక సేవలో విశిష్ట సేవనందించిన శ్రీ జానకి రామారావుగారు గిరిజన రత్న. సంచార, ఆదివాసి, గిరిజన సేవలలో సుదీర్ఘ కాలంగా సేవలనందిస్తున్న శ్రీ జానకి రామారావు గారికి జేజేలు!

## అవసరం



శ్రీ బెజవాడ సుబ్బారెడ్డి

(అలనాటి ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు)

**అర్ధ** శతాబ్దికి పూర్వమే అతనిలో అంతర్లీనంగా అల్లుకుపోయి వున్న ప్రతిభావ్యుత్పత్తులను గుర్తించాను. సరిపడా తిండి లేదు. ఒంటినిండా బట్టలేదు. పండ మంచమూ లేదు. అయినా అతను నిత్య సంతోషి. గుండె నిండా మనసు వుంది. మేను నిండా నిబ్బరం వుంది. ఇంటినిండా

మమత వుంది. ఇంకేం కావాలి తనకు! కష్టాలు, కడగండ్లు అతనిలో ఒక విధమైన పట్టుదలకు ప్రేరేపించాయి. దీక్ష అతనిని ఉత్తేజితం చేసింది. నిరాశలకు నిటూర్పులకు లోను కాక, ఎదురీదడం నేర్చుకున్నాడు. శ్రమించాడు. స్వయం శక్తినే ఆలంబన చేసుకున్నాడు. ధీరోదాత్తంగా పెరిగాడు. అతనే మన చదల జానకి రామారావు.

గండేపల్లిలోని మా ఇంటనే అతను తన సాంస్కృతిక జీవనానికి శ్రీకారం చుట్టుకున్నాడు. కులాల అంతరాలను ఛేదించుకొని మా ఇంట సగర్వంగా తలెత్తుకు సంచరించేవాడు. నాకు అంతేవాసి అయ్యాడు. నేను ప్రజా నాట్య మండలికి పరిచయం చేశాను. దానిలో అతను ఇంతింతై వటుడింతై అన్నట్టుగా ఎదిగిపోయాడు. గొప్ప కళాకారునిగా రాణించాడు. అదే నాకు గర్వకారణం.

ఆ పిదప, సంఘం అతని వెన్నుతట్టింది. సామాజిక స్పృహ పురివిప్పింది. సాంఘిక సంస్కరణల కోసం శతపోరాడు. కొన్ని అణగారిన అభాగ్య జాతులకు విముక్తిని కల్పించాడు. అంతకంటే ముక్తి ఏమున్నది!

ముక్తి ప్రదాతా, చదల జానకి రామారావూ! నేటికీ నా ఆశీస్సులు నీకు ఉండనే వున్నాయి! ఇప్పుడు నీవు ఏడు పదుల కుర్రకుంకవు. ఇంకా ఇంకా శతపోరవలసిన అవసరం వున్నది. సంఘానికి నీ అవసరం ఇప్పుడూ వున్నది!

# ఏకలవ్య శిష్యులు

## శ్రీ కట్టా సాంశివరావు

(ఏకలవ్య సేవా సమితి నాయకులు, గుడివాడ)



**మా** 'ఏకలవ్య సేవా సమితి' వ్యవస్థాపనకు ప్రేరణ 'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్.' ఈ సంఘం ప్రధాన కార్యదర్శి చదల జానకి రామారావుగారు మా ఎరుకలకు ఒక నడచే దైవం. మనసా వాచ కర్మణా ఆయన ప్రభావం మాపై నూటికి నూరు పాళ్ళూ వున్నది. లేదనుకోవడం ఆత్మవంచనే!

అంతే కాదు. ఏ సంస్థలో అయినా, ఏ సంఘంలో అయినా, ఏ రాజకీయ పార్టీలో అయినా ఎవ్వరైనా- సరే ఒక నాయకునిగా రాణించదలచుకున్నవారు- శ్రీ చదల

జానకి రామారావుగారి నుంచి స్ఫూర్తి పొందవలెనని, ఏకలవ్య శిష్యులు కావలెనని విజ్ఞప్తి చేస్తున్నాను. ఎందుచేతనంటే- ఆయన చిత్తశుద్ధి అటువంటిది, కార్యదక్షత అంతటిది. వ్యక్తిత్వం అంతగానూ ఉన్నతమైనది.



# నాయకత్వం

## శ్రీ బడే బాబూరావు

(సామాజిక సేవా కార్యకర్త, హైదరాబాద్)

**సామాజిక** నాయకత్వం నయవంచనకు లోనవుతున్నది. ఒక నాయకుడు మహానాయకుడు అవుతూ ఏడేడు తరాలకు సరిపడా సంపాదించుకుంటున్నాడు. అదే సమయంలో తనను ఆ స్థితికి పెంచిన అసలుసిసలైన కార్యకర్తలను విస్మరిస్తున్నాడు. అంతే కాదు. తనను ప్రశ్నించిన వారిని నిర్దాక్షిణ్యంగా అణచివేస్తున్నాడు. దీనితో ద్వితీయ శ్రేణి, తృతీయ శ్రేణి, ప్రత్యామ్నాయ నాయకత్వం కరవవుతున్నది. ఇది సమాజానికి శ్రేయస్కరం కాదు. సాంఘిక ద్రోహం, సంఘ విద్రోహం కూడాను. దీనిని అనుభవపూర్వకంగా గుర్తించినవారు శ్రీ చదల జానకి రామారావు. అయితే, ఆయన కరివేపాకు మాత్రం కాదు, కరికాల చోళుడు!

శ్రీ చదల జానకి రామారావు నాయకత్వ నేపథ్యంలో వందలు వేలుగా కార్యకర్తలు ఎదిగారు, ఎదుగుతున్నారు. ఆయన నాయకత్వం నిష్కల్మషమై శిఖరాగ్రాలకు చేరినా, తనూ ఒక కార్యకర్తననే చెప్పుకుంటారు. కార్యకర్తలలో ఒకనిగా మమేకమై కృషిచేస్తారేకాని ఏనాడూ నాయకత్వ భేషజానికి పోలేదు. నిరాడంబరత, నిజాయితీ, పరస్పర సదవగాహన, ప్రేమాస్పద భాషణ, సచ్ఛీలత, క్రియాశీలక ధోరణి శ్రీ జానకి రామారావు గారిని కార్యకర్తలకు ఇంకాఇంకా చేరువ చేస్తున్నాయి. అదే నాయకత్వం అంటే. ఇదే శ్రీ చదల జానకి రామారావుగారి నాయకత్వానికి నిర్వచనం.

*

# సేవా సంప్రదాయాలు

## డాక్టరు జి.గంగాధర్

(గిరిజన స్వచ్ఛంద సేవా సంస్థ అధినేత)

**రాజకీయంగా** పదవి, సాంఘికంగా హోదా, ఆర్థికంగా సంపద, సాంస్కృతికంగా చదువు సమాజాన్ని శాసించలేవు, ఒక వ్యక్తిని ఉన్నతుని చేయలేవు. ఇవేవీ లేకనే విశ్వ విజేతలైనవారు వున్నారు. మహాజనంతో మమేకమై సంఘాన్ని ప్రగతి పథాన నిలిపిన వారూ వున్నారు. ఇటువంటి నిడారంబర మానవతామూర్తులలో మన చదల జానకి రామారావుగారు ఒకరు.

చదల జానకి రామారావుగారు పుట్టింది నిరుపేద జానపద కుటుంబంలో; పెరిగింది అసమానతలు, ఆకలి మంటలు, ఆర్తత్రాణల మధ్య. అయినా, తమను తాము మలచుకున్నారు, స్వయంకృషితో స్వీయవ్యక్తిత్వంతో విశ్వనరుడుగా నిలువెత్తున నిలచారు. తాము అనుభవించిన కష్టనష్టాలు, మౌన రోదనలే ప్రేరణలుగా - ఇట్టి దుర్భర దారిద్ర్య, భ్రష్ట బహిష్కృత జీవనం నుంచి తమ జాతిని తప్పించి, సంఘంలో వారికొక స్థాయిని కల్పించి, నడుం బిగించి పట్టుదలతో పనిచేశారు, ఫలితాలను సాధించారు.

ఇదీ సామాజిక స్పృహ, ఇదీ సాంఘిక దృక్పథం, ఇదే మానవసేవ, ఇదే మానవత. దీనిలోనే జానకి రామారావుగారు తరించారు; సంచార ఆదివాసి - గిరిజనుల తరతరాల తల రాతలను తుడిచివైచి, వారిని సయితం సమసమాజ జీవన స్రవంతిలో భాగస్వాములను చేశారు. రాజకీయం అరాచకం అవుతున్న దశలో, సంఘసేవ ఫ్యాషన్‌బుల్ గా మారుతున్న రోజులలో, సంస్కృతి వెఱ్ఱితలలు వేస్తున్న వేళ జానకి రామారావుగారు గళం విప్పారు, వైతాళికులై నిజమైన మానవసేవలకు మూలవిరాట్టులయారు.

ఉన్నత విలువలను పరిపోషిస్తూ, మహోన్నతమైన సేవా సంప్రదాయాలను పాదుకొల్పిన శ్రీ చదల జానకి రామారావుగారి ''సప్తతి'' సన్మాన మహోత్సవంలో నేనూ భాగస్వామినైనందుకు గర్విస్తున్నాను.

# అంతేవాసి

## శ్రీ తంగిరాల ప్రభాకరరావు

## ( కృష్ణాజిల్లా పరిషత్తు సభ్యులు)

**అది 1950.** శ్రీ చదల జానకి రామారావు నందిగామలో జాతీయ రహదారి ప్రక్కన "శ్రీ థక్కర్ బాపా ఆదివాసి హాస్టలు"ను నెలకొల్పారు. బడుగు, బలహీన, దళిత, గిరిజన బాల బాలికలకు విద్యావకాశాలను కల్పించడమే లక్ష్యంగా ఆయన ఇందుకు పూనుకున్నారు. భావి భారత విధాతలకు ఇది కారు చీకటిలో కాంతి రేఖ. ఆ వసతి గృహంలో ఎన్నడూ ఏ చిన్న తప్పిదమూ జరగకపోవడం విశేషం. పైగా ఎంతో క్రమశిక్షణ కానవచ్చేది. పిల్లలకు పౌష్ఠికాహారాన్ని సుష్టుగా పెట్టేవారు. అక్కడ వుండి చదువుకున్న వారిలో ఆ తరువాత ఇంజనీర్లు, డాక్టర్లు, లాయర్లుగా, ఇతర ఉన్నతోద్యాగాలలో రాణించిన వారు ఎందరెందరో వున్నారు. ఆ హాస్టలు 1972 వరకు వున్నది.

ఎరుకలు, యానాదులు, ఇతర సంచార - ఆదివాసి గిరిజనుల కోసం 1960లో నందిగామలో కాలనీని నిర్మించారు. దీని కర్త, కర్మ, క్రియ జానకి రామారావుగారే. అంతే కాదు, ఆ కాలనీకి మంచినీరు, రోడ్లు, విద్యుచ్ఛక్తి, పాఠశాల, మరుగుదోడ్లు మొదలైన సౌకర్యాల కల్పనకు కూడా ఆయన అహోరాత్రాలు కృషి చేశారు. కాలనీవాసుల నిరుద్యోగ నిర్మూలనకు ఋణాలనుకూడా ఇప్పించి, శిక్షణల నిచ్చి, స్వయం ఉపాధి కల్పన పథకాలకు శ్రీకారం దిద్దారు.

నిరుపేద గిరిజనుల నుదుటివ్రాతను తుడిచివైచి, వారిని దారిద్ర్య రేఖ దిగువనుంచి పైకి తేవలెనని శ్రీ జానకి రామారావు ఆ కాలంలోనే తాపత్రయపడేవారు. ఇందుకు అన్ని మార్గాలను అన్వేషించేవారు. అవసరం అయితే రాజ్యాంగాన్నే మార్చవలెననేవారు. ఇంత సునిశిత మేధగల మానవులు చాలా అరుదు. ఆయన నూటికి నూరు పాళ్ళు సాంఘిక విప్లవకారుడు. అందుకనే అప్పటి పాలకపక్ష కాంగ్రెసువారు ఈయనకు 'కమ్యూనిస్టు' ముద్ర వేసి, సాంఘిక సంక్షేమశాఖ గ్రాంట్ల మంజూరులో నానా ఇబ్బందులూ పెట్టేవారు. సంఘసేవకు భాష్యం 'కమ్యూనిస్టులు' ఏం చెప్పగలరు గనుక!

శ్రీ నందమూరి తారక రామారావుగారు "తెలుగుదేశం" పార్టీని వ్యవస్థాపించగానే శ్రీ చదల జానకి రామారావు దానిలో క్రియాశీలక సభ్యులయారు. శ్రీ జానకి రామారావు నిస్వార్థసేవలను, కార్య దక్షతను తొలిగా గుర్తించిన రాజకీయ మేధావి తారక రామారావు గారే అనడం అతిశయోక్తి కాదు. ఆయన ఈయనమీద నమ్మకం వుంచి, అనేక జిల్లాలకు పార్టీ పరిశీలకునిగా తమ ప్రతినిధిగా పంపేవారు. ఆయన నమ్మకాన్ని ఈయన ఏనాడూ వమ్ముచేయలేదు!

ఎన్. టి. రామారావుగారు హైదరాబాద్ టాంక్‌బండ్ మీద నిరాహార దీక్ష చేశారు. ఆయనను పోలీసులు బలవంతంగా ఆసుపత్రికి తరలించారు. ఆ సందర్భంగా నేను, జానకి రామారావుగారు వారిని పరామర్శించడానికి, అవసరం అయితే మేముకూడా ఉద్యమించడానికి సిద్ధపడి వెళ్ళాము. అప్పుడు రామారావుగారు జానకి రామారావుగారికి ఎంతగా మర్యాద ఇచ్చారో మాటలలో చెప్పలేను!

**1994** ఎన్నికలలో శ్రీ జానకి రామారావుగారికి టికెట్ ఇచ్చే విషయం గురించి కూడా శ్రీ ఎన్. టి. ఆర్. పరిశీలించారు. అయితే 'దుష్ట శక్తి' ఆహ్వానంతో అది సాధ్యం కాలేదు! అయినా శ్రీ రామారావుగారిని కడవరకు ఈ జానకి రామారావుఆరాధిస్తూనే వచ్చారు; ఆయనా అంతగానూ గౌరవించుకుంటూవచ్చారు.

ఇప్పుడు శ్రీ నారా చంద్రబాబు నాయుడుగారి హయాంలో కూడా అంతే జరుగుతున్నది. శ్రీ చదల జానకి రామారావుగారు తెలుగుదేశం పార్టీ కేంద్ర అధినాయకత్వ అంతేవాసి!

*

# విద్యా పిపాసి

## శ్రీ పరిమి యాకోబు

(నందిగామ మండల పరిషత్తు అధ్యక్షులు)



**మన** చదల జానకి రామారావుగారు గొప్ప విద్యాపిపాసి. ఆబాల్యంగా ఆయనను గమనిస్తూవస్తున్నాను - అంత విద్యా తృష్ణ గలవారు బహు అరుదు. అష్టకష్టాలుపడి చదువుకున్నాడు. ఎంత వరకు - హైస్కూలు వరకే! అతని ఆర్థిక పరిస్థితి, కుటుంబ భారం అతనిని చదువుసాములలో అంతకు మించి పైకి పోనీయలేదు. అయినా, అక్కడికీ, హిందీ చదువుకున్నాడు. ఉహు! అదీ కొనసాగలేదు... ఇహ, అతను జీవన చక్రంలో ఇరుక్కుపోయాడు.

కాలక్రమంలో అతను మంచి మనిషి అయ్యాడు. నాయకుడు అయ్యాడు. వేత్త అయ్యాడు. అయితే, తన విద్యా పిపాసను వేరు విధంగా తీర్చుకోవాలనుకున్నాడు. తనకు దక్కని విద్య అన్యులకు దక్కేట్టు చేయాలనుకున్నాడు. బడికి వెళ్ళి చదువుకో వీలు చిక్కని నిర్భాగ్య బాల బాలికలను ఊరూరా గాలించి మరీ ఏరుకువచ్చాడు. తన హాస్టలులో వుంచాడు. అన్నం పెట్టాడు. బట్టలిచ్చాడు. ఆటపాటలు నేర్పాడు. లాలించాడు. క్రమశిక్షణ నలవరచాడు. చదువు చెప్పించాడు. ఇలా ఒకరా ఇద్దరా - వందల సంఖ్యలో చదువుకున్నారు, ఆయన పేరు చెప్పుకుని విద్యాధికులయ్యారు. ఉన్నతోద్యోగులయ్యారు. ఇదుగో ఈ విధంగా మన చదల జానకి రామారావుగారు తమ విద్యాపిపాసను తీర్చుకున్నారు.

*

జీవనశైలి

## శ్రీ కొమ్మన గంగాధర తిలక్

(సమ సమాజ తాత్వికులు)



నాటి భారతంలో సంచార జాతులలో త్యాగానికి ప్రతీక ఏకలవ్యుడు. ఈనాటి భారతంలో అణగారిన జాతులలో త్యాగానికి ప్రతినిధి ఎదఎదలో వెందలే చదల జానకి రామారావు గారు.

ఆరున్నొక్క దశాబ్దాల జీవన గమనంలో అర్థశతాబ్దపు కాలాన్ని గిరిజనాభివృద్ధికి, వారి సాంస్కృతిక వికాసానికి, సామాజిక చైతన్యానికి ఆర్థికాభివృద్ధికి వెచ్చించి, అవిశ్రాంత కృషి సల్పిన చదల జానకి రామారావు గారికి సప్తతి పూర్తి సందర్భంగా నా హార్దిక శుభాకాంక్షలు ముందుగా తెలియజేసుకుంటున్నాను.

కాలగతిలో చరిత్ర గమనంలో తాడిత, పీడిత ప్రజల సముద్ధరణకోసం పతితులు, భ్రష్టులు, బాధా సర్పద్రష్టులు, దీనుల, హీనుల కన్నీళ్ళను తుడవడానికి కంకణం కట్టుకొన్న సంస్కర్తలు, సేవాదురంధరులు ఎందరో, ఎందరెందరో!

పెరియార్ రామస్వామి, జ్యోతి బాపూలే, థక్కర్ బాపా, చించాల్కర్, వెన్నెలకంటి రాఘవయ్య, మహాశ్వేతాదేవి వంటి వారెందరో సమాజంలో నిరాదరణకు, నిర్లక్ష్యానికి గురయిన గిరిజన, సంచార జాతుల సముద్ధరణకోసం నాడు నడుం బిగించారు.

పౌరసత్వపు హక్కులు లేనివారు, చేయని నేరానికి నేరస్థులుగా పరిగణితులైన వారు, డొక్కనింపుకోవడంకోసం రెక్కాడిద్దామన్నా అవకాశం లభించని అదృష్టహీనులు, తమ ఏడుపును కూడా బయటకు కక్కుకోలేని దుస్థితిలో వున్న దీనులు, కిరాయికి సయితం ఏడ్చే అభాగ్యులు-72 ఉపకులాల వారు - వారి వారి ప్రజాకళారూపాల ద్వారా బ్రతుకువెళ్ళదీస్తున్న జీవచ్ఛవాల జీవన స్థితిగతులలో మార్పుకోసం, చైతన్యపు ఊపిరులను ఊదాడంకోసం పౌరసత్వం కల్పించడం కోసం, సామాజిక న్యాయంకోసం కృషిచేసిన ఆంధ్ర ప్రాంతీయ ప్రముఖులలో పొన్నా సోదరులు, పాలపర్తి, చదల జానకిరామారావు, రాఘవయ్య ప్రభృతులు ముఖ్యులు.

నందిగామ సీమ పలువురు విశిష్ట వ్యక్తులకు పుట్టినిల్లు. సర్వశ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, మాడపాటి హనుమంతరావు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కొమఱ్ఱాజు

లక్ష్మణరావు, బండారు అచ్చమాంబ ప్రభృతులు ఈ సీమకు చెందినవారే, వీరంతా తమ యశోదుకూలాలను రాష్ట్రం నాలుగు చెరగులకు విస్తరింపజేసినవారే. మునగాల పోరాటం, పరిటాల రిపబ్లిక్ ఏర్పాటు, కమ్యూనిస్టు ఉద్యమం బలంగా వ్యాప్తి చెందటం ఈ ప్రాంతపు చరిత్రను చేకూర్చాయి. ముక్త్యాల సంస్థానం సాహిత్య సేవకు, నాగార్జున సాగరు ప్రాజక్టు నిర్మాణానికి పునాది వేసింది. ఇలా ఈ ప్రాంత నాయకులు, ప్రజలు గావించిన కృషి చిరస్మరణీయం.

ఇంతటి ఘనమైన చారిత్రక నేపథ్యం వున్న నందిగామ ప్రాంతంలో జన్మించిన చదల జానకిరామారావు గారు మట్టిలో మాణిక్యం. ఆంధ్రరాష్ట్ర మైదాన ప్రాంత గిరిజన నాయకులలో వీరు ముఖ్యులు. ఆంధ్రరాష్ట్ర ఆదిమ జాతి సేవక సంఘం ప్రధాన కార్యదర్శిగా భారత ఆదిమ జాతి సేవక సంఘం కార్య నిర్వాహక సభ్యునిగా, అనితర సాధ్యమైన, అవిరళమైన, అమూల్యమైన, ఆచంద్రార్కమైన సేవలు చేశారు. చీకటి బ్రతుకులలో వెలుగులను నింపారు. ఆదివాసీల సాంఘిక ఆర్థిక, సాంస్కృతిక జీవనంలో మార్పును తీసుకురావటానికి శ్రీ చదల జానకి రామారావు రాజకీయ రంగంతో పాటు సాహిత్య, సాంస్కృతిక రంగాలను కూడ సాధనాలుగా ఎంచుకొన్నారు. గిరిజనుల మూఢాచారాలను రూపుమాపటం కోసం అనేక సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించారు.

**1950** లో 'ధక్కర్ బాపా ఆదివాసి హాస్టల్' ను తొలిగా వ్యవస్థాపించి, ఆదివాసీల విద్యా బుద్ధుల అభివృద్ధికి ఈప్రాంతంలో బీజావాపనంచేశారు. శ్రీజానకిరామారావుగారు. నందిగామ న్యూకాలనీలో బాల్వాడి, క్రెచ్ సెంటరు, కంచికచర్లలో రెండు క్రెచ్ సెంటర్లు వీరి ఆధ్వర్యంలో నడిచాయి.

ఎన్. టి. రామారావు, వి. వి. గిరి వంటి ప్రముఖుల మన్ననలను, ఆదరాభిమానాలను చూరగొని ఏకలవ్య, గిరిజన రత్న, డాక్టరు అంబేద్కరు విశిష్ట వ్యక్తి వంటి పురస్కారాలను పొందిన సంస్కర్త, సేవకుడు, విశిష్ట నాయకుడు శ్రీచదల జానకి రామారావు.

మన చదల జానకి రామారావు కేవలం ఆదివాసి, గిరిజన నాయకుని గానేకాక, సమాజసేవలో వివిధ వర్గాల వారి ఆదరాభిమానాలకు పాత్రులైన నాయకులు. సారా వ్యతిరేకోద్యమంలో జిల్లాస్థాయి నాయకునిగా విశేష కృషి గావించారు. తొలి దశలో వామ పక్షోద్యమాభిమాని. తదనంతర పరిణామ రాజకీయాలతోపరిణతి పొంది, తెలుగుదేశం

పార్టీలో చేరి, కృష్ణాజిల్లా తెలుగుదేశం పార్టీకి ఉపాధ్యక్షులుగా, రాష్ట్ర తెలుగుదేశం పార్టీ కార్యవర్గం సభ్యులుగా పనిచేసిన కాకలు తీరిన రాజకీయ యోధులు, రాజకీయ రణరంగ పితామహులు చదల జానకి రామారావు గారు. అంతేకాదు, సహకార రంగంలో పాలుపంచుకొన్న వ్యక్తి. ప్రస్తుతం కృష్ణాజిల్లా కేంద్ర సహకార బ్యాంకు డైరెక్టరు. జలధిగంభీర వ్యక్తిత్వం, సుమ సౌరభ సమాన మానవత్వం, వివాదరహితమైన జీవనశైలి - ప్రజాభరణాలుగా వెలుగొందుతున్న చదల జానకి రామారావుగారు మరిన్ని జన్మదినోత్సవాలు జరుపుకుంటూ సమాజసేవలో పునీతులవుతారని ఆశిద్దాము.

# గిరిజన సంక్షేమ శాఖ ఏర్పాటులో భాగస్వామి

## శ్రీ దేవినేని ఉమామహేశ్వరరావు

(నందిగామ శాసన సభ్యులు, కంచికచర్ల)

దేశ స్వాతంత్ర్యానంతరం మన జాతీయ ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు తొలిగా బడుగు - బలహీన వర్గాల సంక్షేమం పట్ల దృష్టిని సారించాయి. సమాజంలో దారిద్ర్య రేఖకు దిగువన అట్టడుగున అణగిమణగి మగ్గిపోతున్న దళిత, నిమ్న జాతుల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక అభ్యున్నతికి అంచంచల పథకాలను రూపొందించారు. వార్షిక, ద్వైవార్షిక, పంచ వర్ష ప్రణాళికలద్వారా ప్రత్యేక కేటాయింపులతో బడ్జెట్టులను అమలుపరచారు. ప్రత్యేకంగా సాంఘిక సంక్షేమ శాఖను ఏర్పరచారు.



అయితే, తెలిసో తెలియకో గిరిజనులను విస్మరించారు. ఎరుకల, యానాది, లంబాడి, చెంచు, బుడబుక్కల మొదలైన సంచార- ఆదివాసి- ఆదిమజాతుల వారు అన్యాయానికి గురయ్యారు. ఇట్టి వీరి నికృష్ట - అంధకారమయ జీవితాలలో వెలుగులు

నింపడానికి జాతీయ స్థాయిలో భారతీయ ఆదిమ జాతి సేవక్ సంఘ్ మన రాష్ట్ర స్థాయిలో ఆంధ్రరాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ ఉద్యమించాయి. బండబారిన ఈ గిరిజనుల అభ్యున్నతికి కొన్ని పథకాలను, ప్రణాళికలను ప్రభుత్వాలకు ప్రతిపాదించాయి. ఫలితంగా ప్రత్యేకంగా 'గిరిజన సంక్షేమ శాఖ' ఏర్పడింది.

గిరిజన సంక్షేమ శాఖ ఏర్పాటు నిస్సంకోచంగా భారతీయ, ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ కృషి ఫలితమే. ఈ రెండు సంస్థలలోను మన చదల జానకి రామారావుగారికి కీలకమైన బాధ్యతలు వున్నాయనే విషయం జగద్విదితం. తద్వారా ప్రభుత్వాలలో గిరిజన సంక్షేమ శాఖ ఏర్పాటులో శ్రీ జానకి రామారావు గారిది ప్రధాన భూమిక అనేది స్పష్టం.

శ్రీ చదల జానకి రామారావు గారు మాకు అత్యంత ఆప్తులు. మా అగ్రజులు కీర్తిశేషులు శ్రీ దేవినేని వెంకట రమణగారు శాసన సభ్యునిగా మంత్రివర్యునిగా జానకి రామారావు గారి సలహా-సంప్రతింపులకు అత్యధిక విలువ నిచ్చేవారు. నేనూ అంతే! వారు నాకు రాజకీయ గురుతుల్యులు.

## పితృ దేవో భవః

### శ్రీ యరబడి కృష్ణారావు

( ఏకలవ్య సేవా సమితి కృష్ణాజిల్లా

శాఖ సహకార్యదర్శి)



పరమ పూజ్యులు చదల జానకి రామారావు గారికి 70 వ వసంతోత్సవం జరుగుతున్నదంటే నా మేను పులకించింది. పైగా ఆ సన్మాన సంఘం కోశాధికారిగా పేదనైన నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకోవడం నా పురాకృత సుకృతమేమోననిపిస్తున్నది.

చదల జానకి రామారావు గారు కేవల వ్యక్తి మాత్రులు కారు, ఒకానొక సాంఘిక శక్తి. వారి సంఘటితంగా సాధించిన విజయాల వల్లనే మేము ఇవ్వాళ భారతీయ సమ సమాజ వ్యవస్థలో సగౌరవంగా సమాన ప్రతిపత్తితో తల ఎత్తుకు బ్రతుక గలుగుతున్నాము. ఇందుకు మొత్తం ఆదిమ జాతులు, తెగల

వారందరు వారికి రుణపడివున్నారు.

నేనొక నిరుపేద ఆదివాసిని. బాల్యావస్థలోనే తండ్రి చనిపోయారు. కుటుంబ భారం నామీదే పడింది. అయినా జానకి రామారావుగారి ప్రోద్బలం, ప్రోత్సాహంతో నందిగామలోని వారి హాస్టల్‌లో చేరి, పదవ తరగతి వరకు చదువుకున్నాను.

అప్పుడు హాస్టల్సుకు ప్రభుత్వ ఆర్థిక సహకారం లేదు. అయినా జానకి రామారావు గారు ఊరూరా తిరిగి వితరణశీలురనుంచి విరాళాలను పోగుచేసి సుమారు మూడు వందల మంది విద్యార్థినీ విద్యార్థులను పోషించేవారు.

మేమే నాలుగు బృందాలుగా జొన్నలను దంచుకునే వాళ్ళం. కుడితిని రైతులకు ఇచ్చేవాళ్ళం. వారు చిక్కటి మజ్జిగ ఇచ్చేవారు. ఇలా నెట్టుకొచ్చాం.

జానకి రామారావుగారు హాస్టలులోనేకాదు, చదువు విషయంలో కూడా ప్రత్యేక శ్రద్ధ తీసుకునేవారు. మేము చదువుకుంటున్న పాఠశాలలకు స్వయంగా వచ్చి మేము సరిగా హాజరవుతున్నామా లేదా, మా స్టేండర్డ్‌లా వున్నాయి, ప్రవర్తన, క్రమశిక్షణ ఎలా వున్నది మొదలైన అంశాలను ప్రధానోపాధ్యాయులను, ఉపాధ్యాయులను అడిగి మరీ తెలుసుకుని మేమెక్కడా తప్పటడుగులు వేయకుండా సంరక్షించేవారు.

అంతేకాదు, ఆ రోజులలో బడుగుజీవులైన మా ఆదివాసులు పిల్లలను బడికి ుపేవారుకాదు. అందుకు కారణం వారి జీవనోపాధి ఒకటికాగా, అమాయకత్వం ురొకటి. మాకు చదువు అచ్చిరాదని కొందరు, వాళ్ళు చదువుకొని ఊళ్ళేలబోతారా అని మరికొందరు అనేవారు. వారికి నచ్చచెప్పి, బ్రతిమలాడి బామ్మాలి జానకి రామారావుగారు పిల్లలను పట్టుకువచ్చేవారు. విచిత్రం ఏమంటే మధ్యలోనే కొందరు పారి పోతుండేవారు!

నా మట్టుకు నాకు నన్ను పెంచి పోషించింది ఆయనే. చదువుసాములు చెప్పించింది ఆయనే. జీవనోపాధి కల్పింపించింది ఆయనే. కూడు, గుడ్డ, నీడ కల్పించిందీ ఆయనే. అందుకే ఆయన నాకు పితృసమానులు.

నాకే కాదు, నా వంటి వందలాది మంది అనాధలకు, ఆర్తులకు పితృ సమానులు చదల జానకి రామారావు గారు. ఆయన ఆర్ద్రత, అనురాగం, త్యాగమయ కృషితో నేడు ఎందరెందరో ఆదివాస సోదర సోదరీమణులు ఉద్యోగులుగా, ఉన్నతోద్యోగులుగా సమాజంలో సగౌరవంగా బ్రతుకుతూ తమ ఇంట దీపం పెట్టుకుని ఆయన పేరు చెప్పుకుంటున్నారు.

అయినా జానకి రామారావుగారికి తృప్తి కలగడం లేదు. నేను డెభై సంవత్సరాల యువకుడనేకదా అంటూ, ఆదివాసులకు, దుర్బలులకు ఇంకా ఏదో ఏదో మేలు చేయవలెనని తపనపడుతుంటారు. జాలి, దయ, కరుణ, ప్రేమ ఆయన చతుర్వేదాలు. అందుకే ఆయనకు నమోవాకాలు. పితృదేవోభవః

## అవిశ్రాంత బాటసారి

### శ్రీ కూతాడి కృష్ణమూర్తి

దైన్యాతిదైన్యంగా మూఢాచారాల ముసుగులో జీవిస్తున్న గిరిజనుల సేవ అందించి సత్ఫలితాలను సాధించి పునీతులై తరించారు శ్రీ చదల జానకి రామారావుగారు.

ఆంధ్రప్రదేశ్ మైదాన ప్రాంత గిరిజన కుటుంబాలలో గోరంత దీపం వెలిగించి కొండంత వెలుగునింపి వారి ఆశలను పండించి వారి జీవిత విధానాలలో అజరామరమైన మార్పులను సాధించడంలో వీరి అకుంఠిత సేవ అద్భుతం.

అనేక గ్రామాలలోని గిరిజన కాలనీలను నేడు సందర్శిస్తే కనిపించేది శ్రీజానకి రామారావుగారి నిస్వార్థ సేవా ఫలాలే!

శ్రీ చదల జానకి రామారావు గారు 70 సంవత్సరాల వృద్ధాప్యంలో కూడా క్షణం తీరిక లేని సేవా కార్యక్రమాలలో నిమగ్నమై పయనించే అవిశ్రాంత బాటసారి. నందిగామ న్యూకాలనీలోని వారి గృహం సదా సందర్శకులతో కోలాహలంగా ఉంటుంది. అనేక గ్రామాల నుంచి నిరుపేద, నిరక్షరాస్య గిరిజనులు వారి సహాయార్థం వారి ఇంటికి వస్తూవుంటారు. గిరిజనులలో సర్వసాధారణంగా సంభవించే గృహ సంబంధమైన తగాదాలను కూడా వీరు పైసా ఖర్చులేకుండా పరిష్కరించి ఇరువర్గాల వారి అభినందనలు పొందుతుంటారు.

# తాత్పర్యం

## శ్రీ చాపరాల మురళీబాబు, జర్నలిస్టు



తొలుత కమ్యూనిస్టు. పిదప, హ్యూమనిస్టు. తరువాత, రిఫార్మిస్టు. ప్రస్తుతం తెలుగుదేశం రేషనలిస్టు. తొలుత కళాకారులు. పిదప, తోటివారి కన్నీటిని తుడచి కడగండ్లను నివారించయత్నించిన మానవతామూర్తి. తరువాత, ఆంధ్రరాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ ను వేదికగా చేసుకొని అంధ విశ్వాసాలను తుదముట్టించ శతపోరిన సంస్కర్త. ప్రస్తుతం తెలుగుదేశం పార్టీ నాయకునిగా పేదసాదల పెన్నిధిగా రూపుదాల్చిన మహోన్నత వ్యక్తి. ఏక సేన నేత. ఆయన శ్రీ చదల జానకి రామారావు. ఆయనకే ఇప్పుడు ప్రజలు ఘనంగా 'సప్తతి' సన్మానం చేశారు. ఇంతింతై వటుడింతై అన్నట్టు ఎదిగిన వామనాచార్యులు జానకి రామారావు గారికి శతకోటి వందనాలు. ప్రతి కార్యకర్త అలా పెరిగి ప్రజాభినందనలను పొందవలెననే మా తాత్పర్యం.

# విశ్వసనీయత

## శ్రీ సుంకర నరసింహారావు

(ఫ్రీ - లాన్ జర్నలిస్టు)



పేద-సాద, బడుగు-దళిత, బలహీన-అగ్ర, చిన్న-పెద్ద అందరూ జానకి రామయ్యగారు అని అప్యాయంగా పిలిచే శ్రీ చదల జానకి రామారావు గారి వయస్సు మైనస్ నా వయస్సు ఈజీ ఈక్వల్‌టు మా పరిచయం. 23 సంవత్సరాలలో మా పరిచయం స్నేహంగా మారి మమ్మలను ఆప్తులను చేసింది.

కొంతకాలం పాటు మేమిద్దరం గ్రామ పంచాయతీ సభ్యులుగా పని చేయడం వల్ల వారి పని తీరు నాకు అర్థమైంది. వారి కార్య దక్షతను, దీక్షను అనుకరించాలని నేను ఎంత ప్రయత్నించినా సాధ్యపడలేదు. అలాంటి లక్షణాలు ఇమిటేషన్ వల్ల రావేమోననిపించింది. ఈ కార్యదక్షత వారికి జన్మతః వచ్చినదే. అందుకే రాఘవాపురంలో

ప్రారంభమయిన రాజకీయ, సాంఘిక ప్రయాణం రాజధానుల దాకా వెళ్ళింది.

ఏ సమస్య పట్ల నయినా సమగ్రంగా చర్చించడంలోగాని, సమస్యపై నిష్కర్షగా మాట్లాడడంలోగాని, సమస్యలను సానుభూతితో అర్థంచేసుకోవడంలోగాని, అవసరాన్ని బట్టి సహకరించడంలో గాని ఆయనకు ఆయనే సాటి.

పదవి లేకపోయినా పర్వాలేదుగాని ఆత్మగౌరవాన్ని వదులుకోగూడదు, అనేవారు మా జానకి రామయ్యగారు తరచూ.

ఎన్నికల ఫలితాలను ఊహించడంలో ఆయన జ్యోతిష్కుడే! ఆయన నాకు పరిచయం అయిన తరువాత జరిగిన ఏ ఎన్నికలలోను ఫలితాలు ఆయన జ్యోతిష్యానికి భిన్నంగా జరిగిన గుర్తులేదు.

పత్రికలపై ఆయన అవగాహన, పత్రికా విలేకరులతో ఆయన సత్సంబంధాలు, పత్రికా స్వాతంత్ర్యం పట్ల ఆయన విశ్వాసం ప్రగాఢమైనవి. భావ వ్యక్తీకరణను అడ్డుకోవడాన్ని ఆయన అంగీకరించేవారుకాదు.

ఎంత చిన్న విషయాన్నైనా, ఎంత చిన్న మనిషినైనా అశ్రద్ధ చేసే తత్వంకాదాయనిది. ఆయన స్థాయికి గ్రామ పంచాయతీ సభ్యత్వం చాలా చిన్నది. అయినా గ్రామ పంచాయతీని గాని పంచాయతీ సమావేశాలను గాని ఎన్నడూ అశ్రద్ధ చేసేవారు కాదు. గ్రామ పంచాయతీ సమావేశం వున్నదంటే దానికి తగ్గట్లుగా ఆయన తన ప్రోగ్రామును మార్చుకొనేవారు. పంచాయతీ ఆఫీస్ గడియారాన్ని ఆయన రాకతో సరిచూసుకోవలసినదే!

పంచాయతీ ఎజెండాపై సమగ్రమైన నోట్సు తయారుచేసేవారు. గత సమావేశం ఏమి తీర్మానించింది. అందుపై జరిగిన చెర్యలేమిటి? అపరిష్కృతంగా వున్న విషయాలేమిటి? అనే విషయాలతో ఆయన సమగ్రమైన నోట్సుతో సమావేశానికి హాజరయేవారు. గ్రామ పంచాయతీ సమావేశానికి కూడా ఆయన శాసన సభా సమావేశాలకు ఇచ్చినంత ప్రాధాన్యత ఇచ్చేవారు. రోజులో కనీసం పద్దెనిమిది గంటలు బిజీగా వుండే ఈ మనిషి ఇంత చిన్న చిన్న విషయాలకు కూడా ఇంత ప్రాధాన్యత ఎలా ఇవ్వగలుగుతున్నారా అనిఅనిపిస్తూ వుంటుంది.

జానకి రామారావుగారి వయస్సుకు ఆయన మోసే పనిభారానికి ఎక్కడా పొంతన వుండదు. ప్రజా జీవితంలో ఇంత బిజీ గా వున్నా, ఆయన వ్యవసాయన్ని ఎక్కడా అశ్రద్ధ చేసేవారు కాదు. వ్యవసాయం ఆయనకు మంచి ఫలసాయన్నే అందించేది. ఇది ఆయన

కార్య దక్షతకు నిదర్శనం.

జానకి రామయ్యగారు వితరణశీలి. ఆయన, జానకి రామయ్యా కాలనీ నుంచి బయలుదేరి బస్ స్టాండ్‌కు వచ్చేలోగ ఆయన జేబుఖాళీ అయిన సంఘటనలు చాలా వున్నాయి. విద్యాసంవత్సరం ప్రారంభంలో ఎంతమంది విద్యార్థులకు ఆయన పుస్తకాలు కొనిపెడతారో నాకు బాగా తెలుసు.

జానకిరామయ్యగారి కార్యదక్షతా, దీక్షా, కమిట్‌మెంట్, విశ్వసనీయత తెలిసికూడా ఈ ప్రాంత రాజకీయ నాయకత్వం ఆయనకు సముచితమైన స్థానం కల్పించలేకపోయిందేమోనని నా అభిప్రాయం.

# జేజేలు

## శ్రీ రాయల వెంకటేశ్వరరావు

( జర్నలిస్టు, గుంటూరు)



చారిత్రిక, భౌగోళిక, భౌతిక పరిణామ క్రమంలోవచ్చిన మార్పుల వల్ల మానవ సమాజంలో కూడ అనేక మార్పులువచ్చాయి. వర్ణవ్యవస్థ ఏర్పడిన తరువాత స్వేచ్ఛా జీవనాన్నిగడిపే అప్పటికిరాత, బోయ, గోండు, వాల్మీకి తెగలు నిచ్చెనమెట్ల సమాజంలో ఇమడలేక, కొండలకు, అడవులకు పరిమితమైపోయారు.

మానవ సంతతి తొలి నాగరికత అంతా ఆదివాసీల చరిత్ర అంటే అతిశయోక్తి కాదు. శ్రీ కాళహస్తిలోని భక్తకన్నప్ప, రామాయణ కావ్యకర్త వాల్మీకి, గుహుడు, శబరి తదితరులు ఆదివాసీలే. మహాభారత కథాకాలం నాటి ద్రోణాచార్యుడు అప్పట్లో విలువిద్యలో మేటి అయిన ఏకలవ్యుని బొటనవ్రేలు గురుదక్షిణిగా పొందకపోతే అర్జుననికి ప్రత్యామ్నాయంగా ఏకలవ్యుడే సాటిగా చరిత్రలో నిలిచేవాడు. పూర్వకాలంలో గిరిజనుల

ప్రమేయం లేకుండా చరిత్ర నడవలేదు.

జాతీయోద్యమ పోరాటంలో సయితం కొమరంభీము అల్లూరి శ్రీరామరాజుకు అనుచరులైన గాందొర, గంటందొర, ద్వారబంధాల చంద్రయ్య, చిర్యాముండా, సంతాల్ తిరుగుబాట్లుతో బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించారు.

మానవజాతికే మూల విరాట్టులైన ఆదివాసీలు తదుపరి కాలాలలో వారి అమాయకత్వం, నిజాయితీ, స్వేచ్ఛాపూరితమైన స్వచ్ఛంద జీవనం వలన ఆధునిక సమాజంతోపాటు ముందుకు రాలేక వెనకబడిపోయారు.

ఇట్టి దశలో శ్రీ చదల జానకి రామారావు వంటి సంఘ సంస్కర్తలు తమ ఆదివాసీ ప్రజల జీవన విధానాన్ని సముద్ధరించి, వారిలో చైతన్యం తెచ్చేందుకు ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ ను నెలకొల్పి అంకితభావంతో, అవిశ్రాంత కృషి జరిపారు.

శ్రీ చదల జానకి రామారావుగారు ఆదివాసీ సంఘాన్ని బలోపేతం గావించి, ఆదివాసుల జీవన విధానంలో నూతనత్వాన్ని, వారి సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ జీవితాన్ని ప్రభావితం గావించడానికి ఎంతగానో శ్రమించారు. వూహవచ్చిన దగ్గరనుంచీ ఏభై సంవత్సరాలుగా ఆదివాసుల కొరకు తమ జీవితాన్ని వెచ్చించిన ధన్యజీవి.

నేడు శ్రీ చదల జానకి రామారావు సప్తతి సన్మానం వైభవోపేతంగా జరగడం హర్షణీయం. ఇది ఆదివాసీలను సన్మానించడమే.

జానకి రామారావు గారు ఆదివాసుల జీవనానికి తన జీవితాన్నే అంకితం చేసికోవడం అభినందనీయం. అందుకే శ్రీ చదల జానకి రామారావు గారికి జేజేలు!

# చైతన్యవేదం

## డాక్టరు మద్దాల వెంకటేశ్వరరావు

( 'ఉడా' మాజీ డైరక్టరు)

శ్రీ చదల జానకి రామారావు గారు తాడిత పీడిత బడుగు బలహీన వర్గాల ˇత్పరుడు.

శ్రీ చదల జానకి రామారావు గారు కృష్ణాజిల్లా తెలుగుదేశం పార్టీ కార్యదర్శిగా, నేను విజయవాడ అర్బన్ జిల్లా తెలుగుదేశం పార్టీ కార్యదర్శిగా విజయవాడలో ఒకే ఆఫీస్‌లో

విధులు నిర్వహించాము.

ఆ కాలంలో నేను గమనించిన సత్యం; తోటివారిని ఆదరించడంలో, ఆత్మీయతను అందించడంలో, వారికి ఆర్థిక దోహదం కలిగించడంలో ఆయనకు ఆయనేసాటి. ఆయన మానవతావాదం సాంఘిక - సామాజిక చైతన్యవేదం.



# జర్నలిస్టుల

# దృష్టి కోణం

## శ్రీ విజయం

పాలడుగు సాంబశివరావు

(ఉపాధ్యక్షులు: కృష్ణాజిల్లా వర్కి ంగ్ జర్నలిస్టుల సమాఖ్య)

పితృసమానులైన జానకి రామారావు చాలా మందికి గిరిజన నేతగానే పరిచితులు. అయితే, నిజానికి వారు గొప్ప సంఘ సంస్కర్త. అనేక సామాజిక రుగ్మతల మీద ఆయన ఉద్యమాలు నడిపారు.

మనిషి పాలిట అత్యంత ప్రమాదకరమైనటువంటి వ్యసనం మద్యపానం. దీనికి వ్యతిరేకంగా ఆయన రాజీలేని పోరాటం కొనసాగించారు. ఆ వ్యసనాన్ని దూరం చేశారు.

శ్రీ చదల జానకి రామారావు గారు సామాజిక చైతన్యం కలిగే పెక్కు కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్నారు. కుల వివక్షతకు వ్యతిరేకంగా అనేక ఉద్యమాలు నడిపి కొంత మేరకు విజయం సాధించారు.

# ఉపోద్ఘాతం

వావా రవి

(అధ్యక్షులు: ఎ.పి.యు.డబ్ల్యు.జె. కృష్ణాజిల్లా శాఖ )

సమాజంలో అట్టడుగు స్థాయిలో వున్న గిరిజనుల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక అభ్యున్నతికి వారిలో మానసిక చైతన్యం కలిగించేందుకు శ్రీ చదల జానకి రామారావు జరిపిన ప్రజా పోరాటాలు తరతరాలుగా మరిచిపోలేనివి. ప్రధానంగా ఆదివాసి -సంచార కులస్థులపై అధికారులకు, సంఘానికి వున్న దురభిప్రాయాన్ని రూపుమాపడానికి, వారిపై వున్న సిట్రి యాక్టును రద్దుచేయించి సమాజానికి దూరంగా నెట్టివేతకు గురయిన వారిని సంఘంలో విలీనం చేసేందుకు శ్రీ జానకి రామారావు వివిధ రూపాలలో సాగించిన కృషిని చెప్పడానికి ఈ చిన్న పుస్తకం కేవలం ఉపోద్ఘాతం మాత్రమే అవుతుంది అనడం అతిశయోక్తి కాదు.

శ్రీ జానకి రామారావు గారు ఉన్నత విద్య నభ్యసించలేకపోయినా అన్నం తప్ప అక్షరమంటే అర్థం తెలియని గిరిజనులను విద్యావంతులుగా తీర్చిదిద్దేందుకు అనేక ప్రత్యేక పాఠశాలలును వసతి గృహాలను ప్రారంభించి మట్టిలో మాణిక్యాలు ఉంటాయని ఋజువు చేశారు.



అదే విధంగా పూట గడిస్తే చాలనుకుని సంతృప్తిపడి రేపటి గురించి ఆలోచించని గిరిజనులలో భవిష్యత్తుపట్ల ఆశలు రేకెత్తించి వారికి ఇళ్ళ స్థలాలు, పక్కా గృహాలు కేటాయింపుకు కృషి చేసి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేసే సంక్షేమ పథకాలలో భాగస్వాములను చేయడం ద్వారా వారి జీవన ప్రమాణ స్థాయిని పెంచేందుకు శ్రీ జానకి రామారావు పడిన, పడుతున్న శ్రమ, తపన శ్లాఘనీయం.

శ్రీ చదల జానకి రామారావుగారి గురించి చెప్పడానికి నా వయస్సు, అనుభవం చాలవు గాని 'గిరిజన రత్న'గా 'సామాజిక వాల్మీకి'గా బిరుదులు పొందిన వారు. నిజంగా బలహీన వర్గాలకు ఒక కోహినూర్ వజ్రంలాంటి వారే, ఒక ఆధునిక ఋషి పుంగవులే.

# ఆదర్శనీయం

## 'సామాజిక వాల్మీకి'

# 'సప్తతి' జీవనయానం

శ్రీ ఎం. మనోహర్ (విలేకరి)

చదల జానకి రామారావు గారి 'సప్తతి' జీవన యానంలో ప్రతి సంవత్సరం ఆదర్శనీయమైనదేనని ఖచ్చితంగా చెప్పవచ్చు. డెబ్బది వసంతాల జీవిత యాత్రను స్థాలీపులకంగా అయినా వరుసగా వివరించడం ఇక్కడ ఇప్పుడు సాధ్యం కాదు గాని, ఆయనను 'సామాజిక వాల్మీకి'గా గౌరవించడానికి తగిన దార్శనికతను ఉట్టంకించ యత్నిస్తాను.

ఆయన పుట్టింది ఊరూ ఉనికీ ఎరుక లేని కులంలో, పెరిగింది క్షుదార్తితో. అడుగడుగునా అవమానాలు, అష్టకష్టాలు. అయినా ఆయన ఎదురీదాడు. పద్మం బురదలోనే పుడుతుంది, మాణిక్యం మట్టిలోనే దొరకుతుంది. శ్రీ జానకి రామారావు రత్నగర్భుడు, స్వయంచలితుడు. స్వీయ ప్రభాకరుడు. కొంత చదువుకోగలిగాడు. ఆ చదువును సార్థకం చేసుకున్నాడు. సమాజాన్ని చదివాడు, దానిలోనే విలీనమయాడు. ఇలా అంచలంచలుగా ఎదిగిన ఆయనే అంచనాలను మించి అంచలంచలవైన అనన్యసాధ్యమైన కొత్త చరిత్రను సృష్టించారు, వినూత్న లోకాన్ని ఆవిష్కరించారు, ఆదిమ జాతుల వారిని ఆధునికీకరించారు. దర్శనీయమైన ఆదర్శం అదే!

*

# జేజేలు!



## శ్రీ భూక్యా చిన వెంకటేశ్వర్లు

(అధ్యక్షులు; గుంటూరు ప్రెస్ క్లబ్. 'గిరిజన స్రవంతి' పత్రిక సంపాదకులు)

తరతరాలుగా అణగారిన ఆదివాసి గిరిజన జాతుల సముద్ధీకరణకు శ్రీ చదల జానకి రామారావుగారు అవిశ్రాంతంగా గత 50 యేళ్ళుగా కృషి చేస్తూవస్తున్నారు. ఫలితంగా సాంఘికంగా, రాజకీయంగా అణచివేయబడిన ఆదివాసి, గిరిజన, పీడిత జనులు ఇప్పుడిప్పుడే మేలుకుంటున్నారు. అట్టడుగు వర్గాలైన ఈ అణగారిన జాతుల చైతన్యానికి శ్రీ చదల జానకి రామారావు వంటి నేతల కృషే కారణం అని చెప్పక తప్పదు.

ఆదివాసులను శారీరకంగా, మానసికంగా కృంగదీసిన పాశవిక నేరస్థ జాతుల చట్టాన్ని రద్దు చేయించి, వారికి సాంఘిక ప్రతిపత్తిని కల్పించడంలో శ్రీ చదల జానకి రామారావు గారు సాగించిన ఉద్యమం చారిత్రకమైనది. మరువ లేనిది. ఆదివాసి, గిరిజన జాతుల సేవకు తమ జీవితాన్ని అంకితం చేసుకున్న త్యాగధనులు శ్రీ చదల జానకి రామారావు.

స్వీయ జీవన యానంలో నిరాడంబర జీవితాన్ని గడుపుతున్న శ్రీ జానకి రామారావుగారు అహరహం అట్టడుగు వర్గాల సేవలనే కొనసాగిస్తూవస్తున్నారు.

ఆదివాసుల సాంస్కృతిక కళా రూపాలను వివిధ ప్రాంతాలలో ప్రదర్శనలిస్తూ, కల్లుముంత, ఏకలవ్య బుర్ర కథా దళం వ్యాఖ్యాతగా గిరిజనులను చైతన్యవంతులను గావించిన కళాకారులు మన జానకి రామారావు గారు. ఆయనే నాకు స్ఫూర్తి!

సాంఘిక సేవలో విశిష్ట సేవనందించిన శ్రీ జానకి రామారావుగారు గిరిజన రత్న. సంచార , ఆదివాసి, గిరిజన సేవలలో సుదీర్ఘ కాలంగా సేవలనందిస్తున్న శ్రీ జానకి రామారావు గారికి జేజేలు!

*

# కళ్ళెదుటి దైవం

## డాక్టరు ఘంటా విజయకుమార్

(వ్యవస్థాపకాధ్యక్షులు: కృష్ణాజిల్లా వర్కింగ్ జర్నలిస్టుల సంఘం)



**అట్టడుగు** జీవితాలోని ఆకలి కేకలను, ఆదిలోనే అంతరించిపోయే కోరికలు మిగిల్చే నిట్టూర్పులను స్వయంగా అనుభవించిన వ్యకి; కాలానుగుణంగా జరిగే పరిణామాల్లో వాటిని అందుకోని తనబోటి వారికి చేయి అందించే ప్రయత్నం చేస్తారు- అలాంటి మానవత ఉన్న వ్యక్తి చదల జానకి రామారావుగారు .

అక్షరం ముక్క అభ్యసించడానికి అష్టకష్టాలను అనుభవించిన ఈ వ్యకి- తాను శక్తిగా ఎదిగి , తన వారికి చదువు నేర్పేందుకు విద్యా సంస్థలను, సంక్షేమ హాస్టళ్ళను నేలకొల్పారు. పరీక్ష ఫీజు కట్టలేక, మధ్యలోనే చదువులు ఆపడానికి ప్రయత్నించిన దళిత, గిరిజన ,బహుజన కుటుంబాల వారికి చదలజానకి రామారావు తమ జేబులో డబ్బులు లేకున్నా వడ్డీలకు డబ్బు తెచ్చి విరాళాలిచ్చిన సంఘటనలు వున్నాయి.

గిరిజన నేతగా జాతీయ స్థాయిలో గుర్తింపు పొంది ఎన్నో పదవులు నిర్వహించినప్పటికీ జానకి రామారావు నందిగామ ప్రాంత దళిత, గిరిజన, బహుజనులకు ఆపదలు ఆదుకునే పెద్దగానే మిగిలారు.

యానాదులు, ఎరుకలు, బుడబుక్కలు, పరిక మొదలైన కుటుంబాల ఆర్థిక ఇక్కట్లలో ఆయన కళ్ళెదుటి దైవంగానే పనిచేసాడు. ఏలా డబ్బు తేచ్చాడో, ఏలా సహాయం చేసాడో ఆయన గుండెకే పరిమితం. అయినా, జానకి రామారావు నేటికీ అడిగిన వారికి కాదనకుండా ఇచ్చాడు, ఇస్తున్నాడు.

డెబ్బది ఎండ్ల మానవతా మూర్తికి 'గిరిజన రత్న', 'సామాజిక వాల్మీకి' వంటి బిరుదులు స్వచ్ఛంద సంస్థలు అందచేసినప్పటికి, ప్రభుత్వం మాత్రం సముచితరీతిన సత్కరించలేదు.

ఆయన నిండనూరేళ్ళు బ్రతుకుతారు. బహుజన గుండెలను

సంతోషంతో నింపుతారు.

# ఆపద్బాంధవుడు

## శ్రీ కూరాకుల నరసింహ, ఐ.పి.ఎస్.

( ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ మాజీ చెయిర్మన్)



**బహుముఖ** ప్రజ్ఞాశాలి, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో ఎన్నో అసాధారణమైన విజయాలను సాధించిన ప్రజల మనిషి శ్రీ చదల జానకి రామారావు గారి విశిష్ట సేవలకు గుర్తింపుగా వారికి 'సప్తతి' సన్మానం చేయవలెనని పెద్దలు, అభిమానులు నిర్ణయించడం సంతోషదాయకమైనది, సమయోచితమైనది. ఈ సందర్భంగా వారి ఆశయాదర్శాలు, కృషి, వ్యక్తిత్వం మొదలైన అంశాలతో అభినందన సంచికను వారికి బహూకరించవలెనని నిర్ణయించడం కూడా ఎంతో శ్లాఘనీయం, సముచితం, సమంజసం, అతి ప్రశంసనీయం. ఎంతో ఆలస్యమైనా ఈ సంచలనాత్మకమైన నిర్ణయాన్ని తీసుకున్న 'సప్తతి' సన్మాన సంఘం సభ్యులు అభినందనీయులు.

ఉండలేదు భువి తిరగనిదే
నిలువలేదు నీరు పారనిదే
దాగలేదు వెలుగు తగలినిదే
ఆగలేదు గాలి కదలనిదే
జానకి రామారావు గారికి
నిదుర రాదు పని జరగనిదే!

ఆకులమీద, రేకులమీద,
గోళ్ళమీద, గోడలమీద,
కత్తుల ఒరలమీద
కాగితం పొదలమీద
చేతి కణ్ణలమీద

తంబురా బుర్రలమీద,
రెక్కలెత్తి ఎగిసింది,
డెక్కలెత్తి నడిచింది
పడగలెత్తి నర్తించింది
గొడుగులెత్తి వర్తించింది
బడుగు వర్గాల సంచార జాతుల ఆర్తనాదం
ప్రధాన కార్యదర్శి;
స్పందించిన చదల జానకి రాముడు
గళమేత్తాడు నవ సమాజ
సమ సమాజ స్థాపన కోసం!

ముంగిట నిలచిన అధినేతను
మూడు దిక్కులు గెలిచిన విజేతను
నిలువరేమి మీ తలలు వంచి
కీలవరేమి గుండెలు సమర్పించి
నరోత్తములకే అందుతాయి నమస్సులు
దురాత్ములకు కాదు!

కారుణ్యానికే వంగుతాయి శిరస్సులు
కాఠిన్యానికి కాదు!
కరుణామయుడైన జానకి రామారావు గారి కివే
మా శతకోటి నమస్కారాలు!

శ్రీ చదల జానకి రామారావుగారు గౌరవనీయులు, కురువృద్ధులు, మాన్యులు; తాడిత పీడిత సంచార ఆదివాస జాతులకు తమ శక్తివంచన లేకుండా అహర్నిశలు కృషిచేసి వివిధ రంగాలలో వారి ప్రగతికోసం సమరం సాగిస్తున్న మనసున్న మనిషి, మహామనిషి.

శ్రీ జానకి రామారావు గారు ఆశావాది, ఆదర్శవాది. తమ విధి నిర్వహణలోను, బాధ్యత వహించడంలోను, ఆ బాధ్యతల నిర్వాహణలో చూపే సామర్థ్యాన్ని, నేర్పరితనాన్ని, సర్వకాల సర్వావస్థలలో ప్రజల మనిషిగా, నిస్వార్థ సేవలనందించి

మహోన్న ఉత్తేజం కలిగించిన ఆదర్శ త్యాగ మూర్తి. అకుంఠిత దీక్షతో, పట్టుదలతో ఎటువంటి క్లిష్ట పరిస్థితులనైనను ఎదుర్కొన గలిగిన ధీశాలి.

రాజకీయ రంగంలో ఎంతో మంది అతిరథ మహారథులతో, స్వాతంత్ర్య సమరయోధులతో కలసి పనిచేసిన ఉద్యమకర్త. కల్లుముంత, ఏకలవ్య బుఱ్ఱకథా దళ వ్యాఖ్యాతగా ప్రజలను తన అసమాన ప్రజ్ఞాపాటవాలతో జాగృతిపరచి, ఆకట్టుకున్న ప్రఖ్యాత కళాకారులు.

ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ వ్యవస్థాపకులలో ఒకరే కాక, కడచిన అర్థశతాబ్దికి పైగా ఆ సేవా సంఘం ప్రధాన కార్యదర్శి; దుష్ట సెటిల్‌మెంట్ చట్టాన్ని ఎదిరించి, దానిని రద్దు చేయించిన వారిలో అగ్ర గణ్యులు.

సాంఘిక సేవలో, రాజకీయ రంగంలో ఎంతో వ్యయప్రయాసలకులోనై, తన వృద్ధాప్యాన్ని కూడా లెక్కచేయక, స్వయంకృషితో ఎన్నో ప్రతిష్టాత్మకమైన పదవులను తమదైన బాణీలో, దృఢ సంకల్పంతో, అకుంఠిత దీక్షతో నిర్వహించి, అటు ప్రభుత్వం నుంచి, రాజకీయ నాయకుల నుంచి, ఇటు అనేక సాంఘిక స్వచ్ఛంద సంస్థల నుంచి, ప్రజలనుంచి అగ్రశ్రేణి నాయకుడని పేరు గడించారు.

ప్రజలకు అత్యుత్తమమైన సేవలనందిచడంలో చేసిన అవిరళమైన కృషి, పడిన శ్రమ, పట్టుదల, చూపిన చొరవ, ప్రతిభ, అతి శ్లాఘనీయం, అద్వితీయం, అమూల్యం, అమోఘం, ప్రపంశనీయం. వారి స్వార్థ సేవలకు గుర్తింపుగా ఎన్నో ప్రతిషాత్మకమైన అవార్డులను ఈసరికే అందుకున్నారు.

చిన్న కార్యకర్తగా రాజకీయ రంగప్రవేశంచేసి, అంచలంచెలుగా మహోన్నత కీర్తి శిఖరాల నధిరోహించి, హిమగిరిశిఖరాలకు ఎదిగారనడంలో అతిశయోక్తి లేదు.

రాబోవు తరాల వారికి ఇది ఒక సంచలితమైన, సందేశాత్మకమైన గుర్తింపు. ఈ తరం యువకులు నిరంతరం ఈ కార్యక్రమాన్ని గుర్తించుకొని స్ఫూర్తినొంది, స్పందించి వివిధ రంగాలలో సరయిన విశిష్ఠ స్థానాన్ని సంపాదించుకుంటారని ఆశిస్తున్నాను.

శ్రీ చదల జానకి రామారావుగారు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో తుల తుగాలని మనసా, వచసా ఆ పరాత్పరుని వేడుకుంటున్నాను. తాడిత, పీడిత, మలహీన బడుగు వర్గాల, సంచార జాతుల పట్ల జానకి రామారావుగారికి వున్న ప్రేమానురాగాలు

ద్విగుణీకృతమై, ఈ వర్గాలకు ఎల్లవేళలా ఆపద్బాంధవునిగా నిలచి, వారి సహాయసహకారాలతో నూతనాధ్యాయాన్ని స్థాపిస్తారని ఆశిస్తున్నాను.



# అజరామర మైత్రి

## శ్రీ పేర్నా శ్రీరామమూర్తి

(మాజీ ఎం. ఎల్.సి, స్వాతంత్ర్య సమర యోద్ధ)

**సమాజంలో** దోపిడీకి, అవమానాలకు తరతరాలుగా గురవుతూవస్తున్న హరిజన, గిరిజన, వెనుకబడిన తరగతులవారు, ఎరుకల - యానాది - కోయ-చెంచు మొదలైన వారు జాగృతులై సంఘటితు లవుతున్న రోజులవి.

స్థిర నివాసానికి నోచుకోనక చదువు -సంధ్యలు లేక చులకనగాను - హీనంగాను చూపబడుతూ తమ బ్రతుకు తెరవుకు తట్టలు-బుట్టలు-చాపలు అల్లుకుంటూ, తాళ్లు పేనుకుంటూ, పాములను పట్టుకుంటూ సోది చెపుతూ, ఊరి కాపలాలు కాస్తూ నికృష్ట జీవనాన్ని గడుపుతున్న సంచార జాతులకు చెందిన ఎరుకల, యానాది, చెంచు, పాముల, బుడబుక్కల మొదలైన తెగలకు చెందిన స్త్రీ -పురుషులలో చైతన్య దీప్తిని వెలిగించి, వారి వేష భాషలలో - ఆచార వ్యవహారాలలో ఆధునికతను సాధించి, చదువు- సంధ్యలతో రాణించేలా చేసి, తోటి మానవులతో సరిసమానంగా తాము గౌరవించబడాలనే తపనను కలిగించే పవిత్ర ఉద్యమానికి 1940 కే రథసారథిగా వున్న దేశభక్తుడు, ఆదర్శవాది శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారి స్ఫూర్తితో ఈ దళిత-బడుగు పేద వర్గాల సముద్ధరణకు కంకణబద్ధులైన వారు నా మిత్రత్రయం సర్వశ్రీ పొన్నా సత్యనారాయణ, పొన్నా కోటేశ్వరరావు (పొన్నాసోదరులు) ,చదల జానకి రామారావు గారలు: వీరు ధన్యజీవులు.

నేను, నా మిత్రత్రయం (పొన్నా సోదరులు, చదల జానకి రామారావు) నందిగామలోని జిల్లా బోర్డు (జార్జి కార్పోరేషన్) హైస్కూలు విద్యార్థులమే! నాకు జూనియర్లు. ఈ ముగ్గురిదీ విజయవాడ-హైదరాబాదు జాతీయ రహదారిలో కీసరకు

ఉత్తరంగా వున్న గండేపల్లి స్వగ్రామం. శ్రీ పల్లం కోట దాసు వీరి గురువుగారు.

మా నలుగురిని - అంటే నన్ను, పొన్నా సోదరులను, జానకి రామయ్యగారిని ప్రాభావితం చేసిన వారు: మాకు నందిగామ హైస్కూలులో విద్య నేర్పిన, క్రమశిక్షణను అలవరచిన ఉపాధ్యాయ వర్గమే. ఈ హైస్కూలులో మా విద్యాభ్యాసం కొనసాగించే సమయంలో తమ బోధనా పటిమ ద్వారా, అభిమాన వాత్సల్యాల ద్వారా తమ ఆదర్శ జీవిత వరవడి ద్వారా మమ్ము తీర్చిదిద్దిన గురువర్యులు, ముఖ్యంగా హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ చెరుకుపల్లి వెంకటప్పయ్యగారు; వారి సహాయోపాధ్యాయులు సర్వశ్రీ సత్యనారాయణ మూర్తి, కామేశ్వర శర్మ, వేదాద్రి నరసింహం, వెలమకన్ని సూర్యనారాయణ, యడవల్లి శ్రీరామమూర్తి, సుంకర చంద్రశేఖరరావు, డ్రిల్లు మాష్టారు గంటయ్య, హిందీ మాష్టారు వాసి రెడ్డి భాస్కరరావు, తెలుగు మాష్టారు చెవుటూరు వెంకట సుబ్బయ్య; చిత్రావూరు నాగభూషణాచార్యులు, ఎస్. కృష్ణయ్య ప్రభృతులు. కొమ్ముపాలెం గుణ్ణం రామిరెడ్డిగారు 'స్వతంత్ర భారత్' అనే సైక్లోస్టైయిల్డ్ పత్రికను రహస్యంగా, దానిపై ప్రభుత్వం నిషేధం వున్నది. మాకు పంచేవారు. అందుకు కొద్ది విరాళాన్నిచ్చేవాళ్ళం. స్వాతంత్ర్య పోరాట వార్తలు క్లుప్తంగా, ఉత్తేజకరంగా ఆ పత్రికలో వుండేవి.

నందిగామ - వీరులపాడు గ్రామాల రహదారి మధ్యలో గల కొణతమాత్మకూరు గ్రామంలో హిందీని బోధిస్తూ (వ్యవసాయం చేస్తూనే), శ్రీ సుంకర సత్యనారాయణ గారు వుండేవారు. గ్రామీణ ప్రజలలో స్వాతంత్ర్య పోరాట చరిత్రలోని ముఖ్య ఘట్టాలు, సామాజిక స్పృహ, రైతు కూలీ సంబంధాలు - సమస్యలు - హరిజన సేవ - సోషలిజం గురించి బోధనలు గావించేవారు. రాత్రి పాఠశాలలో వయోజన విద్య గరపేవారు.

పొన్నా బ్రదర్సులోని శ్రీ పొన్నా కోటేశ్వరరావు, శ్రీ చదల జానకి రామారావు సాంస్కృతిక రంగంలో కూడా ప్రవేశం, అనుభవం సంపాదించి ప్రజాకళాకారులుగా ప్రసిద్ధి పొందినారు. మా నలుగురి కంటే వయస్సులో - సామాజిక సేవలో పెద్ద - సాంస్కృతిక, కళా రంగాలలో ఎంతో గుర్తింపు పొందిన ప్రవీణులు శ్రీ పాలపర్తి వీరయ్యగారు ఈ ఇద్దరికీ ఆదర్శవర్యులు.

మాది కల్మషం, దుష్ట చరిత్ర లేని స్నేహం. ప్రపంచంలో తీయనది స్నేహమేనోయ్

అనేలా మేము మెలిగాం. చెడుగుడు, ఫుట్‌బాల్ మొదలైన గేమ్సులో - స్పోర్ట్సులో పాల్గొనే వాళ్ళం. డిబేట్సు, సాంస్కృతిక కార్యక్రమాలు, విహార యాత్రలు... ఆహ్లాదకరంగా విజ్ఞానదాయకంగా వుండేవి. మంచి నడవడిక గల విద్యార్థులుగా మాకు గుర్తింపు వుండేది. ఆ స్థాయిని నిలుపుకోవడానికి మా ప్రయత్నాలు మాకు వుండేవి.

**1935** ఇండియా ఆక్టు ననుసరించి అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో అసెంబ్లీకి **1937** లో జరిగిన ఎన్నికలలో పశ్చిమ కృష్ణా ద్విసభ్య అసెంబ్లీ నియోజకవర్గంలో కాంగ్రెసు తరపున పోటీ చేసిన శ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వరప్రసాదు, శ్రీ కాట్రగడ్డ వెంకట నారాయణరావు గార్ల గెలుపుకు మా సీనియర్లు, మేము కొందరం వాలంటీర్లుగా పని చేశాం.

రాష్ట్ర ఎరుకల సంఘానికి వీలైనన్నిచోట్ల జిల్లా మహాసభలు జరిపి, జిల్లా శాఖలను ఏర్పాటు చేయవలెననే నిర్ణయానుసారం ఈ ముగ్గురు మిత్రులు కృష్ణాజిల్లా శాఖ ఏర్పాటుకు నిర్విరామంగా కృషిచేశారు. అధికారులు - అనధికారుల సహాయాన్ని తీసుకున్నారు. **1943** లో నందిగామ పాత ఫ్యాక్టరీ ఆవరణలో కృష్ణాజిల్లా ఎరుకల మహాసభ వీరి చొరవతో దిగ్విజయంగా జరిగింది. నేనూ మరికొందరు మిత్రులం ఇందులో పాల్గొన్నాము. 'యానాదిగాంధీ' గా ప్రసిద్ధి పొందిన శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య ఈ మహాసభలో పాల్గొని ఆదివాసుల కష్టనిష్ఠురాల గురించి అనర్గళంగా గంభీరోపన్యాసం చేశారు.

ప్రస్తుతం విజయవాడ కస్తూరిబాపేట కేంద్రంగా తమ శక్తి కొలదీ నిర్వహిస్తున్న రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు శ్రీ పాలపర్తి వీరయ్యగారు, శ్రీ చదల జానకి రామారావుగారు దళిత జనోద్ధరణ ఉద్యమ రథ సారథులుగా మన్ననలను పొందుతున్నారు.

శ్రీ చదల జానకి రామారావు గారు నందిగామ ప్రాంత సహకార ఉద్యమంలోను ప్రముఖ పాత్ర వహించారు. నందిగామ సహకార బ్యాంకి ప్రారంభ అధ్యక్షులుగా శ్రీ వేజెండ్ల వెంకట సుబ్బయ్యగారి నాటి నుండి శ్రీ బండి తిరుపయ్య, శ్రీ ముక్కపాటి వెంకటేశ్వరరావు. శ్రీ వాసిరెడ్డి సాంబశివరావు గార్ల అధ్యక్ష పదవీ కాలంలోను దళితులకు, మధ్యతరగతి వారికి ఎంతో మందికి ఋణాల నిప్పించారు. వారు తిరిగి చెల్లించేటట్లు శ్రద్ధ వహించారు.

వయోజన విద్య, గ్రంథాలయ ఉద్యమాలతోనూ శ్రీ జానకి రామారావుగారికి

సజీవ సంబంధాలు - పాత్ర వున్నాయి. సాంస్కృతిక రంగంలో ఇంకా కృషి సాధిస్తూనే వున్నారు. మద్యపాన నిషేధాన్ని తొలగించాలన్న ఆలోచనలు వచ్చినపుడు - వాటికి వ్యతిరేకంగా నెల్లూరులో ప్రారంభమైన ఆందోళనోద్యమాన్ని కృష్ణాజిల్లాలో ప్రతిధ్వనిని వినిపించి - జిల్లా అంతటా ఆ ఉద్యమాన్ని ఉధృతపరచిన నాయకులలో శ్రీ చదల జానకి రామారావు గారు ప్రముఖులు. సాంఘిక-ఆర్థిక అసమానతలను రూపుమాపాలన్న ఆలోచన - దాని అమలుకు ఆచరణ ఎక్కడ వుంటే అక్కడ శ్రీ జానకి రామారావు గారిది ప్రముఖ పాత్ర.

ప్రస్తుతం వీరు కృష్ణాజిల్లా సహకార కేంద్ర బ్యాంకు డైరక్టరుగా వున్నారు. సంతోషం. కాని నాబోంట్లకు ఇది పూర్తి సంతృప్తి నివ్వదు. కారణమేమన - అర్థ శతాబ్ది కాలంగా దేశ సేవ, సాంఘిక సేవ, దళిత జనోద్ధరణ, సాంస్కృతిక - సాహిత్య - విద్యారంగాలలో నిస్వార్థంగా శ్రమించిన, మేటి హాలికులు శ్రీ చదల జానకి రామారావుగారు. వీరికి మరింత ప్రాముఖ్యం - సామాజిక ప్రయోజనకారి కాగల గౌరవ స్థానం లభించాలని మనసారా ఆకాంక్షిస్తున్నాము.

## హృద్గతి

### శ్రీ చందు హర్షవర్ధన

'నవనవలా చతురానన'

(పోలీస్ సర్కిల్ ఇన్‌స్పెక్టరు. జగ్గయ్యపేట)



**ఒకప్పుడు** - మొత్తం సంఘాన్ని తమ గుప్పిటలో బిగించుకున్న తెల్లదొరలు, నల్లదొరల ఏలుబడిలో సంచార, ఆదివాసి, గిరిజన జాతులవాదిని కనీసం మానవ మాత్రులుగా కూడా చూసేవారు కాదు. అప్పుడు శ్రీచదల జానకి రామారావు తదితర సంస్కరణాభిలాషులు, మానవతామూర్తులు రంగప్రవేశం చేసి, ఉద్యమాలకు ఉద్యమించి, తాము సంఘ జీవన స్రవంతిలో సమాన భాగస్వాములమేనని హెచ్చరించారు. వారికి గుర్తింపును తెచ్చారు. వారి జన్మహక్కులను చట్టబద్ధం చేసారు. వారిని 'షెడ్యూల్డ్ ట్రైబ్స్'లో చేర్పించి మహోపకారం చేశారు.

మానతను పండించారు.

దశాబ్దాల తరబడిన పోరాటాల ఫలితంగా లభించిన హక్కుల సంరక్షణకు దళిత-గిరిజన ఉద్యోగులు ఇప్పుడు సంఘాలను కూడా ఏర్పరచుకున్నారు. ఇట్టి సంస్థలు-సంఘాల ఏర్పాటుకు ప్రధాన ప్రేరణ ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక సంఘమే! అట్టి సంఘం వ్యవస్థాపకులలో ముఖ్యులు, దశాబ్దాలుగా ప్రధాన కార్యదర్శిగా వ్యవహరిస్తూ, యువతకు స్ఫూర్తిప్రదాతగా నిలచిన శ్రీ చదల జానకి రామారావు గారికి బడుగు జనం ఎంతగానో రుణపడి వున్నారు!

ఇప్పుడు-శ్రీ చదల జానకి రామారావు గారి 'సప్తతి' వారికి హృద్గతి!

# నిరాడంబర సేవలు

## శ్రీ సూర్యదేవర నాగేశ్వరరావు

(కృష్ణాజిల్లా రైతు సంఘం నాయకులు)



**కొందరు** నాయకులు సాధారణంగా పత్రికా ప్రకటనలకో, వేదికలమీద ఉపన్యాసాలకో పరిమితమవుతూవుంటారు. ఆదర్శాలను వల్లిస్తారు, తమకు తామే నాయకులుగా చెప్పుకుంటూవుంటారు సరే - ఆత్మస్తుతి - పరనింద వీరికి కొట్టిన పిండి. ఇట్టివారిని అసలు పట్టించుకొనక, భేషజాలకు పోక, ప్రజలతో మమేకమై నిర్మాణాత్మకమైన పథకాలను నిశబ్దంగా అమలు జరుపుకుంటూ ప్రజాసేవలో తల్లీనమయే నిజమైన నాయకులు బహుతక్కువగా వుంటారు. వ్రేళ్ళపై లెక్కించదగిన ఇట్టి కొద్దిమందిలో శ్రీచదల జానకి రామారావు గారు ఒకరు.

నా చిన్నప్పటి నుంచి చూస్తూనే వున్నాను - శ్రీ చదల జానకి రామారావు గారిది ఒకే బాట, ఒకే మాట. ఒకే మనసు - అది పేద ప్రజలకే అంకితం. నిరాడంబరంగా, నిజాయతీగా, నిస్సంకోచంగా, నిర్భయంగా, నిరాటంకంగా తమ సేవా కార్యక్రమాలను తాము చేసుకుపోతూవుంటారు. ఈ విషయాలలో జానకి రామారావు గారికి పోటీ జానకి రామారావుగారే!

## 'ఆదివాసి పిత'



శ్రీ కూతాటి భాస్కరరావు
(పోలీస్)

**మనకు** 'జాతిపిత' వున్నారు. 'గిరిజన' పిత వున్నారు. శ్రీ చదల జానకి రామారావు గారిని ఆదివాసిపిత గా నేను గుర్తిస్తున్నాను. ఎరుకల, యానాది, లంబాడి, చెంచు, పాముల, బుడబుక్కల, దొమ్మర, మొండి, బండ మొదలైన సంచార- ఆదివాసి - గిరిజన జాతులవారందరూ వారిని అలాగే గుర్తించవలసినదిగా, సంబోధించవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాను. అవసరం అయితే - ఈ సంబంధిత బడుగు వర్గాల వారందరూ రాష్ట్ర స్థాయిన సమావేశమై ఈ మేరకు వారిని బిరుదు పురస్కారంతో సత్కరించడానికి సంఘటితంగా సమాయత్తం కావలసిందిగా కూడా కోరుతున్నాను. ఇందుకు నా సహకారం, నా జాతి సహకారం వుంటుంది. అర్థశతాబ్దిగా కొనసాగుతూవస్తున్న వారి నిస్వార్థ సేవలకు ఇది నిజమైన, విశిష్టమైన గుర్తింపు.

'ఆదివాసిపిత' శ్రీ చదల జానకి రామారావు గారికి వందనం - పాదాభివందనం.

## ఫోటో వెనుక పవిత్ర చరిత్ర



**ఫోటోలోని** వ్యక్తి శ్రీ కోపూరి గంటయ్య. అర్ధాంగి జోషిబాయి, కుమార్తెలు కిరణ్ కుమారి, లక్ష్మీరాజ్యం, విప్లవ కుమారి. ఇప్పుడు ఈ పిల్లకాయలు గ్రాడ్యుయేట్లు, పోస్టు గ్రాడ్యుయేట్లు. ఆయన రిటైర్ అయారు. ఇది మామూలే అయితే ఈ ఫోటో వెనుక వున్న

చిక్కటి చరిత్ర మనకు కావాలి.

గంటయ్య [redacted]లేని ఒకానొక [redacted] బాలుడు. హరిజన్, ఒక క్రిస్టియన్ పంచన ఆ బాలుడు చేరాడు. అయితే, ఇతనిని సాకడం ఆయనకు సాధ్యం కాలేదు. గిరిజనుడైన శ్రీ చదల జానకి రామారావు గారికి ఆ బాలుని అప్పగించారు.

శ్రీ చదల జానకి రామారావు తమ హాస్టలులో అతనిని అట్టే పెట్టుకున్నారు. పాఠశాలలో చేర్పించారు. సొంత సంతానంతో సమంగా పెంచి పోషించారు. శ్రీ గంటయ్య 1964 నాటికి ఎస్. ఎల్. సి. పాస్ అయాడు. అప్పుడు బేసిక్ ట్రయినింగ్ వుండేది. 1964-66లో దానిని పూర్తి చేసాడు. అప్పటిలో శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు కృష్ణాజిల్లా పరిషత్తు చెయిర్మన్. శ్రీ చదల జానకి రామారావు వారితో మాట్లాడారు. 1969 లో ఉద్యోగం వచ్చేసింది! ఒక మంచి సంబంధం చూసారు. వివాహం చేసేసారు. ఇంత కథ వున్నది ఈ ఫోటో వెనుక.

శ్రీ చదల జానకి రామారావు ఇట్టివి మరెన్నో చేసారు. కుల, మతాలకు అతీతంగా అనాధ బాలలను చేరదీశారు. చదువులు చెప్పించారు. ఉద్యోగాలు ఇప్పించారు. ఒక ఇంటి వారిని కూడా చేశారు! అందుకు సాక్షమే ఇట్టి ఫోటోలు.

# బాధ్యత



## శ్రీ కె. వి. రెడ్డి

(జర్నలిస్టు, హుజూర్‌నగరు, నల్లగొండ జిల్లా)

మనకు రాజకీయ నాయకుల కొరతలేదుకాని, రాజకీయ వేత్తలు మాత్రం బహు అరుదు. శ్రీ చదల జానకి రామారావు నిస్సంకోచంగా వేత్త. రాజకీయ, సామాజిక, సాంస్కృతిక వేత్త. కనుకనే ఆయన 'సప్తతి' సామ్మానానికి రాజకీయ, కుల, మత, వర్గ వివక్షతే లేక అందరూ హర్షించారు.

జానకి రామారావు గారి తరంతోనే 'వేత్తలు' అదృశ్యమైపోతారా అనిపిస్తున్నది. యువతరం నాయకత్వం అసహనం, అనాలోచితం, అరాచకం, స్వార్థం, తాత్కాలిక ప్రయోజనం దిశగా పయనిస్తున్నది. తను ఎదగడం అలావుంచి ఎదుటివారు పెరగకుండా ఎత్తుగడలు వేయడమే పరమావధిగా మారుతున్నది.

ఇటి సంక్లిష్ట స్థితిలో జానకి రామారావుగారి వంటి చిత్తశుద్ధి గల వేత్తలు గురుతరమైన బాధ్యత వహించవలసివున్నది. వీరు సరికొత్త నాయకత్వాన్ని సృష్టించాలి! మట్టిలోనుంచి మాణిక్యాలను వెతకి వెలికి తీసి సమాజాన్ని రక్షించాలి!

# తెలంగాణాలో కూడా...



## శ్రీ మానుపాటి భిక్షమయ్య

(వలిగొండ, నల్లగొండ జిల్లా)

సేవలకు సరిహద్దులు వుండవని, మాట్లాడే పెదవులకంటే మేలు చేసే చేతులు మిన్న అని మా అన్న చదల జానకి రామారావుగారు నిరూపించారు. 'ఆంధ్ర రాష్ట్ర

ఆదిమజాతి సేవక్ సంఘ్' సేవలు కేవలం మైదాన ప్రాంత కోస్తా జిల్లాలకు, రాయల సీమకే పరిమితం కాలేదు, తెలంగాణాకు కూడా విస్తరించాయి. సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీచదల జానకి రామారావుగారు ఖమ్మం, వరంగల్లు, నల్లగొండ, నిజామాబాద్, హైదరాబాద్ జిల్లాలలో సయితం విస్తృతంగా పర్యటించి సంఘానికి శాఖోపశాఖలను ఏర్పరచారు. ముఖ్యంగా వెనుకబడిన మా నల్లగొండ జిల్లాలో పూర్తిగా వెనుకబడిన మా ప్రాంతం పల్లెలలో సభలు సమావేశాలు జరిపి, పెద్దలతో యువతతో మాట్లాడి, ఆ తొలినాళ్ళలోనే మాజాతి ప్రజలను చైతన్యపరచారు. ఆ దశలలోనే కట్టుబానిసత్వం నుంచి మాకు విముక్తి లభించింది. జనం తిరగబడితే తిరుగుండదని, సంఘటిత శక్తికి ఎదురు లేదని కొన్ని దశాబ్దాల క్రితమే మాకు నేర్పిన మా జాతి వైతాళికుడు చదల జానకి రామారావుగారికి మా నమస్కృతులు.

## సౌజన్యం



### శ్రీ సాతుపడి నాగయ్య

### (గుంటూరు జిల్లా గిరిజన నాయకులు)

'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్' కార్యకర్తగా, అనుచరునిగా, సహచరునిగా నేను ప్రధాన కార్యదర్శి శ్రీ చదల జానకి రామారావుగారితో కలసి గుంటూరు జిల్లాలో శతానేక కార్యక్రమాలలో పాల్గొన్నాను. కార్యకర్తలను ఆకట్టుకోవడంలో, వారికి శిక్షణ గరపడంలో, కార్యోన్ముఖులను చేయడంలో, వారి మంచి-చెడులను విచారించడంలో శ్రీ జానకి రామారావుగారు ఎంతో సహనంతో, ఓర్పుతో, విషయ పరిజ్ఞానంతో వ్యవహరించేవారు.

అంతేకాదు, ఇతరులతో, 'పెద్దవారు' అనుకునే వారితో మా సంఘీయులకు వివాదాలు ఏర్పడినపుడు అవి ఘర్షణలకు దారి తీయకుండా ఉభయ పక్షాలతో సౌమ్యంగా,

శాంతియుతంగా మాట్లాడి సామరస్యాన్ని నెలకొల్పేవారు. ఎంతటి క్లిష్ట సమస్యలను అయినా సౌజన్యంతో అవలీలగా పరిష్కరించడంతో ఆయనకు ఆయనే సాటి!

## కర్తవ్యం



### శ్రీ కుంభా వెంకటేశ్వరరావు

### (సంఘం తూర్పు కృష్ణా కార్యకర్త, చల్లపల్లి)

మా సంఘం మహాసభను చల్లపల్లిలో పెద్దఎత్తున జరిపారు. జనం తండోపతండాలుగా వచ్చారు. మహానాయకులు మాట్లాడారు. కొన్ని దశాబ్దాల క్రితమే మా ఆదిమ జాతులవారిలో అంత ఐక్యత, అంత మేలుకొలుపు వచ్చిందీ అంటే మా ముఖ్యనాయకుల కృషే అందుకు ప్రధాన కారణం. వారిలో ముఖ్యులు శ్రీ చదల జానకి రామారావుగారు.

ప్రధానంగా తరచు ఆటుపోటులకు గురయ్యే తూర్పుకృష్ణా తీర గ్రామాలలో-ముఖ్యంగా దివిసీమలో - ప్రకృతి వికృతించినపుడు, ఈతి బాధలు కలిగినపుడు మా సంఘం తరఫున శ్రీ జానకి రామారావు గారు ప్రత్యక్షమై ఆపన్నులను ఆదుకునేవారు. బడుగు ప్రాణులైన గిరిజనులను కలుసుకుని, ఓదార్పు, ధైర్యస్థైర్యాలను కల్పించి, వారికి తక్షణ సహాయం అందించే ఏర్పాట్లు చురుకుగా చకచకా చేసుకుపోయేవారు. బద్ధకించడం, వళ్ళు దాచుకోవడం వారి నిఘంటువులోనే లేవు. కర్తవ్యం, కర్తవ్యం - అంతే!



# నాయక త్రయం

## శ్రీ ధీరావతు అమరశింగ్ నాయక్

## (సంఘం గుంటూరు జిల్లాశాఖ కార్యదర్శి)

అర్ధ శతాబ్ది చరిత్రగల ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ నేటికీ సజీవంగా మనగలుగుతున్నదీ అంటే అధ్యక్షులు శ్రీ పాలపర్తి వీరయ్య, ఉపాధ్యక్షులు శ్రీ రామావతు లాలూనాయక్, ప్రధాన కార్యదర్శి శ్రీ చదల జానకి రామారావు గారలు నాయకత్రయంగా ఈ నేల నలు చెరుగులా నిరంతరం పర్యటిస్తూ సంఘ సౌధాన్ని గట్టి పునాదులతో పటిష్టపరచారు.

ప్రధాన కార్యదర్శి శ్రీ చదల జానకి రామారావు గారి 'సప్తతి' సన్మానం సందర్భంగా గతంలోకి తొంగి చూస్తే - సంఘమే ఆయనగా ఆయనే సంఘంగా కనుపిస్తారు. సంఘం నిర్మాణంలో ఆయన కనబరచిన ఆసక్తి, పడిన తపన, చేసిన కృషి న భూత్ న భవిష్యతి అనతగ్గవి. ఈ విషయంలో నా అనుభవాలను, అనుభూతులను చెప్పుకుంటూపోతే అది ఒక మహాగ్రంథమే అవుతుంది. ప్రస్తుతానికి వారికి నా అభినందనలు.

*



# నడచే దేవుడు

## శ్రీ పసుపులేటి పెద వెంకయ్య

## (విముక్త జాతుల నాయకులు)

మా మొండి - బండ కులస్తులను విముక్త జాతుల జాబితాలో చేర్పించే కృషి చేసి మాకు ఒక గుర్తింపును, ఒక స్థాయిని కల్పించిన శ్రీ చదల జానకి రామారావుగారికి విముక్త జాతుల వారు అందరు ఋణపడి వున్నారు. రాష్ట్రం

మొత్తంలోనే తొలిగా కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలో విముక్త జాతుల పిల్లలకోసం శ్రీ జానకి రామారావు గారు హాస్టలును ఏర్పరచి, నాటి సంక్షేమ శాఖ మంత్రి శ్రీ భీమ్‌రావ్ గారి చేత ప్రారంభోత్సవం చేయించారు. మా భావితరాల వారికి విద్యాభిక్ష పెట్టారు. నన్నే ఆర్గనైజరుగా నియమించారు. ఆ రోజులలో మా జాతులవారు తమ పిల్లలను బడికి పంపేవారు కాదు. చుట్టుప్రక్కల గ్రామాలు, కాలనీల వెంట తిరిగి, పెద్దలను ఒప్పించి, పిల్లలను హాస్టలులో చేర్పించడం నా బాధ్యత.

అంతేకాదు. జానకి రామారావుగారు కాలికి బలపం కట్టుకు తిరిగేవారు. సొంత ఖర్చులతో మారుమూలల వుండే గూడాలకు వచ్చి, సభలు-సమావేశాలు జరిపి, వ్యక్తిగతంగా కలుసుకుని మమ్మ సంస్కరించారు. మూఢాచారాల నుంచి మాకు విముక్తిని కల్పించారు. రోగాలు-రొష్టుల నుంచి మమ్మ కాపాడారు. అన్నోదకాలకు పథకాలను అమలుపరచారు. అన్నిటికంటే ముఖ్యం మా అమాయకత్వాన్ని పోగొట్టారు. మా మొండి-బండలకు ఉద్యోగాలు ఇప్పించారు, నివేశన స్థలాలు ఇప్పించారు. ఫలితంగా మా విముక్త జాతుల వారు ఇప్పుడు శ్రీ చదల జానకి రామారావు గారిని 'నడచే దేవుడు'గా ఆరాధిస్తున్నారు.

*

# పని సంస్కృతి

## శ్రీ నెట్టెం రఘురామ్

(ఆంధ్రప్రదేశ్ మాజీ మంత్రి వర్యులు)



చదల జానకి రామారావుగారిది వర్క్‌మైండ్. వర్క్ కల్చర్. పని పని పని-ఎప్పుడూ చేతినిండా పనివుండాలి. పని లేనిదే ఆయనకు ఏమీ తోచదు. ఆ బుర్ర అటువంటిది, ఆయన సంస్కృతి అటువంటిది. ఇంతకూ ఏమిటి ఆ పని? సంఘ

సేవ, ప్రజాసేవ. ఆయన మనసు సేవకే అంకితం. సేవే పరమార్థం, మానవసేవే మాధవసేవ.

శ్రీ చదల జానకి రామారావు మా జగ్గయ్యపేట నియోజకవర్గంలో దశాబ్దాల క్రితమే సుగాలీ తండాలను ఏర్పరచారు. ఎరుకల కాలనీలను నిర్మింపచేశారు. యానాది వాడలకు, వందలాది పక్కా గృహాలకు దోహదం చేశారు.

బలహీన వర్గాల వారికి గొర్రెలు, మేకలు, బర్రెలను ఇప్పించడంలో, చేతి వృత్తుల వారికి. సన్నకారు రైతాంగానికి, నిరుద్యోగులకు ఋణాలను ఇప్పించడంలో వాటిని సద్వినియోగ పరపించడంలో, తిరిగి జమ చేయించడంలో చదల జానకి రామారావుగారు తీసుకున్న శ్రద్ధ అంతాఇంతా కాదు; అది అన్యులవల్ల అయ్యే పని కాదు; ఆయనకే సాధ్యం, ఈ విషయంలో ఆయనకు ఆయనే సాటి.

ఇదే ఆయన పని! ఇదే పని సంస్కృతి!

*

# మరచిపోరు!

## శ్రీ కడియాల రాఘవరావు

## (కృష్ణాజిల్లా పరిషత్తు చెయిర్మన్)

నేను చిన్నచిన్న హోదాలలో వున్నప్పుడు చదల జానకి రామయ్యగారు పెద్ద పెద్ద పదవులలో వున్నారు. ఆయనది పెద్దమనసు. 'తెలుగుదేశం' పార్టీకి కృష్ణాజిల్లా శాఖ తొలి ప్రధాన కార్యదర్శిగా, ఉపాధ్యక్షునిగా, పార్టీ గిరిజన విభాగం అధ్యక్షునిగా, అడ్-హక్ కమిటి సభ్యునిగా, రాష్ట్ర పార్టీ ఎన్నికల పరిశీలకునిగా, ఎస్. టి. సెల్

# లోక్ సభ స్పీకరుచే సన్మానం








# నేతల సమాహారం



నందిగావు నియోజక వర్గం తెలుగుదేశం పార్టీ కార్యకర్తల సమావేశంలో మాట్లాడుతున్న నాయకులు శ్రీ వడ్డే శోభనాద్రీశ్వరరావు, సర్వశ్రీ వసంత నాగేశ్వరరావు, సుంకర సత్యనారుయణ, చదల జానకి రామారావు, కోగంటి వెంకటేశ్వరరావు, ప్రభృతులు.




కృష్ణా జిల్లా నందిగామ మండల పరిషత్తు వారు ఆ నియోజక వర్గం నుంచి కొత్తగా ఎన్నికైన శాసన సభ్యులు శ్రీ దేవినేని ఉమామహేశ్వరరావు అభినందన సభను ఏర్పాటు చేసారు. సభలో శ్రీ ఉమ ను అభినందిస్తున్న శ్రీ చదల జానకి రామారావు, మండల పరిషత్తు అధ్యక్షులు శ్రీ పరిమి యాకోబు, పంచాయతీ సర్పంచ్ శ్రీ నరసింహం, బి. సి. నాయకులు శ్రీ శ్రీరామ ప్రభృతులను చూడవచ్చు.

## శ్రమదానం



## నెల్లూరు సభలో జోహారు గీతాలాపన



## జన్మభూమి కేగుదాం



నందిగామ న్యూ కాలనీలో శ్రీ చదల జానకి రామారావు గారి ఆధ్వర్యాన నేర్చుకున్న జన్మభూమి ప్రచారదళం బుర్రకథ చెబుతున్నటి దృశ్యం. వీరు తిరువూరు ఏసుపాదం దళం.

## బ్రతుకు వల - అలల జలం



శ్రీ పెద చెంచు - నందిగామ

# బొమ్మలు అల్లే కమనీయ కథనం





శ్రీ చదల జానకి రామారావు సప్తతి సమ్మాన సంఘం కార్యవర్గం తొలి సమావేశంలో
ని, సంస్కృతిని ప్రస్తావిస్తున్న అధ్యక్షులు శ్రీ కొమ్మన గంగాధర తిలక్

# సప్తతి సమ్మానం ఏవ శతథా!



శ్రీ సుంకర సత్యనారాయణ సన్మానించారు. ఆహ్వాన సంఘం అధ్యక్ష కార్యదర్శులు శ్రీ కొమ్మన గంగాధర తిలక్, శ్రీ తోట వెంకటేశ్వరరావు 'సామాజిక వాల్మీకి' బిరుదు పత్రాన్ని, గౌతమ బుద్ధుని కాంస్య ఫలకాని బహూకరించారు. కాకాని వెంకటరత్నం కళాశాల పాలక వర్గం అధ్యక్షులు శ్రీ యర్రం రెడ్డి రామకృష్ణమూర్తి ఆదివాసి నేత చదల జానకి రామారావు సప్తతి జీవనయాన చరిత్ర గ్రంథాన్ని ఆవిష్కరించి తొలి ప్రతిని ఆయనకు అందజేశారు.





సన్మాన సభలో పాల్గొన్న పెద్దలలో సగభాగం. ఆసక్తిగా తిలకిస్తున్న శ్రీ జానకి రామారావు కుటుంబ ఆడపడుచులు.









ప్రధాన కార్యదర్శి శ్రీ తోట వెంకటేశ్వరరావు స్వాగతం పలికారు. అధ్యక్షులు శ్రీ తిలక్ అధ్యక్షోపన్యాసం చేసారు. మాజీ శాసన మండలి సభ్యులు శ్రీ పేర్నా శ్రీరామమూర్తి సభను ప్రారంభించారు. శ్రీ చదల జానకి రామారావు తమకు అక్షరాభ్యాసం చేసిన గురువరేణ్యులు శ్రీ పల్లం కోటదాసు గారికి గురుపూజ చేసారు.



నందిగామ పంచాయతి సర్పంచ్ శ్రీ వై. వి. నరసింహం, కృష్ణాజిల్లా పరిషత్తు సభ్యులు శ్రీ తంగిరాల ప్రభాకరరావు, బి. జె. పి. నాయకులు షేక్ సైద, అభిమాని శ్రీ కొంగర కృష్ణమూర్తి.



ఫ్రీ-లాన్స్ జర్నలిస్టు శ్రీ సుంకర నరసింహారావు, అధ్యాపకులు శ్రీ పరుచూరి పిచ్చేశ్వరరావు. కృష్ణా జిల్లా పరిషత్తు సభ్యులు శ్రీ దాసరి ప్రసాదరావు, నందిగామ మండల పరిషత్తు అధ్యక్షులు శ్రీ పరిమి యాకోబు, శ్రీ జ్వాలా నరసింహం.



నందిగామ వ్యవసాయ మార్కెట్ కమిటీ వైస్-ప్రెసిడెంటు శ్రీ మంగునూరి కోటిరెడ్డి, పరిటాల పంచాయతి సర్పంచ్ శ్రీ కోగంటి వెంకటేశ్వరరావు. లెక్చరరు శ్రీ [redacted], శ్రీ ఎం. గురునాథరావు.

[illegible]



శ్రీ సాల నాంచారయ్య (బందరు), శ్రీ కట్టా గోపాలరావు : నందిగామ న్యూ కాలనీ ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులు. శ్రీమతి ఈశ్వరమ్మ, శ్రీమతి శశికుమారి.



శ్రీ హనుమంతరావు (సి. టి. ఓ. హైదరాబాద్), శ్రీ కండెల లింగయ్య, శ్రీ గరిక లక్ష్మణరావు, కార్యదర్శి శ్రీ మనుబోతుల శ్రీరామ.



అఖిల భారత ఎన్. టి. ఆర్. అభిమాన సంఘం నాయకులు శ్రీ వడ్డెల్లి సాంబశివరావు, ఆకాశవాణి వాయిద్య కళాకారులు శ్రీ అన్నవరపు నాగభూషణం, శ్రీ వినుకొల్లు రామానుజం. శ్రీమతి పాపోలు సుందరమ్మ.



శ్రీమతి దేవరశెట్టి నాగరత్నమ్మ, శ్రీ సాతుపాటి నాగయ్య, శ్రీ మద్దెల కాళేశ్వరరావు, శ్రీ బొజ్జగాని మల్లేశ్వరరావు (ఏలూరు) : అధ్యాపకులు.



తమ్ముడు శ్రీ చదల కోటయ్య, కవి శ్రీ గుంజి నరశింహం, శ్రీ చడమల అప్పారావు, శ్రీ తిమ్మసర్తి నాగేశ్వరరావు.



తమ్ముడు శ్రీ చదల ఆంజనేయులు దంపతులు. టైలర్స్ యూనియన్ నాయకులు శ్రీ పిచ్చయ్య, శ్రీ తిమ్మసర్తి నాగయ్య.



యానాది సంఘం పెద్ద శ్రీ చడమల పెదచెంచు రావులు, శ్రీ ఇండ్ల వెంకటేశ్వరులు, కళాకారులు శ్రీ జేమ్స్, శ్రీమతి చదల సుశీలమ్మను సత్కరిస్తున్న నాలుగవ కోడలు ప్రమీలా దుర్గాదేవి



శ్రీ చదల జానకి రామారావును సత్కరిస్తున్న సన్మాన సంఘం కోశాధికారి శ్రీయరబడి కృష్ణారావు, వియ్యంకుడు శ్రీ మొగిలి నాగయ్య, వీరులపాడు మండల పరిషత్తు అధ్యక్షులు శ్రీ నాగవరపు రాజు, కాంగ్రెసు నాయకులు శ్రీ బొబ్బెళ్ళపాటి గోపాల కృష్ణశాయి.



మాజీ శాసన మండలి సభ్యులు శ్రీ గాలేటి వెంకటేశ్వరులు. మనువడు చిరంజీవి సుమన్, పండిత కాసు హనుమరెడ్డి, న్యాయవాది శ్రీ చావలి సాంబశివయాదవ్.



ఇంజనీరు శ్రీ కండెల లింగయ్య (హైదరాబాద్), టైలర్ శ్రీ బొల్లా వెంకటేశ్వరులు, మనువడు చిరంజీవి సూర్జిత్, శ్రీ చిట్టారెడ్డి గాంధి (హుజూరు నగర్).



చదల దంపతులను సత్కరిస్తున్న మహిళా మండలి నాయకులు శ్రీమతి చావా నాగ సుర్యమణి.

# <u>ఫంక్షన్ మెగా సక్సెస్!</u>



పాత్రికేయ బృందం తరపున డాక్టరు ఘంటా విజయ కుమార్ గారూ, దయచేసి స్వీకరించండి ఈ మా చిరు జ్ఞాపికను.



ప్రధాన కార్యదర్శి తోట వారూ! కృషి అంతా మీదే కదా ! మీరూ స్వీకరించండి!

# సమష్టి కృషికి తీపి గుర్తు



తమ అధ్యక్షతన గల సన్మాన సంఘం సమష్టి కృషి నాకు గర్వకారణం. నేడు గాంధీజీ జయంతి కూడా అయిన సందర్భంగా ఈ మహాత్మా గాంధీ ఫలకాన్ని తీపి గుర్తుగా స్వీకరించండి- తిలక్ గారూ !

స్వాగతం సుస్వాగతం

ఆదివాసినేత గిరిజనరత్న సామాజికవాల్మీకి

# శ్రీ చదల జానకి రామారావు గారు

సప్తతి సన్మానోత్సవం సంఘం నందిగామ. ది. 2-10-



వైస్- ప్రెసిడెంటుగా శ్రీ చదల జానకి రామారావు గారు చేసిన విశిష్టమైన, నిర్విరామమైన, నిర్వివాదమైన సేవలను నేను మరువలేదు, జిల్లాపార్టీ మరవలేదు, రాష్ట్ర పార్టీ అధిష్ఠానం కూడా మరవలేదని నేను అనుకుంటున్నాను. కార్యకర్తలు, ప్రజలు అసలు మరవలేదు.

నేను కృష్ణాజిల్లా పరిషత్తు అధ్యక్షుని అయినపుడు నన్ను తొలిగా అభినందించిన నాయకులలో చదల జానకి రామారావు గారు ఒకరు. అది నేను మరవలేదు! జిల్లా పరిషత్తుకు సంబంధించినంత వరకు అధికారిక సభ్యులకంటే ఏ పదవీ లేని జానకి రామయ్యగారే నాతో ఎక్కువగా పనులు చేయించుకుంటున్నారనుకుంటున్నాను. కనిపిస్తే చాలు - ఆ చిరుద్యోగం ఈ నిరుద్యోగికి ఇప్పించమనో, ఆ వూళ్ళో బడి కావాలనో, ఈ ఊళ్ళో ఇళ్ళు కావాలనో - ఇలా నిరంతరం ప్రజా సమస్యల సత్వర పరిష్కారం కోసం అభ్యర్థిస్తూవుంటారు. వీటిలో ఏదీ ఆయన సొంతం కాదు, స్వార్థానికి కాదు; అడిగే హక్కు వున్నా అడిగి చేయించుకోలేని అమాయక పేద ప్రజల కోసమే. ఇదీ నేను మరువలేను, పేద ప్రజలు అసలు మరవరు.

ఎతావతా ఎవ్వరూ మరవని, మరచిపోలేని మహనీయులు ఆదిమ జాతి నేత మన చదల జానకి రామారావుగారు.

*

# మా అందరికీ సన్మానం!



## శ్రీ తొండపు దశరథ జనార్థన్

(కృష్ణాజిల్లా సహకార కేంద్ర బ్యాంకి అధ్యక్షులు, 'ఆప్కాబ్' చెయిర్మన్, జాతీయ సహకార వ్యవసాయ, గ్రామీణాభివృద్ధి బ్యాంకుల సమాఖ్య చెయిర్మన్, నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ స్టేట్ కోపరేటివ్ బ్యాంక్స్ వైస్-చెయిర్మన్)

రాజకీయంగానే కాదు, సహకార రంగంలో సయితం నా కంటే ఎంతో ఎంతో సీనియరు మా చదల జానకి రామారావుగారు; సాంఘిక సేవా రంగంలో ఒక విధంగా మా తరం వారికి గురుతుల్యులు. మా బ్యాంకుకు సంబంధించి ఏ బాధ్యతను అప్పగించినా ఒక డైరక్టరుగా ముందు దానిని నిర్వర్తించిన పిదపే మరొక కార్యక్రమానికి ఉద్యమిస్తారు.

ఈ రోజులలో ఈ వయసులో ఇంత చురుకుగా, చాకచక్యంగా, చిత్తశుద్ధితో కృషి చేసేవారు బహు అరుదు. కర్తవ్యతాపరాయణతలో, క్రమ శిక్షణలో వారి నుంచి నేర్చుకోవలసింది ఎంతో వుంది.

సహకార వ్యవస్థ ఆశయాదర్శాలను, సమష్టి సేవా భావనను పూర్తిగా ఆకళింపు చేసుకున్న పెద్ద శ్రీ జానకి రామారావు గారు ఒకరు. చిన్నవి - పెద్దవి పెక్కు సహకార సంస్థలు - సంఘాల వ్యవస్థాపనకు వారే ప్రేరకులు. తద్వారా పేదలకు, సన్నకారు రైతాంగానికి, చిరుద్యోగులకు, చేతివృత్తులవారికి, నిరుద్యోగులకు వారి వారి జీవన ప్రమాణాల పెంపుదలకు, స్వీయ ఉపాధి కల్పనలకు, ఆవాసాలకు ఎంతగానో దోహదించారు; సహకార రంగ స్ఫూర్తిని ప్రజలకు అందించారు.

'తెలుగుదేశం' పార్టీ అవతరణ నుంచి నేటికీ శ్రీ చదల జానకి రామారావు క్రియాశీలక కార్యకర్త, ఆదర్శప్రాయ నాయకులు. కృష్ణాజిల్లాలోనే కాదు - రాష్ట్ర స్థాయిలో కూడా వారి సేవలు పార్టీ పటిష్టతకు ఉపకరించాయి. నిజానికి, పార్టీకి వారు ఒక వరం.

మా 'చదల'కు 'సప్తతి' సన్మానం జరుగుతున్నదీ అంటే - అది మా అందరికీ జరుగుతున్నట్లు సంభావిస్తున్నాము, సంతసిస్తున్నాము.

*

# వరదగూడు

## శ్రీ జయధీర్ తిరుమలరావు

## (జర్నలిస్టు, హైదరాబాద్)

'గువార్' అనే సవరల క్రతువు 'యజ్ఞం' లాంటిది. ఇదే యజ్ఞానికి మూలమని గిడుగు సీతాపతి అన్నారు. ఆ మాట ఎవరూ పట్టించుకోలేదు. ఆయన తరువాత రెంటినీ తులనాత్మక పరిశీలన, పరిశోధన కూడా చేయలేదు. కారణం ఒకటే! ఏందులకూ కొరగాని గిరిజనుల నుంచి బ్రాహ్మణులు క్రతువుల్ని కాపీ చేస్తారా?' అనే ఆధిక్యతా భావన!

ఏ దేశంలోనైనా ఏ జాతికైనా ఆదిమ దశలో భౌగోళిక పరిస్థితుల ననుసరించి భావాలు పుడతాయి. ఆ భావనల ఆచరణే క్రతువుకి, కర్మకాండకీ మూలం. వీటి

నుకరణతే నృత్యం. ఈ నృత్యాంశాల నుండే నాటక లక్షణాలు ఆవిర్భవిస్తాయి.

గిరిజనుల క్రతువులను 'మానవ శాస్త్రజ్ఞులు' అంతగా పట్టించుకోలేదు. రిశీలనకు నోచుకున్నా, దానిని దృశ్య, శ్రవణ మాధ్యమాల్లో రికార్డు చేయలేదు. ఈ ారణంగా క్రతువుల అసలు స్వభావం, ప్రయోజనం, సందర్భం మరుగున ిడిపోతున్నాయి. నిజానికి - గిరిజనుల భౌతిక జీవితానికి క్రతువులకు ఒక సంబంధం ంది. ఇది అభౌతికం కాదు. అతార్కికం కాదు. ఆ రకంగా వారి నమ్మకాలు, విశ్వాసాలు ొన్ని అమానవీయంగా కనిపించినా వాటిలోని అంతఃసూత్రాలు ఆ తెగల జీవితం, మనోభావాలను ప్రతిబింబిస్తాయి. ఈ అంశాలను పరిశీలించకపోతే అభ్యుదయ వాదులు కూడా వారిని చిన్నచూపు చూసే ప్రమాదం ఉంది.

జానపద, గిరిజన విజ్ఞానవేత్తలు, మానవ శాస్త్రజ్ఞులు చివరి దశలో అంతరించిపోతున్న ఈ అంశాలను అధ్యయనం చేయకపోతే, శాస్త్రీయంగా భావితరాలకు రికార్డు చేసి పెట్టకపోతే నేరస్తులుగానే మిగిలిపోక తప్పదు!

గిరిజనులనగానే 'సంస్కరించ తగినవారు' అనే భావన నాటి వలసవాదులకు, ప్రభుత్వాలకు, రాజకీయ పార్టీలకు, నేటి ఎన్జీవో గ్రూపులకు ఉండడం విచిత్రం. వారి దగ్గర నేర్చుకున్న అంశాలు వున్నాయని ఎవరూ అనుకోలేదు. ఒకరో ఇద్దరో తప్ప పరిశోధనల పేరుతో వారిని కొల్లగొట్టిన వారే అధికం.

నిజానికి, ఈ దేశంలో గిరిజనులు ప్రధాన స్రవంతిని ప్రతి దశలోనూ ఎంతో ప్రభావితం చేశారు. అటు బిర్సాముండే, ఇటు అల్లూరి స్వాతంత్ర్య పోరాటాలకు పాదు చేశారు. గోండు వీరుడు రాంజీ గోండు, కొమురం భీమ్ అజరామర కీర్తి ప్రతిష్టలు గాంచారు. శ్రీకాకుళ విప్లవాలు, ఉత్తర తెలంగాణాల్లో ఇంద్రవెల్లులూ ఒక కొత్త బాటను రూపొందించాయి. కొత్త ఆయుధాన్ని అందించాయి. కాదనలేం.

ఇవాళ్ళ జరిగే మతమార్పిడి హననం ఒరిస్సా ప్రాంతం నుంచి మొదలైంది. ఏది ఏమైనా ఒకటే ఖాయం. గిరిజన సంస్కృతీ సంప్రదాయాలూ, విజ్ఞానం వాళ్ళకి కాకుండా వాళ్ళ కళ్ళ ముందే పరాయివైపోతున్నాయి. భూమి కోల్పోయే క్రమం ఎన్నడో ప్రారంభమైనా సంస్కృతికి తీరని ప్రమాద సూచిక ఈ రోజే ఎదురవుతోంది.

అందుకే భూమి, సంస్కృతుల ఐక్య పోరాటం వాళ్ళను మనుషులుగా నిలబెడుతుంది. ఏ ఒక్కటే అయినా అసమగ్రమే అవుతుంది.

సంస్కృతీ సంప్రదాయాల అధ్యయనంతోనే వారి భూమిని వారితోనే దక్కించుకునే ప్రయత్నం 'మనం' చేయగలగాలి.

ఇప్పటివరకు కోయల కుల పురాణం లేదా కోయ సమాజం పుట్టుక గురించిన వివరాలు వెలుగులోకి రాలేదు. కోయల చరిత్ర, చరిత్రలో కోయ ప్రజల పాత్ర కూడా రికార్డు కాలేదు. వివిధ రాజుల పాలనలో వారి పాత్ర ఎక్కడా కనిపించదు. ఒకవేళ ఉంటే- ఉన్నట్లు కనిపిస్తే - అది పోరాటాల చరిత్రే కావడం ఒక నిజం. పరాయి రాజుల పాలనను ధిక్కరించిన గిరిజన తెగలు ఇప్పుడు కిమిన్నాస్తిగా ఉండడానికి కారణాలు వెలికి తీయగలగాలి. గిరిజనులను పూర్తిగా ప్రధాన స్రవంతి నుంచి తొలగించడానికి లిఖిత సాహిత్యం, సంగీతం, కళల పాత్ర కూడా ఉంది. ఎక్కడైతే, ఏ కారణం వల్లనైతే వారిని సమాజం నుంచి దూరం చేయడం జరిగిందో అక్కడ నుంచే తిరిగి వాళ్ళను 'మన' లో ఒక భాగం చేయక తప్పదు. అప్పుడే సమానం, సౌభాతృత్వాలకు ఈ దేశంలో అర్థం ఏర్పడుతుంది.

ఇట్టి నేపథ్యంలో, కడచిన అర్ధశతాబ్దిగా తన ఉనికిని చాటుకుంటూవస్తున్న 'ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక సంఘ్' సేవలు మరింతగా విస్తృతమై విజృంభించవలసివున్నది. ఆ స్వచ్ఛంద సేవా సంస్థ ప్రధాన కార్యదర్శి శ్రీ చదల జానకి రామారావు గారికి ఈ బాధ్యత మరింతగా వున్నది. అన్నట్టు, శ్రీ జానకి రామారావు గారి 'సప్తతి' ని 'మనం' ఘనంగా జరిపినందుకు నేను సంతసిస్తున్నాను; సామాజిక ప్రగతిదాయక దృక్పథాన్ని సాదరంగా ఆహ్వానిస్తున్నాను. *



# హృదయావిష్కరణ

'ఎందరో మహానుభావులు - అందరికీ వందనాలు.' కలలో అయినా ఊహించనిది - నాకు జరిగిన 'సప్తతి' సన్మానం, ఎన్నడూ అనుకోనిది - నేను 'సామాజిక వాల్మీకి' ని అవుతానని.

ఎప్పుడో డెబ్బది సంవత్సరాల క్రితం మారుమూల కుగ్రామం శివారులో నిరుపేద కుటుంబంలో జన్మించాను. ఇంత నికృష్ట కులంలో ఎందుకు పుట్టానురా దేవుడా అనుకున్నాను. అయితే, ఆ కులం ప్రాతిపదికగానే ఆ తరువాత మరిన్ని కులాలు - యానాది, లంబాడి, చెంచు, పాముల, బుడబుక్కల, మొండి, దొమ్మర మొదలైన సంచార - ఆదివాసి - గిరిజన కులాల వారికి తగు గుర్తింపును తెచ్చి, వారు కూడా సాంఘిక జీవన స్రవంతిలో సమ భాగులయేట్టు చేసి, ఆ కులాలకు ఉత్కృష్టలను సాధించగలిగాము.

ఇందుకు మా మహాసంస్థ ఆంధ్ర రాష్ట్ర ఆదిమ జాతి సేవక్ సంఘ్ దోహదించింది. సర్వశ్రీ వెన్నెలకంటి రాఘవయ్య, చించాల్కార్ జీ, ఎల్. ఎన్. రావు, చిర్రావూరు నాగభూషణాచార్యులు, తిరువీధుల సాంబయ్య, రామేశ్వరం నాగయ్య, పొన్నా సత్యనారాయణ, దేవరకొండ హనుమంతరావు, కంపా పున్నయ్య, పాలపర్తి వీరయ్య, రామావతు లాలు నాయక్ ప్రభృతులు నాయకత్వం వహించారు. ఆ మహోద్యమాల నిర్మాతలలో నన్నూ ఒకనిగా చేసుకున్నారు. అది నా కర్తవ్యం. అదే నాకు గర్వకారణం.

కాగా, పెద్దలు, విజ్ఞులు, మేధావులు పూనుకుని సన్మాన సంఘాన్ని ఏర్పాటు

చేసి 'సప్తతి' క్రతువును పెద్దఎత్తున నిర్వహించారు. ముఖ్యంగా అధ్యక్షులు శ్రీ కొమ్మన గంగాధర తిలక్, ప్రధాన కార్యదర్శి శ్రీ తోట వెంకటేశ్వరరావు, సహ కార్యదర్శి శ్రీసి హెచ్. ఆంజనేయులు, కోశాధికారి శ్రీ యరబడి కృష్ణారావు, సర్వశ్రీ బొజ్జగాని రామకోటయ్య, చడమల తిరుపతయ్య, మనబోతుల శ్రీరామ తదితర కార్యవర్గం సభ్యులు ఇందుకు ఎంతగానో కృషిచేశారు. వారి ఋణం నేను తీర్చుకోలేనిది.

ఈ సందర్భంగా ప్రత్యేక సంపుటిని కూడా ప్రచురిస్తున్నారు. ఇందుకు ప్రముఖ రచయిత, జర్నలిస్టు శ్రీ అడ్సుమిల్లి పూర్ణచంద్రరావు సంపాదకత్వం వహించారు. వారికి నా కృతజ్ఞతలు.

సన్మాన సంఘం సభ్యులుగా, సంపుటిలో ప్రకటన కర్తలుగా ఎందరో వదాన్యులు ఉదారంగా సహకరించారు. వారికి నా హార్దికాభినందనలు.

ప్రతి ఒక్క కార్యకర్తకు నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాభినందనలు.

చదల జానకి రామారావు.





# శ్రీ చదల జానకి రామారావు గారికి

'సప్తతి' శుభాకాంక్షలు

## కాకాని వెంకటరత్నం కళాశాల పాలకవర్గం

నందిగామ, కృష్ణాజిల్లా

శుభాకాంక్షలతో

# ది ఛాంబర్ ఆఫ్ కామర్స్

## నందిగామ, కృష్ణాజిల్లా

అధ్యక్షులు :
**చల్లా సంగమేశ్వరరావు**
జయలక్ష్మి డాల్ మిల్
Ph : (M) 75279, (R) 75270

కార్యదర్శి :
**మహంకాళి రామలింగేశ్వరరావు**
జనరల్ మర్చంట్, వాసవి మార్కెట్
Ph : (S) 75504, (R) 75308

కోశాధికారి :
**సూరే వెంకటనాగేశ్వరరావు**
కిరాణా మర్చంట్, వాసవి మార్కెట్
Ph : 75317 (R)

## శ్రీ చదల జానకి రామారావుగారికి

శుభాకాంక్షలతో



## యలమంచిలి బాబూ రాజేంద్రప్రసాద్

సర్పంచ్ - ఉయ్యూరు

అధ్యక్షులు

ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సర్పంచ్‌ల సంఘం

ఉయ్యూరు - 521 165,
కృష్ణాజిల్లా (ఆం.ప్ర)
© (O) 08676-32423,
(R) 32123, (Hyd) 3735821

---

## వాస్తు - జ్యోతిష్యాలకు సంప్రదించండి

జాతక ఫలాలు చెప్పబడును, జాతక చక్రాలు వేయబడును. గృహాలకు, వ్యాపార సంస్థలకు, పరిశ్రమలకు, నిర్మాణ వాస్తు ప్లాన్ చెప్పబడును. గృహవాస్తుపై సలహాలు ఇవ్వబడును. ప్రాచీన సంప్రదాయ వాస్తుతో కూడిన ప్లాన్‌ల కొరకు సంప్రదించగలరు.

## పంచుమర్తి శ్రీనివాసరావు

(జ్యోతిషం, వాస్తు ముహూర్త భాగములు)

నెహ్రూనగర్, డోర్ నెం. 23-27,
నందిగామ - 521 185
ఫోన్ : 08678 - 76159

---

శుభాకాంక్షలు

బహుముఖ ప్రజ్ఞాశీలి

## శ్రీ చదల జానకి రామారావుగారికి

మా హార్దిక శుభాకాంక్షలు



## చెరుకుమిల్లి శంకరరావు

అధ్యక్షులు - ప్రాథమిక సహకార
వ్యవసాయ సంఘం
మాగల్లు, కృష్ణాజిల్లా

---

శుభాకాంక్షలు

ఆదిమజాతుల ఆశాజ్యోతి,
ఆదిమజాతి సేవక్ సంఘ్
రాష్ట్ర ప్రధాన కార్యదర్శి

## శ్రీ చదల జానకిరామారావు గారు

70 వసంతాలు పూర్తి చేసుకొని 71వ వసంతంలో ప్రవేశించిన శుభ సందర్భంగా ఆయనకు ఆయురారోగ్యాలు, సుఖశాంతులు కలకాలం కలగాలని కోరుకుంటూ ఆయనకు జన్మదిన శుభాకాంక్షలను తెలియజేస్తున్నాను.



**బండారుపల్లి రామచంద్రరావు**

చైర్మన్ - వ్యవసాయ మార్కెట్టు కమిటీ,
కంచికచర్ల, కృష్ణాజిల్లా



మాన్యశ్రీ నందమూరి తారక రామారావు గారి 73వ జన్మదిన సందర్భమున వారి స్వగృహంలో
శ్రీ చదల జానకి రామరావు కలుసుకుని బహూకరించిన చిత్రం